శ్రీమతే రామానుజాయ నమః



భగవద్యామునాచార్యులవారు అనుగ్రహించిన

# చతుఃశ్లోకి

పెరియవాచ్చాన్పిళ్ళై, నాయనార్ ఆచ్చాన్పిళ్ళై, వేదాంత దేశికులు
అనుగ్రహించిన వ్యాఖ్యానములతో

"హరివల్లభా" వ్యాఖ్య (ఆంధ్ర వివరణము)

**శ్రీమాన్ డా|| ఈ.ఏ. శింగరాచార్యులు**

**ఉ.వే. శ్రీమాన్. కందాళ వేంకటాచార్య స్వామివారి**
**తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక**

**2008**

వారి ప్రార్థన ఫలించింది. ఆపదలు తొలగేయి. సంపదలు కలిగేయి. ఆనాడు వారు చూపిన ఆదరం ఏనాటికీ మరువలేనిది. వారు చేసిన ఉపకారానికి ప్రతికృతి ఏదీ లేదు. చేతులు జోడించి అంజలి కావించడం తప్ప జన్మజన్మలకు వారి ఋణం తీర్చుకోలేనిది. వారికి నాపట్ల అంతటి ప్రత్యేకమైన అభిమానం. అది మా దంపతుల సుకృతవిశేషం. నాభార్య **శ్రీమతి మణెమ్మ** (పరమపదవాసి) వారికి అభిమానపాత్రురాలైన శిష్యురాలు. ఆమె జ్ఞాపకార్థం ఆమెకు ఇష్టమైన ఆచార్యకైంకర్యలాభం ఈ సంవత్సరం నాకు కలిగినందుకు ధన్యుడను. నేను, మా కుటుంబముకూడా ఇటువంటి సేవాభాగ్యాన్ని పదేపదే పొందాలని ఆశిస్తున్నాము.

మా స్వామివారు పరమపదించిన తరువాత వారి సంస్మరణసభాజ్ఞాపికగా వారిచే రచింపబడిన **"త్యాగధనుడు"** అనే గ్రంథాన్ని పునర్ముద్రణగావించే అవకాశం నాకు కలిగినది. ఏదైనా పెద్ద గ్రంథం వారి దివ్యస్మృతిగా వెలువరిస్తే బాగుంటుందని అప్పుడు అనిపించింది. ఈనాటికి నాకీ భాగ్యం కలిగింది. లక్ష్మీవైభవప్రకాశమైన **"కాన్తాచతుఃశ్లోకీ"** గ్రంథము సవ్యాఖ్యానముగ ప్రకాశింపజేసుకొనే అవకాశం కలిగింది. మరొక విశేషం. యామునాచార్యులవారు మాస్వామికి ఇష్టులైన ఆచార్యపురుషులు. వారిస్తుతి శ్లోకాలైన **"కాన్తాచతుఃశ్లోకీ, స్తోత్రరత్నం"** రెండిటికీ మాస్వామివారు ఆంధ్రవివరణాన్ని వ్రాసేరు. ఆచార్యముఖోల్లాసమేకదా కైంకర్యానికి పరమావధి. ఈ గ్రంథ ప్రకాశనంద్వారా అది కలుగుతుందని నా నమ్మకం. నాకు భగవంతునిపట్ల భక్తి కలిగి ఉండడమెలాగో తెలియదు. నా దైవం మా ఆచార్యులు. వారి పాదారవిందములే ఇక్కడ, అక్కడకూడా నాకు శరణములని నమ్మి ఉండడమే నాకు తెలిసిన విషయం. **"నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్"** వారి ప్రోత్సాహముతోనే నేను భగవద్రామానుజసేవాభాగ్యాన్నికూడా పొందేను. మాత్రైవర్ణిక వైష్ణవరామానుజ కూటానికి అధ్యక్షునిగా ఉండి, శక్తివంచనలేకుండా కైంకర్యం చేసుకోగలిగేను. అన్నింటికీ **"కర్తా కారయితా"** కూడా వారే !

ఈ సంవత్సరం మా ఆచార్యతిరునక్షత్రోత్సవకైంకర్యాన్ని, దానికి జ్ఞాపికగా ఈ గ్రంథ ప్రకాశనావకాశాన్ని నాకు అందించిన మా ఆచార్యకుటుంబానికి, ప్రత్యేకంగా మాఆచార్యపత్నికి, ఆచార్యపుత్రిక శ్రీమతిజానకమ్మ గారికి కృతజ్ఞతాభివందనములు సమర్పిస్తున్నాను. ఈ స్తోత్రమునకు గల విపులమైన తమిళవ్యాఖ్యకు ఆంధ్రవివరణము కావించి. దానితోపాటుగా ఇతరవ్యాఖ్యలనుకూడా చేర్చి గ్రంథమునకు చక్కటి రూపకల్పన



చేసి, సహృదయంతో ముద్రింపజేసే బాధ్యతనుకూడా స్వీకరించిన **ఉ.వే. శ్రీమాన్ శింగరాచార్యస్వామివారికి** కృతజ్ఞతా పూర్వకంగా దాసోహములు సమర్పిస్తున్నాను. సహృదయంతో సహకరించడంలో వారికి వారే సాటి. అడిగిన వెంటనే తమ అమూల్యమైన మంగళాశాసనములను అనుగ్రహించిన పెద్దలు. **ఉ.వే. శ్రీమాన్. శ్రీ న.చ.రఘునాథాచార్యస్వామివారికి, ఉ.వే.శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారికి, ఉ.వే.శ్రీమాన్. టి.పి. రామచంద్రాచార్యస్వామివారికి, ఉ.వే.శ్రీమాన్ సముద్రాల రంగరామానుజాచార్యస్వామివారికి, ఉ.వే.శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యస్వామివారికి** అనేక దాసోహములు సమర్పిస్తున్నాను. ప్రతిసంవత్సరం ఆచార్యదివ్యస్మృతిగా వారి తిరునక్షత్రమును పునస్మరించుకొని ఉభయవేదాంతపండితసభలను పునరుద్ధరించి నిర్వహిస్తున్న రామానుజకూటంగోష్ఠివారికి నా అభినందనలు.

లక్ష్మీవైభవప్రకాశకమైన ఈ గ్రంథప్రకాశనరూపమైన కైంకర్యం సదా, సర్వదా, సర్వదా కైంకర్యలక్ష్మీప్రదాయకమై, నాకు, మా కుటుంబానికి శ్రేయోదాయక మయేటట్లుగ మంగళాశాసనము చేయమని భాగవతోత్తములను, భగవద్రామానుజులను, అస్మద్ ఆచార్యులను ప్రార్థిస్తున్నాను.

ఇట్లు

భాగవతవిధేయుడు

**నాగులకొండ వేంకటరామానుజయ్య**

(అనుగ్రహైకస్వభావయైన) లోకమాతను దైవంగా కలవాడవుకావలెనని **'మాతృదేవో భవ'** అని మొదట చెప్పబడిన లక్ష్మీదేవిని స్తుతించేవారందరికి దారి జూపే చతురతగల మొదటిగ్రంథం చతుఃశ్లోకి.

ప్రప్రథమ స్తుతి గ్రంథాలైన **'స్తోత్రరత్నం, చతుఃశ్లోకీ'** అనే స్తోత్రాలచేత మొదట ప్రభావితులైనవారు శ్రీమద్రామానుజయతీంద్రులవారు. గద్యత్రయంలో పిరాట్టిని స్తుతించి పురుషకారంగా శరణాగతిని చేసి, తర్వాత భగవానుణ్ని స్తుతించి, ఉపాయంగా ఆశ్రయించారు. పిమ్మట శ్రీకూరేశుల పంచస్తవి, శ్రీపరాశరభట్టర్‌వారి శ్రీగుణరత్న కోశం, శ్రీరంగరాజస్తవం, శ్రీవేదాన్తదేశికుల స్తోత్రగ్రంథాలలోనూ ఆళవందారుల స్తోత్రద్వయప్రభావం సమృద్ధిగా ఉన్నది.

ఇతరసంప్రదాయస్థుల స్తోత్రపద్ధతికంటే విశిష్టాద్వైత సంప్రదాయస్థుల స్తోత్రపద్ధతి విలక్షణమైనది.

**స్వరూపరూపవిభవగుణకర్మాణి శార్ఙ్గిణః।**
**వ్యాచక్షీత నిబధ్నీయా చ్ఛృణుయాద్విలిఖేత్ పఠేత్॥**

అన్నట్లు, గురువందన పూర్వకంగా శ్రీమన్నారాయణుని స్వరూపరూపగుణాలనే కాక, జగత్సృష్ట్యాదిలీలలనుకూడా కీర్తిస్తూ, స్తోత తనను అకించనుడుగా, ఆగతికుడుగా విన్నపించుకొంటూ ప్రపత్తిచేసే పద్ధతి లక్షణంగా ఉంటుంది. ముఖ్యంగా జగన్మాతయైన శ్రీదేవిని స్తుతించే **'చతుఃశ్లోకి'** ఎంతో కమనీయమైన **'కాంత స్తే పురుషోత్తమః'** అనే వాక్యంతో ఆరంభింపబడినది. ఈవాక్యం నాల్గు శ్లోకాల గభీరార్థాలను గర్భీకరించుకొన్నట్లు గోచరిస్తుంది.

ఓ భగవతీ! నీ మనోహరుడు పురుషోత్తముడమ్మా–అని అర్థం, **"సహస్ర శీర్షా పురుషః"**–ఆయన సహస్రపాదాక్షి శిరోరుబాహుడు. **"యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కించిత్"**–ఆయనకంటె చిన్నది, పెద్దది ఇంకొకటి లేనేలేదు. **"పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్"**–గడచినవీ, రాబోయేవీ అన్ని పురుషుడే. **"స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః"**– జీవునిలో ఉన్నవాడు, సూర్యుని (తోజఓజోమండలం) లో ఉన్నవాడూ ఆయన ఒక్కడే. **"ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః"**–నఖశిఖాపర్యంతం బంగారంవంటి అందమైన అవయాలు కలవాడు. **"పురుషః పుండరీకాక్షసంజ్ఞితః"**–పుండరీకాక్షుడనే పేరు కలిగిన పురుషుడు ఆయన.

**"పురు"**–బహ్వర్థకం. **'షణు–దానే'** అనే ధాతువునుంచి ఏర్పడినది పురుషశబ్దం. **"పురు–సనోతీతి పురుషః"** చాలా–అంటే–ధర్మార్థకామఫలాలనేకాక మోక్షఫలాన్నికూడా ఇచ్చేవాడు. **"న తస్యేశే కశ్చన"** – ఆయననునియమించే వాడెవడూ లేడు. ఆయన సర్వస్వతంత్రుడు. **"అజాయమానో బహుధా విజాయతే"** – పుట్టుక లేనివాడైనా ధర్మసంస్థాపనకోసం తన సంకల్పంచేత అనేకరూపాలతో అవతరించేవాడు.



పురుషులకంటే, పురుషులలో, పురుషులయందు ఉత్తముడు. అంటే–త్రివిధ–బద్ధ ముక్త నిత్య–చేతనులకంటే విలక్షణుడు. **"కారణం తు ధ్యేయః"**–చరాచరజగత్తుకు త్రివిధకారణభూతుడు. కాబట్టి పురుషోత్తముడుమాత్రమే ఉపాసింపదగినవాడు.

**"కాన్తః"** –**"కము–కాంతౌ"–'కామ్యత ఇతి కాంతః'** కోరబడేవాడు కాంతుడు, **"కస్య సుఖస్య అంతః నిశ్చయ యస్మిన్ సః–కాన్తః. సుఖం–మోదః ప్రమోద ఆనందః.** శాశ్వతంగా అనుభవించే ఆనందం కలవాడు. **"ఏతావానస్య మహిమా"** ఇంతటి ఉభయవిభూతినాయకత్వమహిమకలవాడుకదా! అనే నీవు చక్కగా కోరుకుని **'యయా వక్షఃస్థలం హరేః"** – బ్రహ్మరుద్రాది దేవతలనూ తన ఆధీనమందు ఉంచుకొనువాడైన హరియొక్క వక్షఃస్థలాన్ని అధిష్ఠించియున్నావుకదా!

ఆయన అభిమతానికి అనురూపమైన స్వరూప–రూప–గుణవిభవైశ్వర్యాలు కలదానవు కాబట్టి, ఆ రూపగుణవిభవాలచే ఆయనకు అపూర్వవిస్మయాన్ని కలిగించే స్వభావవు – అని పురుషోత్తముడు **"చకర్థ యస్యా భవనం భుజాంతరమ్" –** తన భుజాంతరాన్ని నీకు శుద్ధాంతఃపురంగా చేశాడు. భంగ్యతరంగా చెప్పితే **"పురుషోత్తమస్య త్వం కాన్తా"** – పురుషోత్తమునికి నీవు ప్రియపత్నివి అన్నమాటేకదా! అందువల్ల, నీచేత భగవానునికి స్వరూపనిరూపకమూ, ఆయనవల్ల భగవతివైన నీకు స్వరూపసత్తా కలిగిందికదమ్మా ! తత్ఫలితంగా, **"ఫణిపతిః శయ్యాసనం వాహనం వేదాత్మా విహగేశ్వరః" –** భర్త, అస్తి – అంతా భార్యకూ చెందుతున్నందువల్ల ఉభయవిభూతులు మీదివ్యదంపతులకు శేషభూతమైనవి. ఉమ్మడి ఆస్తిగా ఉన్నాయి. **'శ్రీ'** అనియే కదా నీ పేరు. చేతనవర్గమంతా నిన్ను ఆశ్రయిస్తే, నీవు నీవల్లభుడైన పురుషోత్తముణ్ని ఆశ్రయించావు. కాబట్టి శ్రియఃపతి, శ్రీమన్నారాయణుడు సర్వశేషిగా భాసిస్తున్నాడు. **'ఆకారత్రయ సంపన్న'** – అంటే శ్రీదేవి శేషిత్వ, పురుషకారత్వ, ప్రాప్యత్వాలు అనే మూడు ఆకారాలు కలది. **"దేవజుష్టా ముదారాం"** అని శ్రీసూక్తం. బ్రహ్మరుద్రేంద్రాది దేవతలచేత సేవింపబడుతున్నదనడమేకాక ముఖ్యంగా పరవాసుదేవునికి ప్రియమైనది శ్రీదేవి– అని అర్థం. **"దేవశబ్దోఽత్ర వాసుదేవపరః, దేవై ర్జుష్టా మితి తు మన్దమ్. నిరవధికక్రీడోపయుక్తతయా దేవేన భగవత ప్రీతివిషయీకృతా మిత్యర్థః"**. నిష్ప్రత్యూహప్రణయఘటితమైన పరదేవతాద్వంద్వమిది.

**"సో అంగ వేద యది వా న వేద"** – ఈ దివ్యమిథున మహిమ ఎనలేనిది, ఎన్నరానిదికదా! తనమహిమ ఎంతటిదో ముఖ్యంగా ఆ పరమాత్మకే తెలియదన్నది వేదవాణి. అలాగే **"తనక్కుమ్ తన్‌తన్మై అతివతియానై"** – అన్నది ద్రవిడోపనిషత్తు, **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** – బ్రహ్మనూ, బ్రహ్మానందాన్నీ వేదాలు తెలియజాలక మరలివస్తున్నాయి. **"సోఽన్వేష్టవ్యః"**– ఇప్పటికీ వేదాలు ఇంకా వెదకుతూనే ఉన్నాయట. ఇక తన మహిమను తానే తెలిసికోలేని భగవానుడు భగవతి అయిన శ్రీదేవి మహిమను తెలుసుకోలేదుకదా. ఇట్టి దంపతుల గొప్పతనాన్ని స్తుతింపలేమని

సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ

**ఉ.వే.శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారు**

స్థానాచార్యులు, ఆదికేశవఎంబెరుమానార్‌స్వామివార్ల దేవస్థానం, నరసాపురం.

స్వస్తి శ్రీశతాత్

## శ్రీమహిమ

**అస్తి వస్త్విదమిత్థంత్వప్రసంఖ్యానపరాఙ్ముఖమ్ ।**
**శ్రీమత్యాయతనే లక్ష్మీపదలాక్షైకలక్షణమ్ ॥**

"**శ్రద్ధయాఽదేవో దేవత్వ మశ్నుతే**" అనేది వేదవచనం. "**తిరుమామగళ్ కేళ్వాదేవా**" అనేది ఆళ్వార్ల శ్రీసూక్తి. శ్రద్ధాశబ్దవాచ్యురాలైన శ్రీదేవి సాన్నిహిత్యంవల్లే ఆ దేవునికి దేవత్వం సిద్ధించిందని పైసూక్తుల తాత్పర్యం. "**దివి**" ధాతువునకు "**క్రీడావిజిగీషావ్యవహారద్యుతిస్తుతిమోదమదస్వప్నకాంతిగతు**"లనే పది అర్థాలున్నాయి. భగవానుడు చేసే జగత్‌సృష్టిమొదలు మోక్షప్రదత్వంవరకుగల వ్యాపారాలన్నీ శ్రీదేవీ సాపేక్షాలుగానే ఉన్నాయి. ఆమె సహకారం లేనిదే ఆ వ్యాపారాలన్నీ అడవిగాచిన వెన్నెలే అవుతాయి. దానినే "**అసరస మభవాఽప్రియంభవిష్ణు ధ్రువ మకరిష్యత రంగరాజ నర్మ**" – "శ్రీరంగనాథుడు చేసే క్రీడావిలాసాలన్నీ (జగత్‌సృష్ట్యాదులు) స్వారస్యం లేనివి, అప్రియములే అవుతాయి – శ్రీదేవి సహకరించనిచో – అని అన్నారు పరాశరభట్టర్. పైభావాలన్నీ కూడా "**అదేవః శ్రద్ధయా దేవత్వ మశ్నుతే**" అనే వేదసూక్తిద్వారా తెలుస్తున్నాయి. పైసూక్తిలో "**అదేవః**" అను పదపారం స్వరానుకూలం అని పెద్దలు అనుగ్రహిస్తారు.

ఈవిధంగా శ్రీదేవి భగవానుని పత్నీత్వ సంబంధముచే సహకరించుటయేగాక చేతనవిషయంలో మాతృత్వప్రయుక్తసంబంధంతో ప్రియపరురాలవుతుంది. కావుననే కఠవల్లీ సారమైన ద్వయోపనిషత్ శ్రీదేవీపురుషకారపూర్వకంగా భగవానుని శ్రీచరణాలని ఉపాయంగా స్వీకరించాలని, శ్రీతోకూడిన స్వామివిషయంలో సర్వవిధకైంకర్యాన్ని కోరాలని (చేయాలని) ఉపదేశిస్తుంది.

శ్రీదేవివైభవం మొదట శ్రీసూక్తంలో తెలుస్తుంది. పిమ్మట వేదోపబృంహణాలైన ఇతిహాసపురాణాల్లో వివరింపబడుతుంది. ముఖ్యంగా శ్రీరామాయణం మొత్తం "**కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్**" అనునట్లు సీతావైభవాన్నే తెలుపుతుంది. ఇక మన పుర్వాచార్యుల అనుష్ఠాన అనుభవాలనిచూస్తే మిథునశేషత్వమే (శ్రీ– శ్రియఃపతులకు) ఆత్మస్వరూపం–అని తెలుస్తుంది.



శ్రీదేవిమహిమను మొదట పరమాచార్యులైన యామునమునులు (ఆళవందార్లు), స్వామి ఎంబెరుమానార్లు, వారి ననుసరించిన కూరత్తాళ్వాన్, పరాశరభట్టర్, వేదాంతదేశికులు స్తోత్రరూపంలో అనుభవించియున్నారు. పరమాచార్యులైన యామునమునీంద్రులు శ్రియఃపతివిషయంగా స్తోత్రరత్నాన్ని, శ్రీదేవిపరంగా కాంతాచతుఃశ్లోకిని అనుగ్రహించారు. లక్ష్మీనారాయణుల విషయంగా తరువాత అవతరించిన స్తోత్రాలకు యామునాచార్యులే మార్గదర్శకులనుట ప్రసిద్ధవిషయం. "**కాంతాచతుఃశ్లోకీ**" లో ఉన్నవి నాల్గు శ్లోకాలే. కాని, వానిలోని భావాల్ని వివరించుటకు విశదవాక్యసరణియే అవసరమవుతుంది. **మొళిపట్టోడుమ్ కవియముదమ్**" అన్నట్లు (శ్రీసూక్తులను అనుసరించు భావమాధుర్యం) ఉండే ఇందులోని భావమాధుర్యాన్ని ఆస్వాదించడానికి సంప్రదాయజ్ఞులేగాక సారమస్వత ప్రియులుకూడ ఉవ్విళ్ళూరుతారు. రసజ్ఞుల నోము ఫలంగా "**నాయనారాచ్చాన్ పిళ్ళై**" అను పూర్వాచార్యులు ఈ స్తోత్రానికి అద్భుతమైన విశదవ్యాఖ్యను అనుగ్రహించారు. ఉభయవేదాన్తాలలోనుండే రస్యములు, గంభీరములైన విషయాలు ప్రసక్తానుప్రసక్తంగా ఇందులో నిధినిధాయంగా ఉన్నాయి. ఆచార్య సన్నిధిలో ఈ వ్యాఖ్యను శ్రవణం చేయగలిగితే అంతకంటే సంప్రదాయ ప్రియులకు మఱియొక భాగ్యం ఉండదనుట అనుభవైకవేద్యం.

"**జ్ఞానాధిరాజం అభయప్రదరాజసూనుమ్**" అను తనియాన్‌లో గల "**జ్ఞానాధిరాజ**" విశేషణమే వీరి వైభవాన్ని తెలుపుతుంది. వీరు వ్యాఖ్యాతృ చక్రవర్తియగు పెరియవాచ్చాన్ పిళ్ళైగారి తిరుక్కుమారులగుట (స్వీకారపుత్రులు) మఱియొక విశేషం

ఈవ్యాఖ్యలోని విశేషాలు మచ్చునకు కొన్ని –

(1) "**శ్రీయతే–శ్రయతే**"–అని శ్రీశబ్దానికిగల వ్యుత్పత్తులలో (ఆఱు వ్యుత్పత్తులలో), చేతనులచే ఆశ్రయింపబడును–స్వామిని ఆశ్రయించును–అని కర్మణి, కర్తరి వ్యుత్పత్తులను తెలిపే పద్ధతిలో గాక, మొట్టమొదటనే–స్వామిని ఆశ్రయించు చున్నది (**శ్రయతే**) – అను కర్తరి వ్యుత్పత్తిని తెలుపుటలోగల విశేషం.

(2) ద్వయార్థవివరణ మీస్తోత్రం అని తెలుపు సందర్భంలో "**కాంత స్తే పురుషోత్తమః**" అనే భాగంద్వారా –పూర్వఖండార్థం, "**ఫణిపతిః శయ్యా**" ఇత్యాది మిగిలినశ్లోకభాగం ద్వారా ఉత్తర ఖండార్థం వివరింపబడిదని తెలుపుట.

(3) ద్వయమంత్రం పూర్వవాక్యంలోనున్న శ్రీశబ్దానికి ఉపలక్షణత్వం– ఉత్తరవాక్యంలో గల శ్రీశబ్దానికి విశేషణత్వం–అని తెలుపుటలోని ఔచిత్యం.

(4) శ్రీదేవి విషయంగా–అణుత్వవిభుత్వనాదాన్ని సయుక్తికంగా ఉట్టంకించి అణుత్వవిషయాన్ని సిద్ధాన్తీకరించడం.

శిక్షావల్లీప్రథమప్రసూతప్రసూనగుచ్ఛం నాలుగు పూవుల నలరారుతోంది. ఆ ప్రసూనాలు వరుసగా మాతృ-పితృ-ఆచార్య-అతిథి రూపాలు. ఈ నాలుగింటిలో తొలిపూవు తల్లి. ఈ నలుపూవుల గుత్తిలోని రహస్యాన్ని గుర్తించి. శ్రీభాష్యాధ్యాయ చతుష్టయప్రతిపాద్యప్రకారాన్ని గమనించి, విష్ణుపురాణపు పోకడలను అనుశీలించి, పాంచరాత్రరహస్యామ్నాయ సౌరభాలనాఘ్రాణించి, ఆళ్వారుల శ్రీసూక్తుల ననుభవించి, చివరగా ఆచార్యుల అంతరంగాల నవగాహించి, చమత్కారచతురంగా, శ్రుతి సమ్మతంగా, ఉభయవేదాన్త సిద్ధాన్త సీమంతినీ మృదుపరిష్వంగ సుఖసీమాభూమిగా. నిగూఢభావప్రకాశంగా బృహత్తరమూ, మహత్తరమూ రసఘనమూ అయిన వ్యాఖ్యను అనుగ్రహించినారు నాయనారాచ్చాన్ పిళ్ళైగారు. వీరు వ్యాఖ్యాతృశిరోమణులు పెరియ అచ్చాన్ పిళ్ళైగారి తిరుక్కుమారులు.

తమవరకు వెలసిన వ్యాఖ్యలను సాకల్యంగా పరిశీలించి ఆళవందారుల సూత్రప్రాయములయిన సూక్తుల లోతులు ముట్టి, వాటి కలరూపు నెరిగి, నాటికి వినవస్తున్న వివాదాలకు, విచికిత్సలకు సామరస్యంతో వారి మాటలలోనే ఐకరస్యం ఘటించి, సకలశిరోధార్యంగా ఈ వ్యాఖ్యానాన్ని సంతరించినారు శ్రీనాయనారాచ్చాన్ పిళ్ళైగారు.

తమిళంలోని యీ వ్యాఖ్యను తెలుగువారికి సులభం కావింప పూనుకొన్నవారు మాకత్యంత ఆప్తులు, **వ్యాఖ్యాతృశిరోమణి. ఉ.వే.శ్రీమాన్. డా. ఈ. ఏ. శింగరాచార్య స్వామివారు**. వీరిప్పటికే ఎన్నో తమిళ-సంస్కృతస్తుతిప్రబంధాలకు ప్రామాణికములు, ప్రశస్యతరములు అయిన వ్యాఖ్యానువాదములను వెలయించిన విశ్రుతకీర్తులు. సమగ్రమయిన ఉభయవేదాన్త వైదుష్యంతోపాటు వ్యాఖ్యాన నిర్మాణానికి కావలసి పరికరసంపద బహుథా కలవారు. ఈ వ్యాఖ్యానాన్ని తెలుగుగావించి తెలుగు వారి కృతజ్ఞతకు పాత్రులయినారు.

శ్రీమాన్ శింగరాచార్యస్వామి తెలుగున సమకూర్చిన ఈ చతుఃశ్లోకీ వ్యాఖ్యాన గ్రన్థాన్ని తెలుగునాట నెలకొన్న సత్సంప్రదాయపరులకు సమర్పించడానికి ముందుకు వచ్చినారు **"అభినవనంబిళ్ళ"**గా ఆచార్యకులపతులచే ఆప్యాయంగా పేర్కొనబడే **వైకుంఠవాసులు, ఉ.వే. శ్రీమాన్. డా కందాళ వేంకటాచార్యస్వామివారి** కుటుంబము, శిష్యులు.

ఈ యేడు తమ ఆచార్యస్వాముల తిరునక్షత్రోత్సవ కైంకర్యాన్ని సార్వభౌమ వర్చస్కంగా, దివ్యవైభవసనాథంగా జరుపుకోగల సౌభాగ్యాన్ని పొందిన **చరితార్థులు**



**శ్రీమాన్ నాగులకొండ వేంకటరామానుజయ్యగారు**. వీరు వాధూల వేంకటాచార్య పాదరేఖామయులు. **'ఛాయేవానుసరన్ గురుమ్'** అన్నట్టుగా అనారతమాచార్యుల వెన్నంటియుండి పరిపూర్ణమయిన వారి అనుగ్రహానికి పాత్రమైనవారు. సమక్షంలో అనునయిస్తూ పరోక్షంలో **'తిరిగిచూస్తే తిరుమణి తోడు'** అనదగినవారు విజయనగరం త్రైవర్ణికరామానుజకూటంలోనే ఎవరూ లేరు. ఇది నిశ్చప్రచం. వారిలో తలమానికముగా పరోక్షంలోనూ ఆచార్యకుటుంబాన్ని పరిచరిస్తూ, ఆచార్యదుహిత చి.సౌ. జానకిపట్ల ఆచార్యప్రపత్తిని ప్రకటించుకొంటూ, ఆచార్యసేవే తమకు ప్రాప్యముగా భావిస్తూన్న **చరమపర్వనిష్ఠులు శ్రీమాన్ ఎన్. వి. రామానుజయ్యగారు.** ఈయేటి వేంకటాచార్యస్వామి తిరునక్షత్రాంగమయిన ఆచార్యవరివస్యను తమ ప్రీతికృతకైంకర్యముగా తాము కావించుకొంటూ, ఆసందర్భంగా ఈ చతుఃశ్లోకీ శ్రీకోశాన్ని సత్సంప్రదాయమధుకోశంగా ఆచార్యహృదయోల్లాసంకోసం భాగవతగోష్ఠికి సమర్పించుకొంటున్నారు. ధన్యులు.

వారిపై, వారి కుటుంబంపై ఆచార్యకటాక్షం పరిపూర్ణంగా సదా ప్రసరించాలని, ఆయురారోగ్యభాగ్యాలతో వారు. ఇతోధికకైంకర్యశ్రీవల్లభులుగా విలసిల్లేటట్లు దివ్యదంపతులు కటాక్షించాలనీ కోరుకుంటున్నాను.

ఈ చతుఃశ్లోకీవ్యాఖ్యాశ్రీకోశం సంప్రదాయపరులను మధుకోశంగా తనియింపగలదని విశ్వసిస్తున్నాను.

ఇట్లు నివేదించు

భాగవతవిధేయుడు

**శ్రీరామచంద్రాచార్య**

ప్రయత్నాని నిరసించి, పరమాత్మయందే ఉపాయత్వాన్ని నిష్కర్షించింది. కనుక ఉపాయత్వం పరమాత్మయందే అని – తెన్నాచార్య సంప్రదాయం. వడమాచార్య సంప్రదాయం దీన్ని అంగీకరింపదు.

విష్ణుపురాణంలో **"విముక్తిఫలదాయినీ", "సంసారార్ణవతారిణీ"** అని సాక్షాత్తు అమ్మకు ఉపాయత్వం చెప్పబడింది. **అగ్నిషోములకు** ఇద్దరకు హవిస్సునుద్దేశించి ఏకదేవతాత్వం ఎలా ఉన్నదో అలాగే లక్ష్మీనారాయణులిద్దరియందు ఏకశేషిత్వంలాగా ఉపాయత్వం ఉంది. ఇక, అవతారంలో కేవలం దుఃఖాభినయంమాత్రమే. అది భగవంతునికికూడా సమానమే. కనుక, భగవంతునికిలా లక్ష్మికీ ఉపాయత్వం ఉందని వడమాచార్యసంప్రదాయం. ఇలా సంప్రదాయభేదాలు ఉన్నా, ఇవన్నీ శ్రీవైష్ణవానికి వైయర్థ్యాన్ని ఎంతమాత్రం కలిగించేవి కావని, ఇవి కేవలం సమన్వయంలో విభేధాలేనని శ్రీమన్నిగమాన్తదేశికులే స్వయంగా సంప్రదాయపరిశుద్ధిలో ఉద్ఘోషించారు. **"శ్రీభాష్యకారరుడైయ శిష్యసంప్రదాయజ్గళిల్ ఒన్టిలుమ్ అర్థవిరోధ మిల్లై. వాక్యయోజనా భేదముళ్లదు"** – శ్రీభాష్యకారుల శిష్యులలో ఉన్న సంప్రదాయభేదాల్లో అర్థగతంగా విరోధం ఎంత మాత్రంలేదు. వాక్యాలను అన్వయించుకోవడంలో మాత్రమే భేదం ఉంది అని, అందువల్ల వడమాచార్యసంప్రదాయానికి మూలంగా భావింపబడే శ్రీదేశికుల గ్రంథాలనుంచి శ్రీమణవాళమహామునులు అక్కడక్కడ ప్రమాణంగా ఉట్టంకించడం గమనింపవచ్చు. ముముక్షుప్పడివ్యాఖ్యానంలో ఆచార్యలక్షణాన్ని నిర్వచించేటప్పుడు **"సద్బుద్ధిః సాధుసేవీ"** ఇత్యాదిగా న్యాసవింశతిలో శ్రీమన్నిగమాన్తదేశికులనుగ్రహించిన శ్లోకాన్ని ప్రమాణంగా ఉట్టంకించారు. అయితే, ఆధునికులైన సంప్రదాయనిరతులు స్వస్వసంప్రదాయదురభినివేశంతో దేశికులుట్టంకించిన అభిప్రాయాలను అన్యథాకరించి వివరించడం, సమయం దొరికినప్పుడల్లా సంప్రదాయభేదాన్ని ఎత్తి చూపి విమర్శించడం పనిగా పెట్టుకొని రెండుసంప్రదాయాలకు దూరాన్ని పెంచ యత్నించడం శోచనీయం.

నిక్షేపరక్షలోని–

> **ప్రాయః ప్రపదనే పుంసాం పౌనఃపున్యం నివారయన్ ।**
> **హస్తః శ్రీరంగభర్తుర్మామ్ అవ్యాదభయముద్రితః ॥**

అని నిగమాన్తదేశికులు కటాక్షించిన శ్లోకంలో **'ప్రపదనే పౌనఃపున్యం నివారయన్'** అని స్పష్టంగా ఉన్న అంశాన్ని స్వాభిమతసంప్రదాయార్థానుగుణంగా అన్వయించడానికి పెద్దలు పడిన పాట్లు వారి దురభినివేశాన్నే స్పష్టపరుస్తాయి. ఇలాగే లక్ష్మీవిభుత్వాదులు దేశికులకు పూర్వులైన ఆచార్యులకుకూడా సమ్మతాలేనని నిరూపించడానికి దేశికవ్యాఖ్యా సంపాదకులు ఉద్యమించి వాత్స్యవరద గురువులుకూడా తమ ప్రపన్నపారిజాతంలో లక్ష్మీవిభుత్వాదులను ప్రమాణపురస్సరంగా నిరూపించారని పేర్కొనడం కేవలం



స్వమతాభినివేశం తప్ప వస్తుతత్త్వం కాదు. ఇలాంటివి ఆధునికకాలంలో ఎన్నో జరుగుతూ ఉన్నా, పూర్వాచార్యులకుమాత్రం ఇప్పటి ఈ దురభివేశం లేదనే చెప్పాలి. కనుకనే, చతుఃశ్లోకీవ్యాఖ్యానంలో లక్ష్మీస్వరూపాదివిషయకంగా ఐదు పక్షాలు ఉపక్షేపించి– ఐదు పక్షాల్లోనూ ఇదే ప్రమాణమని నిశ్చయింపక– **'కేచిత్', 'అపరే', 'అన్యే'** ఇత్యాదిగా ఆయా పక్షాలు పేర్కొని– **"పంచస్వేతేషు పక్షేషు కశ్చిదేకః ప్రమాణవాన్"**– అని అంటూ, ఈ పక్షాలన్నీ ఉపస్థాపనం చేసి విచారించడంలోని పరమతాత్పర్యం–లక్ష్మీదేవికి నారాయణునితో ఆనురూప్యంతోకూడిన సంబంధం ఉన్నదని చెప్పడమేనని నిష్కర్షించారు.

> **అత్ర స్వామిత్వ సౌలభ్యఫలదత్వఫలత్వతః ।**
> **ఆనురూప్యేణ సంబంధః శ్రీపతౌ దర్శితః శ్రియః ॥**

స్వామిత్వం, సౌలభ్యం, ఫలదత్వం, ఫలత్వం – అనే అంశాలతో సాంప్రదాయిక భేదాలున్నప్పటికీ, వాటిని నిర్మత్సరంగా తెలిసికోవడంలో మనకు ఎలాంటి అభ్యంతరమూ ఉండనక్కరలేదు. ఈ దృష్టితోనే పెద్దల వ్యాఖ్యానాలు ఏకత్ర చేర్చి, వాటిలోని సారాన్ని తెలుగులో శ్రీమాన్ శింగరాచార్యస్వామివారిద్వారా లోకానికి అందింపజేస్తున్న ఈ ప్రయత్నం సర్వథా అభినందనీయం. బహుగ్రంథకర్తలైన స్వామివారు ఈ ప్రస్తుత బాధ్యతనుకూడా చాలా సమర్థతతో నిర్వహించి కృతకృత్యులైనారు. లక్ష్మీవిభుత్వాదివిషయాలలో ఉన్న సాంప్రదాయకభేదాలనుకూడా చాలా విశదంగా పాఠకులముందు వ్యాఖ్యాత్రభిప్రాయంగా ఆవిష్కరించి, మహోపకారం చేశారు. పాఠకలోకం మనస్వామికి కృతజ్ఞతాబద్ధమై ఉంటుంది. ముఖ్యంగా, నాయనార్ ఆళ్వాన్‌పిళ్ళై వ్యాఖ్యను ఆధారంగా చేసికొనే శ్రీమాన్ సింగరాచార్యస్వామివారి వివరణం సాగింది. కనుక, తెలుగు వివరణలో చూపిన పూర్వపక్ష సిద్ధాన్తాభిప్రాయాలన్నీ నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై స్వామివేనని మనం భావించవచ్చు. ఈ అపూర్వవ్యాఖ్యాసంకలనాన్ని ప్రతిఒక్కరు అనర్ఘనిధిగా దగ్గర ఉంచుకొనవలసిన అవసరం ఎంతైనా ఉంది. వీటిని ఏకత్రితంగా వెలికిదీసికొనిరావడానికి ఆర్థికసహకారాన్ని ఉదారంగా చేసిన **శ్రీమాన్ ఎన్.వి. రామానుజయ్యగారికి** అనేక మంగళాశాసనాలు. ప్రోత్సాహకులు **శ్రీమతి జానకి, హరిప్రియ** ప్రభృతులకు హార్దాభినందనాలు.

ఇట్లు

**సముద్రాల రంగరామానుజాచార్యులు**

**"కడలై కుళప్పడియిలే మడుత్తాప్పోలే"** అన్నట్లు సంగ్రహించి పలికారు. ఈ శ్లోకాలలో ఇమిడి ఉన్న విశేషాలను సుసూక్ష్మమతిని కలపెద్దలు దర్శించాలే తప్ప, మాదృశులైన సామాన్యులకు గోచరించవు.

శ్రీయామునుల స్తోత్రరత్నం పరమపదనాథునిగూర్చి అనుగ్రహింపబడిందనే విషయం ఆ స్తుతిని సేవించిన వెంటనే తోస్తుంది. అయితే ఈ స్తుతిలోని "**కులధనం కులదైవతం తత్**" ఇత్యాది ప్రయోగస్వారస్యాన్నిబట్టి ఇది శ్రీరంగంలోని శ్రీరంగనాథుని అర్చామూర్తిని గూర్చి అనుగ్రహింపబడిందని చెప్పవచ్చునని పెద్దల నిర్వాహం. ఇదేరీతిలో శ్రీయామునులు చతుఃశ్లోకిని మహాలక్ష్మినిగూర్చి అనుగ్రహించారని స్పష్టపడినా, దీనిని శ్రీరంగంలోని శ్రీరంగనాయకి అర్చామూర్తిని ఉద్దేశించి రచించారని చెప్పవవచ్చు. భగవద్భాష్యకారుల **"భగవన్నారాయణాభిమతానురూప"** అనే గద్యం, కూరేశుల శ్రీస్తవం, పరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశం–ఇవన్నీ శ్రీరంగనాయకినిగూర్చి రచింపబడినవనే అంశం అందటికీ తెలిసినదేకదా! పరమపదనాథునకు ప్రతిరూపంగా శ్రీరంగనాయకి సంభావింపబడుతున్నది. **"ఈషత్ త్వత్ కరుణా"** ఇత్యాది శ్లోకంలో యామునులు అనుసంధించిన పౌరాణిక వృత్తాంతాన్ని కూరేశులు, భట్టర్ శ్రీరంగనాయకి విషయంగా అనుసంధించడంకూడా గమనార్హం.

ఈ స్తుతికి **"కాంతాచతుఃశ్లోకీ", "కాంతాస్తోత్రమ్"** అనే వ్యవహారాలుకూడా ఉన్నవి. **"అతిమానుషస్తవం, జితంతే స్తోత్రం"** – అనే పేర్లలోవలె స్తుతిలలోని మొదటి పదంతో వ్యవహరిస్తే **"కాంతచతుఃశ్లోకీ", "కాంతస్తోత్రమ్"** అనే వ్యవహారాలు ఉండాలి. వ్యాకరణప్రక్రియానుసారమైనా కాంతశబ్దం సాపేక్షపదం కనుక **"కాంతచతుఃశ్లోకీ", "కాంత స్తోత్రమ్"** అనే ఉండాలి. ప్రాయశః **"గోదాచతుఃశ్లోకీ"** వంటి వ్యవహారాలలోవలెనే వాడుకలో పై వ్యవహారాలు వచ్చివుండవచ్చునని కొందరు పెద్దలు భావించారు. **"కాంతా"**శబ్దాన్ని వ్యస్తంగా, విశేషణపదంగా గ్రహించి అన్వయించవచ్చునేమో! అని మహామహోపాధ్యాయ ఉ.వే. శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారు అనుగ్రహించారు. పలు ముద్రితగ్రంథాలలో మాత్రం **"చతుఃశ్లోకీ"** అని మాత్రమే ఉండడం కూడా గమనించతగినది.

**"రాజరాజోఽఖిలస్యాస్య విశ్వస్య పరమేశ్వరః, కాంతస్య"** అని లక్ష్మీతంత్రం భగవానుని కాంతశబ్దంతో పేర్కొంది. **"నమామి కమలాం కాంతామ్"** అని లక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్రం **"కాంతా"** శబ్దంతో లక్ష్మిని నిర్దేశించింది. అందువల్ల ఈ రెండు పదాలు దివ్యదంపతుల నామాలుగా గ్రహించినపుడు **"కాంతా స్తోత్రమ్, కాంతాచతుః శ్లోకీ"** అనే వ్యవహారాలు పొసగుతాయి అని కొందఱు వివరించారు. అంతేగాక, ఈ



చతుఃశ్లోకిలోనే **"అరవిందలోచనమనఃకాంతా"** అనే ప్రయోగాన్నిబట్టి **"జితం తే"** అని ప్రారంభమయ్యే స్తుతిని తంత్రేణ **"జితంతాస్తోత్రమ్"** అని వ్యవహరించినట్లే, దీనినికూడా **"కాంతాస్తోత్రమ్"** అని వ్యవహరించవచ్చునని ఉ.వే.శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారు అభిప్రాయపడ్డారు.

ఈస్తుతి నాల్గు శ్లోకాలను కల్గి ఉండడంలోని విశేషాన్ని గమనించినపుడు ఈ క్రింది విశేషాలను చెప్పవచ్చు. వేదాంతాలలో ప్రతిపాదింపబడ్డ బ్రహ్మతత్త్వాన్నిగూర్చి వివరించే బ్రహ్మసూత్రాలు నాల్గు అధ్యాయాలుగా విభాగింపబడ్డాయి. **"కారణత్వ మబాధ్యత్వ ముపాయత్వ ముపేయతా"** అని చెప్పబడ్డ రీతిలో ఇవి క్రమంగా లక్ష్మీవిశిష్టుడైన పరమాత్మయొక్క కారణత్వాన్ని, ఆబాధ్యత్వాన్ని, ఉపాయత్వాన్ని, ఉపేయత్వాన్ని తెలుపుతున్నవి. ఈ విషయాన్ని దేశికులు తమ చతుఃశ్లోకీ భాష్యప్రారంభంలోని **"స్వశేషాశేషార్థో నిరవధికనిర్బాధమహిమా ఫలానాం దాతా యః ఫల మపి శారీరక మితః"** ఇత్యాది ప్రార్థనాశ్లోకంలో ప్రకారాన్తరేణ ప్రస్తావిస్తూ, పరమాత్మ యొక్క సర్వశేషిత్వం–అంతులేని, అడ్డులేని మహిమ–ఫలప్రదాతృత్వం–ఫలరూపియై ఉండడం అనే నాల్గు అంశాలు శారీరకమీమాంసలోని నాల్గు అధ్యాయాలలో ప్రతిపాదితాలు అన్నారు. ఈ విధంగా పరమాత్మకు చెప్పబడ్డ నాల్గు అంశాలతో లక్ష్మీదేవికి ఉండే అవినాభావసంబంధాన్ని దేశికులు **"శ్రియం తత్ సధ్రీచీమ్"** అని సూచించారు. చతుఃశ్లోకిలోని నాల్గు శ్లోకాలు పై నాల్గు అంశాలను క్రమంలో తెలుపుతున్నాయి అని చెప్పవచ్చు. మొదటిశ్లోకంలో **"ఫణిపతిః శయ్యా . . .త్వద్దాస దాసీగణః"** ఇత్యాదిగా లక్ష్మియొక్క స్వశేషాశేషార్థత్వం, రెండవశ్లోకంలో **"యస్యా స్తే మహిమానం – నిత్యానుకూలం స్వతః"** ఇత్యాదిగా నిరవధికనిర్బాధమహిమ, **"ఈషత్త్వత్. . . "** ఇత్యాది మూడవ శ్లోకంలో **"అరవిందలోచనమనఃకాన్తాప్రసాదాదృతే"** ఇత్యాదిగా పురుషకార రూపమైన ఉపాయత్వం, నాల్గవ శ్లోకంలో **"యాన్యన్యాని. . . గాఢోపగూఢాని తే"** అని పలుకడంద్వారా లక్ష్మియొక్క ఉపేయత్వం – తెలుపబడినవి అన్నది సుస్పష్టం.

**"ఆక ఇప్పడి శ్లోకత్రయత్తాలుమ్ ప్రకృతియాన శ్రీశబ్దార్థత్తై అనుసన్ధిత్తు, అనంతరమ్ ప్రత్యయమాన మతుప్పిన్ అర్థత్తై అరుళిచ్చెయ్‌వతాక తిరువుళ్ళమ్ పఱ్ఱి"** అని నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై నాల్గవ శ్లోక వ్యాఖ్యానావతారికలో అనడంవల్ల మొదటి మూడు శ్లోకాలు శ్రీశబ్దార్థవివరణమని, నాల్గవ శ్లోకం ప్రత్యయమైన **"మతుప్"** యొక్క అర్థం అని చెప్పవచ్చు. అదే విధంగా మొదటి శ్లోకంలో లక్ష్మీదేవి పరత్వం, రెండవ శ్లోకంలో సౌలభ్యం, మూడవ శ్లోకంలో పురుషకారం, నాల్గవ శ్లోకంలో ఉపేయత్వం చెప్పబడ్డాయని కూడా వ్యాఖ్యలలో వివరింపబడింది.

వ్యాఖ్యానించడాన్ని పేర్కొనవచ్చు. నాయనార్‌కూడా దేశికులవలెనే తమ చతుః శ్లోకీవ్యాఖ్యలో పిరాట్టినిగూర్చి అంతకు ముందు ఉన్న పలువురి ఆచార్యుల అభిప్రాయాలను పేర్కొని, వాటి సామంజస్యాన్ని పరిశీలించారు. వీరి వాక్యవిన్యాసం కూడా అऴకియమణవాళప్పెరుమాళ్‌నాయనార్ అనుగ్రహించిన ఆచార్య హృదయగ్రంథాన్ని పలు చోట్ల తలపిస్తుంది. శ్లోకంలోని పలు పదాలను ప్రత్యేకంగాను, కలిపి ముందు వెనుకలలో అన్వయించి అర్థవిశేషాలను ప్రదర్శించే తీరు పెరియవాచ్చాన్ పిళ్ళై తనిశ్లోకివ్యాఖ్యను స్మరింపజేస్తుంది. ఈ విధంగా నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య వారికి ముందున్న పూర్వాచార్యుల వ్యాఖ్యలలోని లక్షణాలను అన్నిటినీ సంతరించుకొన్నది – అనడం సముచితం. దేశికవ్యాఖ్యలోవలె ఇందులో కూడా ప్రమాణబాహుళ్యం గోచరించడం ఇంకో విశేషం.

చతుఃశ్లోకీప్రమేయాన్నిగూర్చి వివరిస్తూ నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై ప్రారంభంలో చివరలోకూడా ప్రకృతస్తుతి శీక్షావల్లిలోని **"మాతృదేవో భవ"** అనే వాక్యార్థాన్ని వివరిస్తున్నదని అన్నారు. పూర్వాచార్య స్తోత్రాలన్నీ ద్వయార్థ ప్రతిపాదకాలు అనే క్రమాన్ని నాల్గవశ్లోకం వ్యాఖ్యానించిన తరువాత వివరించారు.

తెలుగులిపిలో ముద్రించబడిన ఈ వ్యాఖ్యానప్రతిలో ద్రావిడ లిపిలో ముద్రింపబడిన ప్రతిలో కంటే కొన్నిచోట్ల అధికపాఠాలు, పాఠాంతరాలు కన్పిస్తున్నవి. ద్రావిడప్రతిలోకూడా కొన్ని సందర్భాలలో పాఠాంతరాలు చూపబడ్డాయి.

**శ్రీవేదాంతదేశిక సంస్కృతవ్యాఖ్య :–** శతాధికగ్రంథకర్తలు, సర్వతంత్రస్వతంత్ర–కవితార్కికకేసరి, వేదాంతాచార్య–మొదలైన సార్థక బిరుదాలతో వ్యవహరింపబడే వేదాంత దేశికులు యామునుల చతుఃశ్లోకికి, స్తోత్రరత్నానికి సంస్కృతంలో అత్యంత ప్రామాణికమైన, యుక్తిసహం అయిన వ్యాఖ్యలను కృపజేశారు. వీరు తిరుమల వేంకటేశ్వరుని ఆలయంలో గల గంటయొక్క అంశతో అవతరించారని ప్రసిద్ధి. కన్యామాసంలో వేంకటేశ్వరుని నక్షత్రం అయిన శ్రవణంలో అవతరించిన వీరికి తల్లిదండ్రులు తోతాద్రియంబ అనంతసూరి. వేంకటేశ్వరుని పేరుతోనే వేంకటనాథులని నామకరణాన్ని చేశారు. సంస్కృత–ద్రావిడ–ప్రాకృత–మణిప్రవాళభాషలలో వీరు వెలయించిన వందకు మించిన కావ్య–నాటక–గద్య– దండకాది వివిధ ప్రక్రియలోని గ్రంథాలు వీరి అసాధారణప్రతిభాపాండిత్యాలకు సుస్థిర ధ్వజపతాకలు. అత్యంతగహనాలైన, కఠినాలైన శాస్త్రీయవిషయాలను సైతం మృదుమధురఫణితిలో శ్లోకరూపంలో కూర్చగల శక్తిసామర్థ్యాలు వీరికే సొంతం. వీరి చతుఃశ్లోకీవ్యాఖ్య సుమారు నూఱు సంవత్సరాలకు ముందుగానే తెలుగులిపిలో ముద్రింపబడింది. ఆ తరువాతకూడా పలుమార్లు దేవనాగరిలిపిలో ముద్రింపబడింది. ఇటీవలి కాలంలో



1969 ప్రాంతంలో మద్రాస్ నగరంలోని Sri Vedanta Desika Seventh Centenary Trust వారిద్వారా మహామహోపాధ్యాయ, ఉ.వే. శ్రీమాన్ శేట్టలూరి శ్రీవత్సాంకాచార్యస్వామివారి సంపాదకత్వంలో వారి పీఠికతో స్తోత్రరత్న, గద్యత్రయభాష్యాలతో పాటు ముద్రింపబడింది. ప్రకృతం ముద్రింపబడే దేశికవ్యాఖ్య ఈ సంస్కరణను ఆధారంగా చేసికొన్నది.

శ్రీదేశికుల భాష్యశైలి చాలా శాస్త్రీయమైనది. విషయగాంభీర్యాన్ని కల్గినది. పలు చోట్ల దేశికుల వ్యాఖ్య – నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యల మధ్య సామ్యం గోచరించినా, ఎన్నో అపూర్వవిషయాలు దేశికవ్యాఖ్యలో చర్చించబడ్డాయి. ఉదాహరణకు లక్ష్మీసహస్ర నామంలోని **"నిస్సంకల్పా నిరాశ్రయా"** అనే నామాల అర్థవిచారం మొదటి శ్లోకవ్యాఖ్యలో చేయబడింది. **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"** అనే శ్రుతి ద్వారా తోచే భగవానుని పత్న్యధీనోత్కర్షత్వాన్నిగూర్చి విపులంగా రెండవ శ్లోకవ్యాఖ్యలో చర్చించబడింది. అదే రీతిలో నాల్గవ శ్లోకవ్యాఖ్య చివర పిరాట్టిని గూర్చిన అయిదు పక్షాల వివరం తెలుపబడింది. ఇటువంటి ఎన్నో గంభీర–గహనాలైన అంశాలు ఈ వ్యాఖ్యలో శాస్త్రీయమైన రీతిలో చర్చించబడ్డాయి. చివరిలో చతుఃశ్లోకి ద్వయమంత్రార్థ ప్రతిపాదకం అని కూడా సూచింపబడింది.

చతుఃశ్లోకికి గల ఈ మూడు వ్యాఖ్యానాలను పరిశీలించి చూచేవారికి పెరియవాచ్చాన్ పిళ్ళై, వారి కుమారులైన నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన మణిప్రవాళ వ్యాఖ్యానాలు రెండూ ప్రాచీనాలు అని, దేశికుల సంస్కృతవ్యాఖ్య తరువాత అనుగ్రహింపబడింది అని తెలుస్తుంది. అంతేకాక, దేశికులు ఈ రెండు వ్యాఖ్యలను–ప్రత్యేకించి నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై రచించిన విస్తృతవ్యాఖ్యను పలు చోట్ల స్పృశిస్తూ, కొన్నిచోట్ల తమ అభిప్రాయభేదాన్ని వ్యక్తం చేస్తూ రచించారు – అనే విషయంకూడా స్ఫుటం అవుతుంది. దీనికి ఉదాహరణంగా ఒక అంశం ప్రస్తావింపబడుతున్నది. **"ఈషత్ త్వత్"** అనే మూడవశ్లోకానికి గల వ్యాఖ్యలోని మొదటిభాగంలో పిరాట్టికి జగత్కారణత్వంలో ఉండే అన్వయం వివరింపబడుతున్నది అని పెరియవాచ్చాన్‌పిళ్ళై, నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై నిర్వహించగా, దీనిని శ్రీదేశికులు **"అత్ర ప్రళయాదికం వివక్షిత మితి కేచిత్"** (ఇక్కడ ప్రళయాదులలో పిరాట్టికిగల అన్వయం చెప్పబడుతున్నది అని కొందఱు వ్యాఖ్యానించారు) అని అనుగ్రహించారు. ఈ రీతిలో ఇంకా చాలా ఉదాహరణాలను చూపవచ్చు. శ్రీదేశికులు తమ స్తోత్రరత్న భాష్యంలో నాయనారాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యను పలు చోట్ల స్పృశిస్తూ, కొన్నిచోట్ల అభిప్రాయవర్ణనను చేస్తూ, ఇంకా కొన్నిచోట్ల అభిప్రాయభేదాన్ని ప్రదర్శించారనే విషయం నిశితపరిశీలనవల్ల వ్యక్తం అవుతుంది.

**“పద్మయోని రిదమ్”** అనే మొదటిశ్లోకాన్ని, **“బ్రహ్మేదీనామ్”** అనే రెండవ శ్లోకాన్ని దేశికుల కారికలుగా చూపడం పొరపాటు. ఇదికూడా శోధనీయమే.

ఇపుడు ఇంకొక ఉదాహరణం. రెండవశ్లోక అవతారికలో నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై, మొదటిశ్లోకవ్యాఖ్యలో దేశికులు, పిరాట్టి విషయంగా మతాంతరుల అభిప్రాయాలను ఖండించారు. ఇక్కడ దేశికులు నాయనార్ వ్యాఖ్యలోని పలు వాక్యాలను యథాతథంగా సంస్కృతీకరించారు. **“ఇవ్విశేషకటాక్షమిల్లాదార్...సత్త్వాదివిశిష్ట భగవాన్తానే శ్రీ యెన్బదు, స్త్రీరూపనిత్యవిగ్రహాంతరవిశిష్టమాన అవనే ఇవళెన్బదు....”** అనే రీతిలో నాయనార్వ్యాఖ్య సాగింది. శ్రీదేశికుల సూక్తి–**“యే సత్తాదివిశిష్టో భగవానేవ శ్రీ రితి వా, శ్రీరూపనిత్యవిగ్రహాంతరవిశిష్ట స్స ఏవేయ మితి వా....”** అని ముద్రింపబడి ఉన్నది”. ఇక్కడ **“సత్తాది”–“సత్త్వాది”** అని **“స్త్రీరూప–శ్రీరూప”** అనే పాఠభేదాలలో ఏది సరి అయిన పాఠం అన్నది సుస్పష్టం.

ఇంకొక సందర్భాన్నికూడా గమనించవచ్చు. మూడవశ్లోకంలోని **“కర్హిచిత్”** అనే పదాన్ని వివరించేటపుడు **“ఇవళుడైయ ప్రభావమ్ ఇన్ద్రాదికళ్ప్రభావమ్బోలే కాలభేదభేద్యమా యిరుక్కుమో? వెన్నిల్, అజ్ఞనన్టిక్కే ఏకరూపమాయిరుక్కు మెన్గిఱార్”** అనేది నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యాసూక్తి. **“ఈదృశస్య అస్యాః ప్రసాదస్య ఇంద్రాదీనా మివ కాలభేదభేద్యత్వం చ నాస్తీతి వ్యంజనాయ కర్హిచిత్ ఇత్యుక్తమ్”** అనేది శ్రీదేశిక శ్రీసూక్తి. ఇక్కడ కూడా **“ప్రభావ–ప్రసాద”** అనే పాఠభేదాలలో ఏది యుక్తతరమన్నది సహృదయులే గ్రహిస్తారు.

ఇదే రీతిలో, శ్రీదేశికుల భాష్యాన్నిబట్టి ముద్రితప్రతులలోని నాయనార్భాష్యంలో సంస్కరించవలసిన పాఠాలుకూడా కొన్ని ఉన్నాయి. మూడవశ్లోకంలో– **“కాంతాప్రసాదాత్”** అనే సూక్తిని వివరించేటపుడు **“ప్రసాదాత్–కృపావిశేషాదితి యావత్. అస్యాః క్వచిదపి నిగ్రహాసంభవేన తన్నివృత్తిరూపప్రసాదాయోగాత్’’** (**ప్రసాదాత్**–దయావిశేషంవల్ల – అని భావం. ఈమెకు ఎక్కడాకూడా నిగ్రహం లేదు. కనుక నిగ్రహనివృత్తిరూపం అయిన ప్రసాదం కూడదు కనుక) అనేది దేశికభాష్యం. దీనికి మూలం అయిన నాయనార్ వ్యాఖ్యానంలో–**“(ప్రసాదాత్)–దయావిశేషత్తాలే. అనుగ్రహైకస్వభావైయాన ఇవళుక్కు ఓరిదత్తిలుమ్ నిగ్రహమ్ సంభవియామైయాలే, తన్నివృత్తిరూప ప్రసాదయోగత్తాలొழியయ వెన్గై”** అనే పాఠం కన్పడుతున్నది. దీనిని పరిశీలిస్తే అర్థరహితంగా తోస్తున్నది. శ్రీదేశికుల సంస్కృతీకరణనుబట్టి చూస్తే “**ప్రసాదాయోగత్తాల్**’’ అన్నది శుద్ధపాఠం అనేది స్పష్టం. అయినా ఈ వాక్యం అనన్వితంగానే ఉన్నది. **“అనుగ్రహైకస్వరూపైయాన ఇవళుక్కు ఓరిదత్తిలుమ్ నిగ్రహమ్ సంభవియామైయాలే తన్నివృత్తిరూపప్రసాదాయోగత్తాల్ దయావిశేషరూప ప్రసాదత్తాలొழியయ–ఎన్గై”** అని గాని, ఈ అర్థాన్ని ఇచ్చే వేఱే పదాలుగల వాక్యంగా కాని ఇది ఉండి ఉండాలి. పెద్దలే దీనిని సంస్కరించాలి.



ఇదే రీతిలో ఇంకొక అంశం. నాల్గవశ్లోకంలో **‘‘మూర్తమ్’’** అనేచోట వివరించేటపుడు– **“మూర్తమ్–స్పర్శరూపాదియుక్తం, పరమపదపర్యంకాదిదేశపరిచ్ఛిన్నం చ ఇత్యర్థః’’** –అన్నది దేశికుల భాష్యం. దీనికి మూలం అయిన నాయనార్ వ్యాఖ్యలో–**“(మూర్తమ్)–స్పర్శరూపాదిగుణజ్గళోడే కూడి పరమ పర్యంతాదిదేశపరిచ్ఛిన్న విగ్రహమాయిరుక్కై”** అనే పాఠం ముద్రితం. ఇక్కడ **“పర్యంకాది”** అన్నదే **“పర్యంతాది”**గా మాఱింది అన్నది స్పష్టం.

మఱొక ఉదాహరణను గమనించవచ్చు. నాల్గవశ్లోకంలోనే **“యథాసుఖమ్”** అనే పదాన్ని వివరిస్తూ దేశికులు **“యథాసుఖమ్– మనుష్యాదిసజాతీయావతార దశాయామపి అస్య స్వాభావికసుఖాదినివృత్తిః దుఃఖం వా నాస్తీతి భావః”** అని అనుగ్రహించారు. నాయనార్ వ్యాఖ్యలో–**‘‘(యథాసుఖమ్)–మనుష్యసజాతీయనాయ్ అవతరిత్త దశైయిలుమ్ స్వాభావికసుఖాదివృత్తి యెన్న, దుఃఖభాక్త్వ మెన్న–ఇవై ఇన్టిక్కే”** అని మార్చి ముద్రింపబడింది. ఇక్కడ **“సుఖాదినివృత్తి”** అన్నదే శుద్ధపాఠం–అనే విషయం రెండు వ్యాఖ్యలను గమనిస్తే స్పష్టమవుతుంది.

ఈ రీతిలో లేఖకప్రమాదాలవల్ల ఏర్పడ్డ పలు ప్రామాదిక పాఠాలు ప్రాచీనలిఖితముద్రిత ప్రతులలో దాగి ఉన్నాయి. వీటిని తగిన యుక్తులను, ప్రమాణాలను చూపి సంస్కరించడంలో విప్రత్తిలేదు కదా! ఇంకో రెండు ఉదాహరణలను గమనించండి. మొదటిశ్లోకంలోని **“దయాం తే విదన్”** అనే పదాలను వివరించే దేశికవ్యాఖ్యలో **“అష్టోత్తర, సహస్రనామసుచ పఠ్యతే–కరుణాం వేదమాతరమ్–ఇతి”** అనే పాఠం ఉన్నది.కాని **“కరుణాం వేదమాతరమ్”** అని సహస్రనామంలో లేదు. ఇది అష్టోత్తర శతనామస్తోత్రంలో ఉన్నది. అందువల్ల **“అష్టోత్తరశతనామసు”** అని సంస్కరించాలి. ఇదే రీతిలో నాయనార్వ్యాఖ్యలోకూడా మూడవ శ్లోకంలో **“శ్రేయః”** అనే పదాన్ని వివరించేటపుడు **“(శ్రేయః) –శ్రేష్ఠతమసుఖమ్. తత్సాధనసుకృతవిశేష మాకవుమామ్. “శ్రేయసీ సుకృతం విషయః ఎన్టితే”** అనే పాఠం ఉన్నది. ఇందులో **“విషయః”** అన్నది అశుద్ధపాఠం అని చూడగానే తెలుస్తుంది. ఇదే సందర్భంలోని దేశికుల వ్యాఖ్యను గమనిస్తే–**“(శ్రేయః)–శ్రేష్ఠం సుఖం. తత్సాధనం వా. పుణ్యశ్రేయసీ సుకృతం వృషః– ఇతి హి పఠంతి”** అనే సంస్కృతీకరణం కన్పిస్తుంది. “అందువల్ల **“విషయః”** అన్నచోట్ల **“వృషః”** అన్నది శుద్ధపాఠం.

పై ఉదాహరణలను గమనించినపుడు ఇంకొక విషయంకూడా సువ్యక్తం కాగలదు. శ్రీదేశికులు పలు సందర్భాలలో నాయనార్ అచ్చాన్పిళ్ళై వ్యాఖ్యను

స్వరూపం భగవానుని స్వరూపంతో అనురూపంగా ఉంటుంది – అని ఇక్కడ చెప్పడం స్తుతి కావచ్చునుకదా!” అని చెప్పాలని చూస్తే, ఆ విధంగా అనురూపంగా ఉండడం అంటే ఏమి? అనే ప్రశ్న తలెత్తుతుంది, పిరాట్టి స్వరూపం అణువు కనుక విభువైన భగవత్స్వరూపానికి అనురూపంగా లేకపోయినా, స్వతంత్రశేషి అయిన స్వామికి పరతంత్రమై, అతనికి శేషభూతం అయిన సంపదగా ఉంటూ అతనికి అతిశయాన్ని కల్గించడమే ఇక్కడ అనురూపంగా ఉండడం– అని చెప్పాలని చూస్తే, అంశం అన్ని చేతనాచేతనాలకు సాధారణం కనుక, ఈమెకు ఇది అసాధారణస్తుతి కాబోదు. పిరాట్టి–స్వామి అనాదికాలంగా సర్వజ్ఞత్వాదిగుణాలను కలవారు కనుక అదే అనురూప్యం–అని చెప్పదలచినట్లయితే, అదికూడా నిత్యసూరులకు సాధారణం కనుక, వారికి కూడా శేషిగా మొదటి శ్లోకంలో చెప్పబడే ఈమెకు ఇది విశిష్టస్తుతిగా పరిణమించదు. ఈ విధంగా సాధారణాలైన స్వభావాలను పురస్కరించుకొని స్తుతించవచ్చునని అంటే, భగవానునితో పాటు అందఱికీ సాధారణంగా ఉండే ద్రవ్యత్వం, చేతనత్వం మొదలైనవానినిబట్టికూడా స్తుతించవచ్చునని సిద్ధిస్తుంది. అంతేకాక, **“త్వయైతత్ విష్ణునా చాంబ! జగద్వ్యాప్తం చరాచరమ్”** (విష్ణు.పు. 1-9-126) (తల్లీ! నీచేత, విష్ణువుచేత చరాచరం అయిన ఈ లోకం అంతా వ్యాపింపబడి ఉన్నది) అని మొదలైన వచనాల స్వారస్యంచేత వ్యక్తం అయే పిరాట్టియొక్క స్వరూపవిభుత్వాన్నిబట్టి భగవానుని స్వరూపంలో ఈమెకు అనురూపాన్ని చెప్పవచ్చునని అంటే, ఈమె జీవకోటిలోకి చేరుతుందా! లేక, ఈశ్వరకోటిలోనా? అని పరిశీలించినపుడు ఈమె జీవకోటిలోనికే చేరుతుందని ఏర్పడడంవల్ల అది కుదరదు. జీవకోటిలోనికి చేరినవారు అందరూ అణుస్వరూపాన్ని కలవారై ఉంటారుకదా! ఆ జీవులలోకి చేరిన పిరాట్టికి విభుత్వాన్ని అంగీకరిస్తే జీవలక్షణానికి అవ్యాప్తి, ఈశ్వరలక్షణానికి అతివ్యాప్తి–అనే దోషాలు సంప్రాప్తిస్తాయి. అందువల్ల. **“యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ”** (విష్ణు.పు. 1-8-17) (ద్విజోత్తమా! ఏ రీతిలో విష్ణువు సర్వవ్యాపియో, ఆ విధంగానే ఈమెకూడా అన్నిటినీ వ్యాపించినదై ఉంటుంది) అనే వ్యాప్తివచనం, **“సౌమ్యాసౌమ్యైః జగద్రూపైః త్వయైతత్ దేవి! పూరితమ్”** (విష్ణు.పు. 1-9-12) (దేవీ! అందమైనవి, అందం లేనివి అయిన నీరూపాలతో నీచే ఈలోకం అంతా వ్యాపించి ఉంటుంది) అని చెప్పినట్లు గ్రహించాలి. పిరాట్టిని ఈశ్వరకోటిలోనికి చేరిస్తే, ఆమె భగవానుని కంటే వేఱయినది అని చెప్పినపుడు, అతడు నిస్సమాభ్యధికుడని చెప్పే వేదవాక్యాలతో విరోధం కల్గుతుంది. పిరాట్టి భగవానునికంటే వేఱయినది కాదు – అని చెప్పినపుడు వీరిద్దరూ దంపతులు అని చెప్పడం – మొదలైన పలు అసంభావ్యాలు తోస్తాయి. **“అనురూపరూప”** అని చతుఃశ్లోకిలో చెప్పబడిన ఆనురూప్యం – అంటే, దంపతులమధ్య ఉండే పొందిక– అర్థరహితమే అవుతుంది. ఇద్దఱూ అత్యంతం సములు అని చెప్పే పక్షం, ఇద్దరి



స్వరూపం ఒకటే అనే పక్షం నిరస్తపూర్వాలు. (పిరాట్టికి, భగవానునకు) భేదాన్ని–అభేదాన్ని ఏకత్ర అంగీకరించే భేదాభేదవాదం, అసత్యం అయిన భేదాభేదాలను అంగీకరించేవారి వాదం శ్రీభాష్యాది గ్రంథాలలో నిరసింపబడ్డాయి. అందువల్ల విశిష్టస్తుతి సిద్ధించడం కోసం, పిరాట్టి స్వరూపం భగవానుని స్వరూపానికి అనురూపం అయినది, దానితో గాఢోపగూఢంగా ఉన్నది – అని చెప్పడం అర్థవంతం కావడం కోసం, నిరూపింపబడే భగవత్స్వరూపాన్ని, అతని స్వరూపాన్ని నిరూపించే పిరాట్టి స్వరూపం వ్యాపించి ఉన్నదిగా కావలసి ఉన్నది కనుక, అణుస్వరూపం అయిన లక్ష్మికి అఘటితఘటనాశక్తితో సర్వవ్యాపిత్వం అంగీకరింపబడుతున్నది. దీని వివరాన్ని నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యలో గమనించవచ్చు. దీనికి సమాధానం చెప్పే ప్రయత్నంలో శ్రీదేశికులు తమ అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూ, పిరాట్టి విషయంలో తమకు ముందున్న పూర్వాచార్యుల ఇంకా నాల్గు భిన్నాభిప్రాయాలను ప్రస్తావించారు. మిగిలినవారి స్వభావాలతో సమానం అయిన స్వభావాలను పురస్కరించుకొని స్తుతించం స్తుతి కాబోదు–అని అనడం మొట్టమొదట పొసగదు. ఎవరో కొంతమందికి కంటే అతిశయాన్ని చెప్పేటపుడుకూడా, ఏవో కొన్ని ప్రయోజనాలున్నచోట్లకూడా పలువురకు సాధారణాలైన స్వభావాలనుబట్టి స్తుతించడం తగినదే. సర్వేశ్వరుడుకూడా నిత్యముక్తులకు సమానం అయిన సర్వజ్ఞత్వాదులను కలవాడని చెప్పి, స్తుతింపబడుతున్నాడుకదా!

**రెండవ పక్షం :–** “పిరాట్టికి స్వభావసిద్ధమైన విభుత్వాన్ని ఒప్పుకొంటే ఈమెను జీవకోటిలోనికి చేర్చడానికి వీలులేదు, ఈశ్వరకోటిలోనికీ చేర్చడానికి వీలులేదు”, అని ప్రారంభించి చెప్పబడ్డ విషయంలోని మొదటి పక్షంలో వివరింపబడిన, పిరాట్టి శక్తిచే వ్యాపించి ఉండడాన్నిగూర్చి నాల్గు ప్రకారాలు ఉన్నాయి. అందులో మొదటి ప్రకారం అయిన ఈ రెండవ పక్షంలోకి చేరినవారు ఈ క్రింద విధంగా వాదిస్తారు. పిరాట్టి జీవకోటిలోనికి చేరినది అయినా ఈమె స్వరూపంలో సహజమైన విభుత్వాన్ని కల్గి ఉండడం విరుద్ధం కాదు. జీవులు అణుపరిమాణులు అని తెలిపే వేదవాక్యాలు ఆయా ప్రమాణాలలో కనబడే బద్ధజీవులను గూర్చినవి కనుక, ఆ వాక్యాలు జీవులందఱిని అణుపరిమాణులని చెప్పేవి కావు. “ధాన్యపు గింజ మొనలోని చాలా చిన్నభాగం అంత పరిమాణాన్ని కలవాడైన జీవుడు ముక్తదశలో అంతటా వ్యాపించి ఉంటాడు” **(“వాలాగ్రశతభాగస్య ............ స చానంత్యాయ కల్పతే”)** అనే వేదవాక్యం, జీవాత్మలు వికారాన్ని లేనివారు అని నిర్ధారింపబడడంవల్ల, ముక్తి దశలో ధర్మభూతజ్ఞానంతో ముక్తుడు అంతటా వ్యాపించి ఉండడాన్ని చెబుతున్నది. “అన్ని వస్తువులను ముక్తులు వ్యాపించి ఉంటారు” అని చెప్పే మిగిలిన వేదవాక్యాలుకూడా దీనినే తెలుపుతున్నవి. **“ప్రదీపవదావేశ స్తథాహి దర్శయతి”** (బ్ర.సూ–4-4-15) (దీపం ఒకచోట ఉన్న తన కాంతితో పలు చోట్ల వ్యాపిస్తున్నట్లు, ఒకచోట ఉండే జీవుడుకూడా తన

భగవానునకు మాత్రం ఉన్నది. అందువల్లనే అతడు సర్వేశ్వరుడుగను, నిస్సమాభ్యధికుడుగను అవుతున్నాడు. రెండవ, మూడవ, నాల్గవ పక్షాలలో ఒకదానితో ఇంకొకదానికి గల భేదం చాలా సూక్ష్మం. రెండవపక్షంలో పిరాట్టి జీవవర్గంలో చేర్చబడింది. మూడవపక్షంలో చిదచిదీశ్వరులనే తత్త్వాలు మూడింటికంటే వేఱయినదిగా చెప్పబడింది. నాల్గవ పక్షంలో పిరాట్టి ఈశ్వరకోటిలోనికి చేర్చబడింది. జీవుడు - ఈశ్వరుడు అనే పేరు పెట్టడంలోనే అభిప్రాయభేదం. **"న తస్యేశే కశ్చన"** (తైత్తి.నా-1-4-2) (ఆ పరమాత్మను నియమించేది ఏదీ లేదు) అని మొదలైన వేదవాక్యాలనుబట్టి ఈ నాల్గు పక్షాలలో స్వతంత్రుడైన పతియొక్క నిత్యేచ్ఛచేతనే లక్ష్మీదేవికి ఈ అతిశయాలు అన్నీ సిద్ధిస్తున్నవి. అందువల్లనే "నశించనివాడుకనుక" **నరుడు** అనబడే భగవానునితో సంబంధాన్నికల పదార్థాలు నారాలు-అనే వ్యుత్పత్తిచేత ఈమె నారశబ్దవాచ్యురాలైనా, భగవానునకువలె అతని ఇచ్ఛచే ఏర్పడిన ప్రధానప్రాప్యత్వ-శేషిత్వ- శరణ్యత్వాలు ఈమెకు విరుద్ధాలు కావు-అనడంలో అడ్డులేదు. చేతనరక్షణం మొదలైన కార్యాలను ఇద్దఱూ కలసి చేసినా ఇద్దఱి కార్యాలలో కొంచెం తేడా ఉన్నది. లోకాన్ని అంతటినీ సృష్టించడం మొదలైన ఆయా లీలలను, తనకు ఇష్టమైన పిరాట్టి ఆనందాన్ని ఉద్దేశించే భగవానుడు చేస్తున్నందున, పిరాట్టికూడా లోకాన్ని సృష్టించడం మొదలైనవాటిలో అన్వయం ఉన్నది-అని చెప్పడంలో విరోధంలేదు. ఇద్దఱూ కలసి చేసే ఇటువంటి కార్యాలలో ఈ లోకంలో ఉండే భర్తల విషయంలోవలె పతియే ప్రధాన కర్త - అని చెప్పడంలో పతియే చేస్తున్నాడని అనడం పొసగుతుంది. పిరాట్టి భగవానునకు ఆధీనురాలై ఉండడం అతని నిత్యేచ్ఛచేతనే అయినా, అది ఉభయేచ్ఛాసిద్ధం- అని కొన్ని ప్రమాణాలు పల్కడం పతియొక్క అభీష్టాన్ని ఈమె తన అభీష్టంగా భావిస్తున్నది-అనే అభిప్రాయాన్ని కల్గినది. కనుక పొసగుతుంది. ఇది అంతా నాల్గవ పక్షంవారు చేసే వాదానికి సంగ్రహం.

**అయిదవపక్షం:-** పిరాట్టి భగవానునకు ఆధీనురాలై ఉండడం ఉభయేచ్ఛాసిద్ధం. (ఇద్దఱి అభీష్టంచేత ఏర్పడినది) అని కొన్ని ప్రమాణాలు పల్కడంలో ముఖ్యం అయిన అర్థాన్నే గ్రహించాలి. ఎందుకు ? అని అంటే. **"ఈశ్వర స్సర్వభూతానామ్"** (తైత్తి. నారా-44) అని భగవానుని అందఱికీ ఈశ్వరునిగా చెప్పేటట్లే **"ఈశ్వరీం సర్వభూతానామ్"** అని శ్రీసూక్తం పిరాట్టిని అంతటికినీ ఈశ్వరి - అని చెబుతున్నది. **"సర్వభూతానామ్"** అని పదాలను విభజించి గ్రహించినందువల్ల శ్రీసూక్తానికి సర్వభూతేశ్వరుని పత్ని - అనే అర్థాన్ని గ్రహించడానికి వీలు లేదు. అందువల్ల ఇద్దఱూ ముఖ్యులు అయిన ఈశ్వరులే అన్నది, పిరాట్టి భగవానునకు ఆధీనురాలై ఉండడం ఉభయేచ్ఛాసిద్ధం అన్నది ముఖ్యమైనది అని గ్రహించాలి. ఈ విధంగా ఇద్దఱు ముఖ్యులైన ఈశ్వరులను అంగీకరిస్తే ఒకరి అభీష్టానికి ఇంకొకరు విరుద్ధంగా ప్రవర్తించే అవకాశం ఉన్నదికదా! అని అంటే.



ఇటువంటి పరిస్థితి ఏర్పడని ఐకమత్యాన్ని కల దంపతులై వీరిద్దఱు ఉండడంవల్ల సర్వభూతేశ్వరత్వాన్ని ఇద్దఱికీ చెప్పే వేదవాక్యాలు పొసగుతాయి. ఇది అయిదవ పక్షంవారు చెప్పే వాదసారం.

**దేశికభాష్యంలోని నిగమనశ్లోకాలు :-**

**ప్,,ంచస్వేతేషు పక్షేషు కశ్చిదేకః ప్రమాణవాన్ ।**
**సలక్ష్మీకస్య సామ్రాజ్యం సర్వథా సుప్రతిష్ఠితమ్ ॥**
**ఐహైవం క్వచిదంశే తు సంశయేఽపి విపశ్చితామ్ ।**
**ఉపయుక్తాంశవైశద్యా దుపాయఫలసంభవః ॥**

(ఈ అయిదు పక్షాలలో ఏదో ఒక్కటి ప్రమాణాలతో పొసగుతుంది. ఏ పక్షాన్ని గ్రహించినా పిరాట్టితో కూడి ఉండే భగవానుడే సర్వలోక సామ్రాట్ - అన్నది. పూర్తిగా సుస్థిరంగా ఉన్నది. ఈవిధంగా మహామతులమధ్య కొన్ని విషయాలలో అభిప్రాయభేదం ఉన్నా, ముఖ్యమైన అంశాలలో మాత్రం స్పష్టత ఉండడంవల్ల ఉపాయానుష్ఠానం-ఫలప్రాప్తి ఈ అయిదుపక్షాలను వాదించేవారికి కల్గడంలో లోటు లేదు) అని శ్రీదేశికులు అనుగ్రహించిన ఈ నిగమనశ్లోకాలవల్ల ఈ అయిదు పక్షాలను ఆశ్రయించినవారు శ్రీరామానుజదర్శనానికి చెందిన మహాత్ములు అని, వాటిలో ఏ పక్షాన్ని అయినా పూర్తిగా తొలగదోయడం దేశికుల ఉద్దేశ్యం కాదని స్ఫుటమవుతున్నది. మన దురదృష్టవశంచేత ఈ అయిదు పక్షాలలో ఏది తమకు అభిమతం-అనే దాన్ని వాచా స్పష్టంగా చెప్పకుండానే శ్రీదేశికులు విడిచివేశారు. "ఈ చతుఃశ్లోకీ వ్యాఖ్యానంలోనే పలు చోట్ల తమకు అభిమతం అయినది నాల్గవపక్షమే అని దేశికులు గంభీరంగా వ్యక్తం చేశారు. అయిదవ పక్షంలో చెప్పిన రీతిలో **"సర్వభూతేశ్వరత్వ"** వచనసామ్యాన్ని బట్టి ఇద్దఱు ముఖ్యమైన ఈశ్వరులు - అని దేశికులు తమ విపులమైన గ్రంథాలలో దేనిలోను అనుగ్రహించలేదు. ఇద్దఱు నిమిత్త-ఉపాదానాది సర్వకారణాలై ఉంటారు అని ఎక్కడా కృపజేయలేదు. పిరాట్టి భగవానునకు ఆధీనమై ఉండడం ఉభయేచ్ఛాసిద్ధం అని ఎక్కడా ప్రసాదించలేదు. సర్వభూతేశ్వరత్వవచనసామ్యాన్నిబట్టి ఇద్దఱూ ప్రధానమైన ఈశ్వరులు అనే వాదాన్ని దేశికులు తమ తాత్పర్యచంద్రికలో ప్రారంభంలో ఖండించారు" - అని అంటూ **ఉవే. శ్రీమాన్ ఎన్. కృష్ణస్వామి అయ్యంగార్** తమ చతుఃశ్లోకివ్యాఖ్యాన పీఠికలో అభిప్రాయపడ్డారు.

బ్రహ్మసూత్రాలలో సూత్రకారులు సామాన్యంగా పూర్వపక్షాలను ముందు సూత్రాలలో ప్రస్తావించి, తను సిద్ధాంతాన్ని చివరి సూత్రంలో చెప్పే రీతిలోనే ఇక్కడకూడా అయిదవపక్షాన్ని దేశికులు చివరగా చెప్పడంవల్ల అదే వారి సిద్ధాంతం - అని కొందఱు వాదిస్తున్నారు. ఈ వాదం పస లేనిది అనే విషయం, ఈ అయిదు పక్షాలను దేశికులు

మఱికొందరు ఇపుడు లభించే పురుషకారమీమాంస అనే గ్రంథం అసంపూర్ణం అని, పూర్వపక్షభాగం మాత్రమే ఇపుడు దొరుకుతున్నదని, సిద్ధాంతభాగం లుప్తమని వాదించగా, ఈ వాదం సరికాదని నిరూపిస్తూ అహోబిలమఠానికి చెందిన శ్రీమతి శకుంతల డాక్టరేట్ పట్టాను ఇటీవలే పొందారు" – అనే ఈ వివరాలను అన్నిటినీ ఉవే. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామిఅయ్యంగార్ తమ చతుఃశ్లోకి విపులవివరణానికి గల ప్రవేశికలో తెలియజేశారు. వీరి అభిప్రాయానుసారం నాల్గవ పక్షమే దేశికులకు అభిమతం. ఈ వాదాన్ని వీరు **"పంచమపక్షశతదూషణి, శ్రీతత్త్వసర్వస్వమ్, విశిష్టాద్వైత సంరక్షణమ్, విశిష్టాద్వైతమా? విశిష్టద్వైతమా?"** ఇత్యాది గ్రంథాలలో సమర్థించారు. ఇవి అన్నీ వాదప్రతివాదాలతో కూడుకొన్నవి. ప్రకృతంలో అనావశ్యకాలు కనుక ప్రస్తుతించడంలేదు. మొత్తంమీద పరిశీలించిచూస్తే **"సలక్ష్మీకస్య సామ్రాజ్యం సర్వథా సుప్రతిష్ఠితమ్"** అనే దేశిక శ్రీసూక్తి **"సుప్రతిష్ఠితం"** – అనడంలో సందేహం ఏ మాత్రంలేదు.

శ్రీమత్పరమహంసేత్యాది శ్రీనివాసపరకాలమహాదేశికుల **"లక్ష్మ్యుపాయత్వ నిర్ణయః"** అనే కృతి, ఆత్రేయ వేంకటాధ్వరికృతమైన **"శ్రీవిభుత్వసమర్థనమ్"**, శ్రీకృష్ణబ్రహ్మ తంత్రపరకాలస్వామివారి **లక్ష్మీసహస్రరత్నప్రకాశికావ్యాఖ్య,** ఉ.వే. శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామివారి **"నయద్యుమణిభూమికా"** – ఇత్యాది గ్రంథాలలోకూడా పిరాట్టికి సంబంధించిన పలు సిద్ధాంత విషయాలు చర్చించబడ్డాయి. **"తద్దాసదాసీగణ"** అనే ప్రయోగంలో సమాసానుపపత్తి దోషాన్ని ఆశంకించిన కొందఱి వాదానికి తగిన సమాధానాన్ని శ్రీపిళ్ళైపాక్కమ్ కౌశికగోపాలాచార్యులవారు **"దాసదాసీసమర్థనీ"** అనే గ్రంథంలో, తమ **"వాదతరంగిణి"**లో తెలిపారు ఈ రీతిలో చతుఃశ్లోకిలోని శాస్త్రీయ విషయాలనుగూర్చి సాహిత్యం సంస్కృత, ద్రావిడ భాషలలో విరివిగా లభిస్తున్నది.

**ప్రకృతగ్రంథముద్రణనుగూర్చి :–** చతుఃశ్లోకికి పూర్వాచార్యులు అనుగ్రహించిన మూడు ప్రాచీన వ్యాఖ్యలే కాకుండా. ఇటీవలికాలంలో సమకాలీనులైన పెద్దలు కృపజేసిన వ్యాఖ్యలు, టీకలుకూడా చాలా ఉన్నవి. మహావిద్వాన్. కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామి వారివ్యాఖ్య, శాస్త్రరత్నాకర, మహామహోపాధ్యాయ, ఎస్. ఎన్. సి. రఘునాథాచార్యస్వామి వారివ్యాఖ్య, వ్యాఖ్యాతృచక్రవర్తులు, వాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యస్వామి వారివ్యాఖ్య, సుప్రసిద్ధ విద్వాంసులు ఉవే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి వ్యాఖ్య – ఈ విధంగా పలువురు ఈ స్తుతిని తెలుగులో వ్యాఖ్యానించారు. ఈ గ్రంథాలు ఇపుడు ఇంచుమించు అన్నీ లభిస్తున్నవికూడా.

ఇక, ఈ గ్రంథముద్రణావశ్యకత ఏమి? అనే విచికిత్స సహజంగా కలుగుతుంది నాయనార్ఆచ్చాన్‌పిళ్ళై విపులవ్యాఖ్య, దేశికులవ్యాఖ్య తెలుగులిపిలో సుమారు నూఱు ఏండ్లకు ముందు ముద్రింపబడినా, ఆ శ్రీకోశాలు ఇపుడు దుర్లభాలు. దొరికినా అవి



త్రుటితాలు. క్రిమిదష్టాలు. పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య అయితే ఇతః పూర్వమే చెప్పినట్లు తెలుగులిపిలో ఇంతవరకు ముద్రింపబడలేదు. అందువల్ల వీటిని అన్నిటినీ ఒకచోట చేర్చి ముద్రిస్తే సంప్రదాయపాఠకులకు ఉపయోగపడుతుందనే భావంతో ఈ గ్రంథంలో ఈ మూడు వ్యాఖ్యలు ముద్రింపబడ్డాయి. కేవలం వ్యాఖ్యానాలనే కాక, వాటి భావాన్ని తెలిపే తెలుగువివరణం కూడా ఉంటే మఱింత ఉపయోగకరంగా ఉంటుందనే ఉద్దేశ్యంతో ఆధ్రవివరణంకూడా విన్నవింపబడింది. ఈ వివరణం ప్రాయకంగా నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానాన్ని అనుసరిస్తూ చేయబడింది. ఆవశ్యక సందర్భాలలో దేశికవ్యాఖ్యావిశేషాలు, పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యావిశేషాలుకూడా విన్నపింపబడ్డాయి. అందువల్ల ఈ వివరణం ఒకవిధంగా మూడువ్యాఖ్యల సంగ్రహరూపం అనవచ్చు. **"శ్రీవైష్ణవసుదర్శనమ్"** తమిళ మాసపత్రికా సంపాదకులు, గోపాలోపాయన పురస్కార గ్రహీతలు, **ఉవే. శ్రీమాన్ ఎస్, కృష్ణస్వామి అయ్యంగార్ (పుత్తూర్ అగ్రహారం, తిరుచ్చి)** తమిళంలో ముద్రించిన **"చతుఃశ్లోకీ విరివురై"** అనే గ్రంథాన్ని కృతజ్ఞతాపూర్వకంగా అనుసరిస్తూ ఈవివరణం వ్రాయబడింది. తమ గ్రంథాన్ని అనుసరించడానికి, అనువదించడానికి ఉదాహరణంగా అనుమతిని కృపజేసిన శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్‌స్వామివారి సన్నిధిలో సాంజలి బంధంగా ప్రణమిల్లుతున్నాను. గతంలోవలెనే ఈ ఏడుకూడా జూలై నెలలో 14వతేదీనుండి 16వతేదీ వరకు విజయనగరంలో నిర్వహింపబడే ఉ.వే. **శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి** తిరునక్షత్రోత్సవసందర్భంలో జరిగే ఉభయవేదాంతసభాకార్యక్రమాలలో భాగంగా శ్రీయామునుల **''చతుఃశ్లోకి''**ని సవ్యాఖ్యగా ఈ రీతిలో ముద్రించాలని ల.స.జానకమ్మగారు భావించారు. ఇందుకు శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారు, శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామివారు, శ్రీమాన్ రంగరామానుజా చార్యస్వామివారు, శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారివంటి పెద్దల, హితైషుల అనుజ్ఞ లభించింది. ఆంధ్ర వివరణాన్ని విన్నపించే వాచికకైంకర్యాన్ని, గ్రంథముద్రణ భారాన్ని నిర్వహించవలసినదిగా శ్రీమతి జానకమ్మగారు, వారి కుటుంబసభ్యులు నన్ను కోరడం వారి సౌమనస్యాన్ని, నాపట్ల వారికుండే నమ్మకాన్ని తెలుపుతున్నది. ఆత్మీయులైన వారి మాట కాదనరాదనే ఉద్దేశ్యంతో అల్పజ్ఞుణ్ణి అయినా సాహసించి నేను ఈ **"హరివల్లభా"** వివరణాన్ని విన్నపించాను. **"న సంశయ మనారుహ్య నరో భద్రాణి పశ్యతి"** కదా! అంతేకాక, జగన్మాత అయిన లక్ష్మి విషయంలో యత్కించిత్ వాచికకైంకర్యాన్ని చేసికొనవచ్చుననే పేరాస కూడా కారణం. జగదుద్ధారిణి అయిన అమ్మకు ఇంతకంటే ఏమి సమర్పించగలను ? **"అథవా కిం ను సమర్పయామి"**. అయితే నా ఈ ప్రయత్నంలో ఎంతవరకు కృతకృత్యుణ్ని అయ్యానో, విశేషజ్ఞులైన పెద్దలు, సహృదయపాఠకులే నిర్ణయిస్తారు. నాకు ఈ గొప్ప అవకాశాన్ని ఇచ్చిన **శ్రీమతి**

శ్రీమతే రామానుజాయ నమః



భగవద్యామున ప్రణీతమైన

# చతుఃశ్లోకీ

కాంత స్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం
వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ।
బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః
శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్॥ 1 ॥

యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః
నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః ।
తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ స్తోష్యామ్యహం నిర్భయః
లోకైకేశ్వరి! లోకనాథదయితే! దాంతే! దయాం తే విదన్ ॥ 2 ॥

ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధాసంధుక్షణా ద్రక్ష్యతే
నష్టం ప్రాక్ స్తదలాభత స్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్ ।
శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే
సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥ 3 ॥

శాంతానందమహావిభూతి పరమం యద్బ్రహ్మ రూపం హరేః
మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్ ।
యాన్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి చా
న్యాహుః స్వై రనురూపరూపవిభవైః గాఢోపగూఢాని తే ॥ 4 ॥



శ్రీమతే రామానుజాయ నమః



పరమకారుణికరాన పెరియవాచ్చాన్పిళ్ళైకుమారర్

నాయనారాచ్చాన్పిళ్ళై అరుళిచ్చెయ్‌త

# చతుఃశ్లోకీవ్యాఖ్యానమ్

శ్రుత్యర్థసారజనకం స్మృతిబాలమిత్రమ్
పద్మోల్లసద్భగవదంఘ్రిపురాణబంధుమ్ ।
జ్ఞానాధిరాజ మభయప్రదరాజపుత్రమ్
అస్మద్గురుం పరమకారుణికం నమామి ॥

అవతారికై

అభిష్టౌతి శ్రియం దేవీ మఖిలాత్మైకమాతరమ్ ।
విష్ణుపత్నీం విశాలాక్షీం యామునార్యో మహామతిః ॥

---

పరమకారుణికులైన పెరియవాచ్చాన్పిళ్ళైకుమారులు

నాయనారాచ్చాన్పిళ్ళై అనుగ్రహించిన

## చతుఃశ్లోకీవ్యాఖ్యానము - "హరివల్లభా" వివరణము

ధ్యాత్వా శ్రీయామునాచార్యపదాంభోజౌ తథా గురూన్ ।
వ్యాఖ్యాం కుర్వే చతుఃశ్లోక్యాః పూర్వాచార్యవచోనుగామ్ ॥

## అవతారిక

అభిష్టౌతి శ్రియం దేవీ మఖిలాత్మైకమాతరమ్ ।
విష్ణుపత్నీం విశాలాక్షీం యామునార్యో మహామతిః ॥

ఆత్మలన్నిటికీ ఒకే తల్లి, విష్ణుపత్ని, విశాలమైన నేత్రాలను కల్గినది అయిన శ్రీదేవిని గొప్ప బుద్ధిశాలి అయిన యామునాచార్యులవారు స్తుతిస్తున్నారు.

స్వశేషాశేషార్థో నిరవధికనిర్బాధమహిమా

**ఫలానాం దాతా యః ఫల మపి చ శారీరక మితః ।**
**శ్రియం తత్ సధ్రీచీం తదుపసదనత్రాసశమనీమ్**
**అభిష్టౌతి స్తుత్యా మవితథమతి ర్యామునమునిః ॥**

శారీరకశాస్త్రంలోని నాల్గు అధ్యాయాలలో క్రమంగా, లోకస్వామిగా, అడ్డులేని, అంతులేని మహిమను కలవాడుగా, ఫలప్రదాతగా, ఫలస్వరూపిగా ఏ భగవానుడు చెప్పబడుతున్నాడో, అతనికి సహకారిణిగా ఉండేది, అతనిని ఆశ్రయించడంలో మనకు కలిగే భయాన్ని తీర్చేది అయిన శ్రీదేవిని యథార్థజ్ఞానాన్ని కల యామునముని స్తుతిస్తున్నారు) అని తమ వ్యాఖ్యాప్రారంభంలో శ్రీదేశికులు మంగళాచరణాన్ని చేశారు.

లోకస్వామిగా ఉండడం, నిరంకుశనిరవధికాతిశయాన్ని కలవాడై ఉండడం, ఫలప్రదాతగా ఉండడం, ఫలస్వరూపిగా ఉండడం– అనే మహిమలు భగవానునకు ఉన్నాయని బ్రహ్మసూత్రాలలోని నాల్గు అధ్యాయాలలో క్రమంగా చెప్పబడ్డాయి అని, అతనికి ఈ మహిమలు సిద్ధించడంలో లక్ష్మీదేవి సహాయభూతురాలై ఉంటుందని, దానితో అతనిని పొందడంలో మనకు కలిగే భయాన్ని పోగొట్టి పురుషకారం చేస్తుందని దేశికులు ఈ మంగళశ్లోకాన్ని వివరిస్తూ కృపజేసిన ఈ క్రిందివ్యాఖ్యానపంక్తులు ప్రకృతంలో అనుసంధేయాలు. ఇవి మొదటిశ్లోకానికి అవతారికకూడా.

**"అత్ర సమన్వయావిరోధసాధనఫలవిషయ శారీరకచతురధ్యాయీసమధిగతస్య భగవత్సర్వప్రకారాభిమతానురూపసహధర్మిణీవిశిష్టతయాఽపి సర్వాధికత్వం, "కః శ్రీః శ్రియః" ఇత్యుక్తకైముతికన్యాయకాకుగర్భయా చతుఃశ్లోక్యా ప్రకాశయన్, ప్రథమం శ్రియః ప్రతిపిపాదయిషితానాం విభూతిద్వయశేషిత్వాదీనాం స్థాపక మాహ."** (సమన్వయం, అవిరోధం, సాధనం ఫలం–అనే వాటిని విషయాలుగా కల శారీరకశాస్త్రంలోని నాల్గు అధ్యాయాలతో తెలియబడే భగవానునకు అన్ని రీతులలోను ప్రియయై, అనురూప అయిన సహధర్మచారిణితో లక్ష్మితో కూడుకొన్నవాడైనందువల్ల అతడు అందరికంటే అధికుడు – అనే విషయాన్ని ఈ చతుఃశ్లోకిద్వారా వ్యక్తం చేయాలని యామునులు ఆశిస్తున్నారు. **"కః శ్రీః శ్రియః"** (స్తోత్ర–12) ( అందరిచేత ఆశ్రయింపబడే శ్రీదేవిచేత కూడా ఆశ్రయింపబడే వాడెవడు?) అనే ప్రశ్నకు ఈ చతుఃశ్లోకి వివరణంగాకూడా ఉంటూ ముందు తెలిపిన భగవానుని సర్వాధికత్వాన్ని వివరిస్తున్నది. అందులో అందరికీ శేషిగా అయిన భగవానునకు సహధర్మచారిణిగా ఉండే ఈ పిరాట్టి ఉభయవిభూతికి శేషిగా ఉన్నది–అనే అతిశయం మొదటిశ్లోకంలో స్థాపించబడుతున్నది)

ఈ అవతారికలో శారీరక శాస్త్రంలోని నాల్గు అధ్యాయాలలోను చెప్పబడేవాడు భగవానుడొక్కడే అని, అతనికి అన్నివిధాలుగా అభిమత, అనురూప అయిన ఈ లక్ష్మీదేవి



ఆ భగవానునకు శారీరకశాస్త్రంలో ప్రతిపాదింపబడ్డ ఒక్కొక్క అతిశయం సిద్ధించడంలో సహాయభూతురాలై ఉంటున్నది అని, ఆమెకు స్వామియై ఉండే అతడే సర్వాధికుడనే విషయం కింపునఃన్యాయంతో సిద్ధిస్తుందని దేశికులు చాలా స్పష్టంగా తెలిపారు. శ్రీదేశికులు ఈ మంగళశ్లోకం ద్వారా, ఈ అవతారికాభాష్యంద్వారా లక్ష్మీనారాయణులు ఇద్దరు తుల్యులు–అనే అయిదవపక్షాన్ని అంగీకరించలేదు అని, భగవానుడు తప్ప మిగిలినవారికే లక్ష్మీదేవి శేషిగా ఉంటుందనే నాల్గవ పక్షాన్నే వారు స్వీకరించారని చాలా స్పష్టంగానే తెలుస్తున్నది –అని ఉవే శ్రీమాన్ శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ తమ వివరణంలో తెలిపారు.

**"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ"** (తైత్తి–శీక్షా–11–2) (అఖిలజగన్మాత అయిన పిరాట్టిని దైవంగా కలవాడవు కావాలి. నాశనం లేని తండ్రి అయిన భగవానుని దైవంగా కలవాడవు కావాలి. అజ్ఞాత జ్ఞాపనాన్ని చేసే ఆచార్యుని దైవంగా కలవాడవు కావాలి. అతిథులనబడే భాగవతులను దైవంగా కలవాడవు కావాలి) అని ఉపనిషత్తులో చెప్పిన రీతిలోనే ఈ చేతనునకు ఇతని స్వరూపానురూపం అయిన ఉపకారాలను చేసేవారు ఈ నల్గురు. లోకానికి అంతటికీ తల్లి అయిన లక్ష్మీదేవే వారిలో అగ్రగణ్య, **"అవ్యయః పితా"** (శ్రీవిష్ణు సహస్రనామాధ్యాయం) (నాశం లేని తండ్రి), "**ఎన్నుమ్ ఇఱవాద వెన్దై**" (ఏనాడూ నశించని తండ్రి) అని చెప్పబడే భగవానుడే రెండవవాడు. **"అఱియాదన అఱివిత్త అత్తా"** (అజ్ఞాత జ్ఞాపనాన్ని చేసిన స్వామీ!) (తిరువాయ్–2–3–2) అని చెప్పబడే ఆచార్యుడు మూడవవాడు. భగవదనుభవాన్ని ఇతరులకు విందుగా ఇచ్చి, తాము కూడా ఇతరుల ఇంటిలో అతిథులై దానిని పొందడంచేత అతిథులనబడే భాగవతులు నాల్గవవారు. ఈ తైత్తిరీయోపనిషద్వాక్యానికి లోకప్రసిద్ధ అయిన తల్లిదండ్రులు, లౌకికవిద్యలను ఉపదేశించే ఆచార్యులు, ఇంటికి వచ్చే అతిథులు అనే అర్థాన్ని గ్రహించినా, ఉపకారాతిశయాన్ని గమనించినపుడు పూర్వం తెల్పిన నల్గురే ఈ వాక్యానికి ముఖ్యార్థభూతులు అనే విషయం తెలుస్తుంది. అందువల్ల విజ్ఞులు ఈ నల్గురి విషయంలో ఉపకారస్మృతితో వారు చేసే ఉపకారాన్ని అనుసంధించి, దానికి తగినట్లు నడుచుకోవాలి. ఈ నల్గురు చేసే ఉపకారాలను శ్రీపిళ్ళైలోకాచార్యులవారు తాము అనుగ్రహించిన నవరత్నమాలై అనే

"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ" ఎన్నుకొణ్డు ఇచ్చేతననుక్కు స్వరూపాఽనురూపమాక ఉపకారకరాకిఱార్– "అఖిలజగన్మాతా"వాన పిరాట్టియుమ్, "అవ్యయః పితా" వాన ఈశ్వరనుమ్, "అఱియాతన వఱివిత్త" ఆచార్యనుమ్, అతిథిశబ్దవాచ్యరాన అవనడియారుమ్ ఎన్ను,

ఇన్నాల్వర్ పక్కలిలుమ్ ఉపకారస్మృత్యతిశయత్తాలే ఉద్దేశ్యప్రతిపత్తి పణ్ణి ఉజ్జీవిక్కక్కడవనెన్నుమ్ వేదాన్తఙ్గళిలే వ్యాఖ్యాతమాక విధిక్కైయాలే, విశేషజ్ఞరెల్లారుమ్ విరుమ్బి అనుష్ఠిక్క వేణ్ణుమ్బడి విశేషార్థఙ్గళాయితే ఇవ్వర్థఙ్గళ్ తానిరుప్పతు. ఇన్నాల్వర్ -పణ్ణు ముపకారముమ్ నవరత్నమాలైయిలే నన్ఱాక క్కాణలామితే. ఇప్పడిప్పట్ట ఉపకారఙ్గళై అనుసన్ధిత్తు, “శీతై యెన్బతోర్ తెయ్వమ్”, “తిరుమఙ్గై నిన్ఱరుళమ్ తెయ్వమ్ నా వాఴ్త్తుమ్”, “తేవుమఱ్ఱఱియేన్”, “కులతెయ్వమ్” ఎన్నుమ్ నిన్నాల్వర్పక్కలిలుమ్ దేవతాప్రతిపత్తియై పణ్ణానినార్కళితే.

ఆకైయాలే, సకలవేదాన్తవిదగ్రగణ్యరాయ్, ఆస్తికాఅగ్రేసరరాయ్, పరపక్షప్రతిక్షేప స్వపక్షస్థాపకత్వత్తాలే “ఆళవన్దార్” ఎన్ను అఖిలలోకప్రసిద్ధమాన అభిధానత్తై యుడైయరాన

---

రహస్యగ్రంథంలో స్పష్టంగా వివరించారు. ఈ నల్గురు చేసే ఉపకారాలను స్మరించి, ఆళ్వార్లు **“శీదై యెన్బదోర్ దెయ్వమ్”** (పెరియతిరు-10-2-5) (సీత అనే ఒక దైవకాంతను), **“తిరుమఙ్గై నిన్ఱరుళుమ్ దెయ్వమ్ నా వాఴ్త్తుమ్”** (ఇరణ్డామ్‌తిరు-5-7) (శ్రియఃపతి అయిన, లక్ష్మీదేవి నిత్యవాసం చేసే దైవాన్ని నా నాలుక మంగళాశాసనం చేస్తుంది.), **“తేవు మఱ్ఱఱియేన్”** (వేఱొక దైవాన్ని తెలియను) (కణ్ణినుణ్-2), **“కులదెయ్వమ్”** (పెరియతిరు-2-6-4) (కులదైవం) అనే ఈ నల్గురినిగూర్చి **“దెయ్వమ్”** అనే పదాన్ని ప్రయోగించి, వారి విషయంలో పరదేవతపట్ల కల్గి ఉండవలసిన అతిశయితప్రతిపత్తిని కల్గి ఉన్నారుకదా!

ఈ కారణంచేత, అన్ని వేదాంతార్థాలను తెలిసినవారిలో అగ్రేసరులై, ఆస్తికులలో అగ్రగణ్యులై, వేదబాహ్యులైనవారి మతాలను, వేదానికి అపార్థాలను చెప్పే వారిని నిరసించి, పరమవైదికసిద్ధాంతం అయిన విశిష్టాద్వైత శ్రీవైష్ణవమతాన్ని సుస్థాపించడంచేత **“ఆళవన్దార్”** అని అన్ని లోకాలు కీర్తించే తిరునామాన్ని కలవారైన యామునాచార్యులవారు, తాము సదాచార్యులలో గొప్పవారై ఉండే అతిశయం వ్యక్తం అయేటట్లు, ఈ నల్గురి విషయంలోను తమ ఆదరాతిశయం ప్రకాశించేటట్లు, తమ మార్గంలోకి వచ్చినవారు ఆదరాన్ని పొందేటట్లు కొన్ని స్తోత్రాలను అనుగ్రహించాలని ఆశించారు. **“ఆచరతీత్యాచార్యః”** (ఆచరించి, చూపేవాడు ఆచార్యుడు) అనే ఆచార్యశబ్దవ్యుత్పత్తిచేత, **“ఆచినోతి హి శాస్త్రార్థా నాచారే స్థాపయత్యపి, స్వయ మాచరతే య స్తు స ఆచార్య ఇతి స్మృతః”** (శాస్త్రార్థాలను పూర్ణంగా తెలిసికొని, తాను వాటి ప్రకారం నడచుకొని, ఇతరులను సదాచారంలో నడిపించేవాడెవడో అతడే ఆచార్యుడు) అని ఆచార్యలక్షణాన్ని చెప్పే ప్రమాణానుసారం, తాను తెలిసిన సత్ప్రవర్తనను తాను



యామునాచార్యర్, తామ్ ఆచార్యశ్రేష్ఠరానమై తోఱ్ఱ “ఆచరతీత్యాచార్యః”, “స్వయ మాచరతే య స్తు స ఆచార్య ఇతి స్మృతః” ఎన్గిఱపడియే “ఇవ్వర్థఙ్గళై నామ్ ఆచరిక్కవేణుమ్” ఎన్గిఱ ఆదరాతిశయత్తాలుమ్, “స్వాభిమానాన్తర్భూతరాన అస్మదాదికళెల్లారుమ్ ఇవ్వర్థఙ్గళై అనుష్ఠిత్తు ఆత్మోజ్జీవనత్తిలే అత్యభినివిష్టరాకవేణుమ్” ఎన్గిఱ తమ్ముడైయ ఆకస్మికకృపైయాలుమ్, “ఉపకారకరాన ఇన్నాల్వర్పక్కలిలుమ్ తమక్కుణ్డాన ప్రతిపత్తివిశేషత్తై గ్రన్థస్థమాక ప్రకాశిప్పిప్పోమ్” ఎన్ను తిరువుళ్ళమ్బఱ్ఱి ప్రథమత్తిలే “మాతృదేవో భవ” ఎన్ను మహోపకారకైయాక చొల్లప్పట్ట పెరియపిరాట్టియారుడైయ స్వరూపగుణవిభూతికళై అనుసన్ధిత్తు, అవ్వనుభవజనితప్రీతి ప్రకర్షత్తాలే తద్విషయస్తోత్రత్తిలే ప్రవృత్తరాకిఱార్. (కాన్త స్తే) ఇత్యాదియాలే.

“పితృదేవో భవ” ఎన్ను తొడఙ్గి చ్చొల్లప్పట్ట మూవరిడత్తిలుణ్డాన విశేషప్రతిపత్తియై స్తోత్రరత్నత్తిలే వెళియిట్టరుళినార్. ఎఙ్గనే? యెన్నిల్, ప్రథమత్తిలే

---

కూడా అనుష్ఠించేవాడై, తనతో చేరినవారుకూడా అనుష్ఠించేటట్లు చేసేవాడుకదా ఆచార్యుడు. అందువల్ల తాము తెలిసిన, ఉపకారులైన ఈ నల్గురి విషయంలో తమ ఉపకారస్మృతిని చూపడంకోసం, తమ అభిమానంలో ఒదిగిన తమవంటివారు అందఱూ ఆ నల్గురి అతిశయాన్ని తెలిసికొని, దానికి తగినట్లు నడచుకొని, ఉజ్జీవించడంలో ఉత్సాహాన్ని కల్గి ఉండాలి అనే తమ నిర్హేతుకకరుణచేత యామునులకుకూడా ఈ నల్గురి విషయంలో స్తుతిగ్రంథాలను రచించాలి-అనే కోఱిక కల్గడంలో ఆశ్చర్యం లేదుకదా! అందుచేత, ఈ నల్గురిలో గొప్ప ఉపకారాన్ని చెసేది కనుక “తల్లిని దైవంగా కల్గి ఉండు” **(మాతృదేవో భవ)** అని ఇంతకుముందు ఉట్టంకించిన వాక్యంలో మొదట చెప్పబడ్డ లక్ష్మీదేవియొక్క స్వరూపం, గుణాలు, లీలలు మొదలైన వానిని అనుసంధించి, ఆ అనుభవంచేత కల్గిన భోగ్యతాతిశయంవల్ల ఆ లక్ష్మివిషయంగా ఈ స్తోత్రాన్ని **“కాంత స్తే”** అని అంటూ ప్రారంభిస్తున్నారు.

**“పితృదేవో భవ”** (తండ్రిని దైవంగా కల్గి ఉండు) అని ప్రారంభించి చెప్పబడ్డ మిగిలిన ముగ్గురి విషయంలో ఉండే ఉపకారస్మృతిని స్తోత్రరత్నంలో వ్యక్తం చేశారు. ఏ విధంగా అంటే - ఉట్టంకించిన ఈ ఉపనిషద్వాక్యంలో “ఆచార్యుని దైవంగా కల్గి ఉండు” అని గొప్ప ఉపకారాన్ని చెసేవాడుగా చెప్పబడ్డ ఆచార్యుని విషయంలో తమకున్న ఆదరాతిశయాన్ని **“నమో౽చింత్యాద్భుతాక్లిష్టజ్ఞానవైరాగ్యరాశయే, నాథాయ మునయే౽గాధభగవద్భక్తిసింధవే”** (స్తోత్ర-1) (ఇటువంటిది, ఇంతటిది అని భావించడానికి సాధ్యం

"ఆచార్యదేవో భవ" ఎన్రు మహోపకారకరాక చ్చొల్లప్పట్ట ఆచార్యవిషయత్తిల్ తమక్కుణ్డాన భావబన్ధవిశేషఙ్గళై, "నమో చిన్త్యాద్భుత" ఎన్రుమ్, "తస్మై నమః" ఎన్రుమ్, "భూయో నమః" ఎన్రుమ్, "ప్రణమామి" ఎన్రుమ్ ప్రకాశిప్పిత్తార్. నిరుపాధికపితావాన వీశ్వరవిషయిత్తిల్. తమక్కుణ్డాన ప్రతిపత్తివిశేషత్తై "యన్మూర్ధ్ని మే" ఎన్రు తొడఙ్గి

---

కానిది, ఆశ్చర్యకరమైనది, భగవత్కృపచేత సులభంగా లభించేది అయిన జ్ఞానానికి, వైరాగ్యానికి రాశివంటివారు, భగవానుని ధ్యానించేవారు, అగాధమైన భగవద్భక్తికి సముద్రంవంటివారైన నాథమునులకు నమస్కరిస్తున్నాను) అని, **"తస్మై నమో మధుజిదంఘ్రిసరోజతత్త్వజ్ఞానానురాగమహిమాతిశయాంతసీమ్నే, నాథాయ నాథమునయేఽత్ర పరత్ర చాపి నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్"** (స్తోత్ర-2) (ఈ లోకంలో, పై లోకంలో ఎల్లప్పుడూ ఏ శ్రీమన్నాథమునుల శ్రీపాదాలు నాకు శరణమో, మధువనే రాక్షసుణ్ణి నిరసించిన భగవానుని శ్రీపాదపద్మాలకు సంబంధించిన తత్త్వజ్ఞానం, భక్తి-అనే వీటి అతిశయంయొక్క పరమావధిని ఎల్లగా కలవారు, నాకు నాథులు అయిన ఆ నాథమునులకు నమస్కారం) అని, **"భూయో నమోఽపరిమితాచ్యుతభక్తితత్త్వజ్ఞానామృతాబ్ధిపరివాహశుభై ర్వచోభిః, లోకేఽవతీర్ణపరమార్థ-సమగ్రభక్తియోగాయ నాథమునయే యమినాం వరాయ"** (స్తోత్ర-3) (అంతులేని భగవద్భక్తి, యథార్థజ్ఞానం-అనే అమృతసముద్రంయొక్క పరీవాహరూపాలు అయిన సూక్తులతో ఈ లోకంలో అవతరించినదిగాను, పరమప్రయోజనంగాను, పూర్ణంగాను ఉండే భక్తియోగాన్ని కలవారు, యోగులలో గొప్పవారు అయిన నాథమునులకు మళ్ళీ మళ్ళీ నమస్కారం) అని తమకు ఆచార్యులైన నాథమునుల విషయంలో, "**మాతా పితా యువతయ స్తనయా విభూతిః సర్వం యదేవ నియమేన మదన్వయానామ్, ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా**" (స్తోత్ర-5) (నా వంశంలోనివారికి ఎల్లప్పుడూ తల్లి, తండ్రి, భార్యలు, పుత్రులు, సంపద అంతా ఏ ఆఴ్వార్ల శ్రీపాద యుగ్మమో, మనకు కూటస్థులు, కులపతి అయిన వారియొక్క వకుళపూమాలికచేత అలంకరింపబడినది, శ్రీ వైష్ణవశ్రీని కల్గినది అయిన ఆ శ్రీపాదయుగాన్ని తలతో నమస్కరిస్తున్నాను) అని అంటూ వారికి ఆచార్యులు, తమకు పరమాచార్యులు అయిన నమ్మాఴ్వార్ల విషయంలో వ్యక్తం చేశారు. **"పితృదేవో భవ"** అని చెప్పబడ్డ సహజ పిత అయిన భగవానుని విషయంలో తమకు ఉండే ఉపకారస్మృతిని **"యన్మూర్ధ్ని మే శ్రుతిశిరస్సు చ భాతి యస్మిన్ మనోరథపథ స్సకల స్సమేతి, స్తోష్యామి నః కులధనం కులదైవతం తత్పాదారవింద మరవిందవిలోచనస్య"** (స్తోత్ర-6) (ఏ



బహుప్రకారమాక ప్రకాశిప్పిత్తార్. "వరువిరున్దై", "విరున్దాకుమ్ పెరున్దక్కోర్" ఎన్గైయాలే అతిథిశబ్దవాచ్యరాన తదీయవిషయత్తిల్ తమక్కుణ్డాన విశేషప్రతిపత్తియై "త్వదాశ్రితానామ్" ఎన్రుమ్, "తవ దాస్యసుఖైకసఙ్గినామ్" ఎన్రుమ్, "సకృత్త్వదాకార" ఎన్రుమ్ వెళియిట్టారిఱే.

---

భగవానుని శ్రీ పాదాలు నా తలపైన, వేదాంతాలలో ప్రకాశిస్తున్నవో, ఏ శ్రీపాదాలలో మా సమస్తమైన కోటికలు చక్కగా చేరుతున్నవో, మాకు కులదైవం, కులధనం అయిన పుండరీకాక్షుని ఆ శ్రీపాదపద్మాలను స్తుతిస్తాను) అని ప్రారంభించి స్తోత్రరత్నంలో అంతా పలు రీతులలో వ్యక్తం చేశారు.

ఇక, **"అతిథిదేవో భవ"** అని చెప్పబడేవారై, **"వరు విరున్దై అళిత్తిరుప్పార్"** (పెరియాఴ్వార్ తిరు-4-8-2) (తమ ఇంటికి వేంచేసే అతిథులైన శ్రీవైష్ణవులను స్వరూపానురూపంగా ఆదరించేవారు) **"విణ్ణవర్క్కు విరున్దాకుమ్ పెరున్తక్కోరే"** (పెరియ తిరు-6-610) (పరమపదవాసులకు అతిథులైన మహనీయులే) అని ఆఴ్వార్లచే అతిథులుగా చెప్పబడ్డ భాగవతుల విషయంలో తమకు ఉండే విశేషప్రతిపత్తిని **"త్వదాశ్రితానాం జగదుద్భవస్థితిప్రణాశసంసారవిమోచనాదయః, భవంతి లీలావిధయ శ్చ వైదికాః త్వదీయ గంభీరమనోఽనుసారిణః"** (స్తోత్ర-20) (బ్రహ్మ మొదలైన నీ దాసులకు నీవు లోకాన్ని సృష్టించడం, రక్షించడం, నశింపజేయడం, సంసారాన్ని దాటించడం మొదలైనవి లీలలుగా ఉన్నాయి. వేదవిధులుకూడ నీకు దాసులైనవారి గంభీరం అయిన మనస్సును అనుసరించేవిగా ఉన్నాయి) అని, **"తవ దాస్యసుఖైకసంగినాం.... జన్మ చతుర్ముఖాత్మనా"** (స్తోత్ర-55) (నీకు శేషంగా ఉండడం అనే ఒక్క సుఖంలోనే అభినివేశాన్ని పొందినవారి గృహాలలో దాసుడు పురుగుగా పుట్టడం అయినా చాలు. మిగిలినవారి ఇళ్ళలో బ్రహ్మగా పుట్టడంకూడా నాకు అక్కరలేదు) అని, **"సకృత్త్వదాకారవిలోకనాశయా తృణీకృతానుత్తమభుక్తిముక్తిభిః, మహాత్మభి ర్మామవలోక్యతాం నయ క్షణేఽపి తే యద్విరహోఽతిదుస్సహః"** (స్తోత్ర-56) (ఏ మహనీయుల విశ్లేషం నీకు ఒక్క క్షణం అయినా సహించలేనిదిగా ఉన్నదో, ఒక్కసారి నీ తిరుమేనిని దర్శించాలి అనే ఆశతో తృణంవలె లెక్కపెట్టబడ్డ గొప్పవైన భోగాలను, మోక్షాన్ని కలవారైన ఆ పెద్దలచేత కటాక్షింపబడతగినవాడై ఉండే స్వభావాన్ని నాకు కల్గించాలి) అని స్తోత్రరత్నంలో వ్యక్తం చేశారు.

ఆవిధంగా అయితే, **"మాతృదేవో భవ"** అని చెప్పబడ్డ లక్ష్మియొక్క గౌరవం. అక్కడ కొన్ని శ్లోకాలలో చెప్పబడిందే! అందువల్ల ఎందుకోసం ఇక్కడ ప్రత్యేకస్తుతిని

ఆకిల్, "మాతృదేవో భవ" ఎన్గిఱ పిరాట్టివైభవమ్ అఱ్ఱు ప్రతిపాదిక్కవిల్లైయో? వెన్నిల్, "క శ్రీః శ్రియః" ఎన్రుమ్, "తయా సహాసీనమ్" ఎన్రుమ్ సూచిప్పిత్తమాత్రమితే స్తోత్రత్తిలుళ్ళతు. అప్పడియాకిల్ ఇవ్వళవుపోతాతో, ఇతుక్కాక వారు ప్రబన్ధమ్ నేరవేణ్డు వానెన్నెన్నిల్ "పేరాళన్ పేరోతుమ్", "అన్దమిల్ పేరిన్బత్తడియరోడిరున్దమై "ఎన్గిఱ

---

ప్రారంభించాలి?–అని అంటే, **"కః శ్రీః శ్రియః పరమసత్త్వసమాశ్రయః కః, పుండరీకనయనః పురుషోత్తమః కః. కస్యాయుతాయుతశతైకకలాంశకాంశే విశ్వం విచిత్రచిదచిత్ప్రవిభాగవృత్తమ్"** (స్తోత్ర–12) (లక్ష్మికి సైతం లక్ష్మి అయిన వాడెవడు? శుద్ధసత్త్వమయమైనవాడు ఎవడు? పుండరీకాక్షుడు ఎవడు? పురుషోత్తముడెవడు? ఎవని పలు వేల కోట్ల భాగాలలోని ఒక భాగంలో ఈ లోకం అంతా విచిత్రం అయిన చేతనాచేతన విభాగాన్ని కల్గినదిగా అణగి ఉన్నది) అని, **"తయా సహాసీన మనంతభోగిని ప్రకృష్టవిజ్ఞానబలైకధామని, ఫణామణివ్రాతమయూఖమండలప్రకాశమానోదర దివ్యధామని, నివాసశయ్యాసన పాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః, శరీరభేదై స్తవ శేషతాంగతై ర్యథోచితం శేష ఇతీరితే జనైః"** (స్తోత్ర–39,40) (ఆ లక్ష్మితోకూడ, గొప్పజ్ఞానానికి, బలానికి సాటిలేని మేటి అయిన ఆశ్రయంగా ఉన్నవాడు, తన పడగలలో ఉండే మణిసమూహాల కిరణమండలాలతో ప్రకాశించే మధ్యప్రదేశాన్ని కల్గిన (భగవానుని) దివ్యాంతఃపురాన్ని కలవాడు, (భగవానునకు) వేంచేసి ఉండడానికి తిరుమాళిగగాను, నిద్రించడానికి శయ్యగాను, సింహాసనంగాను, పాదుకలుగాను, పీతాంబరంగాను, తలదిండుగాను, వర్షంనుండి, ఎండనుండి కాపాడే గొడుగుగాను–ఇంకా పలు రీతులలోను రూపొందినవాడై, ఆయా కాలాలకు తగిన రీతిలో నీకు కైంకర్యాన్ని చేయడానికి తగిన పలు శరీరాలతో శేషుడని అందఱు జనులచేత వ్యవహరింపబడేవాడైన ఆదిశేషుని తిరుమేనిపై వేంచేసి ఉన్నవాడుగాను) అని పిరాట్టియొక్క గొప్పతనాన్ని చాలా సంగ్రహంగా తెలియజేశారేతప్ప స్తోత్రరత్నంలో దానిని విరివిగా చెప్పలేదు. కనుక ఈ ప్రబంధం అవతరించింది. సంగ్రహంగా స్తోత్రరత్నంలో చెప్పినది చాలదా? ఇందుకోసం పిరాట్టివిషయంగా ఒక స్తుతి గ్రంథాన్ని రచించాలా? అని అంటే, **"పేరాళన్ పేరోదుమ్ పెరియోరై ఒరుకాలుమ్ పిరికిలేనే"** (పెరియతిరు–7-4-4) (భగవానుని నామాన్ని అనుసంధానం చేసే మహనీయులను ఏ సమయంలోను విడువలేను), **"అన్దమిల్ పేరిన్బత్తడి యరోడిరున్దమై"** (తిరువాయ్–10-9-11) (అంతులేని ఆనందాన్ని పొందే దాసులతో సహవాసం. చేయడం) అనే భాగవతులకు కైంకర్యం చేయడం–అనే పరమప్రాప్యం ఆచార్యునివల్ల



భాగవతానువర్తనమాకిఱ పరమప్రాప్యలాభమ్ ఆచార్యనాలేయాయ్, ఆచార్యలాభమ్ ఈశ్వరనాలేయాయ్, ఈశ్వరలాభమ్ పెరియపిరాట్టియారాలేయాకైయాలే, ఇన్నాల్వరిలుమ్ మహోపకారకైయాయితే ఇవళ్తానిరుప్పతు. ఆకైయితే "మాతృదేవో భవ" ఎన్ఱు ప్రథమోపాత్తైయాయిఱ్ఱు. ఇప్పడి సర్వవ్యావృత్తోపకారశీలై యాకైయాలే, సామాన్యమాన ఆకారేణ ప్రతిపాదిత్త వళవన్ఱిక్కే, విశేషమాక ఒరు ప్రబన్ధమ్ నేరవేణుమెన్ఱు నిర్ణయిత్తు, తద్విషయత్తిలే తమక్కుణ్డాన భావబన్ధమెల్లామ్ తోన్ఱ చ్చతుః శ్లోకియాలే ఉపశ్లోకిక్కిఱార్.

కర్మపరతన్త్రనాన బ్రహ్మావిన్ ప్రసాదత్తాలే, "శోకః శ్లోకత్వ మాగతః" ఎన్గిఱపడియే శోకవేగజనితమాన శ్లోకఙ్గళ్ పోలన్ఱిక్కే, సుమఙ్గళాకారైయాన వివళ్

---

లభిస్తుంది. ఆచార్యున్ని పొందడం భగవానునివల్ల లభిస్తుంది. ఆ ఈశ్వరుడు మనకు వశం అయేది లక్ష్మీదేవివల్ల సాధ్యం అవుతుంది. ఈ కారణంచేత ఈ నల్గురిలో మిక్కిలి గొప్ప ఉపకారాన్ని చేసేది లక్ష్మీదేవే. అందువల్లనే ఉపనిషద్వాక్యంలో **"మాతృదేవో భవ"** అని మొదట చెప్పబడింది. ఈ విధంగా ఆ అందఱికంటే గొప్ప ఉపకారాన్ని చెయడమే స్వభావంగా కల్గినది కనుక స్తోత్రరత్నంలో భగవానునిగూర్చి వివరంగా పలికేటపుడు "ఇతని పత్ని" అని సంగ్రహంగా ఈమెనుగూర్చి పల్కడంతో తృప్తిపొందకుండా, "ఈమెనుగూర్చి ప్రత్యేకంగా ఒక స్తుతి గ్రంథాన్ని రచించాలి." అని నిర్ణయించి, ఆమె విషయంలో తమకుండే గౌరవం, భక్తి మొదలైనవానిని అన్నిటిని. స్ఫురించేటట్లు చతుఃశ్లోకి అనే ప్రత్యేక స్తోత్రకృతితో ఆళవందార్ స్తుతిస్తున్నారు.

**"సమాక్షరైః చతుర్భి ర్యః పాదైః గీతో మహాత్మనా, సోఽనువ్యాహరణా ద్భూయః శోకః శ్లోకత్వ మాగతః"** (రామా–బాల–2-40) ( ఏ శ్లోకం సమసంఖ్యను కల అక్షరాలతో కూడిన నాల్గు పాదాలను కల్గినదిగా ఆ మహాత్ముడైన వాల్మీకిచే గానం చేయబడిందో, ఆ శోకం మాటిమాటికి ఉచ్చరింపబడడంచేత శ్లోకంగా రూపొందింది) అనే రీతిలో కర్మకు వశం అయిన బ్రహ్మయొక్క అనుగ్రహంచేత, వాల్మీకికి కల్గిన శోకంయొక్క ఆధిక్యంచేత ఉద్భవించినవి వాల్మీకి శ్రీరామాయణ శ్లోకాలు. మిక్కిలి గొప్పమంగళాలే మూర్తీభవించిన ఈ లక్ష్మీదేవి అనుగ్రహంచేత ఉద్భవించినవి కాబట్టి ఆ శ్లోకాలకంటే గొప్ప శ్లోకాలుగా రూపొందినవికదా ఈ నాల్గుశ్లోకాలు ఉంటాయి. ఇక, పరమపదానికి వెడలినా, **"అహం శ్లోకకృత్"** (తైత్తి. భృగు–10-6) (నేను శ్రీమన్నారాయణుని విషయంగా ఉత్తమశ్లోకాలను రచించేవాడను) అనే రీతిలో **"ఉత్తమరాజకన్యయా"** (రామా. బాల–77-30) అని వాల్మీకిచేత వర్ణింపబడ్డ

ప్రసాదమడియాక వన్దతాకైయాలే, సుశ్లోకజ్జళాయితే ఇశ్శ్లోకజ్జళ్ తానిరుప్పతు. ఇని, అజ్జు ప్పోనాలుమ్, "అహంగ్ శ్లోకకృత్" ఎన్ఱు ఉత్తమరాజకన్యైయాన ఇవళ్ విషయమాక ఉత్తమశ్లోకరచనై పణ్ణి ఉజ్జీవిక్కైయితే ఉళ్ళతు.

"కృత్స్నం సీతాయా శ్చరితం మహత్" ఎన్ఱు ఎల్లామ్ సీతాచరితమా యిరుక్కవుమ్, "రఘువరచరితమ్" ఎన్ఱు శొల్లప్పడుకైయాలుమ్, గజ్గాసమ్భవాద్య

---

లక్ష్మీదేవితోకూడిన భగవానునిగూర్చి ఉత్తమశ్లోకాలను రచించి ఉజ్జీవించవలసి ఉన్నదికదా!

**"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్, పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః"** (రామా. బాల-4-7) (వ్రతానుష్ఠానాన్ని కల ఈ వాల్మీకి సీతాదేవియొక్క గొప్ప చరిత్ర అయిన శ్రీరామాయణాన్ని అంతటినీ **"పౌలస్త్యవధమ్"** అనే పేరును పెట్టి రచించాడు) అనే రీతిలో శ్రీరామాయణం అంతా సీతయొక్క కథ అయినా, **"తదుపగతసమాధిసంధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్, రఘువర చరితం మునిప్రణీతం దశశిరశ్చ వధం నిశామయధ్వమ్"** (రామా-బాల-2-44) (స్వయంగానే అమరిన సమాస-సంధుల యోగాన్ని కల్గినది, వాల్మీకి మునిచేత రచింపబడినది అయిన **"రఘువరచరితమ్"** అని, **"రావణవధ"** అని పేరు పొందినది అయిన కథను వినిపించండి) అనే రీతిలో రాముని కథగాకూడా ఇది ఉన్నది. దానితో పాటు, గంగోత్పత్తి, గాంగేయుని (గంగకుమారుడైన కుమారస్వామి) ఉత్పత్తి, మొదలైన శ్రవ్యాలు కాని కథలను వర్ణించదంద్వారా మిక్కిలి విస్తృతమైనది. కాబట్టే, సారార్థాన్ని తెలియడానికి కష్టమైనది శ్రీరామాయణం. కాని, ఈ చతుఃశ్లోకి ఇటువంటి దోషాలను వేటినీ లేనిది. నమ్మాழ்వార్ల దివ్యప్రబంధాలు **"తిరుమాలవన్ కవియాదు కఱ్ఱేన్"** (తిరువిరుత్తమ్-40) (శ్రియఃపతిని గూర్చిన కవిత్వాన్ని అభ్యసించాను.) అని అంటూ ఆழ்వార్లే చెప్పిన రీతిలో విశేషణమైన పిరాట్టినిగూర్చి, విశేష్యభూతుడైన భగవానునిగూర్చి గొప్పగా వివరిస్తున్నది. ఈ చతుఃశ్లోకి దానివలె కాకుండా, విశేషణం అయిన పిరాట్టియొక్క మహిమనే చెబుతున్నది. పిరాట్టియొక్క గొప్పతనాన్నే చెప్పినా, **"శ్రీ"** శబ్దం చాలా సంగ్రహంగాను, అర్థాన్ని తెలిసికోవడానికి క్లిష్టంగాను ఉంటుంది. ఈ చతుఃశ్లోకి అటువంటిది కాకుండా నాల్గు శ్లోకాలతో విరివిగా పల్కుతున్నదై, తెలిసికోవడానికి సులభంగా ఉన్నది, దానితోపాటు, శ్రీగుణరత్నకోశం 8వ శ్లోకంలో **"అనాఘ్రాతావద్యం . . . ."** అని నుడివిన రీతిలో (దోషగంధం ఏమీలేనిదై) ఈ చతుః శ్లోకి ఉంటుంది. ఆ శ్రీగుణరత్నకోశంలోనే **"సూక్తిం సమగ్రయతు నః స్వయ మేవ**



సత్కథావర్ణనముఖత్తాలే అతివిస్తరమాయ్, దుర్జ్ఞేయమాన శ్రీరామాయణమ్బోలుమన్ఱిక్కే, విశేషణ - విశేష్యోభయప్రధానమాన "తిరుమాలవన్కవి" పోలుమిన్ఱిక్కే, విశేషణపరమేయాయిరుక్కవుమ్, అతిసంగ్రమాకైయాలే దురవగాహమాన శ్రీశబ్దమ్బోలు మన్ఱిక్కే శ్రీశబ్దవివరణమాయ్, "అనాఘ్రాతావద్య" మాయ్, "వైదగ్ధ్యవర్ణగుణగుమ్ఫన గౌరవ" జ్గళాలే "కణ్డూలకర్ణకుహర" రాయ్క్కొణ్డు కర్ణామృతమాక ప్పానమ్ పణ్ణలామ్బడి పరమభోగ్యమాయ్, ప్రేమయుక్తర్క్కు స్వార్థప్రకాశకచాతుర్యత్తై- యుముడైత్తాన చతుః శ్లోకి సుగ్రహ మాయిరుక్కైయాలే, అఖిలప్రబన్ధవిలక్షణ- మాయిరుక్కుమ్.

భగవత్స్తోత్రమ్ పణ్ణువార్క్కెల్లామ్ స్తోత్రరత్నమ్ మూలమానాప్పోలే, పిరాట్టివిషయత్తిల్ స్తోత్రమ్ పణ్ణువార్క్కెల్లామ్ ఇప్ప్రబన్ధమ్ మూలగ్రన్థమాకైయాలే

---

**లక్ష్మీః శ్రీరంగరాజమహిషీ మధురైః కటాక్షైః, వైదగ్ధ్యవర్ణ గుణగుంభనగౌరవై ర్యాం కండూలకర్ణకుహరాః కవయో ధయంతి"** అని 7వశ్లోకంలో చెప్పిన రీతిలో పిరాట్టి అనుగ్రహంతో శబ్దవైచిత్రి, అర్థగాంభీర్యం, శైలీవైదగ్ధ్యం, గుంఫనవైచిత్రి-మొదలైన గొప్పతనాలను కల్గినది. "ఇంకా వినాలి, ఇంకా వినాలి" అని కవులు కుతూహలంతో శ్రవణపానం చేయాలని ఆశపడే రీతిలో ఉన్నదై, మిక్కిలి భోగ్యమై, భక్తిని కలవారికి తన అర్థాన్ని వ్యక్తం చేసే సామర్థ్యాన్ని కల్గినదై, సంగ్రహమై ఉన్నందున ఈ చతుఃశ్లోకి అందఱు అనుభవించడానికి వీలయినదిగా ఉన్నది. ఈ కారణంచేత, శ్రీరామాయణం, ఆழ்వార్ల సూక్తులు, శ్రీశబ్దం మొదలైన అన్నిటికంటే విలక్షణమైనదై ఈ చతుఃశ్లోకి ఉన్నది.

భగవానుని స్తుతించేవారికి అందఱికీ స్తోత్రరత్నం మార్గదర్శకం అయిన మొదటి గ్రంథం అయినట్లే, పిరాట్టిని స్తుతించేవారికి అందఱికీ ఈ చతుఃశ్లోకి మొదటి గ్రంథం కనుక, ముఖ్యమైనదై ఉంటుంది. లోకంలో ఉండే అందఱికీ అన్ని మహిమలు ఈ పిరాట్టి మూలంగానేకదా ఏర్పడుతున్నవి. ఈ విధంగా స్తోత్రరత్నం. చతుఃశ్లోకి అనే స్తుతులు ప్రప్రథమ గ్రంథాలు. కనుక వీటిని అనుసరించి భగవద్రామానుజులు గద్యత్రయం ప్రారంభంలో పిరాట్టిని స్తుతించి, ఆమెను పురుషకారంగా శరణాగతిని చేసి, పిమ్మట భగవానుని స్తుతించి, ఉపాయంగా ఆశ్రయించారు. వారి ప్రథమశిష్యులైన కూరత్తాழ்వాన్కూడా తమ పంచస్తవాలలోని శ్రీస్తవంలో పిరాట్టిని ముందుగా స్తుతించి, తరువాత శ్రీ వైకుంఠస్తవం, అతిమానుషస్తవం, సుందరబాహుస్తవం, వరదరాజస్తవాలలో భగవానుని స్తుతించారు. వారి కుమారులైన శ్రీపరాశరభట్టర్కూడా శ్రీగుణరత్నకోశంలో పిరాట్టిని స్తుతించి, శ్రీరంగరాజస్తవంతో శ్రీరంగనాథుని స్తుతించారు.

ముఖ్యమాయిరుక్కుమ్, ఇవళ్మూలమాకవిఱే ఎల్లా ముణ్డావతు. ఆకైయిఱే, స్తోత్రచతుఃశ్లోకికళై అడియొఱ్ఱి గద్యత్రయముమ్, శ్రీస్తుతిముతలాన పఞ్చస్తవముమ్, శ్రీగుణరత్నకోశముమ్, శ్రీరఙ్గరాజస్తవమ్ ముతలాన దివ్యప్రబన్ధఙ్గళుమ్ అవతరిత్తతు.

ఆక, ఇత్తాల్ "మాతృదేవో భవ" ఎన్గిఱ వాక్యార్థవివరణమాన శ్రీసూక్తార్థత్తై ఇశ్శ్లోకరూపేణ వెళియిడుకిఱార్. అతిల్, ప్రథమశ్లోకత్తాల్ "శ్రియం దేవీ ముపహ్వాయే, శ్రీర్మా" ఎన్గిఱ వాక్యఙ్గళాలుమ్, "విష్ణో శ్రీః" ఎన్గిఱ వాక్యఙ్గళాలుమ్, "శ్రీవత్సవక్షాః"

---

ఈ రీతిలో, ఈ చతుఃశ్లోకితో **"మాతృదేవో భవ"** అనే తైత్తిరీయోపనిష-ద్వాక్యానికి వివరణం అయిన శ్రీసూక్తంయొక్క అర్థాన్ని యామునులు వ్యక్తం చేస్తున్నారు. అందులో, ఈ మొదటి శ్లోకంతో, **"అశ్వపూర్వాం రథ మధ్యాం హస్తినాదప్రబోధినీమ్, శ్రియం దేవీ ముపహ్వాయే శ్రీ ర్మా దేవీ జుషతామ్"** (సర్వస్వామి అయిన భగవానుని పురస్కరించుకొని ఉన్నది, (శరీరం అనే, లేక, ఓంకారం అనే) రథం మధ్యలో ఉన్నది, గజాల నాదాలతో ప్రబోధాన్ని పొందేది అయిన శ్రీదేవిని దగ్గరకు ఆహ్వానిస్తున్నాను) అనే శ్రీ సూక్తమంత్రంలోను, **"నిత్యై వైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ, యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"** (విష్ణుపు-1-8-17) (జగన్మాతయై, విష్ణువుకు సంపదగా ఉన్నదై, **"ఇఱైయుమ్ అకలకిల్లేన్"** (క్షణం కూడా విడువలేను) అనే పిరాట్టి నిత్యయే. బ్రాహ్మణోత్తమా! ఏ విధంగా భగవానుడు సర్వవ్యాపిగా ఉన్నాడో, ఆ విధంగానే ఈమెకూడా సర్వవ్యాపినిగా ఉన్నది) అనే శ్రీవిష్ణుపురాణశ్లోకంలోను. **"తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః, శ్రీవత్సవక్షాః నిత్యశ్రీః రజయ్యః శాశ్వతో ధ్రువః"** (రామా-యుద్ధ-114-15) (ఈ శ్రీరాముడే తమస్సుకు ఉన్నవాడు, సర్వధారకుడు, శంఖచక్ర గదాధరుడు, శ్రీవత్సమనే పుట్టుమచ్చను వక్షఃస్థలంలో కలవాడు, ఎల్లప్పుడు శ్రీదేవితో కూడి ఉండేవాడు, జయించడానికి సాధ్యం కానివాడు, నిత్యుడు, స్థిరమైనవాడు అయిన నారాయణుడు) అని శ్రీసూక్తమంత్రాన్ని వివరించడంకోసం వచ్చిన శ్రీరామాయణశ్లోకంలోను చెప్పబడే పిరాట్టియొక్క విశిష్టనామం అయిన శ్రీశబ్దాన్ని అర్థంతో అనుసంధిస్తున్నారు.

ఇక, శ్రీపెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానావతారికాసారం విన్నపింపబడుతున్నది.

మన విశిష్టాద్వైతశ్రీవైష్ణవదర్శనానికి ముఖ్యమైన ప్రమాణాలు తిరుమంత్రం, ద్వయం, చరమశ్లోకం-అనే మూడు రహస్యాలు, వరాహప్పెరుమాళ్ అనుగ్రహించిన రెండు చరమశ్లోకాలు, ఆళవన్దార్ పిరాట్టి విషయంగా అనుగ్రహించిన నాల్గు శ్లోకాలను కల చతుఃశ్లోకి-అని మన పూర్వాచార్యులు అనుగ్రహిస్తారు. వీటిలో మొదటిరహస్యం అయిన తిరుమంత్రంలో భగవానునకు జీవాత్మస్వరూపం అత్యంతపరతంత్రం అని,



ఎన్గిఱ తదుపబృంహణఙ్గళాలుమ్ ప్రతిపాదిక్కిఱ తదసాధారణమాన తిరునామత్తై సార్థమాక వనుసన్ధిక్కిఱార్.

అవతారిక్కై ముఱ్ఱిఱ్ఱు.

---

ఆ జీవస్వరూపానికి తగిన పురుషార్థం భగవానునకు ఆనందాన్ని కల్గించే కైంకర్యమే అని చెప్పబడింది. ఆ పురుషార్థాన్ని పొందడానికి దారి ఏది? అనేది చతుఃశ్లోకివల్ల, వరాహచరమశ్లోకంవల్ల వివరింపబడుతున్నది. అందులో, చతుఃశ్లోకిచేత చెప్పబడే అర్థం ఏది? అని అంటే, మనస్వామికి మిగిలిన దైవాలకంటె అతిశయం-మోక్షాన్ని అనుగ్రహించేవాడై ఉండడం, లోకానికి అంతటికీ నిమిత్తం, ఉపాదానం, సహకారి-అనే త్రివిధకారణభూతుడై ఉండడం. భగవానునకు ఉన్న ఈ రెండు విలక్షణాలైన అతిశయాలు అతడు శ్రీదేవికి పతిగా ఉన్నందువల్ల కలిగాయి. నారాయణుడై ఉన్నందువల్ల ఏర్పడిన పరత్వం, సౌలభ్యం-మొదలైన గుణాలవల్ల ప్రాప్యమైన పరబ్రహ్మస్వరూపం, ప్రాప్త అయిన జీవస్వరూపం, పొందడానికి దారి అయిన ఉపాయస్వరూపం, పొందబడే ఫలంయొక్క స్వరూపం, ఈనాటివరకు పొందడానికి అడ్డుగా ఉండే విరోధి స్వరూపం-అనే అర్థపంచకం వేదతాత్పర్యమై ఉన్నది. ఆ వేదాలకు వివరణరూపంగా ఉన్నది శ్రీవిష్ణుపురాణం. పిరాట్టిని పురుషకారస్వరూపిణిగా, భగవానుని ఉపాయంగా, ఈ ఇద్దరి చేరికను ప్రాప్యంగా విష్ణుపురాణంలో శ్రీ పరాశరమహర్షి తెలిపిన విషయాన్ని గమనించిన శ్రీయామునులు స్తోత్రరత్నంతో ఉపాయంగా, ప్రాప్యంగా ఉండే భగవానునియొక్క మహిమలను వివరించి, శ్రీదేవికి పతియై, ఉండడంవల్లనే భగవానునకు సౌలభ్యం, పరత్వం మొదలైన గుణాలు కలిగాయి అనే విషయాన్ని ఈ చతుఃశ్లోకితో వివరిస్తున్నారు. ఇందులోని మొదటిశ్లోకంలో నారాయణునకు పత్నిగా ఉండడంవల్ల పిరాట్టికి ఏర్పడిన పరత్వం చెప్పబడుతున్నది. రెండవశ్లోకంతో ఆ పరత్వాన్ని కీర్తి, పిరాట్టియొక్క సౌలభ్యంవల్ల కలిగే పురుషకారం చెప్పబడుతున్నది. మూడవశ్లోకంతో ఇటువంటి పరత్వం. సౌలభ్యం మొదలైనవాటిని కల పిరాట్టి భగవానుడు లోకానికి త్రివిధకారణాలుగా అయేటపుడు, అతడు లోకాలకు సృష్టించేటట్లు ప్రార్థించడం, ఆ సృష్టివల్ల కలిగే ఆనందంలో పాలు పంచుకోవడం-మొదలైన అప్రధానాలైన అన్వయాలను జగత్కారణత్వంతోపాటు లక్ష్మి ఉన్నది- అనే విషయాన్ని తెల్పి, పురుషకారస్వరూపుణ్ణి అయిన పిరాట్టితో కూడిన భగవానుడే ఉపాయం అని తెలియజేయబడుతున్నది. నాల్గవశ్లోకంతో పూర్వంతెల్పిన ఉపాయంతో పొందబడే ఫలం పిరాట్టితో గాఢోపగాఢంగా ఉండే భగవానుడే అని నిరూపింపబడుతున్నది.

అవతారిక వివరణం ముగిసింది.

శ్రీమతే రామానుజాయ నమః

పరమకారుణికరాన పెరియవాచ్చాన్పిళ్ళైకుమారర్
నాయనారాచ్చాన్పిళ్ళై అరుళిచ్చెయ్

# చతుఃశ్లోకీవ్యాఖ్యానమ్

★ ★ ★

**కాంత స్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం**
**వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ।**
**బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః**
**శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్॥ 1 ॥**

## "హరివల్లభా" వివరణం

**యత్పదాంభోరుహధ్యానవిధ్వస్తాశేషకల్మషః ।**
**వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్ ॥**

(ఎవరి శ్రీపాదపద్మాలను ధ్యానించడంవల్ల అన్ని దోషాలు తీరి, ఒక వస్తువుగా అయ్యానో, అటువంటి గొప్పతనాన్ని కల యామునాచార్యులవారికి నమస్కరిస్తున్నాను)

**కాంత స్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం**
**వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ।**
**బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః**
**శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్॥ 1 ॥**

భగవతి = కల్యాణగుణాలను నిండుగా ఉన్నదానా!, పురుషోత్తమః = పురుషోత్తముడైన, భగవానుడు, తే = నీకు, కాంతః= ప్రియమైన పతి, ఫణిపతిః = సర్పరాజు అయిన ఆదిశేషుడు, శయ్యా= పడుక, వేదాత్మా = వేదాన్ని శరీరంగా కలవాడు, విహగేశ్వరః = పక్షిరాజు అయిన గరుత్మంతుడు, ఆసనం వాహనం =ఆసనంగాను, వాహనంగాను ఉన్నాడు, జగన్మోహినీ = జగత్తును మోహింపజేసే, మాయా = ప్రకృతి, యవనికా = నీముఖానికి తెరగా ఉన్నది, సదయితః = తన భార్యతో కూడి ఉండే, బ్రహ్మేశాదిసురవ్రజః = బ్రహ్మ, శివుడుమొదలైన దేవసమూహం,



**అవతారికై :** (కాన్త స్తే ఇత్యాది) "శ్రీఞ్-సేవాయామ్" ఎన్గిఱ ధాతువిలే నిష్పన్నమాకైయాలే సేవావాచియాన శ్రీశబ్దత్తిల్ "శ్రయత ఇతి శ్రీః", "శ్రీయత ఇతి శ్రీః" ఎన్గిఱ కర్తరి-కర్మణివ్యుత్పత్తిద్వయసిద్ధఙ్గళాన భగవదాశ్రయణత్తైయుమ్, తద్ధేతుకమాన ఉభయవిభూతిశేషత్వత్తైయు ముడైయైయాయ్, అత్తాలే "శ్రీః" ఎన్ను సర్వోత్కర్షహేతువాన తిరునామత్తైయుముడైయైయాయ్, జ్ఞానశక్త్యాదికల్యాణగుణపరిపూర్ణైయుమాన ఉన్నై పరిమితజ్ఞానశక్తికరాన నాఙ్గళ్ పరిచ్ఛేదిత్తు ప్పేశువతెఙ్గనే ? యెన్గిఱార్.

వ్యాఖ్యానమ్:- (కాన్త స్తే పురుషోత్తమః) "సహస్రశీర్షా పురుషః", "పూర్ణం పురుషేణ", "పురుషం మహాన్తమ్", "పురుష ఏవేదం సర్వమ్", "స యశ్చాఽయం

---

త్వద్దాసదాసీగణః = నీకు దాసగణంగా, దాసీగణంగా ఉన్నది, తే నామ చ = నీ పేరుకూడా, శ్రీః ఇతి ఏవచ = "శ్రీః' అనియే, త్వాం = అటువంటి మహిమనుకల నిన్నుగూర్చి, వయం = అజ్ఞులమైన మేము, కథం బ్రూమః = ఏవిధంగా చెప్పగలము?

**అవతారిక :- "శ్రీఞ్-సేవాయామ్"** అనే ధాతువునుండి ఉత్పన్నమైనది కనుక శ్రీశబ్దం సేవను (ఆశ్రయించి ఉండడాన్ని) అర్థంగా కల్గినది. అందులో **"శ్రయతే ఇతి శ్రీః"** (భగవానుని ఆశ్రయిస్తున్నది కనుక **"శ్రీః'** అనబడుతున్నది). అనే కర్తరివ్యుత్పత్తిచేత, పిరాట్టి తన స్వరూపస్థితిప్రవృత్తులకోసం భగవానుని ఆశ్రయిస్తూ ఉన్నది అని తెలుస్తున్నది. **"శ్రీయతే ఇతి శ్రీః"** (తమ స్వరూపస్థితి ప్రవృత్తులకోసం జీవులు అందఱిచేత ఆశ్రయింపబడుతున్నది. కనుక **"శ్రీః"** అనబడుతున్నది.) అనే కర్మణివ్యుత్పత్తిచేత, భగవానునకు పత్నిగా ఉండడంచేత, అతనికి శేషం అయిన ఉభయవిభూతికి ఈమెకూడా శేషిగా ఉన్నది-అని వ్యక్తమవుతున్నది. ఈ రీతిలో అన్ని మహిమలకు కారణం అయిన **"శ్రీః"** అనబడే తిరునామాన్ని కల్గినదానవై, జ్ఞానశక్త్యాదికల్యాణగుణాలతో నిండిన నిన్ను పరిమిత జ్ఞానశక్త్యాదులనుకల మేము, కొన్ని శ్లోకాలతో పరిచ్ఛేదించి పల్కడం ఏ విధంగా సాధ్యం? అని మొదటి శ్లోకంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం:- (కాంత స్తే పురుషోత్తమః)**-నీకు పురుషోత్తముడు ప్రియుడైన భర్త. **"సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షః సహస్రపాత్"** (పురుషసూ-1-1) (పరమపురుషుడు వేయి తలలను, వేయి కన్నులను, వేయి పాదాలను కలవాడు) **"యస్మాత్పరం నాపర మస్తి కించిత్ యస్మా న్నాణీయో న జ్యాయోఽస్తి కించిత్, వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః, తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్"** (ముండక -1-1-7) (ఎవనికంటె గొప్పదైనది వేఱొకటి లేదో, ఎవనికంటే చిన్నది, పెద్దది ఇంకొకటి లేదో, ఎవడు

పురుషే", "హిరణ్మయః పురుషో దృశ్యతే", "మహాపురుష పూర్వజ", "జానాతి పురుషోత్తమమ్", "పురుషః పుణ్డరీకాక్షసంజ్ఞకః", "తం వినా పురుషోత్తమమ్", "ఉత్తమః పురుష స్త్వన్యః", "క్షమస్వ పురుషోత్తమ" "పురుడోత్తమ నడి", "పురుత్తమన్", "పురుడోత్తమమే" ఎన్ఱు మిత్యాది ప్రమాణశతఙ్గళాలే సకలచేతనాఽచేతనవిలక్షణనాన "పఱవై యేఱు పరమ్ పురుడన్" ఎన్ఱవాఱు. 'ఇత్తిరునామన్దాన్ త్రివిధచిదచిద్బృన్దవై లక్షణ్యత్తై శాబ్దమాక క్కాట్టక్కడవతిఱే. "పురుషః" ఎన్ఱు అచిద్వ్యావృత్తరాన బద్ధరైయుమ్, "ఉత్పురుషః" ఎన్ఱు తద్వ్యావృత్తరాన ముక్తరైయుమ్, "ఉత్తరః పురుషః" ఎన్ఱు అవర్కళిల్ వ్యావృత్తరాన నిత్యరైయుమ్ శొల్లి, "ఉత్తమః పురుషః" ఎన్ఱు తద్వ్యావృత్తనాన ఈశ్వరనై

---

పరమపదంలో సాటిలేనివాడై, ఎవరికీ నమస్కరించని వృక్షంవలె వేంచేసి ఉన్నాడో, ఆ పురుషునిచే ఇది అంతా నిండి ఉన్నది), **"వేదాహ మేతం పురుషం మహాంతమ్, ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, తమేవం విద్వా నమృత ఇహ భవతి, నాన్యః పంథా అయనాయ విద్యతే"** (పురుష సూ-2-2) (వేదపురుషుడనైన నేను స్వరూపగుణ విభూతులలో గొప్పవాడు, సూర్యునివలె ప్రకాశించేవాడు, ప్రకృతికి ఆవలివైపు ఉన్నవాడు అని ఈ పరమపురుషుని తెలిసికొంటున్నాను. అతనిని ఈ రీతిగా తెలిసినకొన్నవాడు ఇక్కడే ముక్తుడు అవుతున్నాడు. మోక్షానికి వేఱే గతి లేదు), **"పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్"** (పురుష సూ-1-2) (గడచినవి, (ఉన్నవి), ఇకపై రాబోయేవి-అన్నీ పురుషుడే) **"స య శ్చాయం పురుషే య శ్చాసా వాదిత్యే స ఏకః"** (తైత్తి.భృగు-10-4) (ఏ పరమాత్మ ఈ జీవునిలో ఉన్నాడో, ఎవడు ఆదిత్యునిలో ఉన్నాడో, అతడొక్కడే) **"య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** (ఛాందో-1-6-7) (సూర్యునకు నడుమన సువర్ణంవలె అందమైన రూపాన్ని కల ఏ పరమపురుషుడు కనబడుతున్నాడో, అతడు సువర్ణంవంటి అందమైన మీసాలను, కేశాలను, నఖాలనుండి అన్ని అవయవాలను కలవాడు. అతనికి సూర్యునిచే వికసించే తామరలవంటి రెండు కన్నులున్నాయి), **"జితం తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన, నమస్తేఽస్తు హృషీకేశ మహాపురుష పూర్వజ"** (జితంతే-1-1) (పుండరీకాక్షా ! నీచే ఈ ఆత్మవస్తువు జయింపబడింది. ఇది నాది కాదుకదా! నీదే కదా! లోకాలను అన్నిటినీ సృష్టించినవాడా! ఇంద్రియాలను నియమించేవాడా! సమృద్ధిగా ఇవ్వడంలో గొప్పవాడా! ఈ ఆత్మవస్తువు నా కొఱకు కాకుండా నీకొఱకే కావాలి) **"యో మా మేవ మసమ్మూఢో**



చ్చొల్లిఠఠఱే. హేయమూలమాన వచిత్తుమ్. హేయసహితరాన బద్ధరుమ్, హేయరహితరాన ముక్తరుమ్, హేయప్రాగభావరాన నిత్యరుమ్, హేయనివర్తకనుక్కు సదృశరన్ఱిఱే. స్వరూపస్వభావాన్యథాభావయుక్తఙ్గళాన చేతనాచేతనఙ్గళైప్పఠ,

---

**జానాతి పురుషోత్తమమ్, న సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత".** (భ.గీ-15-19) (అర్జునా! ఎవడు పురుషోత్తముడనైన నన్ను, మోహం లేనివాడై ఈ విధంగా తెలిసికొంటున్నాడో, అతడు అన్నీ తెలిసినవాడే. అన్ని విధాలుగా అతడు నన్ను భజిస్తున్నాడు), **"పురుషః పుండరీకాక్షసంజ్ఞకః"** (పుండరీకాక్షుడనే పేరును కలవాడు పరమపురుషుడు), **"న సంపదాం సమాహారే విపదాం వినివర్తనే, సమర్థో దృశ్యతే కశ్చి త్తం వినా పురుషోత్తమమ్"** (పరమసంహిత) (సంపదలను చేర్చి ఇవ్వడంలో, ఆపదలను సమూలంగా పోగొట్టడంలో సమర్థుడై ఉండేవాడు ఆ పురుషోత్తముడు తప్ప వేఱెవ్వడూ కనబడడంలేదు), **"ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ, క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే, ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః, యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః, అతోఽస్మి వేదే లోకే చ ప్రథితః పురుషోత్తమః"** (భ.గీ.-15-16,17,18,) (క్షరులని, అక్షరులని లోకంలో పురుషులు ఇద్దరున్నారు. అన్ని భూతాలు క్షరశబ్దవాచ్యులు. కూటస్థులైన ముక్తాత్మలు అక్షరులని అనబడుతున్నారు. ఎవడు ముల్లోకాలలోను ప్రవేశించి, వానిని ధరించేవాడుగా, ఏ కొఱత లేనివాడుగా, నియమించేవాడుగా, పరమాత్మ అని చెప్పబడేవాడుగా వెలుగుతున్నాడో, ఆ పురుషోత్తముడు ముందు చెప్పబడ్డ పురుషునికంటే వేఱయినవాడు. నేను జ్ఞానంలో హెచ్చుతగ్గులున్న క్షరపురుషుని అతిక్రమించి ఉన్నందున, జ్ఞానంలో తారతమ్యాలున్న ముక్తపురుషులకంటె మేలయినవానిగా ఉన్నందున, శ్రుతులలో, స్మృతులలో పురుషోత్తముడననే ప్రసిద్ధిని పొందాను), **"ఉపచారాపదేశేన కృతా నహరహ ర్మయా, అపచారా నిమాన్ సర్వాన్ క్షమస్వ పురుషోత్తమ"** (జితంతే-1-20) (పురుషోత్తమా! ఉపచారాలు అనే నెపంతో చేసే అపచారాలను అన్నిటినీ క్షమించు) అని వేదాలలోను, వీటిని వివరించడం కోసం అవతరించిన ఇతిహాసపురాణాలలోను, **"పురుడోత్తమ నడి"** (పెరియాళ్వార్ తిరు-4-7-11) **"మాల్ పురుడోత్తమన్"**. (పెరియాళ్వార్ తిరు-4-7-2) **"వణ్పురుడోత్తమమే"** (పెరియతిరు-4-2-1) మొదలైన ఆళ్వార్ల శ్రీసూక్తులలోను వందలకొలది సందర్భాలలో మిగిలిన చేతనులందఱికంటె గొప్పవాడు

తదుభయాఽనన్య థాభావరూపవైలక్షణ్యత్తాలే, తదుభయవిలక్షణనెన్టుకొణ్డు పురుషోత్తమనెన్గిఱార్. “యస్మాత్ క్షరమతీతోహఽమక్షరాదపి చోత్తమః, అతోఽస్మి వేదే లోకే చ ప్రథితః పురుషోత్తమః” ఎన్నక్కడవతిఱే. “ద్వా విమా విత్యాది”.

ఆక ఇప్పడి సర్వోత్కృష్టనాక ప్రతిపాదిక్కప్పడుకిఱ పరమపురుషన్, సర్వాధికైయాక ప్రమాణప్రసిద్ధైయాయిరుక్కిఱ ఉనక్కు అనురూపనాన పతి.

అథవా, (పురుషోత్తమః తే కాన్తః) “షణు-దానే” ఎన్టు దానవాచియాయ్, “పురు-సనోతీతి-పురుషః” ఎన్టు అధికదాతావై చ్చొల్లి, అవర్కళిలుముత్తమనెన్టు

---

కనుక పురుషోత్తముడని చెప్పబడే **“పఱవై యేఱు పరమ్పురుడన్”** (పెరియాÇ్వార్ తిరు-5-4-2) (పక్షి అయిన గరుడుని అధిరోహించే పరమపురుషుడు) నీకు ప్రియమైన భర్త-అని తాత్పర్యం. ఈ తిరునామం (1) శుద్ధసత్త్వమయం అయిన నిత్యవిభూతి, (2) మిశ్రసత్త్వమయం అయిన లీలావిభూతి, (3) సత్త్వశూన్యం అయిన కాలం-అనే మూడు విధాలైన, జ్ఞానశూన్యం అయిన అచేతనంకంటే, (1) సంసారంలో కట్టుబడి ఉండే బద్ధచేతనులు, సంసారంనుండి విడివడిన ముక్తచేతనులు, (3) ఏనాడూ సంసారంలో కట్టుబడని నిత్యచేతనులు-అనే త్రివిధచేతనులకంటే ఇతడు అతిశయాన్ని కలవాడు అనే విషయం శబ్దంద్వారానే తెలుపుతున్నదికదా! **“పురుషః”** అని వారికంటే వైలక్షణ్యాన్ని కల ముక్తచేతనులను, తెలిపి, **“ఉత్తరః పురుషః”** అని వైలక్షణ్యాన్ని కల నిత్యచేతనులను పల్కి **“ఉత్తమః పురుషః”** అని వారికంటే అతిశయాన్నికల సర్వేశ్వరుడైన నారాయణుని తెలిపిందికదా! బద్ధచేతనుల నైచ్యానికి అంతటికీ కారణమై ఉండే అచిత్తు, దాని సంబంధంచేత నైచ్యాన్ని పొందిన బద్ధులు, ఆ సంబంధంవల్ల కల్గిన నైచ్యం తీరిన ముక్తులు, ఆ నైచ్యాన్ని ఏనాడూ లేని నిత్యులు-వీరెవ్వరూ మిగిలినవారికి ఉండే ఈ నైచ్యాలను పోగొట్టే వైలక్షణ్యాన్ని కల పురుషోత్తమునకు సాటి రారుకదా! జ్ఞానం శూన్యం అయిన అచేతనతత్త్వం తన స్వరూపంలోను, స్వభావంలోను మార్పు పొందదగినది. జ్ఞానాన్ని కల చేతనులు స్వరూపంలో ఏ మార్పు పొందకపోయినా, స్వభావం అయిన జ్ఞానంలో వికారాన్ని పొందుతారు. సర్వేశ్వరుడు మాత్రం స్వభావంలో కాని-స్వరూపంలో కాని ఈ రెండింటిలో మార్పును పొందనివాడు. కనుక, చేతనాచేతనాలు అనే ఈ రెండు తత్త్వాలకంటే విలక్షణుడై ఉండడంచేత అతనిని **“పురుషోత్తమః”** అని అంటున్నారు. గీతలో **“ద్వా విమౌ”** అని ప్రాంభమయే మూడు శ్లోకాలు ఇచట అనుసంధేయాలు.



మోక్షాదిసకలఫలప్రదన్. “ఐశ్వర్యమ్” ఇత్యాదిప్పడియే “పరమోదారై” ఎన్టు ప్రసిద్ధైయాన ఉనక్కు ప్పతి యెన్నవుమామ్.

(పురుషోత్తమ స్తే కాన్తః) “మఙ్గళానాం చ మఙ్గళమ్” ఎన్టు శొల్లప్పడుకిఱవన్, సకలమఙ్గళాస్పదత్వేన ప్రసిద్ధైయాన వునక్కు ప్పతి.

(పురుషోత్తమ స్తే కాన్తః) నారీణా ముత్తమైక్కు ప్పతియామ్బోతు పురుషోత్తమనాక వేణుమిఱే. విశ్వపతియానాలాయిÓÓ ఇవళుక్కు ప్పతియెన్నలావతు. అల్లాతారై, “నీచశశవత్” ఎన్టారు నరియాకవిఱే ఎణ్ణువతు.

---

అందువల్ల “ఈ రీతిలో పురుషులు అందఱిలోను గొప్పవాడుగా ప్రమాణాలలో చెప్పబడే పరమపురుషుడు స్త్రీలు అందఱిలో గొప్పదానవు అనే ప్రమాణ ప్రసిద్ధిని పొందిన నీకు అనురూపుడైన భర్త” అని చెప్పినట్లయింది. **“ద్వా విమౌ పురుషౌ లోకే-ఇత్యాదిభిః స్వేనైవ నిరుక్తేన పరత్వవ్యంజనేన సమాఖ్యావిశేషేణ లక్ష్మీకాంతం విశినష్టి”** అని దేశిక వ్యాఖ్య.

దీనికి వేఱే రీతిలోకూడా అర్థాన్ని చెప్పవచ్చు. **(పురుషోత్తమః తే కాంతః) - “షణు-దానే”** - అనే ధాతుపాఠానుసారం **“షణు”** ధాతువు దానాన్ని చెబుతుంది. **“పురుసనోతీతి పురుషః”** (అధికంగా ఇచ్చేవాడెవడో అతడు పురుషుడు) అనే వ్యుత్పత్తిచేత **“పురుష”** శబ్దం అధికంగా ఇచ్చేవానిని చెప్పి, వారిలో ఉత్తముడు అని మోక్షం నుండి అన్ని ఫలాలను ఇవ్వగలవాడు పురుషోత్తముడు-అనే అర్థం స్ఫురింపజేస్తుంది. ఇటువంటి పురుషోత్తముడు, **“ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా కస్మైచి దంజలిభరం వహతే వితీర్య, అస్మై న కించి దుచితం కృత మిత్యథాంబ! త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః”** (శ్రీగుణ-59) (తల్లీ! ఐశ్వర్యం, కైవల్యం, పరమపదం-అనే వీటిలో దేనిని అయినా ఒక అంజలి భారాన్ని మోసేవానికి ఇచ్చికూడా, “ఇతనికి తగిన దానిని దేనినీ నేను చేయలేకపోయానే” అని నీవు లజ్జపడుతున్నావు. ఇదేమి ఔదార్యమమ్మా! నీవే చెప్పు) అని భట్టర్ అనుగ్రహించినరీతిలో మోక్షాన్ని భగవానునిద్వారా అనుగ్రహింపచేసినా, మిగిలిన ఫలాలను తానే ఇచ్చి, **“పరమోదారా”** అని ప్రసిద్ధిని పొందిన నీకు తగిన భర్త- అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(పురుషోత్తమ స్తే కాంతః)- “పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్, దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా”** (భారతే-సహస్రనామాధ్యాయే) (ఏ భగవానుడు పవిత్రద్రవ్యాలలో అన్నిటిలో పరమపవిత్రుడై ఉన్నాడో, మంగళాలు

“పురుషోత్తమ స్తే” ఎన్గైయాలే, “రాఘవః–తుల్యశీలవయోవృత్తా మర్హతి” ఎన్ను మర్థముమ్, ఏతత్ప్రతికోట్యర్థముమ్ “పురుషోత్తమస్య త్వమ్” ఎన్ను, “అసితేక్షణా తమర్హతి” ఎన్ను మర్థముమ్ తోన్ఱుకిఱదు. “ఉనక్కేఱ్ఱుమ్” ఎన్ను ఇవళ్ సదృశైయా యిరుక్కుమాపోలే, అవనుమ్ “తిరుత్తక్క శెల్వ” నాయితే యిరుప్పతు.

(పురుషోత్తమ స్తే కాన్తః) “లక్ష్మీ శ్చ పత్న్యౌ” ఎన్ను పత్నీసమ్బన్ధత్తాలే అవనుక్కు ఉత్కర్షమ్ శొన్నాప్పోలే, “పురుషోత్తమ స్తే కాన్తః” ఎన్ను పతిసమ్బన్ధత్తాలే ఇవళుక్కు

అన్నిటిలో గొప్ప మంగళంగా ఉన్నాడో, దేవతలకు దైవంగా ఉన్నాడో, ఎవడు జీవరాసులకు అందఱికీ ఏ మార్పు, నాశం లేని తండ్రిగా ఉన్నాడో) అని మంగళవస్తువులకు అన్నిటికీ మంగళరూపుదని చెప్పబడేవాడు అన్ని మంగళాల స్వరూపిణిగా ప్రసిద్ధిని పొందిన నీకు అనురూపుడైన భర్త. **“సర్వమంగళాస్పదత్వేన ప్రమాణ ప్రసిద్ధాయాః”** అని దేశికవ్యాఖ్య.

**(పురుషోత్తమః తే కాంతః)– “సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః, సీతాభ్యనుగతా రామం శశినం రోహిణీ యథా”** (రామా–బాల–1–27,28) (స్త్రీలకు తగిన అన్ని శుభలక్షణాలను కలిగినది, స్త్రీలలో గొప్ప స్త్రీ అయిన సీత, చంద్రుని రోహిణివలె, రాముని అనుసరించి వనానికి పోయింది) అనే రీతిలో స్త్రీలలో ఉత్తమ స్త్రీకి భర్త అయినపుడు అతడు పురుషులలో గొప్పవాడైన పురుషోత్తముడుగానే ఉండాలి కదా! **“పతిం విశ్వస్య”** (తైత్తి–నారా) అనే రీతిలో లోకాలకు అన్నిటికీ పతిగా ఉండే వాడే ఈమెకు పతిగా ఉండగలడు. **“స హి దేవరసంయుక్తో మమ భర్తా మహాద్యుతిః, నిర్భయో వీర్య మాశ్రిత్య శూన్యే వసతి దండకే”** (మఱది అయిన లక్ష్మణునితో కూడినవాడై, గొప్ప తేజస్సును కలవాడైన నా భర్త, తన వీర్యాన్ని ఆశ్రయించి, నిర్భయుడై శూన్యం అయిన దండకారణ్యంలో నివసిస్తున్నాడు) అనే రీతిలో ఈమెకూడా లోకానికి అంతటికీ భర్త అయిన వానినే తనకు భర్తగా వరించింది. **“యథా దృప్త శ్చ మాతంగః శశ శ్చ సహితా వనే, తథా ద్విరదవత్ రామః త్వం నీచశశవత్ స్మృతః”** (రామా–సుందర–22–16) (ఒక అరణ్యంలో మదించిన ఏనుగు, నక్క కలసి ఉండడం ఎటువంటిదో, ఆ విధంగానే ఏనుగువంటివాడు శ్రీరాముడు, నీవు ఒక నక్కతో సాటి) అనే రీతిలో మిగిలినవారిని ఒక నక్కగానే లెక్కిస్తున్నది.

**(పురుషోత్తమః తే కాంతః)** అని అనడంవల్ల పురుషోత్తముడు నీకు ప్రియమైన భర్త – అని చెప్పబడినట్లయింది. దీనికి ప్రతికోటిగా–**“పురుషోత్తమస్య త్వం కాంతా”**



ఉత్కర్షమ్ శొల్లుకిఱార్. “శ్రియఃపతిః” ఎన్ను అవనుక్కు ఉత్కర్షమ్. * “విష్ణుపత్నీ” ఎన్గిఱతే ఇవళుక్కు ఉత్కర్షమ్. “కాన్తః” ఎన్ను అవనుక్కు ఉత్కర్షమ్. “అరవిన్దలోచనమనఃకాన్తై” ఎన్గిఱతే ఇవళుక్కు ఉత్కర్షమ్. “శ్రీవల్లభ” ఎన్ను అవనుక్కు ఉత్కర్షమ్.* “వరదవల్లభా” ఎన్గిఱతే ఇవళుక్కు ఉత్కర్షమ్.

(తే కాన్తః పురుషోత్తమః) ఉనక్కు క్కాన్తనానపిన్బితే, అవన్ పురుషోత్తమ నాయిఱ్ఱు. “క శ్రీ శ్శ్రియః” ఎన్గపిన్బితే. “పురుషోత్తమః కః” ఎన్గతు. “జగన్నాథోఽపి నారాయణో ధన్యం మన్యత ఈక్షణాత్” ఎన్ను వేదాన్తజ్ఞళ్ పరతత్వ మెన్ను

(పురుషోత్తమునకు నీవు ప్రియపత్నివి) అనే అర్థంకూడా తెలుపబడింది. **“తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షితామ్, రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా”** (రామా. సుందర–16–5) (సరి సమానం అయిన గుణాలు, వయస్సు, నడవడికలను కల్గినది, తగిన కులం, సౌందర్యాలతో కూడినది అయిన వైదేహికి శ్రీరాముడే తగివాడు. అతనికికూడా నల్లని నేత్రాలను కల ఈమె తగినది) అని శ్రీరామాయణంలో చెప్పబడింది కదా! **“ఉనక్కేఱ్ఱుమ్ కోలమలర్ప్పావైక్కు”** (తిరువాయ్–10–10–6) (నీకు తగిన అందమైన పుష్పవాసిని అయిన లక్ష్మీదేవికి) అనే రీతిలో నీవు అతనికి తగిన పత్నివై ఉన్నట్లే, **“తిరుత్తక్క శెల్వముమ్”** (తిరుప్పావై–25) (లక్ష్మికి తగిన సంపదను) అనే రీతిలో అతనికి నీకు తగిన సంపదను కల్గినవాడుగా కదా ఉంటాడు.)

**(పురుషోత్తమః తే కాంతః)– “హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ”** (పురుష. సూ–2–5) (పరమపురుషా! నీకు శ్రీదేవి, భూదేవి పత్నులు) అనే రీతిలో పత్ని అయిన ఈమె సంబంధంతో పురుషసూక్తం అతని గొప్పతనాన్ని చెప్పినట్లు, “పురుషోత్తముడు నీకు భర్త” అని అతని సంబంధంచేత ఈమెకు గొప్పతనాన్ని యామునులు చెబుతున్నారు. **“శ్రియః పతిః”** (గీతాభాష్యారంభే) అనేటట్లు లక్ష్మీనాథుడు అనేది అతనికి అతిశయం. **“విష్ణుపత్నీ”** అనికదా ఈమెకు ఉత్కర్షం. **“కాంతః”** అని అతనికి గొప్పతనం. **“అరవిందలోచనమనఃకాంతా”** అని ఈమెకు ఉత్కర్ష. **“శ్రీవల్లభ”** అని అతనికి ఉత్కర్ష. **“ఆకారత్రయసంపన్నా మరవిందనివాసినీమ్, అశేషజగదీశిత్రీం వందే వరదవల్లభామ్”** (శేషిత్వ–పురుషకారత్వ–ప్రాప్యత్వాలనే మూడు ఆకారాలను కల్గినది, తామరపూవులలో నివసించేది, లోకాలను అన్నిటికి ఈశ్వరి, వరదునకు ప్రియమైనది అయిన దేవిని నమస్కరిస్తున్నాను) అని వరదునకు ప్రియమైనది అన్నది ఈమెకు గల అతిశయం.

**(తే కాంతః పురుషోత్తమః)** –నీకు ప్రియమైన భర్త అయిన పిమ్మటనే అతడు పురుషోత్తముడనే పేరును పొందాడు–అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఆళవన్దార్‌కూడా

* ఈ భాగం ద్రావిడప్రతిలో లేదు.

నిర్ణయిత్తతుమ్–ఉన్నుడైయ పాదచిన్నఙ్గళై అవన్ మార్పిలే కణ్డపిన్బితే. సహధర్మచారిణి యాన వివళై ప్పాణిగ్రహణమ్ పణ్ణినపిన్బాయిఱ్ఱు అవన్ శ్రీమానుమాయ్, సర్వాధికనుమాయ్, అనురూపాక్షనుమాయ్, ముముక్షూపాస్యను– మాయ్త్తు. ఆకైయిఱే, "తిరునిన్ఱపక్కమ్ తిఱవితు" ఎన్ఱు సత్తుక్కళ్ పరిగ్రహిత్తతు. అల్లాతార్ "తిరువిల్లాత త్తేవరా" కైయాలే, నిఃశ్రీకరాయ్, పురుషాధమరాయ్, విరూపాక్షరాయ్, అనుపాస్యరు మాయిఱ్ఱు ఆకైయిఱే, "శ్రీనివాసశబ్దత్తాలే పాశుపతాదివ్యుదాసః" ఎన్ఱరుళిచ్చెయ్తతుమ్. "కాణిలు మురుప్పొలార్", "తిరువిల్లా త్తేవరై త్తేఱేల్మిన్ తేవు" ఎన్ఱు సత్తుక్కళ్ పరిత్యజిత్తతుమ్.

---

స్తోత్రరత్నంలో **"కః శ్రీః శ్రియః"** (12) (లక్ష్మికికూడా లక్ష్మి అయిన వాడెవడు?) అనే ప్రశ్నను లేవనెత్తి, తరువాతనేకదా పురుషోత్తముడెవడు? అనే ప్రశ్నను లేవనెత్తారు. **"ఐశ్వర్యం మహ దేవ వాల్ప మథవా దృశ్యేత పుంసాం హి యత్ తల్లక్ష్మా స్సముదీక్షణా త్తవ యత స్సార్వత్రికం వర్తతే, తేనైతేన న విస్మయేమహి జగన్నాథోఽపి నారాయణః ధన్యం మన్యత ఈక్షణా త్తవ యత స్స్వాత్మాన మాత్మేశ్వరః"** (కొంచెం అయినా, ఎక్కువ అయినా ఏ సంపద అనేది లోకంలోనివారి దగ్గర కన్పిస్తున్నదో, అది శ్రీదేవి అయిన నీ కటాక్షంచేతనే అంతటా ప్రకాశిస్తున్నది. ఇందులో మేము ఏమీ ఆశ్చర్యపడడం లేదు. ఎందుకు! అని అంటే, జగన్నాథుడై, తనకు తానే ఈశ్వరుడైన నారాయణుడుకూడా నీ కటాక్షంవల్ల తనను భాగ్యశాలిగా భావిస్తున్నాడుకదా) అని అంటూ కూరేశులు కూడా జగన్నాథుడై, తనకు తానే ఈశ్వరుడైన నారాయణుడుకూడా పిరాట్టియొక్క కటాక్షంచేత తనను భాగ్యశాలిగా తలచినట్లు అనుగ్రహించారుకదా! శ్రీ భట్టర్సైతం శ్రీగుణరత్నకోశంలో **"వేదాంతా స్తత్త్వచింతా మురభిదురసి యత్పాదచిహ్నై స్తరంతి"** (శ్రీగుణ–4) (పిరాట్టి శ్రీపాదముద్రలను భగవానుని వక్షఃస్థలంలో చూచిన తరువాతకదా అతనిని పరతత్త్వంగా వేదాంతాలు నిర్ణయించాయి) అని అనుగ్రహించారు. అతని అన్ని లీలలలో సహయభూత అయిన ఈమెను చేపట్టిన తర్వాతనేకదా అతడు దేవుడు, సర్వాధికుడు, పుండరీకాక్షుడు, ముముక్షూపాస్యుడు అయినాడు. అందువల్లనే **"తిరునిన్ఱపక్కమ్ తిఱవిదు"** (నాన్ముకన్–తిరు–54) (లక్ష్మీదేవి నిత్యవాసం చేసే పార్శ్వాన్ని కల స్వామియొక్క అప్రకంప్యం అయిన పరత్వం ఇది) అని సత్పురుషులైన ఆఴ్వార్లు అంగీకరించారు. మిగిలిన దేవతలు లక్ష్మిని లేని దేవతలు. కనుక అతిశయహీనులై, పురుషాధములై, సౌందర్యం లేని నేత్రాలను కలవారై, ఉపాసింపతగనివారై ఉన్నారు.



(తే కాన్తః పురుషోత్తమః) "తిరుమకళార్ తనిక్కేళ్వన్ పెరుమైయుడైయ పిరానార్" ఎన్ఱు, ఇవళుక్కు క్కేళ్వనాన వాశియిఱే పెరుమైయుడైయ పిరానారాయిఱ్ఱు "శ్రియా విష్ణు రతీవ శుశుభే" ఎన్ఱు–ఇవళ్తనక్కెన్న ఇట్టుప్పిఱన్ద తత్త్వమాకైయాలేయిఱే, అప్రమేయ తేజస్సైయుడైయవనాయ్ అతీవ విళఙ్గిఱ్ఱు. "శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే", "తిరుమఙ్గై తన్నోడుమ్ తికఴ్కిన్ఱ" ఎన్నక్కడవతిఱే.

---

అందువల్లనే–**"శ్రీనివాసశబ్దేన పాశుపతాదివ్యుదాసః"** (శ్రీభాష్యమంగళశ్లోక శ్రుతప్రకాశిక) **("బ్రహ్మణి శ్రీనివాసే")** అనే సందర్భంలో ఉండే శ్రీనివాసశబ్దంచేత పాశుపతులు మొదలైనవారు నిరసింపబడ్డారు), అని పశుపతిని పరతత్త్వంగా చెప్పే పాశుపతులు మొదలైనవారు నిరసింపబడినారని శ్రుతప్రకాశికాచార్యులవారు అనుగ్రహించారు. **"కాణిలుమ్ ఉరుప్పొలార్ శెవిక్కిలాద కీర్త్తియార్ పేణిలుమ్ వరన్తర మిడుక్కిలాద దేవరై"** (తిరుచ్చన్ద–69) (చూచినా వికారరూపాన్ని కలవారు, శ్రావ్యం కాని కీర్తిని కలవారు, ఆశ్రయించినా వరం ఇవ్వగల శక్తిని లేనివారు) **"తిరువిల్లా ద్దేవరైత్తేఱేల్మిన్ తేవు"** (నాన్ముకన్.తిరు–53) (లక్ష్మీసంబంధం లేని దేవతలను శరణు పొందకండి) అని మహాత్ములైన ఆఴ్వార్లు లక్ష్మీవిహీనులైన దేవతల చేయివిడచారు.

**(తే కాంతః పురుషోత్తమః)–"తిరుమకళార్ తనిక్కేళ్వన్పెరుమైయుడైయ పిరానార్"** (తిరువాయ్–1–6–9) (లక్ష్మీదేవితో క్రీడించే అతిశయాన్ని కల స్వామి) అని ఈమెకు భర్త కావడం చేతనే కదా భగవానుడు అతిశయాన్ని కల స్వామి అయ్యాడు. **"తయా స రాజర్షిసుతాభిరామయా సమేయివా నుత్తమరాజకన్యయా, అతీవ రామః శుశుభేఽతికామయా విభుః శ్రియా విష్ణు రివామరేశ్వరః"** (రామా. బాల–77–30) (అందమైన ఉత్తమరాజపుత్రిక అయిన ఆ సీతాదేవితో కూడిన, రాజర్షి పుత్రుడైన శ్రీరాముడు చాలా ఎక్కువగా కోరతగిన, శ్రీదేవితో కూడిన, అమరులకు అధిపతి అయిన విష్ణువువలె చాలా బాగా ప్రకాశించాడు) అని అంటూ ఈ సీతాదేవి ఇతనికే తగిన సొత్తు అయినందువల్లనే అంతులేని గొప్పతనాన్ని కలవాడై, చాలా ఎక్కువ ప్రకాశిస్తున్నాడు. **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"** (యజు–కాఠక–3–3) (దేవుడనబడే భగవానుడు శ్రద్ధానామంచేత చెప్పబడే పిరాట్టిచేతనే దేవుడై ఉండే స్వభావాన్ని పొందుతున్నాడు), **"తికఴ్కిన్ఱ తిరుమార్బిల్ తిరుమఙ్గై తన్నోడుమ్ తికఴ్కిన్ఱ తిరుమాలార్"** (తిరువాయ్–10–6–9) (ప్రకాశించే వక్షస్సులో లక్ష్మీదేవితో వెలిగే శ్రియఃపతి) అని చెప్పబడుతున్నదికదా.

(పురుషోత్తమః) ''పురుషాణా ముత్తమః'' ఎన్ఱు షష్ఠీవిభక్తియాతల్, "పురుషేషూత్తమః" ఎన్ఱు సప్తమావిభక్తియాతల్. "పురుషోత్తమః" ఎన్ఱు సర్వేశ్వరాఽపేక్షయా బ్రహ్మాదికళుడైయ అధమత్వమ్ ప్రతిపాదిక్కైయాలే, తత్పత్నికళిఱ్కాట్టిల్ విష్ణుపత్నియాన ఇవళుడైయ వ్యావృత్తియుమ్ తోఱ్ఱుకిఱతు. "మలైమజ్గై" యుమ్ ''నామజ్గై'' యుమ్ ''పూమజ్గైక్కు'' ప్పోలియాకమాట్టార్కళితే.''నాపతి'' యుమ్, "ఉమాపతి" యుమ్ "మాపతిక్కు" ఉపమానమానవన్ఱితే ఇవళుక్కు అవర్కళొప్పావతు.

ఆక, ఇత్తాల్, "తత్పత్నీత్వత్తాలుమ్, నారకోటిఘటితైయాకైయాలుమ్, అవన్నై ఆశ్రయిత్తు తచ్ఛేషభూతైయాయ్ సత్తై పెఱ్ఱిరుక్కుమ్" ఎన్గిఱ కర్తర్యర్థమ్ శొల్లప్పట్టతు. "మలర్మకళ్ పిడిక్కుమ్ మెల్లడి", "తిరుమకళుమ్ శెమ్బొఱ్ఱిరువడియినైౖ వరుడ" ఎన్గిఱపడియే. అకిఞ్చిత్కరనుక్కు శేషత్వమిల్లామైయాలే. ఇవళ్తాన్ కిఞ్చిత్కరిత్తు

---

**(పురుషోత్తమః)– "పురుషేభ్యః ఉత్తమః"** (మిగిలిన పురుషులకంటే ఉత్తముడు) అని పురుషశబ్దాన్ని పంచమీవిభక్తిలో ప్రయోగింపబడినట్లుగా గ్రహించి, గీతలో, **"ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః"** (15-18) అని పురుషోత్తమశబ్దం నిర్వహింపబడింది. ఆ రీతిలో కాకుండా, **"పురుషాణామ్ ఉత్తమః"** (పురుషులకు ఉత్తముడు) అని షష్ఠీవిభక్తిలో గ్రహించిగాని, **"పురుషేషు ఉత్తమః"** (పురుషులలో ఉత్తముడు) అని సప్తమీవిభక్తిలో గ్రహించిగాని అర్థాన్ని చెప్పవచ్చు. పురుషోత్తముడనే శబ్దంచేత సర్వేశ్వరుడైన ఇతనికంటే బ్రహ్మరుద్రేంద్రాదులు అధములు అని చెప్పడంచేత వారి పత్నులైన సరస్వతి, పార్వతి మొదలైనవారికంటె ఇతని పత్ని అయిన లక్ష్మీదేవి యొక్క గొప్పతనం తెలుపబడుతున్నది. **"మలైమజ్గై"** అనబడే పార్వతి, **"నామజ్గై"** అనబడే సరస్వతి **"పూమజ్గై"** అనబడే లక్ష్మికి సమానం కారుకదా! వాణీపతి, ఉమాపతి లక్ష్మిపతికి సమానులైనపుడుకదా ఈమెకు వారు సాటి అవుతారు. **"అనేన భగవదపేక్షయా హిరణ్యగర్భాదీనా మపి అధమత్వ వ్యంజనాత్ తత్పత్నీభ్యః పురుషోత్తమపత్న్యాః ఉత్తమత్వం సూచితమ్"** అని దేశికవ్యాఖ్య.

**"శ్రీ"** శబ్దం యొక్క అర్థాన్ని వివరించే ఈ శ్లోకంలో ఇంతవరకు పురుషోత్తమునకు పత్ని అయినందువల్ల, నారాయణశబ్దంలో అతనికి శరీరంగా చెప్పబడే నారశబ్దవాచ్యాలైన నిత్యవస్తుసమూహాల్లో ఒకటిగా ఉన్నందువల్ల, వానిని ఆశ్రయించి, అతనికి శేషభూతురాలై, సత్తను పొందుతున్నది" అనే అర్థాన్ని తెలిపే **"శ్రయతే ఇతి శ్రీః"** అనే కర్తరివ్యుత్పత్తియొక్క అర్థం చూపబడింది. **"మలర్మకళ్ పిడిక్కుమ్ మెల్లడి"** (తిరువాయ్-9-2-10) (లక్ష్మీదేవి సంవాహనం చేసే మృదుపాదాలు), **"శెజ్గమల**



స్వరూపలాభమా యిరుప్పాళొరుత్తియితే. అవతారదశైయిలుమ్, "తిరుమజ్గై పోత్తన్దాళ్" ఎన్ఱు కిఞ్చిత్కరిత్తాళితే.

ఇనిమేల్, "సర్వలోకమాతావాకైయాలుమ్, సర్వస్వామినియాకైయాలుమ్, సకలచేతనర్క్కు మాశ్రయిక్కప్పడానిన్ఱాళ్"– ఎన్గిఱ కర్మణివ్యుత్పత్తియిల్ సిద్ధమాన ఉభయ విభూతిశేషిత్వత్తై అరుళిచ్చెయ్కిఱార్ (ఫణిపతిః) ఇత్యాదియాల్. "నిత్యైవైషా జగన్మాతా విష్ణో శ్రీ రనపాయినీ" ఎన్ఱుమ్, "శ్రీయతే చాఽఖిలై ర్నిత్యం శ్రయతే చ పరం పదమ్" ఎన్ఱుమిత్యాది ప్రమాణసిద్ధజ్గళాయితే ఇవ్వుత్పత్తిద్వయము మిరుప్పతు.

---

**త్తిరుమకళుమ్ శెమ్బొన్ తిరువడియినైౖ వరుడ"** (పెరియతిరు-7-8-1) (అందమైన కమలంలో నివసించే లక్ష్మీదేవికూడా బంగారంవలె ఆశపడతగిన శ్రీపాదద్వయిని సంవాహనం చేయగా) అనే రీతిలో కైంకర్యం చేయకపోతే శేషత్వం సిద్ధించదు కనుక, ఈ పిరాట్టికూడా భగవానునకు కైంకర్యాన్ని చేసి, తన స్వరూపాన్ని పొందేదిగా ఉంటుంది కదా! భగవానుడు శ్రీకృష్ణుడై అవతరించినపుడుకూడా **"కానార్ నఱున్తుழாయ్ కైశెయ్ద కణ్ణియుమ్ వానార్ శెழுఞ్జోలై కఱ్పకత్తిన్ వాశికైయుమ్ తేనార్ మలర్మేల్ తిరుమజ్గై పోత్తన్దాళ్"** (పెరియాழ்వార్ తిరు-1-3-7) (తేనె నిండిన ఎఱ్ఱని తామర పూవులై నిత్యవాసం చేసే లక్ష్మీదేవి అడవిలోని మంచి తులసిలో కూర్చిన మాలను, ఆకాశం అంతా కప్పివేసేటట్లున్న, అందమైన కల్పకకుసుమాలతో చేసిన సిగపువ్వును పంపింది) అని బాలకృష్ణునకు పలు గొప్ప వస్తువులను పంపి పిరాట్టి ఈ కైంకర్యాన్ని చేసిందికదా!

ఇకపై, **"శ్రీయతే ఇతి "శ్రీః"** (మిగిలిన అందరిచేత ఆశ్రయింపబడుతున్నది కనుక శ్రీః అనబడుతున్నది) అనే కర్మణివ్యుత్పత్తిచేత ఫలించే, "లోకానికి అంతటికీ తల్లి అయినందువల్ల, అందరికీ ఈశ్వరి అయినందువల్ల చేతనులందరిచేత ఆశ్రయింపబడుతున్నది" అనే అర్థంచేత చెప్పబడే ఉభయవిభూతిశేషిత్వాన్ని (ఉభయ విభూతులు ఈమెకు శేషభూతాలుగా ఉండడాన్ని) మూడవ పాదం చివరివరకు అనుగ్రహిస్తున్నారు. **"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ, యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"** (విష్ణుపు-1-8-17) అనే ప్రమాణంలోను, **"శృణాతి నిఖిలాన్ దోషాన్ శృణాతి చ గుణై ర్జగత్, శ్రీయతే చాఖిలై ర్నిత్యం శ్రీయతే చ పరం పదమ్", "శ్రయంతీం శ్రీయమాణాం చ శృణ్వంతీం శ్రుణతీ మపి"** (పాంచరాత్రమ్-అహిర్బుధ్న్యసంహిత-21-8) (ఆశ్రితుల దోషాలను పోగొడుతుంది. వారి అద్వేషం, ఆభిముఖ్యం మొదలైన గుణాలను వృద్ధిచేస్తుంది. దాసులచేత నిత్యం ఆశ్రయింపబడు

ఆకిల్, ఉపజీవ్యప్రమాణానుసారేణ వ్యుత్పత్తిద్వయత్తై అరుళిచ్చెయ్యాతే, వ్యుత్క్రమమాక వరుళిచ్చెయ్వానెన్? ఎన్నిల్, ఘటకైయాన వివళుక్కు చేతనేశ్వరర్పక్కల్ సమ్బన్ధమ్ అవిశిష్టమాయిరున్దతేయాకిలుమ్, పితృత్వప్రయుక్తమాన "హితస్రోతోవృత్తి" యాలే కలఙ్గి సాపరాధరాన విచ్చేతనరై నిగ్రహిక్క త్తేడుమన్డు, "కి మేత న్నిర్దోష కః"

---

తున్నది. పరమప్రాప్యుడైన భగవానుని ఆశ్రయిస్తున్నది. దాసుల ప్రార్ధనను ఆలకిస్తున్నది. వానిని భగవానునకు వినిపిస్తున్నది. అందువల్ల పిరాట్టి **"శ్రీః"** అని అనబడుతున్నది) అనే పాంతరాత్రవచనంలోను ఈ రెండు వ్యుత్పత్తులు చూపబడ్డాయికదా.)

ఈ విధంగా ఈ రెండు వ్యుత్పత్తులను చూపేటపుడు, పాంచరాత్రశాస్త్రంలో చూపబడ్డ రీతిలో మొదట కర్మణివ్యుత్పత్తిని చూపి, తరువాత కర్తరివ్యుత్పత్తిని చూపకుండా, "నీకు కాంతుడు పురుషోత్తముడు" అని మొదట కర్తరివ్యుత్పత్తిని, దానికి తరువాత కర్మణివ్యుత్పత్తిని ఎందుకు చూపుతున్నారు? అని అంటే, చేతనులను భగవానునితో కలిపే ఈమెకు ఈ ఇద్దఱి విషయంలో సంబంధం సమానం అయినా, **"పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః, కి మేత న్నిర్దోషః క ఇహ జగతీతి త్వముచితై రుపాయై ర్విస్మార్య స్వజనయసి మాతా తదసి న :"** (శ్రీగుణ-47) (తల్లీ! నీ ప్రియుడు తండ్రివలె హితాలను కల్గించడంకోసం పాపాలను నిండుగా చేసిన జీవుల విషయంలో కొన్ని సందర్భాలలో కోపాన్ని పొందుతున్నాడు. అపుడు నీవు "ఇదేమి? ఈ లోకంలో తప్పును చేయనివారెవరైనా ఉన్నారా! అని పల్కి ఉచితమైన ఉపాయాలతో మా పాపాలను మఱుగుపడేటట్లు చేసి, స్వామి శ్రీపాదాలలో చేర్పిస్తావు. అందువల్ల నీవు మాకు తల్లివి అవుతున్నావు) అనే రీతిలో భగవానుడు చేతనులకు హితాన్ని కల్గించడంకోసం మనస్సులో కోపాన్ని తెచ్చుకొని, పాపాలను చేసిన చేతనులను దండించాలని ప్రయత్నించినపుడు-"ఇదేమి? ఈ లోకంలో పాపం చేయనివాడెవ్వడూ లేడే?" అని అంటూ, తన అందాన్ని చూపి అతనిని వశీకరించుకొని, అనుగ్రహించేటట్లుగా సంస్కరించేటపుడు ఈమెకు భగవానునితో ఉండే సంబంధం చాలా ఆవశ్యకం కనుక, అతనికి ప్రియపత్నిగా ఉన్నందువల్లనే అందఱూ ఈమెను ఆశ్రయించడంచేత, "పురుషోత్తముడు నీకు ప్రియమైన భర్త" అని కర్తరి వ్యుత్పత్త్యర్థాన్ని ప్రధానంగా మొదట అనుగ్రహించి, దానికి తరువాత అతనికి పత్నిగా ఉండడంచేత ఈమెకు కలిగే కర్మణివ్యుత్పత్త్యర్థాన్ని అనుగ్రహిస్తున్నారు. **"మచ్ఛేషభూతా సర్వేషా మీశ్వరీ మమ వల్లభా"** (పాంచరాత్రమ్) (నాకు శేషభూతగా



ఎన్డు ఉచితోపాయఙ్గళాలే అవనై వశీకరిత్తు అనుగ్రహైకపరనామ్బడి తిరుత్తుమ్బోతు, తత్సమ్బన్ధమ్ అవశ్యాపేక్షితమాకైయాలుమ్, ఇనిత్తాన్ పిరాట్టియై ఆశ్రయిక్కిఱతు-తత్సమ్బన్ధవిశిష్టై.- యెన్హాకైయాలుమ్, "పురుషోత్తమ స్తే కాన్తః" ఎన్డు ప్రాధాన్యేన కర్తర్యర్థత్తై యరుళిచ్చెయ్తు, అనన్తరమ్ తత్సమ్బన్ధస్థాప్యమాన కర్మణ్యర్థత్తై యరుళిచ్చెయ్కిఱార్. "మచ్ఛేషభూతా సర్వేషా మీశ్వరీ" ఎన్డు ఇవ్వర్థక్రమత్తై స్వయమేవ అరుళిచ్చెయ్తారిఱే. "దేవదేవ దివ్యమహిషీ మఖిల జగన్మాతరమ్" ఎన్డు భాష్యకారరుమ్ ఇవరుడైయ దివ్యసూక్తియై ఉట్కొణ్డు భగవత్సమాశ్రయణత్తై ప్రమాణమాక అరుళిచ్చెయ్దారిఱే. ఇనిత్తాన్, భగవద్విషయత్తై ప్పఱ్ఱియకై "భవతీసమ్బన్ధదృష్టి" యాలే యిఱే. పిరాట్టియై ప్పఱ్ఱియమతు-భగవత్సమ్బన్ధవిశిష్టైయెన్డిఱే. ఇఙ్గనన్డిక్కే,

---

ఉండేది, నాకు ప్రియమై ఉండేది శ్రీదేవి) అని పాంచరాత్రశాస్త్రంలోకూడా ఇదే క్రమంలో భగవానుడు స్వయంగా ఈ రెండు అర్థాలను అనుగ్రహించారు కదా! **"భగవన్నారాయణాభి మతానురూపస్వరూపరూప గుణవిభవైశ్వర్య శీలాద్యనవధికాసంఖ్యేయకల్యాణగుణగణాం పద్మవనాలయాం, భగవతీమ్ శ్రియం దేవీం నిత్యానపాయినీం నిరవద్యాం దేవదేవదివ్య మహిషీ మఖిలజగన్మాతర మస్మన్మాతర మశరణ్యశరణ్యా మనన్యశరణ శ్శరణ మహం ప్రపద్యే"** (శరణాగతి గద్యమ్) (భగవానుడైన నారాయణునకు ఇష్టంగాను, అనురూపంగాను ఉండే స్వరూపం, రూపం, రూపగుణాలు, విభూతి, ఐశ్వర్యం, శీలం-మొదలైన, మహిమలో అంతులేని, సంఖ్యలో లెక్కలేనన్ని కల్యాణ గుణాలు- అనే వీనిని కల్గినది, పద్మవనాన్ని నివాసస్థానంగా కల్గినది, పూజించతగినది, ఏనాడూ భగవానుని విడిచి ఉండనిది, ఏ దోషాలు లేనిది, దేవదేవుడైన భగవానుని దివ్యమహిషి, అన్ని లోకాలకు తల్లియై ఉన్నది, విశేషంగా నాకు తల్లియై ఉన్నది, గతిలేని వారికి గొప్ప గతిగా ఉన్నది అయిన శ్రీదేవిని వేఱొక గతి లేని దాసుడైన నేను శరణు పొందుతున్నాను) అని భాష్యకారులుకూడా పరమాచార్యులైన ఆళవన్దార్ల ఈ దివ్యసూక్తిని అనుసరించి **"దేవదేవదివ్యమహిషీమ్"** అని భగవానుని ఈమె ఆశ్రయించి ఉండడాన్ని ప్రధానంగా అనుగ్రహించారుకదా! శ్రీభట్టర్ శ్రీగుణరత్నకోశంలోని 51వ శ్లోకంలో "**భవతీసంబంధదృష్ట్యా హరిమ్ పశ్యేమ**" అని చెప్పిన రీతిలో, మనం భగవానుని ఆశ్రయించడంకూడా భగవానునకు ప్రియమైన పత్ని అనే కారణంతోనే. ఈ విధంగా కాకుండా, ఇద్దఱినీ ప్రత్యేకంగా ఆశ్రయిస్తే ఈశ్వరుడైన భగవానుని విడచి పిరాట్టిని ఆశ్రయించిన రావణుడు శిరస్సును కోల్పోయినట్లు, అంగభూతురాలైన పిరాట్టిని

తత్సమ్బన్ధరహితమాక ప్పిరిరియమన్లు తలైయుమ్, శెవియిమ్ తరియుణ్డు వైరూప్య వినాశజ్గళే ఫలిత్తువిడుమితే. ఆకైయాల్, ఇవ్వాకారత్తైప్పిరి ఇజ్గనే అరుళిచ్చెయ్య క్కూటైయిల్లై.

ఆకిల్, “మచ్ఛేషభూతా” ఎన్లరుళిచ్చెయ్తపడియే, పిరాట్టియుమ్ భగవచ్ఛేష భూతైయానాల్, శేషభూతర్కెల్లారుమ్ సర్వశేషిక్కు శేషమాయిరుక్కు మెన్లైక్కు ప్రమాణ మెన్నెన్నిల్, “సర్వే హ్యాత్మానః పరమాత్మనః–దాసభూతాః” ఎన్లు ఉభయవిభూతియుమ్

---

విరోధించి, అంగి అయిన భగవానుని ఆశ్రయించిన శూర్పణఖ అంగాన్ని కోల్పోయినట్లును తెలిసికొనవలసి ఉన్నది కదా! అందువల్ల, కర్తరి వ్యుత్పత్త్యర్థంయొక్క ప్రాధాన్యాన్నిబట్టి మొదట దానిని అనుగ్రహించడంలో కొఱతలేదు కదా!

ఆ విధంగా అయితే, పూర్వం ఉట్టంకించిన, **‘‘మచ్ఛేషభూతా’’, “భగవన్నారాయణాభిమతానురూప”** (శరణాగతిగద్య) ఇత్యాది ప్రమాణానుసారం లక్ష్మికూడా భగవానునకు దాసభూతురాలైతే, దాసభూతులు అందఱూ సర్వస్వామి అయిన భగవానునకు దాసులై ఉండాలే తప్ప, నిత్యవిభూతి–లీలావిభూతి అనే రెండు విభూతులనుకూడా పిరాట్టికల్గి ఉంటుంది అనే దానికి ఏది ప్రమాణం? అని అంటే. **“దాసభూతాః స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః”** (హారీతస్మృతి, ఈశ్వరసంహిత–శివవాక్యం) (పరమాత్మకు అన్ని ఆత్మలు సహజంగానే దాసులై ఉన్నారు) అని రెండు విభూతులు భగవానునకు శేషంగా ఉండేటపుడు, అతనికి పత్ని అయిన ఈమెకుకూడా అందఱు చేతనులు దాసభూతులు అని నిరూపించడానికి ఏ ప్రమాణాన్ని అన్వేషించ వలసిన పనిలేదు కదా! భర్తకు సంబంధించిన ఇల్లు, పొలం, సంతానం–మొదలైనవి అతని భార్యకుకూడా సొత్తుగా ఉంటాయి–అనే విషయం లోకంలో ప్రసిద్ధంకదా! అతడుకూడా ఈ రెండు విభూతులను, పిరాట్టికి అంతఃపురంవలె సొత్తుగా చేస్తాడు కదా! **“సర్వేషా మాత్మనాం పరమాత్మదాసత్వసిద్ధేః,“జాయాపత్యో ర్న విభాగః” ఇతి న్యాయాత్ పతిదాసత్వ మవర్జనీయమ్”** ఇత్యాదిగా ఈ విషయం దేశికవ్యాఖ్యలో వివరింపబడింది. **“ఈశానా దేవీ భువనస్యాధిపత్నీ”** (యజు.కాఠక–3–3) (లోకానికి ఈశ్వరిగాను, సర్వాధికునకు పత్నిగాను ఉంటుంది) అని, **“ఈశ్వరీం సర్వభూతానాం త్వా మిహోపహ్వయే శ్రియమ్”** (శ్రీసూక్తమ్–9) (అన్ని భూతాలకు ఈశ్వరియై, శ్రీదేవి అయిన నిన్ను ఇక్కడకు రమ్మని ఆహ్వానిస్తున్నాను) అని, **“అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకేశ్వరో హరిః, ఉద్ధృతా విష్ణునా లక్ష్మీరుకారేణోచ్యతే సదా, మకార స్తు తయో ర్దాస ఇతి ప్రణవలక్షణమ్”** (శ్రుతి) (సర్వలోకాలకు ఈశ్వరుడు, హరి, విష్ణువు అయిన



పరమాత్మ శేషమానాల్, తత్పత్నియాన వివళుక్కుమ్ అఖిలచేతనరుమ్ శేషభూతరెన్ను మిడత్తిల్ ప్రమాణాన్వేషణమ్ వేణ్డావితే. భర్తావుక్కు శేషమాన గృహక్షేత్రపుత్రాదికళ్, భార్యైక్కుమ్ శేషమెన్నుమిడమ్ లోకసిద్ధమితే. అవన్తాన్ ఉభయవిభూతియైయుమ్ ఇవళుక్కు ప్పుడుక్కైప్పిరాక్కియితే వైప్పతు. “ఈశానా దేవీ భువనస్యాఽధిపత్నీ”, ‘‘ఈశ్వరీం సర్వభూతానామ్’’, ‘‘మకార స్తు తయో ర్దాసః’’ ఎన్లు ఇవ్వర్థత్తిల్ ప్రమాణజ్గళుముణ్డితే. “అస్యా మమ చ శేషా హి విభూతి రుభయాత్మికా”, “సర్వేషా మీశ్వరీ మమ వల్లభా” ఎన్లివ్వర్థత్తై స్వయ మేవ అరుళిచ్చెయ్తానితే. “తిరునారణన్

---

భగవానుడు అకారంచేత చెప్పబడుతున్నాడు. విష్ణువుచే (వక్షఃస్థలంలో ఎల్లప్పుడూ ధరింపబడే లక్ష్మి అకారంచేత చెప్పబడుతున్నది. వారి ఇద్దరికీ మకారవాచ్యుడైన జీవుడు దాసుడు– అన్నదే ప్రణవార్థం) అని భగవానునకు సొత్తు అయిన ఉభయవిభూతులు ఈమెకు చెందినవి–అనే విషయాన్ని ప్రమాణాలు ఘోషిస్తున్నవికదా! **“అస్యా మమ చ శేషా హి విభూతి రుభయాత్మికా”** (పాంచరాత్రమ్) (ఉభయవిభూతులు ఈమెకు, నాకు శేషం కదా) అని పాంచరాత్రశాస్త్రంలోను, పూర్వం ఉట్టంకించిన **‘‘మచ్ఛేషభూతా సర్వేషా మీశ్వరీ మమ వల్లభా’’** (పాంచరాత్రమ్) (నాకు శేషభూతురాలైనది, మిగిలిన అందఱికీ ఈశ్వరిగా ఉన్నది నాకు ప్రియంగా ఉన్నది శ్రీదేవి) అనే పాంచరాత్ర శాస్త్రపమాణంలోను ఈ అర్థాన్ని భగవానుడు స్వయంగా అనుగ్రహించాడుకదా! **“మయర్వఱ మదినలమ్ అరుళినన్”** (భ్రమ విప్రలంభాది దోషరహితం అయిన భక్తిరూపాపన్నజ్ఞానాన్ని అనుగ్రహించాడు) (తిరువాయ్–1–1–1) అనే రీతిలో నిర్దుష్టమైన జ్ఞానాన్ని పొంది, తత్త్వాలను యథాతథంగా తెలిసిన మన ఆళ్వార్లు కూడా **“తిరునారణన్ తొణ్డర్”** (తిరువాయ్–3–7–4) (శ్రీమన్నారాయణుని దాసులు), **“తిరుమాలుక్కురియ తొణ్డర్”** (తిరువాయ్–6–9–11) (శ్రీమన్నారాయణుని అసాధారణులైన దాసులు), **‘‘తిరుమాలే నానుమ్ ఉనక్కు ప్పళవడియేన్’’** (తిరుప్పల్లాణ్డు–11) (శ్రియఃపతీ ! నేను నీకు అనాదిగా దాసుడను), **“శెన్రాల్ కుడైయామ్ తిరుమాఱ్కు అరవు”** (ముదల్ తిరు–53) (వేంచేసేటపుడు స్వామికి ఆదిశేషుడు గొడుగు అవుతాడు) అని ఉభయవిభూతులలో ఉండే చేతనులు అందఱూ భగవానుడు, లక్ష్మి–అనే మిథునానికి దాసభూతులు– అని అనుగ్రహించారుకదా!

ఈ రీతిలో వేదాలవల్ల, వేదాంతాలవల్ల తెలియబడే భగవానుని **“మిక్క వేదియర్”** (కణ్ణినుణ్–9) అని అన్నట్లు వేదార్థాన్ని తెలిసిన జ్ఞానులచేత వ్యక్తం చేయబడిన

తొణ్డర్", "తిరుమాలుక్కురియ తొణ్డర్", "తిరుమాలే నాను మునక్కు ప్పౘవడియేన్", "తిరుమాఱ్కరవు" ఎన్న్ఱు మిథునశేషత్వమ్ సర్వసాధారణ మెన్నుమిడత్తై తత్త్వవిత్తుక్కళాన నమ్ ఆఌ్వార్‌కళుమ్ అరుళిచ్చెయ్‌తార్‌కళిఱే.

ఆక, ఇప్పడి వేదఙ్గళాలుమ్, వేదవిత్తుక్కళాలుమ్. వేదాన్తవేద్యనాలుమ్, "మిక్క వేతియ" రాలుమ్ ప్రతిపాదిక్కప్పట్ట ఉభయవిభూతిశేషిత్వత్తుక్కు ప్రతిసమ్బన్ధితయా వక్తవ్యమాకైయాలే, ఉభయవిభూతియిలుళ్ళారుమ్ ఇవళుక్కు కిఙ్కరిత్తు శేషభూతరాయిరుక్కుమ్బడియై ప్రయోగిప్పతాక త్తిరువుళ్ళమ్బఱ్ఱి, "అతిల్ ప్రథమత్తిలే నిత్యసూరికళిల్ తలైవరాన తిరువనన్దాఌ్వాన్ ఇవళ్ విషయత్తిలే కిఙ్కరిత్తు స్వరూపమ్బెఱ్ఱిరుక్కుమ్బడియై అరుళిచ్చెయ్‌కిఱార్ (ఫణిపతి) రిత్యాదియాలే.

---

ఈ మిథునానికి చెందిన ఉభయవిభూతులలో ఉన్నవారు వీరిద్దరికీ కైంకర్యాన్ని చేసి, దాసులై ఉండడాన్ని తెలియజేయాలని తలచి, అందులో మొదట నిత్యసూరులలో ముఖ్యుడు అయిన ఆదిశేషుడు ఈ పిరాట్టివిషయంలో కైంకర్యాన్ని చేసి, తన స్వరూపాన్ని పొందే రీతిని అనుగ్రహిస్తున్నారు-**"ఫణిపతిః"** అని ప్రారంభించి.

అంటే- **"ఇరుళిరియ చ్చుదర్‌మణికళ్ ఇమైక్కుమ్ నెఱ్ఱి ఇనత్తుత్తి అణిపణ మాయిరఙ్గళార్‌న్ద"** (పెరుమాళ్ తిరు-4) (చీకటి చెదిఱి పోయేటట్లు జ్యోతిస్సును కల మణులు ప్రకాశించే శిరోభాగాలను కల్గి, దానికి తగిన స్వామి శ్రీచరణచిహ్నాలను అలంకరించుకొన్న వేయి పడగలతో ఉండేవాడు) అని, **"మన్నియ పల్ పొఱిశేర్ ఆయిరవాయ్ వాళరవిన్ శెన్నిమణిక్కుడిమి"** (పెరియతిరుమడల్-1) (స్థిరంగా ఉండే పలు రేఖలను, వేయినోళ్ళను కాంతిని కల ఆదిశేషుని పడగలతో ప్రకాశించే మణుల అగ్రాలనుండి వ్యాపించే) అని చెప్పే రీతిలో **"మదురవాఱు"** (తిరుమాలై-36) (మధురప్రవాహం) అని, **"ఇన్బవాఱు"** (తిరుక్కుఱు-2) (ఆనందప్రవాహం) అని చెప్పే రీతిలో సాటిలేని మాధుర్యాన్ని కల భగవదనుభవాన్ని పొందేటపుడు, ఆ అనుభవానికి పరీవాహరూపాలుగా నోరార పొగడేటట్లు వేయితలలను కలవాడై, **"అనంతధా భవతి"** (శ్రుతి) (ముక్తుడు అంతులేని శరీరాలను పొందుతున్నాడు) అనే రీతిలో లెక్కలేనన్ని దేహాలను పరిగ్రహించి, అన్ని విధాలైన కైంకర్యాలను చేసి, కైంకర్యాన్ని చేయడమే స్వభావంగా కల్గిన నిత్యసూరులు అందఱికి ఉపమానంగా ఉండేవాడై, **"అఙ్గారవారమ్"** (నాన్ముకన్. తిరు-10) అనే పాశురంలో చెప్పిన రీతిలో ఆపద సంభవించడానికి ఏ మాత్రం అవకాశం లేని పరమపదంలోకూడా భగవానునకు అసుర-రాక్షసులవల్ల ఏమి



అతావతు- "ఇరుళిరియ చ్చుదర్‌మణికళిమైక్కుమ్ నెఱ్ఱి ఇనత్తుత్తి యణి పణ మాయిరఙ్గళార్‌న్ద" ఎన్న్ఱుమ్, "వాయోరీరైఞ్ఞాఱు" "మన్నియ పల్‌పొఱిశే రాయిరవాయ్ వాళరవిన్ శెన్నిమణిక్కుడిమి" ఎన్న్ఱుమ్ శొల్లుకిఱపడియే, "మదుర వాఱు" ఎన్న్ఱుమ్, "ఇన్బవాఱు" ఎన్న్ఱుమ్ శొల్లుమ్బడి నిరతిశయభోగ్యమాన భగవదనువత్తుక్కు అనుభవపరీవాహరూపమాక వాయార ప్పుకఌకైక్కు మీడాక, పల వాయ్‌త్తలైకళైయుముడైయనాయ్, "అనంతధా భవతి" ఎన్గిఱపడియే అనేకదేహఙ్గళై ప్పరిగ్రహత్తు, అశేషశేషవృత్తియిలు మన్వయిత్తు, శేషవృత్తిపరరాన వశేషర్‌క్కుమ్ ఉపమానభూమియాయ్, "అఙ్గారవార" త్తిఱ్పడియే అస్థానే భయశఙ్కై పణ్ణి, "అఌలుమిఌ్న్దు" అనవరత మఙ్గళాశాసనపరరాయిరుక్కైయాలే, "అరవరశ ప్పెరుఞ్జోతి

---

కీడు మూడుతుందో! అని అస్థానే భయశంకను పొంది, నోళ్ళలో విషాన్ని వెదలకక్కుతూ ఎప్పుడూ మంగళాశాసనాన్ని చేస్తూ ఉండేవాడు కనుక, **"అరవరశ ప్పెరుఞ్జోది అనన్దన్".** (పెరుమాళ్ తిరు-1-1) అనే రీతిలో అనంతుడనే తిరునామాన్ని, **"తయా సహాసీనమ్.... శేష ఇతీర్యతే జనైః"** (స్తోత్రరత్న-39-40) అని స్తోత్రరత్నంలో చెప్పిన రీతిలో శేషుడనే తిరునామాన్ని, మిక్కిలి గొప్ప జ్ఞానాన్ని, బలాన్ని కలవాడై, పిరాట్టి అయిన నీకు శయ్య అయిన క్రమంలో **"నాకణైమిశై నమ్బిరాన్"** (తిరువాయ్-5-10-11) అనే రీతిలో అందఱికీ పురుషకారంగా ఉండేవాడై, **"ఏవంవిత్ పాదేనాధ్యారోహతి"** (కౌషీతకి-1-51) (ఈ విధంగా తెలిసికొన్నవాడు భగవానుని పడుకపై పాదాన్ని పెట్టి ఎక్కుతున్నాడు) అని పర్యంకవిద్యలో చెప్పిన రీతిలో ముక్తిని పొందే నీ బిడ్డలు అందఱూ తన ఒడిలో కాలు పెట్టి ఎక్కేటట్లుగా ఆసనమై, నీకు భగవానుని మిక్కిలి దగ్గరగా ఉండేవాడై, భగవానునకు స్వరూపాన్ని నిరూపించే నీవలె (లక్ష్మివలె) **"నాకణైమిశై నమ్బిరాన్"** (తిరువాయ్-5-10-11) (ఆదిశేషునిపై శయనించిన మన స్వామి) అని భగవానుడు సర్వాధికవస్తువు అనే విషయాన్ని తెలియజేసేవాడై, **"ఆస్తే పాతాళమూలస్థః శేషో౽శేషసురార్చితః, తస్య వీర్యం ప్రభావం స్వరూపం రూప మేవ చ, న హి వర్ణయితుం శక్యం జ్ఞాతుం వా త్రిదశై రపి"** (విష్ణు పు-2-5-21) (దేవతలందఱిచే పూజింపబడే శేషుడు పాతాళలోకం మూలప్రదేశంలో ఉంటాడు. అతని వీర్యం, ప్రభావం, స్వరూపం, రూపం మొదలైనవానిని వర్ణించడం దేవతలకు సైతం సాధ్యంకాదు) అనేటట్లు స్వరూపం, రూపం, గుణం, సంపద మొదలైనవానిని కలవాడైన ఆదిశేషుడు నీకు పరుండేటపుడు పడుకగా, **"ఇరున్దాల్ శిఙ్గాశనమామ్"** (ముదల్ తిరు-53) (వేంచేసి ఉన్నపుడు

యనన్దన్" ఎన్డుమ్, "యథోచితం శేషః" ఎన్డుమ్ తిరునామఙ్గళైయుడైయనాయ్ "ప్రకృష్టవిజ్ఞానబలైకధామా" వాయ్, ఉనక్కు ప్పడుకైయాన ముఱైయాలే "నాకణైమిశై నమ్బిరాన్" ఎన్డు ఎల్లార్క్కుమ్ పురుషకారభూతనాయ్, "ఏవంవిత్ పాదేనాऽధ్యారోహతి" ఎన్డు పర్యఙ్కవిద్యైయిఱ్పడియే తన్ మడిలే అడియిట్టు ఏఱలామ్బడి ఆసనమాయ్, అన్తరఙ్గనాయ్, భగవత్స్వరూపనిరూపకభూతైయాన వున్నైప్పోలే "నాకణై మిశై నమ్బిరాన్" ఎన్డు అవనుక్కు సర్వస్మాత్పరత్వసూచకనాయ్, "ఆస్తే పాతాళమూలస్థ శ్శేషోऽశేషసురార్చితః, తస్య వీర్యం ప్రభావ ఇ్చ స్వరూపం రూప మేవ చ, న హి వర్ణయితుం శక్యం జ్ఞాతుం వా త్రిదశై రపి" ఎన్గిఱపడియే, అపరిచ్ఛేద్యస్వరూపరూపగుణ విభవాదికళై యుడైయవనుమాన తిరువనన్దాழ్వాన్, పళ్ళికొణ్డరుళినాల్ పడుక్కైయాయ్, "ఇరున్దాల్ శిఙ్గాశనమాయ్"- ఇప్పడి ఉనక్కు బహుముఖమాక వడిమై శెయ్తు లబ్ధస్వరూపనాయిరుక్కుమ్. 'ఫణిపతి' శబ్దత్తాలే శైత్య- మార్దవ- సౌరభ్య- విశాలోన్నతత్వాదియాన పర్యఙ్కగుణఙ్గళ్ ప్రకటితఙ్గళాకిఱన. "పఞ్చశయనమ్" ఎన్నక్కడవతిఱే.

సింహాసనంగా ఉంటాడు) అనే రీతిలో వేంచేసి ఉన్నపుడు సింహాసనంగా- ఈ విధంగా నీకు పలు రీతుల్లో కైంకర్యాన్ని చేసి తన శేషత్వస్వరూపాన్ని పొందినవాడై ఉంటాడు. "సర్పాలకు ప్రభువు" అనే అర్థాన్ని ఇచ్చే **"ఫణిపతిః"** అనే శబ్దంతో చల్లదనం, మార్దవం, సౌగంధ్యం, విస్తృతి, ఔన్నత్యం - మొదలైన, పడుకకు తగిన అన్ని గుణాలు ఇతనికి ఉన్నాయని సూచింపబడింది. **"మెత్తెన్ఱ పఞ్చశయనమ్"** (తిరుప్పావై-19) (మెత్తని పంచశయనం) అని తిరుప్పావైలోకూడా ఈ అయిదు గుణాలు పడుకకు ఉండాలని చెప్పబడింది కదా. "**ఫణిపతిశబ్దేన సురభిసుకుమారశీతలవిశాలోన్నతత్వాదిరూపాః పర్యంకగుణాః వ్యజ్యంతే**" అని దేశికవ్యాఖ్య.

**"శయ్యా, ఆసనమ్"** అని రెండిటినీ చెప్పినది ద్వయమహామంత్రంలో చెప్పిన రీతిలో **"తిరుమాఱ్కరవు శెన్డాల్ కుడైయామ్"** (ముదల్ తిరు-53) అని ఆழ్వార్లచేత, **"నివాసశయ్యాననపాదుకాంశుకోపధాన....శేష ఇతీర్యతే జనైః"** (స్తోత్రరత్నమ్-39,40) అని ఆళవన్దార్ చేత చెప్పబడ్డ రీతిలో, ఇద్దటి కలయికలో **"భవాం స్తు సహ వైదేహ్యా గిరి సానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** (రామా. అర-31-25) (నీవు సీతాదేవితో కలిసి కొండచరియలలో విహరిస్తావు. అపుడు నిద్రపోతున్నపుడు, మేల్కొన్నపుడూ నీకు అన్ని విధాలైన కైంకర్యాలను నేను చేస్తాను) అని చేసే అన్ని విధాలైన కైంకర్యాలను చెప్పినట్లవుతుంది. **"కించైనాం ప్రతివక్ష్యామి**



"శయ్యా, ఆసనమ్" ఎన్డు ద్వయత్తై చ్చొన్నతు, ద్వయత్తిఱ్పడియే "తిరుమాఱ్కరవు-శెన్డాల్ కుడైయామ్", "నివాసశయ్యాసన" ఎన్డు తొడఙ్గి, ఇరువరుమాన శేర్త్తియిలే "అహం సర్వం కరిష్యామి" ఎన్డు పణ్ణుమ్ సర్వవిధకైఙ్కర్యఙ్గళుక్కు ముపలక్షణమ్. "యదా యదా హి కౌసల్యా" ఎన్డు ఓరబలై అప్రాప్తవిషయత్తిలే పలపడియాక పరిచర్యై పణ్ణినాళెన్డాల్, ప్రకృష్టజ్ఞానశక్తికళైయుడైయ వివన్ ప్రాప్తవిషయత్తిలే పల వడిమైకళుమ్ శెయ్కై ప్రతిపన్నమిఱే.

ఇప్పడి పరత్వత్తిలే పల వడిమైకళ్ శెయ్యుమళవన్ఱిక్కే, "దేవత్వే దేవదేహేయమ్" ఎన్డనువర్త్తిత్త ఇవళైప్పోలే అవతారన్దోఱుమ్ అడుత్త వడివు కొణ్డు "ఇతుక్కు" ఎన్డు సృష్టనాయ్, "సీతా మువాచ" ఎన్డు ఇవళ్పురుషకారమాక, ఇవళ్ సమక్షత్తిలే స్వాపేక్షితఙ్గళై

**శుత్వా విప్రియ మీదృశమ్, యదా యదా హి కౌసల్యా దాసీవచ్చ సఖీవ చ, భార్యావద్భగినీవచ్చ మాతృవచ్చోపతిష్ఠతి"** (రామా.అర-12-68) (కౌసల్య దాసి వలె, సఖివలె, భార్యవలె, సహోదరివలె, తల్లివలె శుశ్రూషను చేసేటపుడు, ఇటువంటి అనిష్టం అయిన కార్యాన్ని చేసి, ఆమెకు ఏ విధంగా బదులు చెప్పగలను? ) అనే రీతిలో ప్రాకృతదేహాన్ని కల్గిన, బలం లేని స్త్రీ అయిన కౌసల్య ప్రాకృతదేహాన్ని కల తన భర్తకు పలురీతుల్లో కైంకర్యాన్ని చేసింది అని చూస్తున్నాము. ఈ విధంగా ఉండగా అత్యంతవిశిష్టమైన జ్ఞానశక్తులను కలవాడైన ఈ ఆదిశేషుడు స్వరూపానురూపుడైన స్వామి విషయంలో పలువిధాలైన కైంకర్యాలను చేయడం తగినదే. వాసుదేవుడనే పరదశలో ఉండేటపుడు కైంకర్యాన్ని చేయడంతో నిలువకుండా, **"పున శ్చ పద్మా సంభూతా ఆదిత్యోऽభూత్ యథా హరిః యథా తు భార్గవో రామః తదాసీ ద్ధరణీత్వియమ్, రాఘవత్వేऽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణోః శ్రీ రనపాయినీ, దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ, విష్ణో ర్దేహానురూపాం వై కరోత్యేషాత్మన స్తనుమ్"** (విష్ణు.పు.-1-9-143,144,145) (భగవానుడు ఆదిత్యుడై అవతరించినపుడు పిరాట్టి పద్మగా అవతరించింది. భార్గవరాముడు అయినపుడు ధరణి అయినది. రాముడుగా అవతరించినపుడు సీతగాను, కృష్ణావతారంలో రుక్మిణిగాను అయినది. మిగిలిన అవతారాలలోకూడా భగవానుని విశ్లేషించకుండా ఉన్నది. అతడు దేవజాతిలో అవతరించినపుడు ఈమెకూడా దేవరూపాన్ని పొందుతుంది. మనుష్యుడై అవతరించినపుడు ఈమె మనుష్యస్త్రీగా మారుతున్నది. విష్ణువు దేహానికి అనుకూలంగా తన దేహాన్ని ఈ లక్ష్మీదేవి

ప్పేశి, "వైదేహ్యా సహ" ఎన్ఱు ఇవళ్ శేర్త్తియిలేయితే భావజ్ఞనాయ్ "అహం సర్వమ్" ఎన్ఱు సర్వవిధ కైఙ్కర్యఙ్గళైయుమ్ ప్రార్థిత్తు అడిమైశెయ్యప్పెఱ్ఱు, "ప్రహర్షయిష్యామి" యిఴ్పడియే ఉకప్పిత్తు, "ఉకన్దు పణిశెయ్తు" ఎన్నుమ్బడి రమిత్తు లబ్ధస్వరూపనాయ్, ఇరుప్పానొరువనిత్తే. "అణైవతరవణైమేల్ పూమ్బావైయాకమ్ పుణర్వతు", "తీవాయ్ నాకణైయిల్ తుయిల్వానే తిరుమాలే", "శుడర్ప్పామ్బణై నమ్బరనై త్తిరుమాలై" ఎన్ఱు ఇరువరుమాన శేర్త్తియిలే అడిమైశెయ్తు వాఴుమ్బడియై ఆఴ్వార్కళ్

---

మార్చుకుంటుంది) అనే రీతిలో భగవానుడు పరిగ్రహించే అవతారాలు అన్నిటిలోను అవతరించే ఈమెవలె, ఇతడు (ఆదిశేషుడు) కూడా ఒక్కొక్క అవతారంలోను తగిన దేహాన్ని పరిగ్రహించి, **"సృష్ట స్త్వం వనవాసాయ"** (రామా-అయో-40-5) (నీవు వనవాసంలో రాముని అనుసరించడంకోసమే పుట్టావు) అని సుమిత్రాదేవి పల్కినట్లు కైంకర్యాన్ని చేయడమే స్వభావాన్ని కల్గినవాడై, **"స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః, సీతా మువాచాతియశాః రాఘవం చ మహావ్రతమ్"** (రామా. ఆయో-31-2) (రఘునందనుడై, గొప్ప కీర్తిని కలవాడైన లక్ష్మణుడు అగ్రజుని పాదాలను దృఢంగా పట్టుకొని సీతాదేవీపురస్సరంగా ఆశ్రితరక్షణం అనే గొప్ప వ్రతాన్నికల శ్రీరాముని చూచి పలికాడు) అని చెప్పిన రీతిలో ఈ పిరాట్టి పురుషకారంగా, ఈమె సమక్షంలోనే ఇద్దరి చేరికలో తాను కోరిన దానిని ప్రార్థించి, వీరి భావాన్ని తెలిసినవాడై, **"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే"** (రామా-ఆయో-31-25) అనే రీతిలో అన్ని విధాలైన కైంకర్యాలను కోటి, దాస్యాన్ని చేసి, **"కదా ప్రహర్షయిష్యామి"** (స్తోత్ర-46) (ఎపుడు కైంకర్యాన్ని చేసి ఆనందింపజేస్తాను?) అనే రీతిలో మిమ్ములను సంతోషింపజేసి, **"ఉకన్దు పణిశెయ్దు"**. (తిరువాయ్-10-8-10) (ఆనందించి కైంకర్యం చేసి) అన్నట్లు దానినిబట్టి తానుకూడా ఆనందించి, శేషత్వస్వరూపాన్ని పొందినవాడై ఉండే సాటిలేనివాడుకదా! **"అణైవదు అవరణైమేల్ పూమ్ పావై యాకమ్ పుణర్వదు"** (తిరువాయ్-2-8-1) (పరుండేది ఆదిశేషునిపై, సంశ్లేషించేది లక్ష్మీదేవి వక్షస్సును), **"తీవాయ్ నాకణైయిల్ తుయిల్వానే తిరుమాలే"** (పెరియతిరు-7-7-9), (అగ్నిని వెలువరించే నోటిని కల ఆదిశేషుడనే పడుకపై నిద్రించేవాడా! శ్రియఃపతీ!), **"శుడర్ ప్పామ్బణై నమ్బరనై త్తిరుమాలై"** (తిరువాయ్-8-7-11) (తేజస్సును కల ఆదిశేషుని పడుకగా గల మన స్వామి, శ్రియఃపతి) అని ఆదిశేషుడు భగవానుడు-పిరాట్టి అనే ఇద్దఱి చేరికలో కైంకర్యాన్ని



అనుసన్ధిత్తార్కళిత్తే. ఇవర్తాముమ్, "తయా సహాఽఽసీన మనన్తభోగిని" ఎన్ఱరుళిచ్చెయ్తారిత్తే. "శేషభోగే శ్రియా సహాఽఽసీనమ్" ఎన్ఱు భాష్యకారర్. "శ్రీస్తనాభరణంతేజః ఉత్సఙ్గేఽనన్తభోగినః" ఎన్ఱు భట్టర్.

(ఫణిపతి శ్శయ్యాఽఽసనమ్) "భోగప్రియా భోగవతీ భోగీన్ద్రశయనాఽఽసనా" ఎన్ఱు ఇవళుక్కు అసాధారణమాక ఆసనశయనాదియాన వడిమై శెయ్యుమ్బడియై శ్రీసహస్రనామత్తిలే శొల్లిఱ్ఱిత్తే. "శ్రీమతే" ఎన్ఱి పడియే, కైఙ్కర్యమ్ సిద్ధిప్పతుమ్, రసిప్పతుమ్, కైఙ్కర్యవర్ధకైయాయ్, పరమప్రాప్యైయాన వివళ్శేర్త్తియిలేయాకైయాలే, ఇవళ్ శేర్త్తియిలే అడిమై శెయ్కైయిత్తే స్వరూపప్రాప్తమ్. ఆకైయితే, "తిరుమాలే నిన్తే

---

చేసి స్వరూపాన్ని పొందడాన్నిగూర్చి ఆఴ్వార్లు అనుసంధించారుకదా! ఆళవన్దార్కూడా ఇంతకుముందు ఉట్టంకించిన **"తయా సహాసీన మనంతభోగిని.....శేష ఇతీర్యతే జనైః"** (స్తోత్ర-39-40) అనే ప్రమాణంలో **"తయా సహాసీనమ్"** అని అంటూ ఇద్దరి చేరికలో ఆదిశేషుడు చేసే కైంకర్యాలను అనుసంధించారుకదా! **"అనంతభోగిని శ్రీమద్వైకుంఠైశ్వర్యాదిదివ్యలోక మాత్మకాంత్యా విశ్వ మాప్యాయయంత్యా, శేషశేషాశనాదికమ్ సర్వం పరిజనం భగవత స్తత్తదవస్థోచితపరిచర్యాయా మాజ్ఞాపయంత్యా, శీలరూపగుణవికాసాదిభిః ఆత్మానురూపయా శ్రియా సహాసీనమ్"** (శ్రీవైకుంఠగద్యమ్) (శ్రీమద్వైకుంఠనగరం మొదలైన దివ్యలోకాలు అన్నిటినీ తన కాంతితో పోషిస్తున్నదై, శేషుడు-విష్వక్సేనుడు మొదలైన పరిజనాలను అందఱిని, ఆయా దశలకు తగినట్లు కైంకర్యంలో ఆజ్ఞాపించేదై, శీలరూపగుణవిలాసాదులలో తనకు సాటి వచ్చేది అయిన శ్రీదేవితో కలిసి ఆదిశేషుని ఒడిలో వేంచేసి ఉన్నవానిని) అని అంటూ శ్రీ భాష్యకారులుకూడా దీనిని అనుగ్రహించారు, **"శ్రీస్తనాభరణం తేజః శ్రీరంగేశయ మాశ్రయే, చింతామణి మివోద్వాంత ముత్సంగేఽనంత భోగినః"** (శ్రీరంగ-1-8) (ఆదిశేషుని ఒడిలో అతనిచే కక్కబడిన మాణిక్యంవలె, లక్ష్మీదేవి స్తనటాలకు ఆభరణంవలె ఉండే శ్రీరంగనాథుడనే తేజస్సును ఆశ్రయిస్తున్నాను) అని శ్రీపరాశరభట్టర్ ఈ విషయాన్నే అనుగ్రహించారు.

**(ఫణిపతిః శయ్యా ఆసనమ్)- "భోగప్రియా భోగవతీ భోగీంద్రశయనాసనా"** (బ్రాహ్మమ్-శ్రీసహస్రనామమ్) (భోగప్రియ, భోగవతి, భోగీంద్రుడైన ఆదిశేషుని ఆసనంగా కల్గినది) అని శ్రీలక్ష్మీసహస్రనామంకూడా ఆదిశేషుడు ఈమెకు శయ్య, ఆసనం మొదలైనవిగా రూపొంది, కైంకర్యం చేసే రీతిని తెలిపింది. **"శ్రీమతే"** అని ద్వయంలోని ఉత్తరఖండంలో చెప్పిన రీతిలో కైంకర్యం సిద్ధించడం, రుచించడం అంతా కైంకర్యాన్ని

యాట్చెయ్య నీ కొణ్డరుళ నినైప్పతు తాన్ ఎన్టే” ఎన్ఱు ప్రసన్నజనకూటస్థర్ ప్రార్థిత్తరుళిఱు. “శ్రీనివాసే-భక్తిరూపా భవతు”, “శ్రియఃకాన్తో... యస్తత్పదాబ్జే పరిచరణసక్తం భవతు మే” ఎన్ఱు కైఙ్కర్యోపకరణమాన భక్తియైయుమ్, కైఙ్కర్యత్తైయుమ్ ఇవళ్ సన్నిధియిలే ప్రార్థిత్తరుళినారిఱే.

“అనన్దన్ పాలుమ్ కరుడన్ పాలుమ్” ఎన్ఱు ఇవనుక్కనన్తరమ్ వ్యామోహ విషయమాన పెరియతిరువడి, ఇవళ్ విషయత్తిలే కిఙ్చిత్కరిత్తు స్వరూపమ్ నిఱమ్బెరుమ్బడియై యరుళిచ్చెయ్‌కిఱార్‌మేల్ (వేదాత్మా) ఎన్ఱు తొడఙ్గి. ఆసనపదమ్

---

వృద్ధిచేసేదై, పరమప్రాప్య అయిన ఈమె నిత్యయోగంవల్లనే కాబట్టి, ఈమె చేరికలో కైంకర్యాన్ని చేయడమేకదా స్వరూపానికి తగినది. అందువల్లనే కదా **“తిరుమాలే! నిన్టే ఆట్చెయ్య నీ కొణ్డరుళ నినైప్పదుతాన్ ఎన్టే”** (తిరువాయ్-8-3-8) (శ్రియఃపతీ! స్థిరంగా నేను కైంకర్యం చేసేటట్లుగా నీవు సంకల్పించేది ఎపుడు?) అని ప్రపన్నజనకూటస్థులైన నమ్మాழ్వార్లు అనుగ్రహించారు. **“అఖిలభువనజన్మస్థేమభంగాదిలీలే వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే, శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా”** (శ్రీభాష్యమంగళ శ్లోకం) లోకాలను అన్నిటినీ సృష్టించి, రక్షించి, లయం చేయడం మొదలైనవానిని లీలగా కలవాడు, వేదాంతంలో వెలిగేవాడు అయిన శ్రీనివాసుడనే పరబ్రహ్మనుగూర్చి భక్తిరూపాపన్నం అయిన జ్ఞానం నాకు కలగాలి) అని, **“శ్రియం కాంతోఽనంతో వరగుణగణైకాస్పదవపుః హతశేషావద్యో పరమఖపదో వాఙ్మనసయోః, అభూమి ర్భూమి ర్యో నతజనదృశా మాదిపురుషో మన స్తత్పాదాబ్జే పరిచరణసక్తం భవతు మే”** (వేదాంతదీపమ్) (శ్రియఃపతియై, గొప్ప కల్యాణగుణగణాలకు సాటిలేని స్థానం అయిన తిరుమేనిని కలవాడై, హేయప్రతిభటుడై, పరమపదనిలయుడై, వాక్కుకు, మనస్సుకు అందనివాడై, దాసుల నేత్రాలకు గోచరీభూతుడై, ఆదిపురుషుడైన అనంతుని శ్రీపాదపద్మాలలో కైంకర్యాన్ని చేయడానికి నా మనస్సు ఆశ కల్గినది కావాలి) అని శ్రీభాష్యకారులుకూడా కైంకర్యం చేయడానికి ఆవశ్యకం అయిన భక్తిని, కైంకర్యాన్ని ఈమె కలయికలోనే ప్రార్థించారు కదా!

**“అనన్దన్ పాలుమ్ కరుడన్ పాలుమ్”** (పెరియాழ్వార్. తిరు-5-4-8) (అనంతుని పట్ల, గరుడునిపట్ల) అని ఆదిశేషునకు పిమ్మట భగవానునకు చాలా ప్రియమైనవాడు అయిన గరుత్మంతుడు ఈమె విషయంలో కైంకర్యాన్ని చేసి, తన స్వరూపం ప్రకాశింపజేసికొనే రీతిని **“వేదాత్మా”** అని ప్రారంభించి తెలుపుతున్నారు. కాకాక్షిన్యాయంలో **“ఆసన”** పదాన్ని, **“ఫణిపతిః శయ్యాసనమ్”** అని ముందుకు



కాకాక్షిన్యాయత్తాలే మేలోడు మన్వయిత్తు, “వేదాత్మా విహగేశ్వరః-ఆసనమ్ వాహనమ్” ఎన్ఱు యోజిత్తుక్కొళ్వతు.

(వేదాత్మా) “సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరో గాయత్రం చక్షు స్తోమ ఆత్మా సామ తే తనూ ర్వామదేవ్యం బృహద్రథన్తరే పక్షౌ యజ్ఞాయజ్ఞియం పుచ్ఛం ఛన్దాంస్యఙ్గాని ధిష్ణియా శ్శఫా యజూంషి నామ” ఎన్గిఱ సౌపర్ణశ్రుత్యర్థత్తై వివక్షిత్తు “వేదాత్మా” వెన్గిఱార్. “త్రయీమయః” ఎన్టారిఱే ఇవర్‌తామే.

(వేదాత్మా) (వేదాఽధిష్ఠాతృతయా వేదానా మాత్మా) “వేదాఽధిష్ఠాతృత్తైయినాలే వేదానామాత్మా” ఎన్ఱు తత్పురుషనాతల్. యద్వా, తద్విశిష్టత్వేన తత్సామానాధి కరణ్యత్తాలే, “వేదాత్మా యస్యేతి” ఎన్ఱు బహువ్రీహియాతల్. ఇత్తాల్, ఇవనుడైయ

---

అన్వయించినట్లే, **“వేదాత్మా విహగేశ్వరః ఆసనమ్ వాహనమ్”** అని తరువాతకూడా అన్వయించి, అర్థాన్ని చెప్పవచ్చు.

**(వేదాత్మా)-“త్రివృత్తే శిరో గాయత్రం చక్షుః స్తోమ ఆత్మా సామ తే తను ర్వామదేవ్యం బృహద్రథంతరే పక్షౌ యజ్ఞాయజ్ఞియం పుచ్ఛం ఛందాంస్యంగాని ధిష్ణియాః శఫా యజూంషి నామ”** (తైత్తి.యజు-సంహిత-4-1-42) (త్రివృత్ శిరస్సు, గాయత్రం చక్షువులు, స్తోమ ఆత్మ, సామ తనువు, వామదేవ్యము, బృహద్రథంతరాలు రెండు ఱెక్కలు, యజ్ఞాయజ్ఞియాలు పుచ్ఛం, అంగాలు ఛందస్సులు, ధిష్ణ్యలు శఫలు (గిట్టలు), యజుస్సులు నామాలు) అనే సౌపర్ణశ్రుతి అర్థాన్ని మనస్సులో పెట్టుకొని **“వేదాత్మా విహగేశ్వరః”** (వేదాన్ని శరీరంగాను కల గరుడుడు) అని యామునులు అంటున్నారు, **“దాస స్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనం త్రయీమయః, ఉపస్థితం తేన పురో గరుత్మతా త్వదంఘ్రిసమ్మర్దకిణాంకశోభినా”** (స్తోత్ర-41) (వేదాలను అవయవాలుగా కల ఏ గరుడుడు నీకు దాసుడు, మిత్రుడు, వాహనం, సింహాసనం, ధ్వజం, వితానం, చామరం అవుతున్నాడో, నీ శ్రీపాదాల తాకిడిచేత కల్గిన కిణాలను గుర్తులుగా కల్గి శోభించే ఆ గరుడునిచేత సమక్షంలో సేవింపబడేవానినిగా) అని స్తోత్రరత్నంలో వీరే గరుడుని **“వేదాత్మా”** అని అన్నారు కదా!

**(వేదాత్మా)-** వేదాలకు అభిమానిదేవతగా ఉన్నందున “వేదాలకు ఆత్మగా ఉన్నవాడు” అని తత్పురుషసమాసంగాకూడా చెప్పవచ్చు. వేదాలను తన శరీరంగా కల్గి, వానితో కూడి ఉన్నందువల్ల శరీరశరీరిభావంద్వారా ఒకే విభక్తిలో చెప్పేటట్లు ఉన్నందువల్ల “వేదాలు ఎవనికి ఆత్మయో (శరీరమో) అతడు వేదాత్మ” - అనే బహువ్రీహి సమాసంగాకూడా చెప్పవచ్చు. ఇందువల్ల ఇతడు అన్నీ తెలిసినవాడు అని

సర్వజ్ఞత్వమ్ సూచితమాయిఱ్ఱు. అమృతాహరణాదికళిలే ఇవనుడైయ శక్తిమత్త్వమ్ సిద్ధమితే.

(విహగేశ్వరః) పుళ్ళరైయిన్ పుకఴ్ కుఴఱుమ్" ఎన్గిఅపడియే, పక్షిరాజ నెన్ఱు ప్రసిద్ధనై యిరుప్పానొరువనితే. ఇత్తాల్, "సత్య స్సుపర్ణో గరుడ స్తార్క్ష్య స్తు విహగేశ్వరః'' ఎన్ఱు శ్రీసాత్వతాదికళిలే ప్రాణాదిపంచకాధిపతిత్వేన అవస్థితనాన వివనుడైయ వ్యూహవిశేషత్తై చ్చొల్లుకిఱతు. ఇవన్తాన్ నిత్యవిభూతియిల్ "ఓడు ముపుళ్ళేతి" ఎన్ఱు అడిమైశెయ్యుమళవన్ఱిక్కే, లీలావిభూతియిలుమ్ కూడత్తొడర్న్దు, నాగపాశ విమోచనమ్ పణ్ణుమతు, అమృతప్రదానమ్ పణ్ణుమతు, "అరుళాఴిపుట్కడవీరవర్వీతి యెరునాళ్" ఎన్ఱుమ్, "అశురరుయిరెల్లామ్ తకర్త్తుణ్డుఴలుమ్ పుట్పాకన్" ఎన్ఱుమ్

---

తెలుపబడినట్లయింది. అమృతాన్ని తీసికొని రావడం, పారిజాతవృక్షాన్ని పెళ్ళగించుకొని రావడం-మొదలైన చరిత్రలవల్ల ఇతడు మహాశక్తిని కలవాడు - అని వ్యక్తమవుతున్నది.

**(విహగేశ్వరః)**- పక్షులకు ప్రభువు. **"పుళ్ళరైయన్ పుకఴ్ కుఴఱుమ్ పునలరఙ్గమే"** (పెరియాఴ్వార్-4-9-5) (పక్షిరాజు కీర్తిని పాడే పక్షులను కల తోటలను గల్గిన శ్రీరంగం) **"పుళ్ళరైయన్ కోయిల్"** (తిరుప్పావై-13) (పక్షిరాజు కోవెల) అనే రీతిలో ఇతడు పక్షిరాజుగా పేరు పొందినవాడుకదా! ఇందువల్ల **"సత్య స్సుపర్ణో గరుడ స్తార్క్ష్య స్తు విహగేశ్వరః"** (సాత్త్వతసంహిత) (సత్యుడు, సుపర్ణుడు, గరుడుడు, తార్క్ష్యుడు, విహగేశ్వరుడు అనే అయిదు గరుడుని వ్యూహరూపాలు) అని శ్రీసాత్త్వతసంహితలో చెప్పిన రీతిలోనే ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమానాలు అనే అయిదు వాయువులకు అధిపతిగా ఉండే గరుడుని వ్యూహంలో ఒకటి అయిన విహగేశ్వరుని చెబుతున్నది. ఇతడు పరమపదంలో **"ఓడుమ్ పుళ్ళేతి"** (తిరువాయ్-1-8-1) అన్నట్లు కైంకర్యం చేయడంతోపాటుగా, లీలావిభూతిలో భగవానుడు అవతరించేటపుడు అంతా తానుకూడా అవతరించి (రామావతారంలో) నాగపాశాలనుండి విడిపించాడు. అమృతకలశాన్ని తీసికొని వచ్చాడు. **"అరుళాఴిప్పుళ్ కడవీర్ అవర్ వీది యొరునాళ్''** (తిరువాయ్-1-4-6) (కరుణాసముద్రుడైన గరుడుని ఎక్కి వారి వీథిలో ఒకనాడు వేంచేయండి) అని, **"అశురర్ ఉయిర్ ఎల్లామ్ తకర్న్దుణ్డుఴలుమ్ పుట్పాకన్"** (తిరువాయ్-8-10-6) (అసురులను అందరినీ పీడించి, వధించి, సంచరించే గరుడుని వాహనంగా నడిపే స్వామి) అని చెప్పిన రీతిలో భగవానుడు దాసులను రక్షించేటపుడు అతనికి అనుకూలుడై ఉండి, అతనికి సహాయం చేసే కరుణాసముద్రుడై ఉంటాడు ఇతడు. ఇటువంటి మహిమలను కల పెరియతిరువడి (గరుడుడు) నీతో భగవానుడు



శొల్లుకిఱపడి ఆశ్రితరక్షణత్తుక్కుమ్ తద్విరోధినిరసనత్తుక్కుమ్, అనుకూలనామ్పడి కృపాసముద్రమా యిరుప్పానొరువనితే. ఏవంవిధవైభవనాన పెరియతిరువడి, ఎఴున్దరుళి.ఇరున్దాల్ సింహాసనముమాయ్, ఉలావి యరుళువెప్పొతు వాహననముమాయ్, కిఙ్చిత్కరిత్తు లబ్ధస్వరూపను- మాయిరుక్కుమ్.

(వాహనమ్) విశ్లేషదశైయిల్ "వెఙ్జిఱైప్పుళ్" ఎన్ఱు వెఱుక్కుమ్పడియుమ్, ''అఙ్జిఱైప్పుళ్'' ఎన్ఱు సంశ్లేషదశైయిలే శ్లాఘిక్కుమ్పడియుమ్, అత్తలైక్కు అన్తరఙ్గవాహనమాయ్, ''త్వదంఘ్రిసమ్మర్దకిణాఙ్కశోభి'', యాయ్ విజయధ్వజమాయిరుక్కిఱ వినతాతనయన్, "ఊరు మ్పుట్కొడియు మ Lతే", "దాస స్సఖా వాహన మాసనం ధ్వజః" ఎన్ఱుమ్ శొల్లుకిఱ సర్వవిధకైఙ్కర్యఙ్గళిలు మన్వితనాయ్, సత్తై పెఱ్ఱిరుక్కు మెన్గిఱ వర్ధత్తై "ఆసనం వాహనమ్'' ఎన్గిఱ పదద్వయముమ్

---

వేంచేసి ఉన్నపుడు సింహాసనంగా, విహరించేటపుడు వాహనంగా కైంకర్యాన్ని చేసి, స్వరూపాన్ని పొందుతాడు.

**(వాహనమ్)** -ఆఴ్వార్లు నాయికాభావాన్ని పొందినపుడు భగద్విశ్లేషదశలో **"వెఙ్జిఱై ప్పుళ్"** (తిరువాయ్-1-4-1) (క్రూరమైన రెక్కలను కలపక్షి) అని భగవానునివలె ఇతనినికూడా గర్హించేటట్లుగాను, చేరి ఉన్నప్పుడు **"అఙ్జిఱైప్పుళ్ళుమ్ ఒన్ఱు ఏఱి వన్దార్ అచ్చో ఒరువర్ అఴకియ వా"** (పెరియ. తిరు-9-2-8) (అందమైన రెక్కలను కల గరుడుని ఎక్కి ఒకరు వచ్చారు! అందగాడా! రా!) అని ఇతనినికూడా పొగడేటట్లుగాను అతనికి అంతరంగవాహనంగా ఉంటాడు. పూర్వం ఉట్టంకించిన **"తయా సహాసీన మనంతభోగిని ....... త్వదంఘ్రిసమ్మర్దకిణాంకశోభినా "** (స్తోత్ర-41) అనే స్తోత్రరత్న ప్రమాణంలో చెప్పినట్లు భగవానుని శ్రీపాదాల సమ్మర్దంవల్ల కల్గిన కిణాలను కలవాడై, అతనికి దాసుడై, స్నేహితుడై, వాహనమై, ఆసనమై, ధ్వజమై ఉంటాడు. **"ఊరుమ్ పుట్కొడియుమ్ అ.'.దే"** (తిరువాయ్ 10-2-3) (గరుడుని అధిరోహిస్తాడు. ఆ గరుడుడే ధ్వజం) అని ఆఴ్వార్లుకూడా ఈ విషయాన్ని తెలిపారు. ఈ విధంగా అన్ని విధాలైన కైంకర్యాలను చేసి, సత్తను పొందేవాడు ఇతడు-అనే విషయాన్ని **"ఆసనమ్ వాహనమ్"** అనే రెండు పదాలతోను తెలుపుతున్నారు." **"పొరుశిఱై ప్పుళ్ ఉవన్దేఱుమ్ పూమకళార్ తనిక్కేళ్వన్''** (తిరువాయ్-1-9-3) (యుద్ధోన్ముఖుడైన గరుడుని ఆనందంతో అధిరోహించే, లక్ష్మీదేవితో సంశ్లేషించే స్వామి) **"తిరువిరున్ద మార్బన్ పొలిన్ద కరుడన్మేత్కొణ్డ కరియాన్"** (మూన్తామ్-తిరు -5-7) (లక్ష్మీవాసం చేసే వక్షస్సును

ప్రకాశిప్పిక్కిఱతు. "పొరు శిఱై ప్పుళ్ళువన్దేఱు మ్పూమకళార్", "తిరువిరున్దమార్పన్" ''కరుడన్మేఱ్కొణ్డ'' ఎన్నుమ్ శొల్లుకిఱపడియే, ఇవళ్ శేర్త్తియిలే ఇవర్కళ్ అడిమైశెయ్యుమ్బడియై దర్శిత్తనుభవిత్తార్కళితే. ఇత్తాల్ "గరుడా గరుడాసనా" ఎన్గిఱ ప్రమాణార్థమ్ శొల్లప్పట్టతు.

''వేదాత్మా వాహనమ్'' ఎన్గైయాలే, స్వగుణాऽనుగుణమాక స్వస్వవాహనఙ్గళైయుడైయ అధమదేవతాభార్యైకళిల్ ఇవళుక్కుణ్డాన వుత్కర్షమ్ తోఱ్ఱుకిఱతు. "పఱవై యేఱు పరమ్బురుడా" ఎన్గిఱపడియే, "గరుడవాహనన్" "ఎన్గై-అవనుక్కు

కలవాడు, గరుడునిపై అధిరోహించే నల్లనివాడు) అని అన్నట్లు భగవానుడు, పిరాట్టి కలసిన చేరికలోనే గరుడుడు వాహనంగా కైంకర్యాన్ని చేయడాన్ని ఆఴ్వార్లు అనుభవించి అనుగ్రహించారుకదా! **"గరుడా గరుడాసనా"** (శ్రీసహస్రనామమ్-100) (గరుడా అనే పేరును కల్గినది. గరుడుని వాహనంగా కల్గినది) అనే లక్ష్మీసహస్రనామంలో పిరాట్టికి గరుడుడు ఆసనంగా ఉంటాడు అని చెప్పినదానిని అనుసరించి, వీరిచే ఇక్కడ ఈ విధంగా చెప్పబడింది-అని తెలుస్తున్నది.

**(వేదాత్మా వాహనమ్)**- అని చెప్పడంవల్ల అధమదేవతలైన బ్రహ్మ, రుద్రాదుల పత్నులైన సరస్వతి, పార్వతి మొదలైనవారికి వారి వారికి తగిన రజస్తమోగుణాలనుబట్టి ఆయా గుణాలను కల హంస, ఋషభం మొదలైన తక్కువ వాహనాలకంటె గొప్పదైన వాహనాన్ని కల్గిన ఈమె అతిశయం తెలుపబడింది. **"పఱవై యేఱు పరమ్పురుడా"** (పెరియాఴ్వార్ తిరు-5-4-2) (గరుడుని ఎక్కే పరమపురుషా!) అనే రీతిలో "గరుడవాహనుడు" అనే ప్రయోగం అతడు దేవతలందఱిలో గొప్పవాడు అనే విషయాన్ని తెలుపుతున్నట్లే, "**గరుడాసనా**" "గరుడుని వాహనంగా కల్గినది" అనేది ఈమె స్త్రీ దేవతలందఱిలో గొప్పది అనే విషయాన్ని స్పష్టంచేస్తున్నదికదా! "ఆదిశేషుడు పడుక, ఆసనం, వాహనం గరుడుడు" అని అన్నందువల్ల ఒకరికొకరు ఆగర్భశత్రువులైన గరుడ-సర్పాలనుండి ఒకేసమయంలోనే ఏ వైరుధ్యంలేకుండా దాస్యాన్ని పరిగ్రహించే ఈమె అఘటితఘటనాసామర్థ్యం తెలుపబడింది. **"ఫణిపతివిహగేశ్వరయో రుపాదాన మిహ మిథో విరుద్ధ జాతీయైరప్యవిరోధేన యుగపత్ సేవ్యత్వం సూచయతి"** అని దేశిక వ్యాఖ్య. **"పుట్కొడియాయ్! తీవాయ్ నాకణైయిల్ తుయిల్వానే! తిరుమాలే"** (పెరియ తిరు-7-7-9) (గరుడధ్వజా! నిప్పును ఉమినే నోళ్ళను కల ఆదిశేషునిపై శయనించి ఉండే శ్రియఃపతీ!) అని సర్వేశ్వరునకు లక్షణం అయిన గరుడధ్వజత్వం,



సర్వాధికత్వద్యోతకమానాప్పోలే, ఇవళుక్కుమ్ సర్వోత్కర్షహేతువాయిరుక్కుమితే. "ఫణి పతి శ్శయ్యాऽసనం వాహనం వేదాత్మా" ఎన్గైయాలే, అన్యోన్యమ్ విరుద్ధజాతీయరైయుమ్, యుగపత్ అవిరుద్ధమాక అడిమైకొళ్ళుకిఱ అఘటితఘటనాసామర్థ్యమ్ తోఱ్ఱుకిఱతు. "పుట్కొడియాయ్-తీవాయ్ నాకణైయిల్ తుయిల్వానే తిరుమాలే!" ఎన్ఱు సర్వాధికత్వలక్షణఙ్గళ్ మూన్ఱైయుమ్ శేర్త్తనుభవిత్తాప్పోలే, ఇవరుమ్ "కాన్త స్తే" ఇత్యాదియాలే విష్ణుపత్నీత్వ-శేషశాయిత్వ- గరుడవాహనత్వఙ్గళై యుగపదేవ అరుళిచ్చెయ్తారాయిఱ్ఱు.

ఆక, ఇప్పడి అఖిలసూరిపరిబృఢరాన శేషశేషాశనరుడైయ శేషత్వమ్ శొన్నపోతే, శేషాశనర్ ముతలాన వశేషశేషవర్గత్తినుడైయ శేషత్వముమ్ కైముతికన్యాయసిద్ధమితే. "త్వదీయభుక్తోజ్ఝితశేషభోజినా", "హతాऽఖిలక్లేశమలైః" ఎన్గిఱ శ్లోకద్వయత్తాలుమ్ అఖిలసూరివర్గముమ్ అఖిలజగన్మాతావాన వివళ్తిఱత్తి నడిమైశెయ్యుమ్బడియై,

శేషశాయిత్వం, శ్రియః పతిత్వం- అనే మూడిటిని కలిపి తిరుమఙ్గైయాఴ్వార్లు అనుభవించినట్లే, ఈమె కూడా అతనిని (భగవానుడు) తప్ప మిగిలిన అందఱికి ఈశ్వరి అని చూపే విష్ణుపత్నీత్వం, శేషశాయిత్వం, గరుడవాహనత్వం- అనే మూడిటిని **"కాంత స్తే పురుషోత్తమః, ఫణిపతిః శయ్యాసనం, వాహనం వేదాత్మా విహగేశ్వరః"** అని ఆళవన్దార్ అనుగ్రహించారు.

ఈ విధంగా నిత్యసూరులందఱిలో అగ్రేసరుడైన ఆదిశేషుడు, సర్పాలను ఆహారంగా గ్రహించే గరుడుడు - అనే ఇద్దఱి శేషత్వాన్ని చెప్పినపుడే భగవానుని శేషాన్ని (భుక్తశేషాన్ని) భుజించే విష్వక్సేనాది నిత్యసూరులు అందఱు ఈ లక్ష్మీదేవికి దాసభూతులు అనే విషయం కిం పునర్న్యాయసిద్ధం కదా! "**కైముత్యా దన్యేషాం నిత్యానాం ముక్తానా మప్యేతత్ పరిజనపరిచ్ఛదభావేన అవస్థానం ఖ్యాప్యతే**" అని దేశికవ్యాఖ్య.

**"త్వదీయభుక్తోజ్ఝితశేషభోజినా త్వయా నిసృష్టాత్మభరేణ యద్యథా, ప్రియేణ సేనాపతినా నివేదితం తథాऽనుజానంత ముదారవీక్షణైః"** (స్తోత్రరత్న-42) (నీవు భుజించగా మిగిలిన శేషాన్ని భుజించేవాడు, నీచే అప్పగించబడ్డ నీ ఉభయవిభూతి నిర్వాహరూపం అయిన భారాన్ని కలవాడు, అందఱికీ మిత్రుడు అయిన విష్వక్సేనునిచే ఏ పనులు ఏయే రీతిలో విన్నపింపబడ్డాయో, కరుణాపూర్ణకటాక్షాలతో ఆయా కార్యాలను ఆ రీతిలోనే ఆమోదించేవానిని) అని, **"హతాఖిలక్లేశమలైః స్వభావత స్తదానుకూల్యైకరసై స్తవోచితైః, గృహీతతత్పరిచారసాధనైః నిషేవ్యమాణం సచివై ర్యథోచితమ్"**

ఇవర్తామే అరుళిచ్చెయ్తారిఱే. "శ్రియాఽ సహాసీనమ్" ఎన్ఱు ఇవళోట్టై చ్చేర్త్తియిలేయిఱే అశేషపరిజనముమ్ అడిమై శెయ్వతు. ఇవరుడైయ దివ్యసూక్తియిఱ్పడియే భాష్యకారరుమ్, "శ్రీవల్లభ" ఎన్ఱు తొడఙ్గి, "అశేషశేషాశనప్రముఖనానావిధాఽనన్తపరిజనపరిచారికాపరిచరితచరణయుగళ" ఎన్ఱనుసన్ధిత్తరుళినారిఱే. "ధన్యా స్తే పరిచారకర్మణి సదా పశ్యన్తి యే సూరయః" ఎన్ఱు భట్టరరుళిచ్చెయ్తారిఱే. ఇనిత్తాన్ "తిరుమక"ళెన్ఱిఱే, ఎల్లారుమ్ కుఱ్ఱేవల్ శెయ్వతు. "శేషశేషాశనాది సర్వం పరిజనం భగవత స్తత్తదవస్థోచితపరిచర్యాయా మాజ్ఞాపయన్త్యా" ఎన్ఱు ఇవళుడైయ ఆజ్ఞాఽనువర్తనపరరాయిఱే అశేషపరిజనము మిరుప్పతు.

---

(స్తోత్రరత్న-43) ( క్లేశాలను, ప్రకృతిసంబంధం అనే మలాన్ని లేనివారు, సహజంగానే ఎల్లప్పుడూ నీ కైంకర్యాన్నే భోగ్యంగా కలవారు, నీకు తగినవారు, ఆయా కైంకర్యాలకు సాధనాలైన పూమాలికలు, ధూపం, దీపం మొదలైనవానిని ధరించేవారు, నీకు క్రమానుసారం తెలిపి కైంకర్యాన్ని చేసేవారు అయిన నిత్యసూరులచేత స్వరూపానికి తగినట్లు సేవింపబడేవాడుగా) అనే ఈ రెండు శ్లోకాలతో అందఱు నిత్యసూరులు సమస్తలోకజనని అయిన ఈమె విషయంలో కైంకర్యాన్ని చేసే రీతిని వీరే అనుగ్రహించారు కదా! **"తయా సహాసీన మనంతభోగిని"** ఇత్యాది స్తోత్రరత్నప్రమాణంలో అనుగ్రహించిన రీతిలో భగవానుడు, పిరాట్టి అనే ఇద్దఱు కలిసి వేంచేసి ఉండే సన్నివేశంలోకదా నిత్యసూరులు అందఱూ కైంకర్యాన్ని చేయడం. ఈ దివ్యసూక్తులను అనుసరించే శ్రీరామానుజులు కూడా-**"స్వాభిమతనిత్యనిరవద్యానురూపస్వరూపరూపగుణ విభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణశ్రీవల్లభ! భూమినీళాయక! స్వచ్ఛందానువర్తి స్వరూపస్థితిప్రవృత్తిభేదాశేషైక రతిరూప నిత్యనిరవద్యనిరతిశయజ్ఞాన-క్రియైశ్వర్యాద్యనంత కల్యాణగుణగణ! శేషశేషాశనగరుడ ప్రముఖనానావిధానంత పరిజనపరిచారికా పరిచరిత చరణయుగళ"** (శరణాగతి గద్యమ్) (తనకు) ప్రియంగాను, నిత్యంగాను, దోషరహితంగాను, తగినట్లుగాను ఉండే స్వరూపం, రూపం, రూపగుణాలు, సంపద, ఐశ్వర్యం, శీలం మొదలైన అంతులేని, గొప్ప లెక్కలేనన్ని కల్యాణగుణగణాలు మొదలైనవానిని కల లక్ష్మీదేవికి, ప్రియమైనవాడా! భూదేవికి, నీళాదేవికి నాయకుడవై ఉండేవాడా! నీ మనస్సును అనుసరించి ఉండే స్వరూపస్థితి-ప్రవృత్తి-నివృత్తులను కలవారు, సకలవిధకైంకర్యాలను చేయడంలోనే ఆసక్తిని కలవారు, నిత్యులు, దోషరహితులు, గొప్ప జ్ఞానం, శక్తి, ఐశ్వర్యం మొదలైన అనంతకల్యాణగుణగణ-



అవన్ఱాన్, "సహ పత్న్యా" ఎన్ఱు పత్నీసహితనాయ్ ప్రాప్తవిషయ పరిచర్యై పణ్ణి మెన్ఱైయాలుమ్, బ్రహ్మాదికళ్ సదయితరాయ్క్కొణ్డు దాసదాసీగుణమా యిరుప్పర్కళెన్ఱు మేలే శొల్లుకైయాలుమ్, ఇవర్కళుమ్ సపత్నీకరాయ్ కొణ్డు విష్ణుపత్నిక్కడిమైయా యిరుప్పర్కళెన్ను మిడమ్ సిద్ధమిఱే. ఇవర్కళ్తాన్ అఙ్గనీ విశోకైకళోడుమ్, కాన్తి-వారుణికళోడుమ్, రుద్రా-సుకీర్తికళోడుమ్, సూత్రవతియోడుమ్, సుదర్శనవల్లి-విజయవల్లియోడుఙ్గూడ సకుటుమ్బమాకవిఱే జగత్కుటుమ్బియాన శ్రియఃపతిక్కు అడియై శెయ్వదు. ఆకైయిఱే "పరిజనపరిచారికా పరిచరితచరణ యుగళ" ఎన్ఱరుళిచ్చెయ్దదు, ఇవర్కళ్తాన్ భాగవతసత్కారదశైయిలుమ్

---

సమూహాన్ని కలవారు అయిన ఆదిశేషుడు, విష్వక్సేనుడు, గరుడుడు మొదలైన పలువురు లెక్కలేనంతమంది దాసదాసీగణాలచేత సేవింపబడే శ్రీపాదద్వంద్వాన్ని కలవాడా !) అని అంటూ ఈ విషయాన్ని అనుసరించి అనుగ్రహించారు కదా! శ్రీపరాశరభట్టర్కూడా **"హేలాయా మఖిలం చరాచర మిదం భోగే విభూతిః పరా ధన్యా స్తే పరిచారకర్మణి సదా పశ్యంతి యే సూరయః, శ్రీరంగేశ్వరదేవి! కేవలకృపానిర్వ్యాహ్యవర్గే వయం శేషిత్వే పరమః పుమాన్ పరికరా హ్యేతే తవ స్ఫారణే"** (శ్రీగుణ-22) (శ్రీరంగనాయకీ! స్థావర-జంగమరూపంలోని ఈ లోకం అంతా నీ లీలలకోసం. మేలయిన నిత్యవిభూతి నీ భోగంకోసం. భాగ్యశాలురై, ఎల్లప్పుడూ నిన్ను కళ్ళార దర్శిస్తూ ఉండే నిత్యసూరులు నీకు కైంకర్యం చేయడంకోసం ఉన్నవారు. నీ నిర్హేతుకకృపచేత రక్షింపబడేవారి గోష్ఠిలో మేము కూడా అన్వయిస్తాము. పరమపురుషుడు నీకు స్వామి. ఇవి అన్నీ నీ అతిశయాన్ని వ్యక్తం చేసే పరికరాలై ఉన్నాయి) అని ఈ విషయాన్ని అనుగ్రహించారు కదా! **"తేవిమారావార్ తిరుమకళ్ పూమి యేవ మఱ్ఱమరర్ ఆట్చెయ్వార్"** (తిరువాయ్-8-1-1) (దేవేరులైన లక్ష్మి భూదేవి ఆదేశించగా మిగిలిన నిత్యసూరులు తత్ప్రకారం సేవచేస్తారు.) అనే రీతిలో లక్ష్మీదేవిచే నియమింపబడికదా నిత్యసూరులు కైంకర్యాన్ని చేస్తారు. **"అనంతభోగిని శ్రీమద్వైకుంఠైశ్వర్యాది పరిజన మాజ్ఞాపయంత్యా"** ఇత్యాది శ్రీ వైకుంఠగద్యప్రమాణంలో చెప్పిన రీతిలో లక్ష్మీదేవి ఆజ్ఞానుసారంకదా నిత్యసూరులందరూ ప్రవర్తిస్తారు.

భగవానుడు అవతారదశలో-**"గతే పురోహితే రామః స్నాతో నియత మానసః, సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్"** (రామా-అయో-6-1) (పురోహితుడు వెడలిన తరువాత శ్రీరాముడు స్నానం చేసి, మనస్సును నియంత్రించి,

"పతియినిఱ్పాజ్గినిల్ పాతజ్గళ్ కఴివి", "పూశిత్తు నల్కువతు" "తన్దేవియరోడే" శేన్దే విఱే.

ఇని, ఇవర్కళిలుమ్ ఇవర్కళ్ మహిషికళ్, "దేవదేవదివ్యమహిషి"క్కు అన్తరజ్గపరిచారికైకళా యిరుక్కుమ్బడియై, "సైన్యధురీణప్రాణసహాయాం సూత్రవతీ మాశ్రయ మమ్బామ్, శ్రీపదలాక్షాలాఞ్ఛితసేవాప్రోతలసద్దోర్వల్లివిలాసామ్",

---

విశాలనేత్రాలను కల పత్నితోపాటు కూడినవాడై నారాయణుని ఆరాధన చేయడంకోసం సమీపించాడు) అని అన్నట్లు సీతాదేవితోకూడ శ్రీ రంగనాథునకు కైంకర్యాన్ని చేశాడు-అని శ్రీవాల్మీకి మహర్షి పల్కినందువల్ల, శ్రీ యామునులు-బ్రహ్మ మొదలైన దేవతలు తమ పత్నులతో కలసి ఈమెకు దాసదాసీజనంగా ఉంటారు-అని ఈ శ్లోకంలోనే అనంతరం చెప్పినందువల్ల, ఈ ఆదిశేషుడు, గరుడుడు, విష్వక్సేనుడు మొదలైన నిత్యసూరులుకూడా తమ తమ పత్నులతో కలసియే విష్ణుపత్ని అయిన ఈ లక్ష్మీదేవికి కైంకర్యాన్ని చేస్తారు-అనే విషయం స్వయంగానే స్పష్టమవుతున్నదికదా! అందువల్ల ఆదిశేషుడు అంజలి, విశోక, కాంతి, వారుణి-అనే తన పత్నులతోను, గరుడుడు రుద్ర, సుకీర్తి-అనే తన పత్నులతోను, విష్వక్సేనుడు సూత్రవతి అనే తన పత్నిలోను, సుదర్శనుడు సుదర్శనవల్లి, విజయవల్లి-అనే తన పత్నులతోను సకుటుంబంగానే కైంకర్యం చేస్తారు. అందువల్లనే **"స్వాభిమతనిత్యనిరవద్య..."** ఇత్యాదిగా పూర్వం ఉట్టంకించిన శరణాగతిగద్య ప్రమాణంలో శ్రీ భాష్యకారులు కూడా **"నానావిధానంతపరిజనపరిచారికాపరిచరిత చరణయుగళ"** అని అనుగ్రహించారు. **"పదియినిల్ పాజ్గినిల్ పాదజ్గళ్ కఴివినర్"** (తిరువాయ్-10-9-10), (తమ దివ్యస్థానాలలో ఉపచారాలను చేసి, పాదాలను కడిగారు.) **"తేవర్ వైకల్ తీర్త్తజ్గళే ఎన్ను పూశిత్తు నల్కి యురైప్పర్ తమ్ తేవియర్క్కే"** (తిరువాయ్-7-10-11) (నిత్యసూరులు ప్రతిదినం వీరు పావనులు అని పూజించి పల్కి స్నేహంచేసి, తమ దేవులకు ఉపదేశిస్తారు) అని ఆఴ్వార్లుకూడా - నిత్యసూరులు తమ దేవేరులతో పాటు చేరే భాగవతులను పూజిస్తారు అని-చెప్పారు కదా !

ఈ నిత్యసూరులకంటేకూడా వీరి దేవేరులు దేవదేవదివ్యమహిషి అయిన ఈ లక్ష్మీదేవికి అంతరంగకైంకర్యాలను చేస్తారు - అనే విషయాన్ని **"సైన్యధురీణప్రాణ సహాయాం సూత్రవతీ మాశ్రియ మంబామ్, శ్రీపదలాక్షాలాంఛిత సేవాప్రోతలసద్దోర్వల్లి విలాసామ్"** (శ్రీరంగ-1-5-1) (లక్ష్మీదేవియొక్క శ్రీపాదాలలో సమర్పించిన లత్తుకపంకం గుర్తులను కల్గినది, లక్ష్మీదేవి శ్రీపాదాలను ఒత్తే కైంకర్యానికి పనికి



"తార్క్ష్యపక్షతివ దస్య వల్లభాం రుద్రయా సహ సుకీర్తి మర్చయే, హర్షబాష్ప మపి కీర్తి మర్థినాం యన్ముఖేన కమలా కటాక్షయేత్" ఎన్ఱుమ్ భట్టరరుళిచ్చెయ్తారిఱే.

ఇని, భూమినీళైకళుమ్ ఇవళుక్కు శేషభూతరాయ్ సేవిత్తిరుప్పర్కళ్. "శ్రీసహాయః . . . ., ఉభాభ్యాం భూమినీళాభ్యం సేవితః" ఎన్ఱతిఱే. "మాధవ త్వయి అహం శిష్యా చ దాసీ చ భక్తా చ" ఎన్ఱుతానే అరుళిచ్చెయ్తాళిఱే. "ఉత్ఫుల్లపఙ్కజతటా కమివోపయాని శ్రీరఙ్గరాజ మిహ దక్షిణసవ్యసీమ్నోః, లక్ష్మీం విహారరసికా మివ రాజహంసీం ఛాయామివాஉభ్యుదయినీ మవనీఞ్చ తస్యాః" ఎన్ఱు ఇవళుక్కు

---

వచ్చేది అయిన సేవావస్త్రంతో ప్రకాశించే లత వంటి బాహువులతో ప్రకాశిస్తున్నది, విష్వక్సేనుల ప్రియపత్ని అయిన సూత్రవతి అనే తల్లిని ఆశ్రయిస్తున్నాను), **"తార్క్ష్యపక్షతివదస్య వల్లభాం రుద్రయా సహ సుకీర్తి మర్చయే, హర్షబాష్ప మపి కీర్తి మర్థినాం యన్ముఖేన కమలా కటాక్షయేత్"** (శ్రీరంగ-1-54) (లక్ష్మీదేవి ప్రార్థించే వారికి ఆనందబాష్పాన్ని, కీర్తిని ఏ గరుడపత్నుల మూలంగా కటాక్షించి అనుగ్రహిస్తున్నదో, ఆ గరుడుని పక్షమూలంవలె ఆ గరుడునకు ప్రియం అయిన ఆ సుకీర్తిని రుద్రతోపాటు పూజిస్తున్నాను) అని పరాశరభట్టర్ అనుగ్రహించారు.

ఇక, **"వైకుంఠే తు పరే లోకే శ్రీసహాయో జనార్దనః, ఉభాభ్యాం భూమినీళాభ్యాం సేవితః పరమేశ్వరః"** (శ్రీవైకుంఠం అనే గొప్ప లోకంలో శ్రీదేవితోపాటు కూడి ఉండే భగవానుడు భూదేవి, నీళాదేవులు ఇరువురిచే సేవింపబడుతున్నాడు) అనే రీతిలో భూమినీళాదేవేరులుకూడా ఈ పిరాట్టికి శేషభూతులై కైంకర్యాన్ని చేస్తారు. **"అహం శిష్యా చ దాసీ చ భక్తా చ త్వయి మాధవ"** (వరాహపురాణమ్) -( శ్రీమన్నారాయణా! భూదేవిని అనే నేను నీకు శిష్యురాలిని, దాసురాలిని, భక్తురాలినికూడా ) అని భూదేవి మాధవుడనే శ్రియఃపతికి తాను దాసి అని చెప్పింది కదా! **"ఉత్ఫుల్లపంకజ తటాక మివోపయాని శ్రీరంగరాజ మిహ దక్షిణసవ్యసీమ్నోః, లక్ష్మీం విహారరసికా మివ రాజహంసీం ఛాయా మివాభ్యుదయినీ మవనీం చ తస్యాః"** (శ్రీరంగరాజస్తవ.1-63) (ఈ గర్భాలయంలో వికసించిన తామర పూవులనుకల కొలనువలె ఉండే శ్రీరంగనాథుని ఆశ్రయిస్తున్నాను. కుడివైపు, ఎడమవైపు క్రీడించే ఆడహంసలవలె ఉండే శ్రీదేవిని, వృద్ధిచెందే ఆమె నీడవలె ఉండే భూదేవిని ఆశ్రయిస్తున్నాను) అని పరాశరభట్టర్కూడా శ్రీరంగరాజస్తవంలో భూదేవి లక్ష్మీదేవికి పాదచ్ఛాయవలె పరతంత్రగా ఉంటుందని అన్నారు. శ్రీగుణరత్నకోశంలోని **"పుష్పాంగరాగై స్సమమ్"** అనే 26వ శ్లోకంలోకూడా

ప్పాదచ్చాయైపోలే పరతన్త్రర్కళాయిరుప్పర్కళెన్ఱుమ్, "పుష్పాఙ్గరాగఙ్గ"ళోపాతి భోగోపకరణఙ్గళాయ్, "స్తనబాహుదృష్టికళ్" పోలే అవయవభూతరాయిటే, అల్లాత మహిషీవర్గఙ్గళిరుప్పతు-ఎన్ఱు భట్టరరుళిచ్చెయ్తరుళినారిటే, "కుÇఱ్కోవలర్ మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్ నిÇల్పోల్వనర్" ఎన్నక్కడవతిటే.

ఆక, భూమినీళైకళ్ముతలాన మహిషికళుమ్, తిరువడి, తిరువనన్దాÇ్వాన్ ముతలాన సూరివర్గముమ్, "కరై కణ్డోర్" ఎన్గిఱ ముక్తరుమ్ ఇవళుక్కు శేషభూత రెన్ఱు శొల్లుకైయాలే, నిత్యవిభూతి యడఙ్గ, ఇవళుక్కు శేషమాయిరుక్కు మెన్నుమిడమ్ దర్శిప్పిక్కప్పట్టతు.

---

భట్టర్ భూమి మొదలైన దేవేరులు లక్ష్మీదేవికి తన తిరుమేనిలో అలంకరించుకొన్న పుష్పాలు, చందనం, ఇత్యాదులవలె భగవానుని అనుభవించేటపుడు ఉపకరణాలవలె ఉంటారు-అని, "**స్తనబాహుదృష్టిభిరివ**" తమ స్తనాలు, బాహువులు, నేత్రాలవలె అవయవభూతులై ఉంటారు-అని అనుగ్రహించారు. **"కుÇఱ్కోవలర్ మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్ నిÇల్పోల్వనర్"** (తిరువిరుత్తమ్-3) (పిల్లనగ్రోవిని నిరూపకంగా గల గోపాలవంశంలో అవతరించిన భవ్య అయిన నప్పిన్న, భూదేవి లక్ష్మీదేవికి ఛాయ వంటివారు) అని శ్రీభూమి నీళాదేవులు ముగ్గురు నీడల వలె భగవానుని విడచి ఉండకుండా, ఒకరిని వేఱొకరు విడచి ఉండకుండా కైంకర్యాన్ని చేస్తారు-అని అంటూ నమ్మాÇ్వార్లు కూడా అనుగ్రహించారు.

అందువల్ల, ఈ రీతిలో భూదేవి, నీళాదేవులు మొదలైన దివ్యదేవేరులు, గరుడ-అనంతాది నిత్యసూరులు, **"కరై కణ్డోర్"** (తిరువాయ్-8-3-10) (తీరాన్ని చూచినవారు) అని చెప్పబడే ముక్తులు ఈ లక్ష్మీదేవికి శేషభూతులు-అని చెప్పడంవల్ల, నిత్యవిభూతిలో ఉండే చేతనులు అందఱు ఈమెకు శేషభూతులని చూపబడింది.

తరువాత, లీలావిభూతి అంతా ఈమెకు శేషభూతం అనే విషయాన్ని అనుగ్రహించాలని ప్రారంభించి, అందులో మొదట లీలావిభూతికి కారణం అయిన మూలప్రకృతి ఈమెకు శేషభూతంగా ఉండడాన్ని "**యవనికా మాయా**" ఇత్యాదిగా చూపుతున్నారు.

**(యవనికా మాయా జగన్మోహినీ) అని. "జగన్మోహినీ మాయా తే యవనికా"** అని ఇక్కడ అన్వయించి అర్థాన్ని చెప్పాలి. ఈ సంసారమండలంలో ఉండే బద్ధజీవులను అనాదికాలంగా అజ్ఞానంతో మోహింపచేసేది, భగవానుడు ఆశ్చర్యకరలీలను చేయడానికి సాధనంగా ఉండడంచేత **"మాయా"** (ఆశ్చర్యకరమైనది) అనే పదంతో వ్యవహరింపబడేది అయిన మూలప్రకృతి - సౌందర్యం, సౌకుమార్యం, లావణ్యం,



అనన్తరమ్ లీలావిభూతి యడఙ్గ ఇవళుక్కు చ్చేషమాయిరుక్కు మెన్నుమిడత్తై అరుళిచ్చెయ్య ఉపక్రమిత్తు, అతిల్ ప్రథమమ్ లీలావిభూతికారణమాన మూలప్రకృతి ఇవళుక్కు చ్చేషమాయిరుక్కుమ్బడియై దర్శిప్పిత్తరుళుకిఱార్ (యవనికా మాయా జగన్మోహినీ) ఎన్ఱు.

(జగన్మోహినీ మాయా తే మోహినీ యవనికా) అన్యాద్యజ్ఞానత్తాలే జగత్తై మోహిప్పిక్కడవతాయ్, విచిత్రకార్యకరణోపకరణమాకైయాలే మాయాశబ్దవాచ్యైయా-యిరుక్కిఱ మూలప్రకృతి, సౌన్దర్య- సౌకుమార్య-లావణ్య- యౌవనాద్యనన్తగుణగణ-విశిష్టమాన ఉన్నుడైయ దివ్యమఙ్గళవిగ్రహముమ్, తదాధారమాన దివ్యాత్మస్వరూపముమ్ ప్రతికూలర్దృష్టిగోచరమాకామల్ మఱైక్కైక్కు త్తిరైయా యిరుక్కుమ్.

తిరై యావతు-అన్తర్వర్తిపదార్థఙ్గళై బహిశ్చరర్క్కు త్తెరియాతపడి తిరోధానమ్ పణ్ణువతాయ్, శుక్లకృష్ణరక్తతన్తుక్కళాల్ శమైక్కప్పట్టు నానావర్ణఙ్గళాలే విచిత్రైయాయ్,

---

యౌవనం మొదలైన అంతులేని గుణసమూహాలతో కూడిన నీ అప్రాకృత దివ్యదేహం, దానిని ధరించి ఉండే దివ్యాత్మస్వరూపం-విరోధుల అంతఃచక్షువుకు, బాహ్యచక్షువుకు కనపడకుండా మఱుగుపఱచే తెరగా ఉంటుంది.

తెర అనేది-లోపల ఉండే వస్తువులు బయటకు గోచరించకుండా ఉండేటట్లు మఱుగుపఱచేదై, తెలుపు, నలుపు, ఎఱుపు రంగులను కల దారాలతో నేయబడినది, పలు రంగులను కల్గినది కాబట్టి విచిత్రంగా ఉండే, చాలా ఆశ్చర్యకరం అయిన వస్తువు. ఈ మూల ప్రకృతికూడా దివ్యదంపతుల దివ్యాత్మస్వరూపాన్ని, దివ్యమంగళ విగ్రహాన్ని, అప్రాకృతాలు అయిన వీరి అవయవాలను వీరిని ఆశ్రయించనివారికి కానరాకుండా ఉండేటట్లు అజ్ఞానాన్ని కల్గించి, మఱుగుపఱచే తెరవలె ఉన్నందువల్ల, **"అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం (సృజమానాం) జనయంతీం సరూపామ్, అజో హ్యేకో జోషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగ్యా మజోఽన్యః"** (శ్వేత-4-5) (ఎఱుపు-అంటే రజోగుణం, తెలుపు-అంటే సత్వగుణం, నలుపు-అంటే తమోగుణాలతో కూడినదై, తనవంటి పలు ప్రజలను సృష్టించేదై, జన్మరహిత అయిన ప్రకృతి అనే ఒక స్త్రీని జన్మరహితుడైన ఒక (సంసారి) జీవుడు ప్రీతితో భుజిస్తున్నాడు. ఈమెను భుజించిన వేఱొక జీవుడు (ముముక్షువు) ఈమెను విడిచి పోతున్నాడు) అనే రీతిలో ఎఱుపు, తెలుపు, నలుపు రంగులతో సూచింపబడే రజస్సత్త్వతమో గుణాలతో కూడిన విచిత్రమైన కర్మలనే దారాలతో కట్టబడినది. విచిత్రమైన సృష్టిని చేయడంవల్ల చాలా ఆశ్చర్యకరంగా ఉన్నందువల్లకూడ ప్రకృతిని తెరగా రూపణం చేస్తున్నారు.

అత్యాశ్చర్యవిశిష్టైయా యిరుప్పతొన్ఱు. ఇతువుమ్ దివ్యదమ్పతికళుడైయ దివ్యాత్మ స్వరూపత్తైయుమ్, దివ్యమఙ్గళవిగ్రహత్తైయుమ్, దివ్యావయఙ్గళైయుమ్। అనాశ్రితర్క్కు। గోచరియాదపడి, అజ్ఞానత్తై విళైత్తు తిరోధాయకమాక తిరస్కరిణియాయిరుక్కైయాలుమ్, "లోహితశుక్లకృష్ణామ్" ఎన్గిఅపడియే గుణత్రయవిశిష్టవిచిత్ర కర్మసూత్రత్తాలే కట్టప్పట్టు విచిత్రసృష్టియై ప్పణ్ణుకైయాలే ఆశ్చర్యతమైయాయిరుక్కైయాలుమ్, తిరైయాకనిరూపిక్కిఱార్.

(జగన్మోహినీ) పరమాత్మవిషయమాకవుమ్, ప్రత్యగాత్మవిషయమాకవుమ్, స్వవిషయమాకవుమ్ అన్యథాజ్ఞాన-విపరీతజ్ఞానఙ్గళై ప్పిఱప్పిత్తు, అత్తాలే మోహిప్పిక్కైయాలే (జగన్మోహినీ) ఎన్గిఱార్. పరమాత్మావినిడత్తిల్ అన్యథాజ్ఞానవిపరీతజ్ఞానఙ్గళై ప్పిఱప్పిక్కైయావతు-శ్రియఃపతియాయ్, నిఖిలహేయప్రత్యనీకకల్యాణగుణవిశిష్టనాయ్, ఉభయవిభూతినిర్వాహకనాయిరుక్కిఱ పురుషోత్తమనై, "నిర్విశేషచిన్మాత్రం వస్తు" ఎన్ఱు

---

**(జగన్మోహినీ)**-పరమాత్మ విషయంలోని, జీవాత్మ విషయంలోని, తన విషయంలోని స్వరూప-స్వభావాలను తెలిసికో లేకుండా చేసి. దానివల్ల లోకాన్ని మోహింపజేయడంవల్ల **"జగన్మోహినీ"** అని అంటున్నారు. పరమాత్మ స్వరూపాన్ని తెలియకుండా ఉండడం విపరీత జ్ఞానం అని, పరమాత్మ స్వభావాన్ని తెలియకుండా ఉండడం అన్యథాజ్ఞానం అని చెప్పబడుతున్నది. అంటే-శ్రియఃపతియై, నిఖిలహేయ-ప్రత్యనీకుడై, సకలకల్యాణగుణాలతో కూడినవాడై, ఉభయవిభూతినాయకుడైన పురుషోత్తమునిగూర్చి-**"నిర్విశేషచిన్మాత్రం బ్రహ్మ"** (ఏ విశేషంలేని జ్ఞానమాత్రం అయినది బ్రహ్మ) అనే మాయావాదాన్ని చేయడం,"చిదచిదీశ్వరులనే మూడు ఒకే ద్రవ్యంయొక్క పరిణామరూపాలు"-అని, మూడు తత్త్వాలమధ్య భేదం-అభేదం ఒకే సమయంలో ఉంటుంది" అని అనడం, "కర్మానుష్ఠానంకోసం చేతనుడు ఉన్నాడని అంగీకరించాలి. ఈశ్వరుడు అనే తత్త్వాన్ని ఒప్పుకోవడంలో ఏ ఫలం లేదు. అని ఈశ్వరసత్తను అంగీకరించకపోవడం, మొదలైనవి పరమాత్మ కనుక, ఈశ్వరుడనే తత్త్వాన్ని అంగీకరించడంలో ఏ ఫలం లేనందువల్ల ఈశ్వరుడు లేడు" అని ఈశ్వరసద్భావాన్ని ఒప్పుకోకుండా ఉండడం - మొదలైన అజ్ఞానాలే పరమాత్మ విషయంలో అన్యథాజ్ఞాన-విపరీతజ్ఞానాలను జనింపచేయడం. మూలప్రకృతి జీవాత్మవిషయంలో అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానాలను కల్గించడం అంటే- **"అనాత్మన్యాత్మబుద్ధి ర్యా చాస్వే స్వ మితి యా మతిః, సంసారతరుసంభూతిబీజ మేతత్ ద్విధా స్థితమ్"** (విష్ణుపు-6-7-11) (ఆత్మ



మాయావాదమ్ శొల్లుతల్, "చిదచిదీశ్వరర్కళ్ మూన్ఱుమ్ ఏకద్రవ్యపరిణామమ్" ఎన్ఱు భేదాఽభేదమ్ శొల్లుతల్, 'కర్మానుష్ఠానత్తుక్కు చ్చేతననుణ్డాకిల్, ఫలప్రదానత్తుక్కు క్కర్మముణ్డాకిల్, ఇని ఈశ్వరన్ ఎతుక్కు?" ఎన్ఱు తత్సద్భావత్తై ఇశైయాతొ౯ితల్-ఏవమాదికళాన బుద్ధికళై ప్పిఱప్పిక్కై. ప్రత్యగాత్మావినిడత్తిల్ అన్యథాజ్ఞాన-విపరీతజ్ఞానఙ్గళై ప్పిఱప్పిక్కైయావతు-"అనాత్మన్యాత్మబుద్ధి ర్యా" ఎన్గిఅపడియే "దేహమే ఆత్మా" ఎన్నుతల్, ఇన్ద్రియాదికళై ఆత్మా ఎన్నుతల్, దేహపరిణామ మెన్నుతల్, అన్యశేష మెన్నుతల్, స్వతన్త్ర మెన్నుతల్- ఏవమాదియాన విప్రతిపత్తికళై విళైక్కై. స్వవిషయమాక విపరీతధీయై విళైక్కై. యావదు - స్వకార్యమాన శబ్దాదికళిలే భోగ్యత్వబుద్ధియై పిఱప్పిక్కై. ఇవ్వర్థత్రయత్తైయుమ్ భాష్యకారర్ "భగవత్స్వరూపతిరోధానకరీం, విపరీతజ్ఞానజననీం, స్వవిషయాయా శ్చ భోగ్యబుద్ధే ర్జననీమ్" ఎన్ఱరుళిచ్చెయ్‌తారిఱే.

---

కాని దేహాలలో ఆత్మ అనే బుద్ధి, తనది కాని వస్తువులో తనది అనే బుద్ధి-అనే ఈ రెండు సంసారం అనే విషవృక్షంయొక్క వృద్ధికి రెండు విధాలైన విత్తులు) అనే రీతిలో దేహమే ఆత్మ-అని అనడం, ఇంద్రియాలు మొదలైనవానిని ఆత్మ -అని అనడం, పంచభూతాలు ఒకటిగా చేరి పరిణమించేటపుడు ఏర్పడేది ఆత్మ అని అనడం, ఆత్మ శివుడు మొదలైన అన్యదైవాలకు శేషభూతాలు అని అనడం-మొదలైన అజ్ఞానాలను కల్గించడమే. తన విషయంగా అన్యథాజ్ఞాన-విపరీతజ్ఞానాలను కల్గించడం అంటే-ప్రకృతి అనే తననుండి పుట్టే శబ్దాది విషయాలను కల ప్రాకృతవస్తువులలో ఇవి భోగ్యమైనది-అని మొదలైన జ్ఞానాలను కల్గించడమే. **''భగవత్స్వరూపతిరోధానకరీం విపరీతజ్ఞానజననీం స్వవిషయాయా శ్చ భోగ్యబుద్ధే ర్జననీం మాం తారయ''** (శరణాగతిగద్యమ్-12) (భగవత్స్వరూపాన్ని మఱుగుపఱచేది, విపరీతజ్ఞానాన్ని కల్గించేది, తన విషయంగా భోగ్యబుద్ధిని కల్గించేది అయిన ప్రకృతినుండి నన్ను రక్షించు) అని శ్రీభాష్యకారులుకూడా శరణాగతిగద్యలో వీటిని అన్నిటినీ అనుగ్రహించారుకదా!

**"మాయా"** అనే శబ్దంతో **"అనాదిమాయయా సుప్తః యథా జీవః ప్రబుధ్యతే"** (గౌడపాదకారిక-21) (అనాదిమాయ అనే ప్రకృతిచే (కట్టుబడి) నిద్రించే జీవుడు ఎపుడు నిద్ర లేస్తాడో) అనే రీతిలో మూలప్రకృతిని తెలుపుతుంది. ఇదికూడా ఆశ్చర్యమైన మోహాన్ని కల్గించే మాయ అయినందువల్లనేకదా జగన్మోహినీ అయినది. **"మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్"** (శ్వేత-4-10) (మాయ అనేది

మాయాశబ్దత్తాలే "మాయా న్తు ప్రకృతిం విద్యాత్" ఎన్గిఱపడియే మూలప్రకృతియైచ్చొల్లుకిఱతు. ఇతుతాన్ మాయైయాకైయాలేయిఱే జగన్మోహిని యాయిఱ్ఱు. "అనాదిమాయయా సుప్తః" ఎన్నక్కడవతిఱే, అజ్ఞానహేతువాయిఱే ఇతుతానిరుప్పతు. ఆక ఇప్పడి మాయాశబ్దవాచ్యైయాయ్, జగన్మోహినియాన మూలప్రకృతి. యవనికారూపేణ కించిత్కరిత్తు శేషమాయిరుక్కు మెన్డదాయిఱ్ఱు.

యవనికై యాకిల్, అన్తర్వర్తికళోడు బహిశ్చరరోడు వాశియఱ దృష్టిప్రసరణ నిరోధత్తాలే అన్యోన్యాఽవలోకననిరోధినియాయిఱే యిరుప్పతు. అప్పడియే ప్రకృతియై యవనికైయాక నిరూపిక్కుమ్పోతు పిరాట్టిక్కుమ్ స్వవ్యతిరి క్తసకలపదార్థదర్శనమ్ పణ్ణవొణ్ణాతిఱే, అజ్ఞనేయాకిల్, పిరాట్టిక్కుమ్ కర్మవశ్యత్వముమ్, అత్తాలే

ఆశ్చర్యకరసృష్టికి హేతువు అయిన ప్రకృతి. ఆ మాయను ఛేదించే మాయావి సర్వేశ్వరుడు. జీవుడు మాయ అనే ప్రకృతిచే కట్టుబడి, మోహాన్ని పొంది పడి ఉంటాడు) అని చెప్పబడిందికదా! "**మాయాశబ్దోఽయం మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్-ఇతి ప్రకృతివిషయతయా శ్వేతాశ్వతరై రధీతః**" అని దేశికవ్యాఖ్య. అజ్ఞానాన్ని కల్గించేదికదా ఈ ప్రకృతి. అందువల్ల ఈ విధంగా **"మాయా"** అని చెప్పబడడంచేత లోకాన్ని మోహింపజేసే మూలప్రకృతి పట్టమహిషివి అయిన నీపైన ఇతరుల కన్ను పడకుండా ఉండేటట్లు మఱుగుపఱచే తెరవలె ఉండి, కైంకర్యాన్ని చేసి నీకు శేషంగా ఉంటుంది-అని చెప్పబడినట్లయింది.

ఈ సందర్భంలో ఒక ఆక్షేపం చేయబడుతున్నది. "తెర అనేది బయట ఉండే వారికి లోపల ఉండే వారిని కనబడకుండా చేస్తుందికదా! ఈ ప్రకృతి తెరగా రూపించబడడంవల్ల పిరాట్టికి లోకానికి సంబంధించిన అజ్ఞానం, దానికి కారణం అయిన కర్మవశ్యత్వం, దానివల్ల భగవన్మాయచే తిరోహితమైన జ్ఞానాన్ని కల్గినదై ఉండడం- అనేవి అంగీకరించవలసి వస్తుందికదా! అందువల్ల ఇది ఏ విధంగా పొసగుతుంది? అనేది ఈ ఆక్షేపం. దీనికి సమాధానాన్ని ఈ క్రిందివిధంగా చెప్పవచ్చు. ఈ పిరాట్టికి శేషభూతమై, ఆమెచే నియమింపబడేనదై, ఆమెకు వశం అయిన ప్రవృత్తులను కల మూలప్రకృతి-స్వామిని, నియామక అయిన ఈమెను అన్నిటినీ చూడలేనిదిగా చేయగల్గినది కాదుకదా! **"అస్మా న్మాయీ సృజతే విశ్వ మేతత్ తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః"** (శ్వేత-4-9) ( ఈ మాయ అనే ప్రకృతివల్ల మాయావి అయిన భగవానుడు ఈ లోకాన్ని సృష్టించాడు. అందులో జీవుడనే వేఱొకడు మాయచే



భగవన్మాయాతిరోహితజ్ఞానత్వముమ్ అజ్గీకరిత్తతాయ్ విడుమిఱే. ఆకైయాల్ ఇతు శేరుమ్పడి యెన్? ఎన్నిల్, తచ్ఛేషభూతైయాయ్, తన్నియామ్యైయాయ్, తదధీనవ్యాపారత్తైయు ముడైత్తాన ప్రకృతి-స్వామినియాయ్, నియామకైయుమా-యిరుక్కిఱ ఇవళుడైయ సర్వవిషయదృష్టితిరోధానమ్ పణ్ణమాట్టాతిఱే. "మాయయా సన్నిరుద్ధః" ఎన్డుకొణ్డు, కర్మవశ్యైయాకిలిఱే-మాయాతిరోహితస్వప్రకాశైయాయిరుప్పతు. ఈశ్వరనైప్పోలే అకర్మవశ్యైయాన ఇవళుక్కు త్తిరోధానమ్కూడాతిఱే. ఆకైయాలే ప్రతికూలర్క్కుమ్ తత్స్వరూపరూపాదికళ్ యథావాక త్తోఱ్ఱాతపడి తిరోధానమ్పణ్ణుమత్తై ప్పఱ్ఱి త్తిరస్కరిణియాక రూపిత్తవిత్తాల్ ఒరు విరోధ మిల్లై.

ఆక క్కీఴ్ నిత్యవిభూతియిలుళ్ళార్ ఇవళుక్కు చ్ఛేషభూతరాయిరుక్కుమ్పడియై దర్శిప్పిత్తరుళి, లీలావిభూతికారణమాన మూలప్రకృతియినుడైయ శేషత్వత్తై

కట్టుబడి ఉన్నాడు) అనే రీతిలో మాయ అనే దీనికి కట్టుబడిన కర్మవశ్యురాలై ఉంటే కదా మాయచేత ఈమె జ్ఞానం ఆవరింపబడడానికి సాధ్యం. ఈశ్వరునివలె కర్మకు వశంకాని ఈమెను మాయ అనే మూలప్రకృతిలో మిగిలినవారిని చూడలేని రీతిలో ఆవరించలేదుకదా. అందువల్ల ప్రతికూలురకు ఈ పిరాట్టి స్వరూపరూపాదులు యథాతథంగా ప్రకాశించని రీతిలో ఆవరించడాన్నిబట్టి మూలప్రకృతి తెరగా రూపించబడింది- అనే చెప్పాలి. అందుచేత ఏ విరోధం లేదు. "**తదధీనసర్వవ్యాపారయా మాయయా తస్యాః సర్వవిషయసహజదృష్టినిరోధాయోగాత్**" అని దేశికవ్యాఖ్య. ఈ వ్యాఖ్యలో ఇంకా చాలా వివరాలు చర్చించబడ్డాయి.

ఈ విధంగా ఇంతవరకు నిత్యవిభూతిలో ఉండే చేతనులు ఈమెకు శేషభూతులై ఉండడాన్ని చూపి, లీలావిభూతికి కారణం అయిన మూలప్రకృతికూడా ఈమె శేషభూతం-అని అనుగ్రహించారు. ఇక ఆ మూలప్రకృతినుండి పుట్టిన బ్రహ్మాండంలోపల ఉండేవారై, ఆ మూలప్రకృతిచే మోహాన్ని పొందినవారై, కర్మవశ్యులైన బ్రహ్మాదిదేవతలు తమ పత్నులతోకూడ ఈమెకు శేషభూతులై ఉంటారు-అని ఇకపై అనుగ్రహిస్తున్నారు.

తెరపట్టవలసినట్లున్న లోకవిలక్షణులైన దివ్యదంపతులను చెప్పి, **"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే"** (రామా-అయో-31-25) అనే ప్రమాణంలో తెల్పిన రీతిలో తెరకు లోపల, బయట ఒకే విధంగా **"ఉడనాయ్ మన్ని ఒఴివిలా వడిమై శెయ్యవేణ్డుమ్"** (తిరువాయ్-3-3-1)

అరుళిచ్చెయ్‌తు, తదారబ్ధాణ్డాన్తర్వర్తికళాయ్, తాదృశప్రకృతివోహితరాయ్, కర్మవశ్యరుమాన బ్రహ్మాదికళ్ సపత్నీకరాయ్‌క్కొణ్డు ఇవళుక్కడిమైయాయిరుక్కుమ్బడియై అరుళిచ్చెయ్‌కిఱార్ మేల్ (బ్రహ్మేశాదీత్యాదియాల్).

తిరై వళైత్తిరుక్కవేణ్డుమ్బడి లోకవిలక్షణరాన దివ్యదమ్పతికళై చ్చొల్లి, "జాగ్రత స్స్వపత శ్చ" ఎన్ఱుకొణ్డు తిరైక్కుళ్ళోడు పుఱమ్బోడు వాశియఱ "ఉడనాయ్ మన్ని వఴు విలా వడిమై శెయ్‌తు" వాఴుమ్ అన్తరఙ్గరైచ్చొల్లి తిరైతన్నై చ్చొల్లి, తిరైక్కు ప్పుఱమ్బు నిన్ఱు సేవిత్తిరుక్కుమవర్‌కళై చొల్లుకిఱతు. "కడిక్కమలత్తుళ్ళిరున్దుమ్ కాణ్గిలా" నిఱే. "నీఱాడిత్తాన్ కాణమాట్టాత" "కార్ శెఱిన్ద కణ్డత్తానెణ్ కణ్ణాన్ కాణాన్, అవన్ వైత్త పణ్డైత్తానత్తిన్ పతి" ఎన్ఱరుళిచ్చెయ్‌తార్‌కళిఱే సర్వజ్ఞరాన వాఴ్వార్‌కళ్. "నెఱ్ఱి మేల్ కణ్ణానుమ్ నిఱైమొఴివాయ్ నాన్ముకనుమ్". "నాట్టమాయిరత్తానుమ్ తాన్దామ్ కఱ్ఱ

---

(సర్వదేశాలలోను స్థిరంగా ఉండి అవిచ్ఛిన్న కైంకర్యాన్ని చేయాలి) అని చెప్పిన రీతిలో సర్వదేశ–సర్వకాల– సర్వావస్థలలోను కైంకర్యం చేసే మూలప్రకృతిని తెలిపి, ఇపుడు తెరకు బయట ఉండి సేవించేవారిని ఈ ప్రయోగం తెలుపుతున్నది. **"కడిక్కమలత్తుళ్ళిరున్దుమ్ కాణ్గిలాన్ కణ్ణన్ అడిక్కమలన్ తన్నై అయన్"** (ముదల్ తిరు–56) (పరిమళాన్ని కల నాభీపద్మంలో ఉన్నా బ్రహ్మ స్వామి శ్రీపాదాలను చూడలేదు.) **"నీఱాడితాన్ కాణమాట్టాద తారకల చ్చేవడియై"** (నాన్ముకన్ తిరు–27) (భస్మాన్ని పూసికొన్న శివుడుకూడా దర్శించలేని, పూమాలనుకల, విశాలమైన ఎఱ్ఱని శ్రీచరణం) **"కార్ శెఱిన్ద కణ్డత్తాన్ ఎన్ కణ్ణాన్ కాణాన్ అవన్ వైత్త పణ్డైత్తానత్తిన్ పది"** (నాన్ముకన్–తిరు–73) (దట్టమైన నలుపును కంఠభాగంలో కల రుద్రుడు, ఎనిమిది కనులను కల బ్రహ్మ ఆ శ్రీకృష్ణుడు అనుగ్రహించే అనాది అయిన పరమపదానికి ఉపాయం అయిన చరమశ్లోకాన్ని తెలియలేరు.) అని సర్వజ్ఞులైన ఆఴ్వార్లు అనుగ్రహించిన రీతిలో బ్రహ్మ రుద్రాదులు కూడా ఈ దివ్యదంపతులను దర్శించలేరుకదా! **"నెఱ్ఱిమేల్ కణ్ణానుమ్ నిఱైమొఴివాయ్ నాన్ముకనుమ్"** (తిరుచ్ఛన్ద–108), (ఫాలాక్షుడు, వేదాలను ఉచ్చరించే బ్రహ్మ), (వేయి కన్నులను కల ఇంద్రుడుకూడ) **"కఱ్ఱపెఱ్ఱియాల్ వణఙ్గుమ్"** (తిరుచ్ఛన్ద–87) (తాము నేర్చిన విధానానికి తగినట్లు ఆశ్రయించే) అనే రీతిలో తాము తాము తెలిసిన రీతిలో నమస్కరించడం తప్ప, తీరం సమీపంలో నిలచి ప్రార్థించి పిలిచే వీరికి అవధిని (తీరాన్ని) చూడడం సాధ్యం కాదు కదా! **"తామోదర నురువాకియ శివఱ్కుమ్ తిశైముకఱ్కుమ్ ఆమో తర మఱియ ఎమ్మానై ఎన్నాఴివణ్ణనైయే"**



పెఱ్ఱియాల్ వణఙ్గ" మత్తనై పోక్కి, కరైయరుకే నిన్ఱు కూప్పిడుకిఱవర్‌కళ్ కరై కాణమాట్టార్‌కళిఱే. "శివఱ్కుమ్ తిశైముకఱ్కుమ్.... తర మఱియలామో" ఎన్నక్కడవతిఱే.

(బ్రహ్మేశాదీత్యాది) "యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్" ఎన్గిఱపడియే తిరునాభీకమలత్తిలే అవ్యవధానేన పిఱక్కైయాలే ఉనక్కు ప్పుత్రనాన బ్రహ్మా,త జ్జ్యేష్ఠపుత్రనాకైయాలే ఉనక్కు ప్పౌత్రనాన రుద్రన్. ఆదిశబ్దత్తాలే "సేన్ద్రాది", "తళిరొళి యిమైయవర్ తలైవన్", "నిన్ఱ శశిపతియై", "వెణ్బకట్టి లొరువన్" – ఎన్ఱు ఇవర్‌కళోడే సహపఠిక్కుమ్బడియాన నిలైమైయుడైయ ఇన్ద్రనైయుమ్, ''ఇన్దిరనుళ్ళిట్ట

---

(తిరువాయ్–2–7–12) (దామోదరునకు శరీరంగా ఉండే రుద్రునకు బ్రహ్మకు నా స్వామి సముద్రవర్ణుడైన మహిమను తెలియడం సాధ్యమా?) అని నమ్మాఴ్వార్లుకూడా దీనిని అనుగ్రహించారుకదా!

**(బ్రహ్మేశాది....దాసీగణః) –"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై, తం హ దేవ మాత్మబుద్ధిప్రసాదం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే"** (శ్వేత–6–18) (ఎవడు బ్రహ్మను ముందుగా సృష్టించాడో, ఎవడు వేదాలను అతనికి ఉపదేశించాడో, అటువంటి దేవుడు, తనకు సంబంధించిన జ్ఞానాన్ని ప్రకాశింపచేసేవాడు అయిన పరమపురుషుని మోక్షాన్ని పొందగోరే నేను శరణు పొందుతున్నాను) అనే రీతిలో నాభీకమలంలో సాక్షాత్తు జన్మించడంవల్ల అతనికి పుత్రుడైన బ్రహ్మ, అతనికి జ్యేష్ఠపుత్రుడైనందున పౌత్రుడైన రుద్రుని, **"ఆది"** శబ్దం – **"స బ్రహ్మ స శివః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్"** (తైత్తి–నారా–11) (అతడే బ్రహ్మకు అంతర్యామి. అతడే శివునకు అంతర్యామి. అతడే ఇంద్రునకు అంతర్యామి. అతడే నాశం లేనివాడై, ఉత్కృష్టుడై, కర్మవశ్యుడు కాని ముక్తునకుకూడ అంతరాత్మ) అని, **"నళిర్ మది చ్చడైయనుమ్ నాన్ముకక్కడవుళుమ్ తళిరొళి ఇమైయవర్ తలైవనుమ్ ముదలా"** (తిరువాశిరియమ్–7) (చల్లని చంద్రుని జటలలో కల శివుడు, చతుర్ముఖుడు, చిగురు కాంతివంటి కాంతిని కల దేవతలకు ప్రభువైన ఇంద్రుడుడు మొదలైన) అని, **"ఎన్ మలైమకళ్ కూఱన్‌తన్నై ఎన్ఱుమ్ ఎన్ నామకళై అకమ్బాల్ కొణ్డ నాన్ముకనై నిన్ఱ శశిపతియై"** (తిరువాయ్–7–6–7) (ఫాలాక్షుడు, వేదాలను ఉచ్చరించే చతుర్ముఖుడు, పొడుగుగా వేలాడే నోటిని, తొండాన్ని కల శ్వేతగజం అయిన ఐరావతాన్ని కల ఇంద్రుడు) అని, **"నెఱ్ఱిమేల్ కణ్ణానుమ్ నిఱైమొఴి వాయ్ నాన్ముకనుమ్, నీణ్డనాల్ వాయ్ ఒఱ్ఱక్కై వెణ్ పకట్టి లొరువనైయుమ్"** (పెరియతిరు–11–6–3) (పార్వతిని పార్శ్వంలోకల శివుడు వాగ్దేవిని సదా ముఖంలో కల వీరిద్దరితో సమానుడైన శచీపతి అయిన ఇంద్రుడు)

దేవర్కుఴాత్తై”యుమ్ శొల్లుకిఱతు. ఆక, ఇప్పడి విబుధశ్రేష్ఠరాన బ్రహ్మరుద్రర్కళ్ ముతలాన దేవతాసమూహమ్ ఉనక్కు దాసగణమాయ్, తత్పత్నికళాన సరస్వతీ- రుద్రాణీ- ఇన్ద్రాణీప్రభృతికళుమ్, తద్దాసీభూతరాన అప్సరస్సంఘఙ్గళుమ్, ఉనక్కు దాసీగణమాయ్, దాసకృత్యత్తిలే అనవరతాన్వయత్తై ఉడైయరాయ్క్కొణ్డు సత్తై పెఱ్ఱిరుప్పర్కళ్. ఇత్తాల్ “నీలార్ కణ్డత్తమ్మానుమ్ నిఱైనాన్ముకను మిన్దిరనుమ్-శేలేయ్ కణ్ణార్ పలర్ శూఴ” సేవిత్తిరుక్కుమ్బడియై చ్చొల్లిఱ్ఱు.

“తిరుమాలై క్కైతొఴువర్”, “హిరణ్యగర్భ స్సమవర్తతాఽగ్రే,” “భూతస్య జాతః పతి రేక ఆసీత్” ఎన్నుమ్, “యో దేవానాం ప్రథమం పురస్తా ద్విశ్వాధికో రుద్రో

---

అని ఈ ఇద్దఱిని చెప్పిన తర్వాత చెప్పవలసిన స్థానాన్ని కల ఇంద్రుని, **“ఇన్దిరనుళ్ళిట్ట తేవర్కుఴామ్”** (నాచ్చియార్. తిరు-6-3) (ఇంద్రుడు మొదలైన దేవసమూహం) అనే రీతిలో ఇంద్రుని నాయకునిగాకల మిగిలిన దేవతలను చెబుతుంది. ఈ విధంగా దేవతల నాయకులైన బ్రహ్మరుద్రేంద్రాది దేవసమూహం నీకు కైంకర్యాన్ని చేసే దాసగోష్ఠియై, నీకు సేవచేయడంలో ఎల్లప్పుడూ అభినివేశాన్ని కల్గి, తమ స్వరూపసత్తను పొందుతారు-అని భావం. దీనివల్ల **“నీలార్ కణ్డత్తమ్మానుమ్ నిఱై నాన్ముకనుమ్ ఇన్దిరనుమ్ శేలేయ్ కణ్ణార్ పలర్ శూఴ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే”** (తిరువాయ్-6-10-8) (నీలవర్ణంచే పూర్ణం అయిన కంఠాన్ని కల ప్రధానుడైన శివుడు, జ్ఞానపూర్తిని కల చతుర్ముఖుడు, ఇంద్రుడు, అందమైన చేపలవంటి కన్నులను కల పలువురు వనితలు తోడురాగా ఆశ్రయించే వేంకటేశ్వరా!) అనే రీతిలో దేవతల నాయకులు, వారి పత్నులు లక్ష్మీదేవికి దాస్యవృత్తి చేసే రీతిని చెప్పినట్లయింది.

**“ఎణ్మర్ పదినొరువర్ ఈరఱువర్ ఓరిరువర్...తిరుమాలై క్కైతొఴువర్”** (ముదల్. తిరు-52) (అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వినీదేవతలు . . . శ్రియఃపతిని సేవిస్తారు) అని చెప్పబడిందికదా! **“హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్”** (తైత్తి.సంహి-4-2-8) (మొదట భూతాలకు అన్నిటికీ ఒకే నాథుడైన హిరణ్యగర్భుడు (జీవాత్మసమూహాన్ని తనలో కలిగిన భగవానుడు ఉన్నాడు) అని, **“యో దేవానాం ప్రథమః పురస్తాత్ విశ్వాధికో రుద్రో మహర్షిః, హిరణ్యగర్భః పశ్యత జాయమానం స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు”** (తైత్తి-నారా-10-19) (సంసారమనే వ్యాధిని పోగొట్టడంవల్ల రుద్రశబ్దవాచ్యుడు, మహాజ్ఞాని అయిన ఏ భగవానుడు దేవతలలో ప్రథముడైన హిరణ్యగర్భుడు మొదట



మహర్షిః, హిరణ్యగర్భం పశ్యతి జాయమానం స నో దేవ శ్శుభయా స్మృత్యా సంయునక్తు” ఎన్నుమ్ శొల్లుకిఱపడియే, కారణత్వసంబన్ధనోత్కర్షదర్శనత్తాలే ఈశ్వరత్వశఙ్కాస్పదరాన బ్రహ్మరుద్రాదికళోడు, తచ్ఛఙ్కాఽనాస్పదరాన ఇన్ద్రాదికళోడు వాశియఱ సర్వరుమ్ ఇవళుక్కు దాసభూతరెన్ఱు తోఱ్ఱుకైక్కాక (సురవ్రజః) ఎన్గిఱార్. ఇఙ్గనేయాకిల్, జగత్కారణభూతరాక ప్రమాణప్రసిద్ధరాయిరుక్కిఱ ఇవర్కళ్ ఇమ్మిథునత్తుక్కు “ఇనమిన” మాక వఴిపాడు శెయ్వార్కళెన్ఱు శొల్లుకై క్కీఴ్చ్చొల్లుకిఱ ప్రమాణఙ్గళుక్కు విరుద్ధమన్ఱో? వెన్నిల్, కీఴ్చ్చొన్న హిరణ్యగర్భరుద్రశబ్దఙ్గళ్ యోగత్తాలుమ్, అపర్యవసానవృత్తియాలుమ్ నారాయణనై ప్రతిపాదిక్కిఱవాకైయాలే విరోధ మిల్లై.

---

జన్మించేటపుడు అతనిని కటాక్షించాడో, ఆ దేవుడు మనకు మంచిబుద్ధిని ప్రసాదించుగాక) అని చెప్పే రీతిలో పరమాత్మనుగూర్చి హిరణ్యగర్భ-రుద్రాదిపదాలను కారణవాక్యాలలో ప్రయోగించడంచేత “వీరే జగత్కారణభూతులా! ఏమి!” అనే సందేహానికి తావు లేని ఇంద్రుడు మొదలైనవారితో తేడా లేకుండా దేవతలందఱు ఈమెకు శేషభూతులు అని స్ఫురించడంకోసం **“సురవ్రజః”** అని అన్నారు. “**ప్రకర్షనిదర్శనాధీశ్వరత్వ-శంకాస్పదయోః “ఏతౌ ద్వౌ విబుధశ్రేష్ఠౌ” ఇత్యాద్యుక్తయోః బ్రహ్మేశయో రప్యగ్నీంద్రాదిభి రైకరాశ్యత్వ సూచనాయ వ్రజగణశబ్దౌ**” అని దేశికవ్యాఖ్య. ఆ విధంగా అయితే ఈ కారణవాక్యాలలో జగత్కారణభూతులుగా పొగడబడే బ్రహ్మ, రుద్రుడు **“ఏత్తి ఇఱైఞ్జి ఇనమినమాయ్....వఴిపాడుశెయ్యుమ్”** (తిరువాయ్-6-10-6) (కీర్తించి, ప్రార్థించి, గుంపులు గుంపులుగా. . . . సేవించే) అనే రీతిలో పిరాట్టికి, భగవానునకు కైంకర్యాన్ని చేసేవారు-అని చెప్పడం ఆ కారణవాక్యాలతో విరోధిస్తుందే! అని అంటే, ఆ కారణవాక్యాలలో ఉండే హిరణ్యగర్భ రుద్ర శబ్దాలు అర్థంద్వారా బ్రహ్మ-రుద్రులకుకూడా అంతర్యామిగా ఉన్నందున, **“ఏకో హ వై నారాయణ ఆసీత్”** (నారాయణుడొక్కడే ప్రళయసమయంలో ఉన్నాడు) అని మహోపనిషత్తులోని కారణవాక్యంలో చెప్పబడ్డ నారాయణునే నిర్దేశిస్తుంది - అనే విషయం సామాన్యవిశేషన్యాయంవల్ల స్ఫురిస్తుంది. కనుక విరోధం లేదు.

అందుచేతనేకదా ముందు ఉట్టంకించిన మహోపనిషత్తులో **“ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః, తత్తేజో హిరణ్యమండమ్, తత్ర బ్రహ్మా చతుర్ముఖోఽజాయత, త్ర్యక్షః శూలపాణిః పురుషోఽజాయత** ” (మహోపనిషత్) (నారాయణుడొక్కడే ప్రళయకాలంలో ఉన్నాడు. బ్రహ్మ లేదు. ఈశ్వరుడు లేదు. ఆ నారాయణునివల్ల

ఆకైయితే, "న బ్రహ్మా నేశానః" ఎన్ఱు–ఇవర్కళై సంహార్యరాకచ్చొల్లి, "అథ పురుషో హ వై నారాయణోఽకామయత ప్రజా స్సృజేయేతి, నారాయణా ద్బ్రహ్మా జాయతే, నారాయణా ద్రుద్రో జాయతే, నారాయణా దిన్ద్రో జాయతే, నారాయణా ద్ద్వాదశాదిత్యా రుద్రా వసవ స్సర్వాణి ఛన్దాంసి", "తత్ర బ్రహ్మా చతుర్ముఖోఽజాయత", "త్ర్యక్ష శ్శూలపాణిః పురుషోఽజాయత" ఎన్ఱు ఇవర్కళై సృజ్యరాక చొల్లిఱ్ఱు. ఆకైయాలే, "ఏకో హ వై నారాయణ ఆసీత్" ఎన్ఱు "నారాయణనే సకలజగత్కారణభూతన్" ఎన్ఱు ఉపనిషత్తుక్కళోతిఱ్ఱు. "నాన్ముకక్కోఴముళై యీన్ఱు, ముక్కణీశనోడు తేవుపల నుతలి మూవులకమ్ పడైత్త వున్ది మాయక్కడవుళ్ మూముతలడియే" ఎన్ఱుమ్, "నాన్ముకన్ఱన్నొడు తేవరులకోడుయిర్పడైత్తాన్" ఎన్ఱుమ్ ఇవ్వర్థత్తై ద్రమిడోపనిషత్తు దర్శిప్పిత్తతిఱే. "కస్యోదరే

సువర్ణమయం అయిన అండం జనించింది. అందులో చతుర్ముఖుడైన బ్రహ్మ పుట్టాడు. మూడు కన్నులను కలవాడై, శూలపాణి అయిన పురుషుడు పుట్టాడు) అని, నారాయణోపనిషత్తులో **"అథ పురుషో హ వై నారాయణోఽకామయత, ప్రజాః సృజేయేతి. నారాయణాత్ బ్రహ్మా జాయతే, నారాయణా ద్రుద్రో జాయతే, నారాయణా దింద్రో జాయతే, నారాయణా ద్ద్వాదశాదిత్యా రుద్రా వసవ స్సర్వాణి చ ఛందాంసి"** (నారాయణోపనిషత్)– (పురుషుడైన నారాయణుడు "ప్రజలను సృష్టిస్తాను"–అని సంకల్పించాడు. నారాయణునివల్ల బ్రహ్మ పుట్టాడు. నారాయణునివల్ల రుద్రుడు పుట్టాడు. నారాయణునివల్ల ఇంద్రుడు పుట్టాడు. నారాయణునివల్ల పన్నెండుమంది ఆదిత్యులు, రుద్రులు, వస్తువులు, అన్ని భూతాలు ఆవిర్భవించాయి) అని బ్రహ్మ రుద్రుడు సృష్టికాలంలో సృష్టింపబడే వారు అని, నారాయణుడు ఒక్కడే అన్ని లోకాలకు కారణభూతుడని చెప్పబడింది, **"నాన్ముకక్కోఴముళై ఈన్ఱు, ముక్కణీశనొడు తేవు పల నుదలి, మూవులకుమ్ పడైత్త ఉన్ది, మాయక్కడవుళ్ మాముదలడియే"** (తిరువాశిరియమ్–4) (చతుర్ముఖ బ్రహ్మ అనే పూర్ణమైన అంకురాన్ని, త్రినేత్రుని, రుద్రునితోపాటు పలువురు దేవతలను సృష్టించి, ముల్లోకాలను సృష్టించిన నాభినికల ఆశ్చర్యభూతుడై, పరదేవతయై, సర్వకారణభూతుడైన స్వామి శ్రీపాదాలే) అని, **"నాన్ముకన్ తన్నొడు దేవరుల కోడు ఉయిర్ పడైత్తాన్"** (తిరువాయ్–4–10–1) (చతుర్ముఖునితో, దేవతలతో, లోకాలతోపాటు ఆత్మలను సృష్టించాడు) అని ఈ అర్థాన్ని ద్రావిడవేదంకూడ తెలిపిందికదా! **"కస్యోదరే హరవిరించిముఖః ప్రపంచః కో రక్షతీ మమ జనిష్ట చ కస్య నాభేః, క్రాంత్వా నిగీర్య పున రుద్గిరతి త్వదన్యః కః కేన వైష పరవా నితి శక్యశంకః?"** (స్తోత్ర–14) (శివుడు, బ్రహ్మ మొదలైన లోకం ఎవరి ఉదరంలో ఉన్నది? ఈ లోకాన్ని



హరవిరిఞ్చిముఖప్రపఞ్చః" ఎన్ఱుమ్, "విభో ర్నాభీపద్మో విధిశివనిదానమ్" ఎన్ఱుమ్, ఆఴ్వార్కళై యడి యొఱ్ఱి ఆచార్య కళుమ్ ఇప్పడి దర్శిప్పిత్తార్కళిఱే.

ఇప్పడి ఉభయోపనిషత్ప్రసిద్ధమాన జగత్కారణత్వత్తాలే పణ్ణుకిఱ "స్థిరచరరచనాతారతమ్య"త్తిలే ప్రమాణమాన "భ్రూభఙ్గత్తై" యుడైయళాయ్, "స్వర్గదుర్గత్యా" దికళై ప్పణ్ణుమ్బోతు, స్వేఙ్గితపరాధీననాయ్ క్కొణ్ణు సర్వత్తైయుమ్ పణ్ణుమ్బడి తద్వల్లభైయాయ్, అవనుడైయ చిదచిద్విధానవ్యసనత్తై సార్థమాక్కుమవళాయ్,

ఎవరు రక్షిస్తున్నారు? ఎవరి నాభినుండి ఈ లోకం పుట్టింది? నీవు తప్ప వేఱెవరు ఈ లోకాన్ని (త్రివిక్రమావతారంలో) కొలిచి, (అవాంతర ప్రళయంలో) మింగి, తిరిగి ఉమిశారు? ఈ లోకం వేఱెవరిని నాథునిగా కల్గినది అని సందేహపడతగినది?) అని, **"త్రయో దేవా స్తుల్యా స్త్రితయ మిద మద్వైత మధికం త్రికా దస్మా త్తత్త్వం పర మితి వితర్కాన్ విఘటయన్, విభో ర్నాభీపద్మో విధిశివనిదానం భగవతః తదన్యత్ భ్రూభంగీపరవదితి సిద్ధాంతయతి నః"** (రంగ–1–116) (త్రిమూర్తులు సమానులు అని, త్రిమూర్తులు ఒకరే అని, ఈ త్రిమూర్తులకంటే వేఱయిన ఒకటి పరతత్త్వం ఉన్నదని వాదించేవారి వివాదాలను పటాపంచలు చేస్తూ, బ్రహ్మ–రుద్రులకు మూలకందంగా ఉండే శ్రీరంగనాథుని నాభీకమలం ఆ భగవానుడుతప్ప మిగిలిన అంతా అతని కనుబొమల కదలికలకు వశమైనది అని మనకు నిర్ణయించి చెబుతున్నది) అని ఆఴ్వార్లను అనుసరించిన ఆళవన్దార్, భట్టర్ మొదలైన పూర్వాచార్యులు ఈ విషయాన్ని తెలియజేశారు కదా!

ఈ రీతిగా సంస్కృత–ద్రావిడవేదాంతాలలో చెప్పబడ్డ జగత్కారణత్వంలో భగవానునకు–జగత్తుకు త్రివిధకారణాలు కావడమనే అంశలు ఉన్నవి. అందువల్ల అతడు లోకానికి తండ్రి. అతని మహిషియై. లోకానికి మాత అయిన ఈ పిరాట్టికూడా ఆ జగత్కారణత్వంలో అప్రధానం అయిన అన్వయాన్ని కల్గి ఉన్నది. ఏ విధంగా అంటే– **"యద్భ్రూభంగా ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః"** అని భట్టరు శ్రీగుణరత్నకోశంలోని నాల్గవ శ్లోకంలో అనుగ్రహించిన రీతిలో భగవానుడు స్థావరజంగమాలను సృష్టించేటపుడు వాటిలో ఉండే తారతమ్యాలకు ఈ పిరాట్టి కనుబొమల కదిలికలలోని తేడాలే కారణం అవుతున్నాయి. కూరత్తాఴ్వాన్ శ్రీస్తవంలో **"స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతాం సర్గోపసర్గస్థితీః స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః, యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలమ్"** అని మొదటిశ్లోకంలో అనుగ్రహించినట్లుగా భగవానుడు స్వర్గం–నరకం మొదలైనవానిని

తత్పత్నియాకైయాలే సర్వలోకత్తుక్కుమ్. మాతావాయ్, అవన్ పితావాకైయాలే, సర్వర్క్కుమ్ పితామాతాక్కళ్ "మాధవః" ఎన్నుమ్బడి తిరుమాలితే. ఆకైయితే "తిశైముకనార్ తఙ్గళప్పన్", "నాన్ముకఙ్కు త్తన్దైకాణ్" ఎన్ఱు బ్రహ్మాదికళుక్కుమ్ పితా వెన్ఱుమ్, "పితృదేవో భవ" ఎన్గిఅపడియే, "ఈశఙ్కుమ్ నాన్ముకఙ్కుమ్ తెయ్వమ్" ఎన్ఱుమ్ పరదేవతైయాకవుమ్ అరుళిచ్చెయ్తతు ఇవర్కళ్తాఙ్గళుమ్, "ఎన్దై యెమక్కరుళెన నిన్ఱు" ఎన్ఱు పితృత్వత్తై అనుసన్ధిత్తు, "ఎమ్మై-నినుళ్ళే తోఱ్ఱియ ఇఱైవ" ఎన్ఱు

---

సృష్టించేటపుడు ఈ పిరాట్టిముఖంలోని భావాల తారతమ్యానికి వశుడై అన్నిటిని సృష్టించవలసినట్లుగా ఈమె స్వామికి ప్రియంగా ఉంటుంది. భట్టరు శ్రీగుణరత్నకోశంలో **"శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః, అంగీకారిభి రాలోకైః సార్థయంత్యై"** అని పల్కిన రీతిలో భగవానుడు చేతనాచేతనాలను సృష్టించడం అనే ప్రయత్నాన్ని చేసేటపుడు తన తన ఆనందంతో దానిని ఈమె ఫలవంతం చేస్తున్నది. సర్వలోకపిత అయిన అతనికి పత్ని అయినందువల్ల, ఈ విధంగా జగత్కారణత్వంలోకూడా అప్రాధాన్యం అయిన అన్వయం గ్రహించడంవల్ల ఈమె సమస్తలోకానికి తల్లి అవుతున్నది. అందువల్లనే మహాభారతంలోకూడా **"సర్వేషా మేవ లోకానాం పితా మాతా చ మాధవః, గచ్ఛధ్వ మేనం శరణం శరణ్యం పురుషర్షభాః"** (భార-ఆది-19-2-56) (పురుషశ్రేష్ఠులారా! లోకాలన్నిటికి తండ్రి, తల్లి లక్ష్మీనాథుడే. శరణుపొందడానికి తగినవాడైన ఇతనిని శరణువేడండి) అని అన్నిలోకాలకు తల్లి, తండ్రి మాధవుడైన శ్రియఃపతియే అని చెప్పబడింది. ఈ కారణంచేతనే **"పితృదేవో భవ"** అని చెప్పిన రీతిలో ఆఴ్వార్లు కూడా **"తిశైముకనార్ తఙ్గళప్పన్"** (పెరియతిరు-2-2-7) (చతుర్ముఖుని తండ్రి) అని, **"నాన్ముకఙ్కు త్తన్దైకాణ్"** (పెరియతిరు-11-5-2) (చతుర్ముఖునకు తండ్రి సుమా!) అని భగవానుడు బ్రహ్మాదులకు తండ్రి అని **"ఈశఙ్కుమ్ నాన్ముకఙ్కుమ్ దెయ్వమ్"** (నాన్ముకన్. తిరు-96) (ఈశ్వరునకు, చతుర్ముఖునకు దైవం) అని అంటూ ఆ ఇద్దఱికి దైవం అయిన పరదేవత ఇతడే అని అనుగ్రహించారు. ఈ బ్రహ్మ రుద్రులు **"ఎన్దై ఎమక్కు అరుళెన నిన్ఱు"** (పెరియతిరు-4-1-4) (మా తండ్రీ! మమ్ములను అనుగ్రహించు) అని భగవానుడు తమకు తండ్రిగా ఉండే స్వభావాన్ని అనుసంధించారు. **"ఎమ్మై నిన్ఱుళ్ళే తోఱ్ఱియ ఇఱైవ"** (తిరువాయ్-2-2-10) (మమ్ములను నీలో సృష్టించిన స్వామీ! అని భగవానుడు తమకు తండ్రి అయినందువల్ల అతనితో ఉన్న శేషశేషిసంబంధాన్ని తెలిపారు. **"ఇఱైయాదలతిన్దేఱ్ఱి"** (తిరువాయ్-3-1-10)



పితృత్వప్రయుక్తమాన శేషశేషిభావసమ్బన్ధత్తై యుణర్న్దు,"ఇఱైయాతలతిన్దేఱ్ఱి" "కన్దమలర్ కొణ్డు తొఴుతు", "మన్దిరమామలర్కొణ్డు" మఱైన్దువరాయ్, "అన్దియమ్పోతిలే" తిరువన్దిక్కాప్పిట్టు, "శిఱ్ఱమ్ శిఱుకాలైయిలే" వన్దు తిరుప్పళ్ళియణర్త్తి", "అలఙ్గలమ్ తొడైయల్ కొణ్డు", "మానితి కపిలై" ముతలాన, "పడిమెయ్క్కలఙ్గాణ్డఙ్కు ఏఱ్పనవాయిన కొణ్డు" ఎన్ఱు శొల్లుమ్బడి ఆరాధనోపకరణఙ్గళెల్లా మేన్ది క్కొణ్డు "అడియిణై పణిన్దు" "వణ్ణచ్చిఱుతొట్టిల్" వరక్కాట్టువతు, "ఇడైవిరవి క్కోత్త ఉడైయార్" "కనమణియోడొణ్మాతుళమ్బూ" విడు తరువతు, "ఎఴిలుడై

---

(స్వామిత్వాన్ని తెలిసి, కీర్తించి) అని, **"కన్దమలర్ కొణ్డు తొఴుదు"** (పెరియతిరు-5-10-7) (సుగంధపుష్పాలను తెచ్చి, అర్చించి) అని అతనిని సేవించారు. **"మన్దిర మామలర్ కొణ్డు మఱైన్దువరాయ్"** (పెరియాఴ్వార్ తిరు-2-8-1) (పురుషసూక్తాది మంత్రాలను ఉచ్చరిస్తూ పూలతో అదృశ్యంగా వచ్చేవారై) అని,**"అన్దియమ్ పోదిదు"** (పెరియాఴ్వార్ తిరు-28-1) (సంధ్యాకాలంలో) అని చెప్పే రీతిలో భగవానునకు సంధ్యాకాలపు దిష్టిని తీశారు. **"శిఱ్ఱమ్ శిఱుకాలే"** (తిరుప్పావై-29) (ప్రాతఃకాలంలో) అతనిని నిద్రనుండి లేపి, సుప్రభాతం పాడారు. **"అలఙ్గలమ్ తొడైయల్"** (తిరుప్పళ్ళి-5) (కదలాడే మాలికలు) అనే రీతిలో మాలను సమర్పించి, **"మానిది కపిలై ముదలా పడిమైక్కలమ్ కాణ్డఙ్కు ఏఱ్పనవాయిన కొణ్డు"** (తిరుప్పళ్ళి-8) (గొప్పనిధి, కపిలధేనువు, నిలువుటద్దం మొదలైన వానిని స్వామి కటాక్షించడంకోసం) అని చెప్పే రీతిలోని ఆరాధనకు ఆవశ్యం అయిన సాధనాలను తీసికొని, **"అడియిణై పణిన్దు"** (తిరుప్పళ్ళి-8) (పాదద్వయిని సేవించి), "**వణ్ణ చ్చిఱుత్తొట్టిల్**" (పెరియాఴ్వార్ తిరు-1-3-1) (వివిధవర్ణాలను కల చిన్న తొట్టిని) పంపడం, **"ఇడైవిరవి క్కోత్త ఉడైయార్ కనమణియోడు ఒణ్మాదుళమ్బూ"** (పెరియాఴ్వార్ తిరు-1-3-2) (నడుముకు తగినది, బంగారం, మణులు కలిపి కూర్చబడినది అయిన అందమైన మొలకత్తితోపాటు, అందమైన దానిమ్మపూల దండను) పంపడం, **"పొఴిలుడై కిణ్గిణి తన్దువనాయ్"** (పెరియాఴ్వార్-1-3-3) (ప్రకాశించే మువ్వలను) పంపడం, **"శఙ్గిన్ వలమ్పురియుమ్ అఙ్గై చ్చురివళైయుమ్"** (పెరియాఴ్వార్ తిరు-1-3-4) (గొప్పది అయిన దక్షిణావర్తశంఖాన్ని, చేతులకు అలంకరించతగిన వలయాలను) పంపడం, **"అఴకియ ఐమ్బడైయుమ్ ఆరముమ్ కొణ్డు తొఴుదు"** (పెరియాఴ్వార్ తిరు-1-4-5) (అందమైన పంచాయుధిని, ముక్తాహారాన్ని చేతిలో పెట్టుకొని సేవించి), **"ఓదక్కడలిన్ ఒలిముత్తి నారముమ్ శాత్తిప్పవళముమ్ శన్దచ్చురివళైయుమ్"** (పెరియాఴ్వార్

క్కిణ్గిణి'' త్తన్దువనాయ్ నిఱ్పతు; ''శఙ్గిన్ వలమ్బురియుమ్ అఙ్గై చ్చురివళైయుమ్'' పోత్తరువతు, ''అఴకియ వైమ్బుడైయు మారము జ్కొణ్డు'' తొఴువతు; ''ఓతక్కడలి లొళిముత్తినారముమ్ శాతిప్పవళముమ్ శన్దచ్చురివళైయుమ్'' విడుతరువతు. ఆక–ఇప్పడి ''నీరేఱుశెఞ్జడై నీలకణ్డనుమ్ నాన్ముకనుమ్ ముఱైయాల్ శీరేఱు వాశకమ్ శెయ్యనిన్ఱ తిరుమాల్'' ఎన్గిఅపడియే ఇవర్కళెల్లారుమ్ శేషశేషిభావముఱైయాలే శ్రియః పతిక్కడిమైశెయ్తు, ''ఎన్ తిరుమార్వన్దన్నై'' ఎన్ఱు తొడఙ్గి అరుళిచ్చెయ్తపడియే ఇవర్కళ్ తఙ్గళ్మహిషికళోడే విశిష్టత్తుక్కు ప్రకారమాయిరుక్కైయాలే, ఇరువర్క్కుమ్

---

తిరు–1–3–6)– (అలలను కల సముద్రంలో పుట్టిన ముత్యాలలో కూర్చబడ్డ హారం, జాతి పగడాలు, అందమైన వలయాలు, అంగదాలు) పంపడం – మొదలైనవానిని తమ స్వరూపానికి తగినట్లు చేసి, బాలకృష్ణునకు కానుకలను చెల్లించారు. అందువల్ల ఈ రీతిగా **''నీరేఱు శెఞ్జడై నీలకణ్డనుమ్ నాన్ముకనుమ్ ముఱైయాల్ శీరేఱు వాశకమ్ శెయ్య నిన్ఱ తిరుమాల్''** (పెరియాఴ్వార్ తిరు–4–1–5) (భస్మధారి, ఎఱ్ఱనిజటలను కలవాడైన నీలకంఠుడు, చతుర్ముఖుడు క్రమానుసారం గొప్పవాక్కులతో కీర్తించే శ్రియః పతి) అనే రీతిలో ఈ దేవతలందఱు తాము శేషభూతులుగాను, వారిరువురు (స్వామి, పిరాట్టి) స్వాములుగాను ఉన్న సంబంధంచేత శ్రియఃపతికి కైంకర్యాన్ని చేసి, **''ఎన్ తిరుమార్బన్‌తన్నై ఎన్ మలైమకళ్ కూఱన్దన్నై ఎన్ఱుమ్ ఎన్ నామకళై అకమ్బాల్ కొణ్డ నాన్ముకనై నిన్ఱ శశిపతియై''** (తిరువాయ్–7–6–7) (లక్ష్మీదేవిని వక్షస్సులో కల నా స్వామిని, పార్వతిని పార్శ్వంలో కల శివునకు అంతర్యామి అయిన నా స్వామిని, సరస్వతిని తన ముఖంలో కల బ్రహ్మకు అంతర్యామి అయిన నా స్వామిని, వీరిద్దరితో సమానుడైన శచీపతి అయిన ఇంద్రుని) అని అనుగ్రహించిన రీతిలో వీరు తమ పత్నులతోపాటు లక్ష్మీసహితుడైన స్వామికి ప్రకారభూతులు కావడంచేత, ఆ ఇద్దఱికి శేషభూతులై ఉండే స్థితిని భావించి **''బ్రహ్మేశాది సురవ్రజః సదయిత స్త్వద్దాసదాసీగణః''** అని అన్నారు.

**(దాసీగణః)** శ్రీస్తవంలో కూరేశులు **''లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం యస్యాః ప్రసాదపరిణామ ముదాహరంతి, సా భారతీ భగవతీ తు యదీయదాసీ''** అని అంటూ 9వ శ్లోకంలో అనుగ్రహించిన రీతిలో ఈ లోకంలో ఒక జీవుడు వృక్షం సమానంగా, వేఱొక జీవుడు దేవగురువు అయిన బృహస్పతివలె గొప్ప బుద్ధిమంతునిగా ఉండే హెచ్చు తగ్గులకు కారణం అయిన జ్ఞానపూర్తిని కల భారతి అనే సరస్వతి.



శేషభూతరాయిరుక్కుమ్బడియై త్తిరువుళ్ళమ్బఱ్ఱి (బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః) ఎన్గిఱార్.

(దాసీగణః) లోకత్తిలే ''వనస్పతి–బృహస్పతి తారతమ్య'' హేతువాన పరిపూర్తియైయుడైయ భారతియై ప్పాదచేటియాక వుడైయవళాయితే ఇవళిరుప్పతు. మలైమకళుక్కు త్తలైమకళాన కలైమకళ్ మలర్‌మకళుక్కు మనైయడిమై యెన్నపోతే, మఱ్ఱుళ్ళారడిమై యెన్ను మిడమ్ శొల్లవేణ్డావితే.

''త్రయ ఏవాఽ ధనా రాజన్ భార్యా'' ఎన్గిఅ న్యాయత్తాలే బ్రహ్మాదికళ్ శేషభూతరెన్ఱపోతే తత్పత్నికళుక్కుమ్ శేషత్వమ్ సిద్ధమాయిరుక్క, ''సదయితః'' ఎన్ఱు విశేషిత్తరుళువానెన్? ఎన్నిల్, బ్రహ్మాదికళ్‌పక్కల్ శిలర్క్కు ఈశ్వరత్వశఙ్కాభ్రాన్తియాలే,

---

లక్ష్మీదేవికి దాసురాలు, పార్వతికి అత్త అయిన సరస్వతి తనకు అత్త అయిన లక్ష్మీదేవికి దాసురాలు అయినపుడు మిగిలిన దేవతాస్త్రీలు అందఱూ లక్ష్మీదేవికి దాసురాండ్రు అనే విషయం చెప్పకుండానే సిద్ధిస్తుందికదా!

**''త్రయ ఏవాధనా రాజన్! భార్యా దాస స్తథా సుతః, య త్తే సమధిగచ్ఛంతి యస్యైతే తస్య తద్ధనమ్''** (భార–ఉద్యోగ) (రాజా! భార్య, దాసుడు, సుతుడు– అనే ముగ్గురు ధనం లేనివారు, వారు సంపాదించే ధనంకూడా వారి యజమానికే చెందుతుంది) అనే న్యాయంలో ''బ్రహ్మ మొదలైన దేవతలు వీరికి శేషభూతులు'' అని చెప్పినపుడే వారి పత్నులు కూడా వీరిరువురికి శేషభూతులై ఉంటారు– అనే విషయం తనకు తానే సిద్ధిస్తుంది. కనుక, **''సదయితః''** అనే విశేషణాన్ని ప్రయోగించాలా? అని అంటే, బ్రహ్మ మొదలైనవారిని కొందఱు పరతత్త్వం– అని భ్రమిస్తున్నారు. బ్రహ్మ మొదలైనవారి పత్నులైన సరస్వతి మొదలైనవారు లక్ష్మియొక్క అంశ అనే భ్రమ వారికి ఉండవచ్చు కదా! ఆ భ్రమను తీర్చడంకోసం ఈ విధంగా విశేషణాన్ని ప్రయోగించారు. బ్రహ్మ మొదలైనవారు పరతత్త్వం కాదు–అని చూపే శ్రుత్యాదిప్రమాణాలద్వారా వారి పత్నులు లక్ష్మికి అంశభూతులు అనే వాదం సమసిపోతుందికదా! అని అంటే, ఈ విధంగా తాత్పర్యార్థంద్వారా సిద్ధించడం కాకుండా, శబ్దతః చెప్పడం చాలా స్పష్టతను కల్గిస్తుంది. కనుక ఈ విధంగా విశేషణప్రయోగాన్ని చేయడం సరి అయినదే!. ఈ రీతిలో దేవతాప్రముఖులైన బ్రహ్మ, ఈశ్వరుడు మొదలైనవారు లక్ష్మికి శేషభూతులు–అని అనడంవల్ల వారికంటే తక్కువవారైన మానవులు మొదలైనవారు పిరాట్టికి శేషభూతులు అనేది చెప్పకుండానే తెలుస్తుంది కదా! ఈ విధంగా ఇంతవరకు నిత్యవిభూతి, లీలావిభూతి అనే రెండు లోకాలు లక్ష్మికి శేషమై ఉన్నాయి–అని తెలియజేశారు.

తత్పత్నికళ్‌పక్కలిలేయుమ్ లక్ష్మ్యంశభ్రాన్తి ఉణ్డాయిరుక్కుమితే. తన్నిరాకరణార్థమ్ "సదయితః" ఎన్ఱు విశేషిత్తరుళుకిఱార్. అవర్‌కళ్‌పక్కల్ ఈశ్వరత్వ శఙ్కానిరాకరణ శ్రుత్యాదికళాలే తత్పత్నికళ్ పక్కల్ లక్ష్మ్యంశవాదముమ్ నిరాకృతమితే? యెన్నిల్, తాత్పర్యత్తాలే సిద్ధిప్పతిలుమ్ శబ్దతః శొల్లుకై మికవుమ్ స్పష్టమా యిరుక్కుమితే. అతు తోన్ఱ ఇప్పడి అరుళిచ్చెయ్య క్కుఱైయిల్లై. ఆక, ఇప్పడి ప్రధానరాన బ్రహ్మాదికళ్ ఇవళుక్కు శేషభూతరానాల్, ఇవ్వరుకుళ్ళార్ శేషభూతరెన్ను మిడమ్ కిమ్పునర్న్యాయసిద్ధమితే. ఆక, ఉభయవిభూతియుమ్ ఇవళుక్కు చ్చేషమెన్ఱు దర్శిప్పిత్తారాయిఱ్ఱు.

ఇప్పడి "కాన్త స్తే పురుషోత్తమః" ఎన్ఱు కర్తర్యర్థత్తైయుమ్, "ఫణిపతిః –దాసీగణః" ఎన్ఱు కర్మణ్యర్థత్తైయు ముడైయళాకైయాలే "శ్రీః" ఎన్ఱు ఉనక్కు త్తిరునామ మెన్గిఱార్ (శ్రీరిత్యేవ చ నామ తే) ఇత్యాదియాలే. "శ్రీయత–ఇతి–శ్రీః" ఎన్ఱుమ్, "శ్రయత

ఈవిధంగా ఇంతవరకు, **"కాంత స్తే పురుషోత్తమః"** అని అనడంవల్ల ఈమె భగవానుని ఆశ్రయించి ఉంటుంది అనే కర్తరివ్యుత్పత్తివల్ల సిద్ధించే అర్థాన్ని, **"ఫణిపతిః --- దాసీగణః"** అని అనడంవల్ల ఈమె అందఱిచేత ఆశ్రయింపబడుతున్నది అని కర్మణివ్యుత్పత్తిద్వారా సిద్ధించే అర్థాన్ని కల్గినది కాబట్టి ఈ రెండు అర్థాలను తెలిపే **"శ్రీ"** అనే పదం నీకు తిరునామం–అని ఇకపై అంటున్నారు. **(శ్రీరిత్యేవ చ నామ తే)** –అని ప్రారంభించి. ఈ విధంగా కర్తరివ్యుత్పత్త్యర్థం, కర్మణివుత్పత్త్యర్థం కల్గి ఉండడం చేతనేకదా శ్రీశబ్దం అర్థవంతం అవుతున్నది– అని భావం. ఆవిధంగా కాకుండా, వేఱే రీతిలోకూడా అర్థాన్ని గ్రహించవచ్చు. ఇంతవరకు చెప్పిన, విష్ణువుకు పత్నిగా ఉండడానికి, ఉభయవిభూతులకు ఈశ్వరిగా ఉండడానికి ప్రమాణంగా శ్రుతి–స్మృతిమొదలైనవానిని వెదుకవలసి ఉన్నదా? "నీవు భగవానుని ఆశ్రయించి ఉన్నదానివి కనుక, నీవు ఆస్వామి శేషభూతురాలవు", "అతడు తప్ప మిగిలిన అందఱు నిన్ను ఆశ్రయించి ఉండడంచేత వారికి అందరికీ నీవు శేషివి" అని చూపే **"శ్రీః"** అనే విలక్షణనామంమాత్రమే చాలదా? అని అంటున్నారు–అని కూడా చెప్పవచ్చు.

**(శ్రీరిత్యేవ చ నామ తే భగవతి)–"యచ్చ కించి జ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేఽపి వా, అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"** (తైత్తి–నారా–11) (ఈ లోకంలో కన్పించేవిగా, వినిపించేవిగా ఉండే వస్తువులు అన్నిటిలో లోపల బయట నారాయణుడు వ్యాపించి ఉన్నాడు) అని, **"ఎణ్ పెరుక్కన్నలత్తు ఒణ్ పొరుళ్ ఈఱిల ఒణ్పుకళ్నారణన్"** (తిరువాయ్–1–2–10) (అసంఖ్యాకాలైన, ఆ బ్రహ్మానందంతో సరి అయిన, లెక్కలేనన్ని ఆనందాది గుణాలను కల నారాయణుడు),



ఇతి శ్రీః" ఎన్ఱుమ్ శొల్లుకిఱ వ్యుత్పత్తిద్వయార్థముమ్ ఉణ్డానాలితే శ్రీశబ్దమ్ సార్థమావతు. అన్ఱిక్కే, కీళ్శొన్న విష్ణుపత్నీత్వత్తుక్కుమ్, ఉభయవిభూతిశేషిత్వత్తుకుమ్ శ్రుతిస్మృతికళ్ తేడవేణుమో? సర్వశేషిత్వవాచకమాయ్ ఉనక్కసాధారణమాన తిరునామమే పోరాతో? ఎన్గిఱారాకవుమామ్.

(శ్రీరిత్యేవ చ నామ తే భగవతి) "అన్త రహి శ్చ తత్సర్వమ్" ఎన్ఱుమ్, "పొఙ్గు పుణరి" ఎన్ఱుమ్ అర్థత్తై చొల్లి ప్పిన్బు శబ్దత్తై చ్చొన్నాప్పోలే, ఇఙ్గుమ్ శ్రీశబ్దార్థత్తై మున్దుఱ వరుళిచ్చెయ్‌తు, అనన్తరమ్ శ్రీశబ్దత్తై అరుళిచ్చెయ్‌కిఱార్ (శ్రీ రితి) ఎన్ఱు. "దేవో నామసహస్రవాన్" ఎన్ఱు "పేరాయిరమ్ కొణ్డతోర్ పీడుడైయ" నానాలుమ్ "నారాయణన్" ఎన్ఱు అవనుక్కు నిరూపకమానాప్పోలే, "లక్ష్మీః" ఎన్ఱు తొడఙ్గి అనేకమ్ తిరునామఙ్గళుణ్డేయాకిలుమ్, ఇవళుక్కు అసాధారణనిరూపకమ్ "శ్రీః" ఎన్గిఱ

**"పొఙ్గు పుణరిక్కడల్ శూళ్న్దై నిలైమామకళ్ మలర్ మామఙ్గై పిరమన్ శివన్ ఇన్దిరన్ వానవర్ నాయకరాయ ఎఙ్గళడికళ్ ఇమైయోర్ తలైవరుడైయ తిరునామమ్ నాఙ్గళ్ వినైకళ్ తవిర ఉరైమిన్ నమో నారాయణమే"** (పెరియ తిరు–6–10–9) (పై పైకి వృద్ధి చెందే అలలను కల సముద్రాన్ని తనకు చుట్టుకొనే వస్త్రంగా కల భూమికి, లక్ష్మికి, చతుర్ముఖునకు, రుద్రునకు, ఇంద్రునకు, మిగిలిన దేవతలకు నిర్వాహకుడు, మా స్వామి, నిత్యసూరి నాయకుడు అయిన భగవానుని తిరునామం నారాయణనామం. దానిని మన పాపాలు తీరేటట్లు అనుసంధిస్తాం) అని భగవానుని పలికేటపుడు అతడు అంతటా వ్యాపించి ఉండేవాడు, అందఱికీ నాయకుడు అని మొదలైన అర్థాలను ముందు పల్కి, ఆ అర్థాలను తెలిపే నారాయణశబ్దాన్ని తరువాత చెప్పినట్లే ఇక్కడకూడా శ్రీ శబ్దంయొక్క అర్థాన్ని మొదట అనుసంధించి, ఆ శ్రీశబ్దాన్ని తరువాత **"శ్రీ రితి"** అని అంటూ అనుసంధిస్తున్నారు, **"సహస్రాస్య స్సహస్రాక్షః సహస్రచరణో విభుః, సహస్రబాహుః సర్వజ్ఞో దేవో నామసహస్రవాన్"** (భారతే–భీష్మః) (వేయి శిరస్సులను కలవాడు, వేయి కన్నులను కలవాడు, సర్వజ్ఞుడు, సర్వశక్తి అయిన, ప్రకాశించే భగవానుడు వేయి నామాలను కలవాడు) అని అన్నట్లు వేయి పేర్లను కలవాడు అయినా, **"పేరాయిరమ్ కొణ్డదు ఓర్ పీడుడైయున్ . . . . నారాయణన్"** (తిరువాయ్–9–3–1) అని నారాయణనామం అతనికే చెందిన విలక్షణనామం అని అన్నట్లే, **"లక్ష్మీః"** అని ప్రారంభించి ఈమెకు పలు తిరునామాలున్నా, ఈమెకే చెందిన ప్రత్యేకనామంగా **"శ్రీః** అనే నామం ప్రకాశించడంచేత, **"శ్రీరిత్యేవ చ నామ తే"** అని అంటున్నారు. అతడుతప్ప మిగిలిన అందఱూ ఈమెను ఆశ్రయించి ఉంటారు–అని చూపే తిరునామం ఇది తప్ప వేఱొకటి లేనందువల్ల **"శ్రీరిత్యేవ చ"** అని ఏవకారాన్ని ప్రయోగించారు.

తిరునామమాకైయాలే (శ్రీరిత్యేవ చ నామ తే) ఎన్గిఱార్. సర్వాధికవస్తువుక్కు వాచకశబ్దమ్ ఇతువల్లతిల్లామైయాలే (శ్రీరిత్యేవ) ఎన్ఱు అవధరిక్కిఱార్.

"శ్రీఞ్-సేవాయామ్," "శృ-విస్తారే," శౄ-హింసాయామ్," "శ్రు-శ్రవణే" ఇత్యాది ధాతుభేదత్తాలే శ్రీశబ్దత్తుక్కు అనేకార్థఙ్గళుణ్డాయిటే ఇరుప్పతు. అవ్వర్థభేదఙ్గళై ప్పఱ్ఱ నిరుక్తిభేదఙ్గళుణ్డాయిరుక్కుమిటే. ఆకైయాలే, "శ్రీయత ఇతి-శ్రీః", "శ్రయత ఇతి- శ్రీః", "శౄణాతీతి-శ్రీః", "శృణోతీతి-శ్రీః", "శ్రావయతీతి- శ్రీః" - ఇత్యాది

---

**"శ్రీఞ్-సేవాయామ్"** అని సేవను, (ఆశ్రయాణాన్ని) **"శృ-విస్తారే"** అని విస్తృతిని, **"శృ-హింసాయామ్"** అని హింసను, "**శ్రు-శ్రవణే**" అని శ్రవణాన్ని చెప్పే నాల్గు విధాలైన ధాతువులనుండి పుట్టిన శ్రీశబ్దానికి పలు అర్థాలున్నాయి. ఆ అర్థాలను ఇచ్చే "**శ్రీయతే ఇతి శ్రీః**" (ఆశ్రయింపబడుతున్నది కనుక **"శ్రీః"** అనబడుతున్నది), **"శ్రయతే ఇతి శ్రీః"** (భగవానుని ఆశ్రయిస్తున్నది కనుక **"శ్రీః"** అనబడుతున్నది), **"శృణాతి ఇతి శ్రీః"** (దాసుల గుణాలను విస్తరింపజేస్తుంది కనుక **"శ్రీః"** అనబడుతున్నది) "**శౄణాతి ఇతి శ్రీః**" - (ఆశ్రితుల దోషాలను పొగొడుతుంది కనుక "**శ్రీః**" అనబడుతున్నది) **"శ్రుణోతి ఇతి శ్రీః"** (ఆశ్రితుల ఆర్తనాదాలను వింటుంది కనుక **"శ్రీః"**) అనబడుతున్నది, **"శ్రావయతీతి శ్రీః"** (ఆశ్రితుల ప్రార్థనలను భగవానునకు వినిపిస్తుంది కనుక **"శ్రీః"** అనబడుతున్నది) అనే వేత్వేరు అర్థాలను ఇచ్చే ఆఱు నిరుక్తులు ఇక్కడ చెప్పబడుతున్నాయి. **"శృణాతి నిఖిలాన్ దోషాన్ శృణాతి చ గుణై ర్జగత్, శ్రీయతే చాఖిలై ర్నిత్యం శ్రయతే చ పరం పదమ్,"** (పాంచరాత్రమ్) **"శ్రయంతీం శ్రీయమాణాం చ శ్రుణ్వంతీం శృణతీ మపి"** (అహిర్బుధ్న్య-21-8) ( ఆశ్రితుల దోషాలను లేకుండా చేస్తుంది. వారి అద్వేషం, ఆభిముఖ్యం మొదలైన గుణాలను విస్తరింపజేస్తుది. దాసులచేత నిత్యం ఆశ్రయింపబడుతుంది. పరమప్రాప్యుడైన భగవానుని ఆశ్రయిస్తుంది. కాబట్టి పిరాట్టి **"శ్రీః"** అని అనబడు తున్నది) అని ఈ ఆఱు అర్థాలు పాంచరాత్రశాస్త్రంలో చూపబడ్డాయికదా! అందఱు జీవులచేత ఆశ్రయింపబడడం తాను భగవానుని ఆశ్రయించి స్వరూపాన్ని పొందడం, దాసుల దోషాలను పోగొట్టి, వారి అద్వేషం మొదలైన గుణాలను విస్తరింపజేసి, వారి దీనాలాపాలను విని, వారిని అంగీకరించడానికి తగిన మాటలను భగవానుని వినిపించడం శ్రీశబ్దానికి అర్థంగా ఆచార్యులు అనుసంధిస్తారు.

ఈ విధంగా పూర్వం పల్కిన అతిశయాలచేత భగవానునిచేకూడా పొగడతగినదై ఉంటుంది లక్ష్మీదేవి- అనే విషయాన్ని **"భగవతి"** అని అంటూ



నిరుక్తికళ్ ఇవ్విడత్తిలే వివక్షితఙ్గళ్. "శృణాతి నిఖిలా న్దోషాన్ శృణాతి చ గుణై ర్జగత్, శ్రీయతే చాఖిలై ర్నిత్యం శ్రయతే చ పరం పదమ్, శ్రీయన్తీం శ్రీయమాణా ఞ్చ శృణ్వతీం శృణతీ మపి" ఎన్ఱు ఇవైకళ్తాన్ ప్రమాణప్రసిద్ధఙ్గళైయిటే యిరుప్పతు. అఖిలచేతనరుక్కుమాశ్రయణీయైయాయ్, తాన్ అవనై ఆశ్రయిత్తు లబ్ధస్వరూపైయాయ్, ఆశ్రితదోషఙ్గళై హింసిత్తు, ఇవర్కళై అఙ్గీరిక్కైక్కనుగుణమాన వచనఙ్గళై అవనై శ్రవిప్పిక్కై ముతలాన వాకారఙ్గళ్ పురుషకారభూతైయాన పిరాట్టిక్కు అవశ్యాపేక్షితఙ్గళాకైయాలే ఇన్నిరుక్తికళెల్లావఱ్ఱియుమ్ శ్రీశబ్దత్తుక్కర్థమాక ఆచార్యర్కళనుసన్ధిప్పార్కళ్.

ఇప్పడి కీఴ్చ్చొన్న వాకారఙ్గళాలే అవనుక్కుమ్ పూజ్యైయాయిరుక్కుమ్పడియై అరుళిచ్చెయ్కిఱార్ (భగవతి) ఎన్ఱు. "తత్ర పూజ్యపదార్థోక్తిపరిభాషాసమన్వితః"

---

అనుగ్రహిస్తున్నారు.**"మైత్రేయ ! భగవచ్ఛబ్ద స్సర్వకారణకారణే, సంభర్తేతి తథా భర్తా భకారోఽర్థద్వయాన్వితః, నేతా గమయితా స్రష్టా గకారార్థ స్తథా మునే, ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః, జ్ఞానవైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా, వసంతి తత్ర భూతాని భూతాత్మన్యఖిలాత్మని, స చ భూతేష్వశేషేషు వకారార్థ స్తతోఽవ్యయః, జ్ఞానశక్తిబలైశ్వవీర్యతేజాంస్యశేషతః, భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః, ఏవ మేష మహాశబ్దో మైత్రేయ భగవానితి, పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః, తత్ర పూజ్యపదార్థోక్తిపరిభాషాసమన్వితః, శబ్దోఽయం నోపచారేణ త్వన్యత్ర హ్యుపచారతః"** (వి.పు-6-5-72.....78) (మైత్రేయా! **"భగవాన్"** అనే పదం సర్వకారణాలకు కారణభూతుడైన సర్వేశ్వరుని విషయంలో ప్రయోగించబడుతున్నది. ప్రకృతికి కార్యదశను పొందించేవాడు, "స్వామి" అనే రెండు అర్థాలను భకారం కల్గినది. ఓ మునీ! ఆ రీతిలోనే రక్షించేవాడు, సంహరించేవాడు, సృష్టించేవాడు-అని గకారంయొక్క అర్థం. "సంపూర్ణమైన ఐశ్వర్యం, వీర్యం, యశస్సు, సంపద, జ్ఞానం, వైరాగ్యం - అనే ఈ ఆఱు గుణాలకు "**భగ**" అనే పదం వాచకం. భూతాలను శరీరంగా కలవాడు. అన్నిటికీ ఆత్మగా ఉండేవాడు అయిన అతనిలో భూతాలు నివసిస్తున్నాయి, అతడు అన్ని భూతాలలోను నివసిస్తున్నాడు. అందువల్ల నాశం లేనివాడైన భగవానుడు వకారానికి అర్థంగా ఉన్నాడు. హేయాలైన త్రిగుణాలు మొదలైనవానితో సంబంధం లేని జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు- అనే అన్ని గుణాలు **"భగవాన్"** అనే శబ్దంచేత చెప్పబడుతున్నాయి. మైత్రేయా! ఈ విధంగా **'భగవాన్'** అనే ఈ మహాశబ్దం పరబ్రహ్మ అయిన వాసుదేవుని మాత్రమే నిర్దేశిస్తుంది. వేఱెవ్వరినీ తెలుపదు. పూజించదగినవాడనే

ఎన్డు–భగవచ్ఛబ్దమ్ పూజ్యవాచియాయ్, అఖిలచేతనర్క్కుమ్ పూజ్యనానవనుక్కుమ్ పూజ్యైయాయిరుక్కు మెన్డపడి. భగవన్నారాయణనుక్కు పూజ్యైయాకైయాలేయితే, “భగవతీమ్” ఎన్డరుళిచ్చెయ్‌తతు. ఆకైయితే “నన్ మార్చిన్‌మేలుమ్” ఎన్డర్చిక్కిఱతు.

ఇప్పడి స్వరూపత్తాలుమ్, గుణత్తాలుమాయిరుక్కుమ్ జ్ఞానశక్త్యాది కల్యాణగుణఙ్గళైయుడైయళాయ్, హేయగుణరహితైయుమాయిరుక్కైయాలే (భగవతి)

---

అర్థాన్ని తెలిపేది అనే పరిభాషతో కూడిన ఈ శబ్దం అతని విషయంలో ఔపచారికంగా ప్రయోగింపబడడం లేదు. మిగిలిన వాని విషయంలో మాత్రం ఔపచారికంగా–అంటే –అముఖ్యంగా ప్రయోగింపబడుతున్నది) అనే ప్రమాణంచివరలో చెప్పబడ్డ **“భగవాన్”** అనే శబ్దం పూజించతగినవారిని నిర్దేస్తుంది. కనుక చేతనులందఱిచేత పూజించతగినవాడైన అతనికి కూడా పూజ్యురాలై ఉంటుంది ఈ పిరాట్టి. ఈ విధంగా భగవన్నారాయణునకుకూడా పూజించతగినదిగా ఉండడంచేతనేకదా **“భగవన్నారాయణాభిమతానురూప ....భగవతీం శ్రియం దేవీమ్”** అనే శరణాగతిగద్యసూక్తిలో భగవద్రామానుజులు ఈమెను **“భగవతీమ్”** అని నిర్దేశించారు. అందుచేతనేకదా **“తోళిణైమేలుమ్ నన్ మార్బిల్‌మేలుమ్ శుడర్‌ముడిమేలుమ్ తాళిణైమేలుమ్ పునైన్ద తణ్ణన్తుళాయ్‌ముడి యమ్మాన్”** (తిరువాయ్–1-9-7) (బాహువులపై, చక్కని వక్షఃస్థలంపై, ప్రకాశించే కిరీటంపై, శ్రీపాదద్వయిపై సంశ్లేషించే చల్లని తులసిని కల కిరీటాన్ని కల్గిన స్వామి) అనే రీతిలో ఈమె వేంచేసి ఉండే చోటు అయిన తన వక్షఃస్థలంలో తులసీమాలను ధరించి, ఈమెను స్వామి ఆదరిస్తున్నాడు.

ఈ విధంగా స్వరూపంతో గొప్పదై, జ్ఞానశక్త్యాది కల్యాణగుణాలను కల్గినదై , హేయగుణరహితయై ఉండడంచేత **“భగవతి”** అని ఈమెను అంటున్నారు. “**నిర్దోషమంగళగుణాకరత్వ జ్ఞాపనాయ భగవతీత్యుక్తః**” అని దేశికవ్యాఖ్య. పూర్వం ప్రసక్తం అయిన “**మైత్రేయ**” ఇత్యాది విష్ణుపురాణప్రమాణం పూర్వభాగంలో చెప్పిన రీతిలో హేయగుణరాహిత్యం, సమస్తకల్యాణగుణపూర్ణత్వమేకదా భగవచ్ఛబ్దార్థం. అందుచేతనే కదా ఆ ప్రమాణంలో జ్ఞానం మొదలైన ఆఱు గుణాలను **“భగ”** అనే పదం తెలుపుతున్నదని, **“అన్”** అనే ప్రత్యయం హేయగుణరాహిత్యాన్ని తెలుపుతున్నది అని శ్రీపరాశరభట్టర్ వ్యాఖ్యానించారు. **“అన్”** అనేది **‘న’** అనే నిషేధ వాచకంయొక్క అర్థాన్ని ఏ విధంగా తెలుపుతుంది? అని అంటే, **“న”** అనే పదాన్ని “న్”, **“అ”** అని రెండుగా విభజించినపుడు **“న్”** అనేది ధాతుపదమై, **“అ”** అనేది సులభంగా నోటితో ఉచ్చరించడానికి తగిన పదంగా ఉన్నది. ఈ పదాలు ముందు వెనుకలు అయినపుడు



ఎన్గిఱార్. “మైత్రేయ భగవచ్ఛబ్ద స్సర్వకారణకారణే, “సమ్భర్తేతి తథా భర్తా భకారోఽర్థ ద్వయాన్వితః, నేతా గమయితా స్రష్టా గకారార్థ స్తథా మునే, ఐశ్వర్యస్య సమగ్రస్య వీరస్య యశసః శ్రియః, జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా, వసన్తి తత్ర భూతాని భూతాత్మన్యఖిలాత్మని, స చ భూతేష్వశేషేషు వకారార్థ స్తతోఽవ్యయః, ఏవ మేష మహాశబ్దః కీర్త్యతే భగవా నితి, పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః, జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్యతేజాంస్యశేషతః, భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః” ఎన్గిఱపడియే హేయగుణరాహిత్య–సద్గుణసాహిత్యఙ్గళిరణ్డుమ్ భగవచ్ఛబ్ద వాచ్యఙ్గళాయితే యిరుప్పతు. ఆకైయితే “షణ్ణాం భగ ఇతీరణా” ఎన్డు భగవచ్ఛబ్దత్తుక్కు జ్ఞానాదిగుణఙ్గళ్ అర్థమాకవుమ్, “అన్” ఎన్గిఱ పదత్తుక్కు హేయరాహిత్యమ్ అర్థమాకవుమ్ భట్టర్ వ్యాఖ్యానమ్ శెయ్‌దరుళిరు. “అన్” ఎన్గిఱతు–నఞర్థమా–

---

**“అన్”** అని అవుతుంది. ఇది ఒక విశిష్ట ఛాందస (వైదిక) ప్రయోగం” **“కశ్యపః పశ్యకో భవతి”** (తైతి. ఆర–1–8) (జ్ఞాని అనే అర్థాన్ని కల **“పశ్యకః”** అనే పదం **“కశ్యపః”**. అని మాఱుతుంది) అనే వేదవాక్యంలో **“పశ్యక”** అనేది ముందు వెనుకలై **“కశ్యపః”** అని మాఱినట్లే, ఇదికూడా మాఱింది అని అంటారు. అందువల్ల హేయగుణాలు లేకుండా ఉండడం, కల్యాణగుణాలు నిండి ఉండడం **“భగవాన్”** అనే పదానికి అర్థం అని అనడంలో లోటు లేదు.

పిరాట్టివిషయంలో హేయగుణం అంటే–దాసుల దోషాలను, గుణరాహిత్యాన్ని చూచి, వారి చేయివిడువడం. అది లేకుండా ఉండడం అంటే – ఈ దోషాలను, గుణ రాహిత్యాన్ని భోగ్యంగా తలచి దాసులను అంగీకరించడం. భట్టర్ శ్రీగుణరత్నకోశంలోని 50వ శ్లోకంలో **“రాక్షసీః త్వయి తథైవార్ద్రాపరాధా స్త్వయా రక్షంత్యా పవనాత్మజాత్”** అని పల్కిన రీతిలో పిరాట్టిపట్ల అపరాధాన్ని చేసి, రక్తసిక్తహస్తలై ఉండే అశోకవనంలోని రాక్షస స్త్రీలను వారి ఆదోషాలనే ఉపహారంగా గ్రహించి, వారిని పరిగ్రహించి, కాపాడిందికదా! **“త్రాహి త్రాహీతి భర్తార మువాచ దయయా విభుమ్”** (పాద్మపురాణమ్)– (నాథుడైన భగవానుని చూచి, “రక్షించు, రక్షించు” అని కృపతో సీతాదేవి పల్కింది) అనే రీతిలో గతి లేక కిందపడిన కాకాసురునికూడా, తనపట్ల చేసిన అపచారాన్ని లెక్కించకుండా, అతనిని అంగీకరించి, అతడు తలక్రిందుగా కిందపడినా, శ్రీరాముని శ్రీపాదాలలో అతని తలను చేర్చి కాపాడిందికదా! ఈమె గుణాలు ఏవి అంటే – జ్ఞానం శక్తి మొదలైనవి. వాటితో కూడి ఉండడం అంటే– అవి

యిరుక్కిఱతెఙ్గనే ? యెన్నిల్; “న” ఎన్గిఱవిడత్తిల్, “న్”, “అ” ఎన్ఱు పిరివుణ్డాయ్, అతిలే “న్” ఎన్గతు ప్రకృతియాయ్, “అ” ఎన్గిఱతు-సుఖముఖోచ్చారణమాయిఱ్ఱే ఇరుప్పతు. ఇవ్విడత్తిల్ “అన్” ఎన్ఱు మున్పిన్నాయ్ పిన్మున్నాయిరుక్కిఱతు. ఛాన్దసప్రయోగ మిరుక్కుమ్బడి. ఇవ్విడత్తిల్, “కశ్యపః పశ్యకో భవతి” ఎన్గాప్పోలేయెన్ఱిఱే అరుళిచ్చెయ్వతు. ఆకైయాలే హేయగుణరాహిత్య-సద్గుణసాహిత్యఙ్గళ్ భగవచ్ఛబ్దవాచ్యఙ్గళెన్న త్తట్టిల్లై.

ఇవ్విడత్తిల్ హేయమావతు-ఆశ్రితదోషగుణహానికళ్ పార్త్తు అవర్కళై ఉపేక్షిక్కై. తద్రాహిత్యమావతు-అవై యిరణ్డుమ్ అడుకువళమాక వజ్గీకరిక్కై. “ఆర్ద్రాపరాధైక” ళాన రాక్షసికళై అరాధమే పఱ్ఱాశాక అఙ్గీకరిత్తు రక్షిత్తాళిఱే. “త్రాహి త్రాహి” ఎన్ఱ అణ్డజాధమనైయుమ్ అఙ్గీకరిత్తు త్తిరువడికళిలే తలైయాక రక్షిత్తతుముణ్డిఱే. గుణఙ్గళావన-జ్ఞానశక్త్యాదికళ్. తత్సాహిత్యమావతు-అవై స్వరక్షణహేతువాయ్ తన్బక్కలిలే శువఱివిడుకైయన్ఱిక్కే, పరరక్షణత్తుక్కు ఉఱుప్పాక ప్పుఱవెళ్ళ మిడుమ్బడి సమ్పున్నమాయిరుక్కై. ఇవఱ్ఱై స్వరక్షణత్తుక్కు ఉఱుప్పాక్కామల్, “తత్తస్య సదృశం

---

తనను రక్షించడానికి కారణాలై, స్వల్పం అయిన ఆనందానికే హేతువులు కాకుండా, ఇతరులను కాపాడడానికి హేతువులై, మహానందప్రవాహాన్ని కల్గించేటట్లు పూర్ణంగా ఉండడం. తన జ్ఞానశక్తులు తనకు రక్షించడానికి ఉపయోగపఱచకుండా, **“శరై స్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః, మాం నయే ద్యది కాకుత్థ్సః తత్తస్య సదృశం భవేత్”** (రామా-సుందర-39-30) (శత్రువుల బలాన్ని నశింప జేసే శ్రీరాముడు లంకను బాణాలతో కలత చెందేటట్లు చేసి, నన్ను తీసికొని పోయినట్లయితే, అది వారికి తగినది అవుతుంది) అనే రీతిలో భగవానుడు వచ్చి, తనను రక్షించాలని వేచి ఉన్నదికదా! అదే సమయంలో- **“యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః, యది వాఽ స్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః’.** (రామా-సుందర-53-29) (నాకు పతిశుశ్రూష ఉంటే, నాచేత తపస్సు చేయబడినది అయితే, నా నాథునకు ఏకపత్నీ వ్రతం ఉన్నట్లయితే హనుమానునకు అగ్ని అయిన నీవు చల్లగా ఉండాలి) అని హనుమంతుని నిప్పు కాల్చకుండా ఉండేటట్లు అనుగ్రహించిందికదా! **“తత స్సా హ్రీమతీ బాలా భర్తు ర్విజయహర్షితా, అవోచత్ యది తత్ తథ్యం భవేయం శరణం హి వః”** (రామా-సుందర-5-90) (లజ్జను నిండుగా కల్గినది, భర్త జయాన్ని విని ఆనందాన్ని పొందినది అయిన ఆ సీతాదేవి “ఆ కల నిజం అయితే మీకు నేను శరణం కాగలను) అని అన్నది. అనే రీతిలో తనను బాధించిన రాక్షసకాంతలకు అభయాన్ని ఇచ్చింది



భవేత్” ఎన్ఱిరున్దు “శీతో భవ”, “భవేయం శరణం హి వః” ఎన్ఱు పరిరక్షణత్తుక్కు ఉఱుప్పాక్కినాళిఱే. ఇవఱ్ఱై గుణమెన్నలావతు-పరార్థమానపోతిఱే. ఆకైయిఱే “గుణగణా శ్చ జ్ఞానశక్త్యాదయ స్తే. . . . సకలం సంశ్రితార్థం చకర్థ” ఎన్ఱరుళిచ్చెయ్తతు. గుణఙ్గళుక్కు వ్యావర్త్యర్ తద్వ్యతిరిక్తర్. ఇవళ్గుణఙ్గళుక్కు వ్యావర్త్యన్ అవన్. అవన్ గుణఙ్గళ్ పుంస్త్వ ప్రయుక్తమాన స్వాతన్త్ర్యవిశిష్టమాయ్, పితృత్వప్రయుక్తమాన “హితస్రోతోవృత్తి”యాలే కలఙ్గినపోతుణ్డాన ప్రతాపత్తాలే దురాసదమాయ్, అతఏవ పురుషకారసాపేక్షమాయిరుక్కుమ్. ఆకైయిఱే ఇవళ్ గుణఙ్గళాలే తద్గోష్ఠి లఘుతరైయాయిఱ్ఱు.

ఆక, ఇప్పడి పాపమే పచ్చైయాక వజ్గీకరిక్కైక్కుహేతువాయ్, పరార్థైకవేషమాన జ్ఞానశక్త్యాదికల్యాణగుణపూర్త్తియై భగవచ్ఛబ్దమ్ శొల్లుకిఱతు. “జ్ఞానాది షడ్గుణమయీ” “జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యశక్తిప్రభావినీమ్” ఎన్నక్కడవతిఱే. “స దిశతు భగవాన

---

కదా! నిజానికి జ్ఞానం, శక్తి మొదలైన వానిని గుణాలని చెప్పే యోగ్యత ఉన్నది అవి రక్షించడానికి ఉపయోగపడినపుడు కదా! **“పరిజనపరిబర్హా భూషణాన్యాయుధాని ప్రవరగుణగణా శ్చ జ్ఞానశక్త్యాదయ స్తే, పరమపద మథాణ్డాన్యాత్మదేహ స్తథాఽత్మా వరద సకల మేతత్ సంశ్రితార్థం చకర్థ”** (వరదరాజస్తవం-63) (వరదరాజస్వామీ ! విష్వక్సేనాదిపరిజనం, ఛత్రచామరాది పరిచ్ఛదాలు, ఆభరణాలు, ఆయుధాలు, జ్ఞానశక్త్యాదిగుణసమూహాలు, పరమపదం, అణ్డాలు, నీ దివ్యమంగళవిగ్రహం, దివ్యాత్మస్వరూపం- అనే వీనిని అన్నిటినీ నీ దాసుల కోసమే చేశావు) అనే రీతిలో భగవానుడు తన గుణాలు మొదలైనవానిని ఇతరులకు వశం చేస్తాడు – అని కూరేశులు అనుగ్రహించారు. భగవానుని గుణాలు బ్రహ్మరుద్రాది అన్యదేవతల గుణాలకంటె గొప్పవి. ఈ పిరాట్టి గుణాలు అతని గుణాలకంటే గొప్పగా ఉంటాయి- అని, అతడు పురుషులలో గొప్పవాడైన పురుషోత్తముడు అయినా **“పితేవ త్వత్ప్రేయాన్.... హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః”** అనే శ్రీగుణరత్నకోశంలోని 52 వశ్లోకంలోని సూక్త్యనుసారం తన బిడ్డలకు హితాన్ని కల్గించడంకోసం వారి విషయంలో కోపాన్ని పొంది, మనస్సు కాలుష్యాన్ని పొందే అవకాశం ఉన్నది. కనుక పురుషకారభూత అయిన ఈమెను ఎదురు చూడవలసి ఉన్నది. అందుచేతనే భట్టర్ శ్రీగుణరత్నకోశంలోని 50వశ్లోకంలో **“మాత ర్మైథిలి....లఘుతరా రామస్య గోష్ఠీకృతా”** అని చెప్పిన రీతిలో ఈమె గుణాలచేత రాముని గోష్ఠి అధఃకరింపబడింది.

శేషపుంసామ్", "స్మర్తవ్యో భగవాన్", "మోదతే భగవాన్", "భగవన్నారాయణ" ఎన్ఱు అవనై నిర్దేశిత్తాప్పోలే, తత్తుల్యశీలైయాన ఇవళై వ్యవహరిప్పతుమ్ "భగవతి" ఎన్ఱిఱే. ఇన్ద పూర్తితాన్-కీఴ్"పురుషోత్తమన్" ఎన్ఱు శొన్న పూర్తిక్కడియాయిఱే యిరుప్పదు. "భగవాన్ నారాయణ" ఎన్ఱు ఇవళ్ పూర్తిక్కు అడియుడైమై. "శ్రీమన్ నారాయణ" ఎన్ఱిఱేఅవన్ పూర్తిక్కు అడియుడైమై. "స్వత శ్రీ" రిత్యాది.

---

అందుచేత ఈ రీతిలో దాసుల దోషమే ఉపహారంగా అంగీకరించడానికి హేతువులై, ఇతరుల కోసమే ఉండే జ్ఞానం, శక్తి మొదలైన కల్యాణగుణాలు ఈమెలో నిండి ఉండే విషయాన్ని భగవచ్ఛబ్దం తెలుపుతున్నది. **"తథైవైకా పరా శక్తిః శ్రీ స్తస్య కరుణాశ్రయా, జ్ఞానాదిషడ్గుణమయీ యా ప్రోక్తా ప్రకృతిః పరా"** (సనత్కుమారసంహిత) (కరుణకు అద్వితీయస్థానమై, జ్ఞానం మొదలైన ఆఱు గుణాలను పూర్ణంగా కల్గినదై, గొప్పదైన ప్రకృతి అని చెప్పబడే శ్రీదేవి ఆ భగవానుని గొప్ప శక్తి) అని, **"జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజఃప్రభావినీమ్"** (అహిర్బుధ్న్య-21-9) (జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు- అనే ఆఱు గుణాలను కల శ్రీదేవిని) అని పాంచరాత్రశాస్త్రం ఈమెను జ్ఞానం మొదలైన ఆఱు గుణాలు నిండినదిగా చెప్పిందికదా! **"ఇతి వివిధ మజస్య యస్య రూపం ప్రకృతిపరాత్మమయం సనాతనస్య, ప్రదిశతు భగవా నశేషపుంసాం హరి రపజన్మజరాదికాం స సిద్ధిమ్"** (విష్ణుపు-6-8-64) (జన్మరహితుడు, సనాతనుడు అయిన ఏ విష్ణువునకు పలు రీతులలోని ప్రకృతి, దానికంటె గొప్పది అయిన దివ్యమంగళవిగ్రహం, ఆత్మస్వరూపం - అనే ఇవి ఈ విధంగా శరీరాలుగా ఉన్నవో, ఆ భగవానుడు అయిన హరి అందఱు మానవులకు జన్మ, వార్ధక్యాదులను లేకుండా చేసే మోక్షసిద్ధిని అనుగ్రహించుగాక!), **"మహత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః"** (భార-సభా-90-41) (గొప్ప ఆపద వచ్చినపుడు భగవానుడైన హరి శరణాగతిచేయతగినవాడు), **"అనియోజ్యోఽప్రమేయ శ్చ యస్య కామశరీరకృత్, మోదతే భగవాన్ భూతైః బాలః క్రీడనకై రివ"** (భార-సభా-40-78) (ఎవరిచేత నియోగింపబడడానికి సాధ్యం కానివాడు-ఎదిరించి మాటలాడడానికి వీలుకానివాడు, తెలిసికొనడానికి సాధ్యం కానివాడు, ఇష్టం వచ్చిన రీతిలో రూపాలను ధరించేవాడు అయిన భగవానుడు, బాలుడు ఆటవస్తువులతో ఆడేటట్లు, జీవులతో క్రీడించి సంతోషిస్తాడు) అని ఇతిహాసపురాణాలలోను, శరణాగతిగద్యంలోని **"భగవన్నారాయణాభిమతానురూప"** అనే ప్రమాణంలోను భగవానుని **"భగవాన్"** అని నిర్దేశించినట్లే, అతనికి అనురూపం అయిన గుణాలను కల ఈమెను "**భగవతీ**" అనికదా నిర్దేశించాలి. ఈమె గుణపూర్తి పూర్వం పురుషోత్తముడని చెప్పబడ్డ స్వామిగుణపూర్తికికూడా కారణంగాకదా



ఇప్పడిప్పట్ట అతిశయశాలినియాన ఉన్నై యథావత్తాక స్తోత్రమ్ పణ్ణప్పోమో? ఎన్గిఱార్ (త్వాం వయం కథం బ్రూమః) ఎన్ఱు. (త్వామ్) ఉక్తప్రక్రియైయాలే విష్ణుపత్నియాయ్, తదితరసర్వస్వామినియాయ్, తదనురూపాఽసాధారణమాన

---

ఉంటుంది. **"భగవన్నారాయణ"** ఇత్యాది శరణాగతిగద్యవాక్యంలో పిరాట్టియొక్క గుణవైభవానికి భగవానుని గుణవైభవం కారణం అని చెప్పబడింది. ద్వయంలో **"శ్రీమన్నారాయణ"** అని భగవానుని గుణాతిశయానికి పిరాట్టియొక్క గుణాతిశయం కారణం అయినా, ఇందువల్ల అతని పరబ్రహ్మత్వానికి ఏ లోటు లేదు-అనే విషయాన్ని **"స్వతః శ్రీః త్వం విష్ణోః త్వ మసి తత ఏవైష భగవాన్ త్వదాయత్తర్థిత్వేఽప్యభవద పరాధీనవిభవః, స్వయా దీప్త్యా రత్నం భవతి చ మహార్ఘం న విగుణం న కుంఠం స్వాతంత్ర్యం భవతి చ న చాన్యాహితగుణమ్"** (శ్రీగుణ-31) (తల్లీ ! సహజంగానే నీవు భగవానునకు చెందినదానవై ఉన్నావు. ఇందువల్లనే ఈ భగవానుడునీవల్ల సిద్ధించిన వైభవాన్ని కల్గినవాడైనా, సహజం అయిన గొప్పతనాన్ని కలవాడు అయ్యాడు. తనకాంతివల్ల గొప్ప విలువను కల్గినది అయిన రత్నం (ఆ కారణంచే) తక్కువదిగానో, సహజమైన విలువను లేనిదిగానో, వేఱొకదానివల్ల ఏర్పడ్డ గౌరవాన్ని కల్గినదిగానో కాదు కదా) అని శ్రీపరాశరభట్టర్ పలికారు.

ఇటువంటి గొప్పతనాన్ని కల నిన్ను మేము ఏ విధంగా స్తుతించగలం ? అని అంటున్నారు. **(త్వాం వయం కథం బ్రూమః)** అని అంటూ. **(త్వామ్)** పూర్వం పల్కినట్లు విష్ణువునకు పత్నియై, అతడు తప్ప మిగిలినవారికి అందఱికీ తల్లివై, ఈ గొప్పతనాలకు తగిన **"శ్రీ"** అనే తిరునామంతో వ్యవహరింపబడేదానివై, భగవానునికంటే గొప్ప జ్ఞానం, శక్తి మొదలైన కల్యాణగుణాలచే అలంకరింపబడినదానవై, ఈ స్వభావాలచేత అన్ని ఉపనిషత్తులలోను కీర్తింపబడే నిన్ను-అని భావం - **(త్వాం వయం కథం బ్రూమః)** బ్రహ్మధ్యానమే కాలక్షేపంగా కల సనకసనందనాది మహర్షులకు, లోకసృష్టి మొదలైనవానితోపాటు బ్రహ్మధ్యానాన్ని కల బ్రహ్మ మొదలైన దేవతలకు, పరబ్రహ్మనుగూర్చి పలికే వేదాలకుకూడా పరిచ్ఛేదించి పలుకడానికి సాధ్యం కాని గొప్పతాన్ని కల నిన్ను మిక్కిలి తక్కువ జ్ఞానశక్తులను కల మేము పరిచ్ఛేదించి స్తుతించడం ఏ విధంగా సాధ్యం? అని అంటున్నారు. **"న తే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాపి వేధసః, ప్రసీద దేవి పద్మాక్షి మాస్మాంస్త్యాక్షీః కదాచన"** (విష్ణు.పు-1-9-133) (బ్రహ్మయొక్క జిహ్వాకూడా నీ గుణాలను వర్ణించగల శక్తిని కల్గినది కాదు. తామరలవంటి నేత్రాలను కల దేవీ! అనుగ్రహించు. మమ్ములను ఎప్పుడూ విడచిపోవద్దు), **"బ్రహ్మాద్యా**

నామనిర్దిష్టైయాయ్, భగవద్విలక్షణజ్ఞానశక్త్యాదికల్యాణగుణభూషితైయాయ్, ఇవ్వాకారజ్గళినాలే సకలోపనిషత్ప్రసిద్ధైయాన ఉన్నై. (త్వాం వయం కథం బ్రూమః) బ్రహ్మభావనైకనిష్ఠరాన సనకాదికళుక్కుమ్, ఉభయభావనానిష్ఠరాన బ్రహ్మాదిళుక్కుమ్, బ్రహ్మప్రతిపాదకజ్గళాన వేదజ్గళుక్కుమ్, పరిచ్ఛేదిక్క వొణ్ణాత ప్రభావత్తైయుడైయ ఉన్నై, పరిమితజ్ఞానశక్తికరాన నాజ్గళ్ పరిచ్ఛేదిత్తు ప్పేశువతెజ్గనే? యెన్గిఱార్. "న తే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాపి వేధసః", "బ్రహ్మాద్యా స్సకలా దేవా మునయ శ్చ తపోధనాః,

---

**స్సకలా దేవా మునయ శ్చ తపోధనాః, త్వాం స్తోతు మపి నేశానాః త్వత్ప్రసాదలవం వినా"** (బ్రహ్మ మొదలైన దేవతలందఱు, తపస్సే ధనంగా కల మునులు, నీ దయలో ఒక లవలేశం అయినా ఉంటే తప్ప నిన్ను స్తుతించలేరు) అనే ప్రమాణాలతోను,**"ఉద్బాహు స్త్వా ముపనిషదసా వాహ నైకా నియంత్రీం శ్రీమద్రామాయణ మపి వరం ప్రాణితి త్వచ్చరిత్రే, స్మర్తారో ఽ స్మజ్జనని! యత మే సేతిహాసైః పురాణైః నిన్యు ర్వేదా నపి చ తత మే త్వన్మహిమ్ని ప్రమాణమ్"** (శ్రీగుణ-14) (మా తల్లీ! శ్రీ సూక్తం మొదలైన ఈ ఉపనిషత్తులు మాత్రమే బాహువులను పైకెత్తి నిన్ను లోకానికి స్వామినివి అని చెప్పలేదు. శ్రీ మద్రామాయణంకూడా నీ చరిత్రను వర్ణించడంద్వారానే ఉజ్జీవిస్తున్నది. స్మృతికర్తలైన ఋషులుకూడా ఇతిహాసపురాణాలతో కూడిన వేదాలనుకూడా నీ గొప్పతనాన్ని తెలిపే ప్రమాణాలని చెప్పారు) అని శ్రీపరాశర భట్టర్‌చేత కూడా పిరాట్టియొక్క గొప్పతనం లెక్కకట్టలేనిది అని ఘోషింపబడనదికదా "**తిరుమాల్ నాన్ముకన్ శెజ్జడైయాన్ ఎన్గివర్‌కళ్.....ఎమ్బెరుమాన్ తన్మైయై యారఱికిఱ్పార్**" (తిరువాయ్-8-3-9) (శ్రియః పతీ! చతుర్ముఖుడు, ఎఱ్ఱని జటలను కల శివుడు అనే వీరిలో సర్వేశ్వరుడవైన నీ మహిమను తెలిసికొనగలవారు ఎవరు?) అని **"మామలరాన్ వార్‌శడైయాన్ ఎన్ఱు ఇవర్ కట్కు ఎణ్ణత్తానామో ఇమై"** (మూన్ఱామ్. తిరు-97) (పద్మభవుడు, వేలాడే జటలను కల రుద్రుడు-అనే వీరికి స్వామి మహిమను చింతించడానికైనా సాధ్యమా!) అని ఆళ్వార్లు పిరాట్టితో కూడిన భగవానుని గొప్పతనాన్ని బ్రహ్మాదిదేవతలు సైతం స్తుతించలేరు-అని అనుగ్రహించారుకదా! స్తోత్రరత్నంలో ఆళవన్దార్ **"ఉపర్యుపర్యబ్జభువో ఽ పి పూరుషాన్, ప్రకల్ప్య తే యే శత మిత్యనుక్రమాత్ ..... నోద్యమతో ఽ తిశేరతే"** అనే 19 వశ్లోకంలో పల్కిన రీతిలో ఉత్తరోత్తరం పురుషులను కల్పించి పరబ్రహ్మయొక్క ఆనందం మొదలైన గుణాలను ఇదమిత్థంగా లెక్కించాలని ప్రయత్నించిన వేదంకూడా **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చ న"** (తైత్తి-ఆనం-9-1) (ఏ పరబ్రహ్మనుండి మనస్సుతోపాటు వాక్కులు ఆ పరబ్రహ్మను



త్వాం స్తోతు మపి నేశానాః" ఎన్ఱుమ్, "ఉద్బాహు స్త్వా ముపనిషదసా వాహ నైకా నియన్త్రీమ్" ఎన్నక్కడవతిఱే. "నాన్ముకన్ శెజ్జడైయానెన్గివర్‌కళ్ తిరుమాల్‌తన్మైయై యారఱికిఱ్పార్" ఎన్ఱుమ్, "మామలరాన్ వార్‌శడైయానెన్గివర్‌కట్కు ఎణ్ణత్తానామో" ఎన్ఱుమ్, బ్రహ్మాదికళుమ్ ఇవళుడైయ వైభవత్తై స్తోత్రమ్ పణ్ణ అసమర్థరెన్ఱరుళిచ్చెయ్‌తార్-కళిఱే. మేలే మేలే పురుషర్‌కళై కృప్తిత్తు ఉత్ప్రేక్షిత్తవళవిలుమ్, ఓరొరు గుణజ్గళై అవధి కాణ వొణ్ణామైయాలే, "యతో వాచో నివర్తన్తే" ఎన్ఱు వేదజ్గళుమ్ నివృత్తమామ్బడి నిరవధికమాన వానన్దత్తుక్కుమ్ హేతుభూతైయాయ్, "చుళకితభగవద్వైశ్వరూప్యాఽ

---

పరిచ్ఛేదించలేక వెనుకకు తిరుగుతున్నాయో, ఆ పరమాత్మయొక్క ఆనందాన్ని తెలిసినవాడు ఎవరివల్ల భయపడడు) అనే రీతిలో వెనుకకు తిరిగేటట్లున్న అంతులేని భగవానుని ఆనందానికి కారణంగా ఉండేదై, **"భోగోపోద్ఘాతకేళీచుళకితభగవద్వైశ్వ-రూప్యానుభావా"** అని శ్రీ భట్టర్ శ్రీగుణరత్నకోశం 4వ శ్లోకంలో పల్కినట్లు భగవానుని విశ్వరూపానుభవాన్నికూడా మించి ఉండే ఈమె గొప్పతనం లెక్కకట్ట వీలులేనిది-అనేది చెప్పి తెలియనక్కఱలేదు.

**(వయమ్)**- "మేము" అని తమనే బహువచనంలో నిర్దేశించుకొంటున్నారు అని అనవచ్చు. లేకపోతే, **"ఎన్నుడైయారుయిరార్ ఎజ్గనేకొల్ వన్దు ఎయ్‌దువరే"** (తిరువాయ్-7-6-5) (నా ఆత్మ ఏ విధంగా వచ్చి నిన్ను పొందుతుంది?) అని ఆళ్వార్లు తమపై నిరాదరణను సూచించడంకోసం పరిహాసపూర్వకంగా బహువచనాన్ని వ్యతిరేకలక్షణలో ప్రయోగించినట్లే, వీరుకూడా తమ విషయంలోని నిరాదరణను సూచించడంకోసం ఈ బహువచనాన్ని ప్రయోగించారనికూడా గ్రహించవచ్చు. **"తత్త్వేన యస్య మహిమార్ణవశీకరాణుః శక్యో న మాతు మపి శర్వపితామహాద్యైః, కర్తుం త్వదీయ మహిమస్తుతి ముద్యతాయ మహ్యం నమో ఽ స్తు కవయే నిరపత్రపాయ"** (స్తోత్ర-7) (ఏ భగవానుని మహిమ అనే సముద్రంలోని ఒక చిన్న రేణువులోని అణువు అంతకూడ శివుడు, బ్రహ్మ మొదలైనవారిచే కూడా యథాతథంగా పరిచ్ఛేదించడానికి సాధ్యం కాదో, ఆ భగవానుని మహిమను గూర్చిన స్తోత్రాన్ని చెయడానికి ఆరంభించినవాడను, లజ్జ లేనివాడను, కవి అనే పేరును పెట్టుకొన్నవాడను అయిన నాకు నేనే నమస్కారాన్ని చేసికోవాలి) అని స్తోత్రరత్నంలో కూడా వీరు భగవానుని స్తుతించడానికి ప్రారంభించిన తమను తామే క్షేపించుకొన్నారుకదా! **"యద్వావతవ వైభవం తదుచితస్తోత్రాయ దూరే స్పృహా స్తోతుం కే వయ మిత్యద శ్చ జగృహుః ప్రాంచో విరించాదయః, అప్యేవం తవ దేవి! వాఙ్మనసయో ర్భాషానభిజ్ఞం పదం కా వాచః ప్రయతామహే కవయితుం**

నుభావై" యుమాన ఇవళుడైయ ప్రభావమ్ పరిచ్ఛేదిక్క వొణ్ణాతెన్ను మిడమ్ శొల్లవేణ్డావిఱే.

(వయమ్) ఎన్రు ఆత్మని బహువచనమ్. "ఎన్నుడై యారుయిరార్" ఎన్నుమాప్పోలే క్షేపోక్తియాకవుమామ్. "మహ్యం నమోఽస్తు కవయే" ఎన్రు తమ్మై గర్విత్తుక్కొణ్డారిఱే. "స్తోతుం కే వయ మిత్యద శ్చ జగృహుః ప్రాఞ్చో విరిఞ్చాదయః" ఎన్నక్కడవతిఱే.

అథవా, (వయమ్) "మహార్ణవాన్తర్నిమజ్జతో రణుకులాచలయోః కో విశేషః" ఎన్గిఱపడియే వేదఙ్గళుక్కుమ్, చతుర్ముఖప్రముఖర్క్కుమ్, "అపి మే జన్మ చతుర్ముఖాత్మనా". ఎన్రు అమరర్కళై తృణీకరిత్తిరుక్కిఱ తమక్కుమ్ అన్యోన్యమ్ తారతమ్య ముణ్డేయాకిలుమ్, ఇవళుడైయ మహిమార్ణవత్తిలే మగ్నరామిడత్తిల్ ఒరు వైషమ్య మిల్లామైయాలే ఎల్లారైయుమ్ కూట్టిక్కొణ్డు "వయమ్" ఎన్గిఱారాకవుమామ్. "మాతఙ్గ శ్చ మహాన్" ఇత్యాది. కీழక్తరానవర్కళోడు ఒరువరాయ్, పరిచ్ఛేదిక్కమాట్టామై యన్రిక్కే,

**స్వస్తి ప్రశస్త్యై గిరామ్"** (శ్రీగుణ-5) (శ్రీరంగనాయకీ ! నీ గొప్పతనం యొక్క స్వరూపానికి, అవధికి తగిన స్తుతిని చేయడానికి ఆశపడడంకూడా చాలా దూరంలో ఉన్నది. ప్రాచీనులైన బ్రహ్మాదులుకూడా "నిన్ను మేము స్తుతించడానికి అధికారులమా!" అనే మాటనే పల్కుతున్నారు. ఆ విధంగా ఉన్నా, వాక్కు. మనస్సుల అవధిని దాటి ఉండే నీ స్వరూపాన్ని స్తుతించడంకోసం నిహీనమైన వాక్కులను కల మేము ప్రయత్నిస్తున్నాము. మా వాక్కులకు గౌరవం కల్గడం కోసం నీ కరుణ అనే మంగళం కల్గుగాక) అని శ్రీ గుణరత్నకోశం 5వ శ్లోకంలోభట్టర్ సైతం బ్రహ్మ మొదలైనవారిచే కూడా స్తుతించడానికి సాధ్యం కానిది లక్ష్మీదేవి-అని అనుగ్రహించారుకదా!

**(వయమ్)-** లేక, ఇతరులను అనేకులను కలుపుకొని "మేము" అనే పదాన్ని ప్రయోగించారనికూడా చెప్పవచ్చు, **"యద్వా శ్రమావధి యథామతి వాఽప్యశక్తః స్తౌమ్యేవ మేవ ఖలు తేఽపి సదా స్తువంతః, వేదా శ్చతుర్ముఖముఖా శ్చ మహార్ణవాంతః కో మజ్జతో రణుకులాచలయో ర్విశేషః"** (స్తోత్ర-8) (లేక, శక్తి లేని నేను నాకు శ్రమ కలిగేంతవరకు, నా బుద్ధికి తెలిసినంతవరకు అయినా స్తోత్రాన్ని చేస్తాను. ఎల్లప్పుడూ స్తుతించే ఆ వేదాలు, బ్రహ్మ మొదలైనవారుకూడా ఈ విధంగానేకదా స్తుతిస్తారు. గొప్ప సముద్రంలోపల మునిగిపోయే చిన్న అణువుకు, గొప్ప కులపర్వతానికి మధ్య మునిగిపోవడంలో ఏమి తేడా ఉన్నది?) అనే రీతిలో వేదాలకు, బ్రహ్మ మొదలైనవారికి, **"తవ దాస్యసుఖైకసంగినాం భవనేష్వస్త్వపి కీటజన్మ మే, ఇతరావసథేషు మాస్మ భూ**



ఎల్లారుమ్ కూడి ఏకకణ్ఠరాయ్ ప్పేశిలుమ్ మేలెల్లై కాణవొణ్ణా తెన్రు "వయమ్" ఎన్గిఱతాతల్.

(త్వాం వయమ్) "అవనెవ్విడత్తాన్ యానార్" ఎన్నుమాపోలే, స్తోత్ర-స్తోతవ్య గతోత్కర్షాఽపకర్షఙ్గళుడైయ ఎల్లై నిలత్తై సూచిప్పిక్కైక్కాక (త్వాం వయ మెన్గిఱార్).

**రపి మే జన్మ చతుర్ముఖాత్మనా"** (స్తోత్ర-55) (నీకు శేషంగా ఉండడమనే సుఖం ఒక్క దానిలోనే అభినివేశాన్ని కలవారి గృహాలలో నాకు కీటజన్మ అయినా సరే కలుగనీ. మిగిలినవారి ఇళ్ళలో బ్రహ్మగా పుట్టడంకూడా నాకు వద్దు). అనే రీతిలో వారిని తృణప్రాయంగా గణించే తమకు ఇతరులతో హెచ్చుతగ్గులున్నా ఈమె మహిమార్ణవంలో మునిగిపోయే విషయంలో సమానమే కాబట్టి, వేదాలను, బ్రహ్మ మొదలైనవారిని కలుపుకొంటూ **"వయమ్"** అని అన్నారనికూడా అనవచ్చు. "**బ్రహ్మాదీనాం స్వస్య చాత్రావిశేషవ్యంజనాయ బహువచనమ్**" అని దేశికవ్యాఖ్య. వేదాలు, బ్రహ్మాదులు తాము ప్రత్యేకప్రత్యేకంగా స్తుతించలేకపోవడమే కాక, అందఱూ ఒకటిగా కలసి ఏకముఖంగా స్తుతించినా, లక్ష్మి గొప్పతనంయొక్క అవధిని చూడలేరు- అనే అర్థంలో కూడా **"వయమ్"** అనే పదాన్ని గ్రహించవచ్చు. "**కథం బ్రూమః**" - "**కార్త్స్న్యేన తద్వర్ణన మశక్యమ్, పరిచ్ఛిద్య వర్ణనం త్వనుచితమితి భావః**" అని దేశికవ్యాఖ్య.

**(త్వాం వయమ్)-"అమ్మాన్ ఆழிప్పిరాన్ అవన్ ఎవ్విడత్తాన్ యాన్ ఆర్"** (తిరువాయ్-5-1-7) (సుదర్శనధారి అయిన స్వామి ఎక్కడ? నేనెక్కడ ?) అనే రీతిలో స్తుతించే తాము నైచ్యావధిలో, స్తుతింపబడే లక్ష్మీదేవి పరమావధిలో ఉండడాన్ని తెలుపడంకోసం రెండు పదాలనుచేర్చి ప్రయోగించారు. **"అవరై నామ్ అవ్వణ్ణత్తవర్"** (తిరునెడు-21) (వారిని మేము అటువంటివారు అని) అనే చోట **"అవరై నామ్ అవ్వణ్ణత్తవర్ ఎన్రుతాన్ శొల్లముడియుమ్"** (వారిని మనం "అటువంటివారు" అని మాత్రమే చెప్పగలం) అని తిరుమఙ్గైయాழ்వార్ అనుగ్రహించినట్లు, "నిన్ను మేము ఏ విధంగా స్తుతించగలము?" "**త్వాం వయం కథం బ్రూమః**" అని అంటున్నారు.

అందువల్ల, ఈ రీతిలో ఈ మొదటి శ్లోకంలో- "భగవానుని జ్ఞానశక్త్యాదులకంటె గొప్పవి అయిన జ్ఞానశక్త్యాదికల్యాణగుణాలను నిండుగా కల్గినది, ఆ గుణాలను తెలిపే, భగవానుని తప్ప మిగిలిన అందఱికంటే ఈమె గొప్పది అని తెలియజేసే **"శ్రీః"** అనే తిరునామాన్ని కల్గినది, తమ పత్నులతో కూడిన బ్రహ్మాదిదేవతలను దాసదాసీజనంగా కల్గినది, అణ్డసృష్టికి కారణం అయినది, అయిన మూలప్రకృతికి అభిమానిదేవత, **"విష్ణుపత్ని"** అనే-అతిశయాన్ని కల్గినది-అనే ఈ మహిమలచేత శ్రుతిస్మృత్యాదిప్రమాణాలలో పొగడబడే నిన్నుగూర్చి అల్పజ్ఞానులం అయిన మేము ఏ

"అవరై నామ్-అవ్వణ్ణత్తవర్" ఎన్నుమత్తనై యెన్నాపోప్పలే, "త్వాం వయం కథం బ్రూమః" ఎన్గిఱార్.

ఆక, ఇత్తాల్-"భగద్విలక్షణజ్ఞానశక్త్యాది కల్యాణగుణపూర్ణైయాయ్, గుణఙ్గళుక్కు వాచకమాయ్, సర్వోత్కర్షప్రకాశకమాన తిరునామత్తై యుడైయైయాయ్, అణ్డకారణమాన మూలప్రకృతినిర్వాహకైయాయ్, అనన్తగరుడవిష్వక్సేన ప్రముఖసూరి పరిషత్పరిచర్యమాణ చరణనళినైయాయ్, 'విష్ణుపత్నీ' ఎన్గిఱ మేన్మైయైయుడైయైయాయ్, ఇవ్వాకారఙ్గళాలే శ్రుతిస్మృత్యాదిప్రమాణప్రసిద్ధైయా యిరుక్కిఱ వున్నై, పరిమితజ్ఞానశక్తిరాన నాఙ్గళ్ పరిచ్ఛేదిత్తు ప్పేశువతెఙ్గనే? ఎన్ఱు పిరాట్టియుడైయ పెరుమైయై దర్శిప్పియానిన్ఱుకొణ్డు,

---

విధంగా పరిచ్ఛేదించి పలుకగలం?" అని పిరాట్టియొక్క గొప్పతనాన్ని తెలిపారు. తరువాత, **"అమతం మత మథామతం స్తుతం పరినిందితం భవతి నిందితం స్తుతమ్, ఇతి రంగరాజ ముదజూఘష త్రయీ స్తుమహే వయం కి మితి త న్న శక్నుమః"** (శ్రీరంగ-1-13) (పరమాత్మ తెలియ సాధ్యం కానివాడు అని తలిస్తే, అపుడు సరిగా తెలిసినది అవుతుంది. బ్రహ్మం తెలియడానికి సాధ్యమైనవి అని భావిస్తే అది తెలియనిదే అవుతుంది. పరబ్రహ్మ పూర్తిగా స్తుతించ సాధ్యమైనదని భావింపబడితే అది నిందింపబడినదే అవుతుంది. యథాతథంగా స్తుతించడానికి సాధ్యం కానిది అని భావింపబడితే స్తుతించబడినది అవుతుంది-అని ఈ విధంగా పరమాత్మ అయిన శ్రీరంగనాథుని విషయంగా వేదం ఘోషించింది. ఈ విధంగా ఉండగా, జ్ఞానం లేని మేము అతనిని ఏమని స్తుతించగలం? స్తుతించలేము) అని భట్టర్ అనుగ్రహించినట్లే, స్తుతిని ప్రారంభించడానికి తమకు యోగ్యత లేని విషయాన్ని తెలుపుతూ, స్తుతినుండి వెనుకంజవేస్తున్నారు. ఈశ్లోకంలో యామునులు కఠవల్లి ఉపనిషత్తులో పఠింపబడ్డ ద్వయమంత్రంలోని **"శ్రీ"** శబ్దాన్ని అర్థంతో పాటు అనుసంధించినవారయ్యారు.

**యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః**
**నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః ।**
**తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ స్తోష్యామ్యహం నిర్భయః**
**లోకైకేశ్వరి! లోకనాథదయితే! దాంతే! దయాం తే విదన్ ॥ 2 ॥**

ప్రతి:- లోకైకేశ్వరి=లోకానికి ఈశ్వరిగా ఉన్నదానా!, లోకనాథదయితే=లోకాలకు అన్నిటికీ స్వామి అయిన భగవానునకు ప్రియమహిషి అయినదానా!, దాంతే= కరుణాస్వరూపిణీ!, యస్యాః తే=ఏ నీయొక్క, నిరవధిమ్=అంతులేనిది, స్వతః నిత్యానుకూలం=సహజంగానే



"స్తుమహే వయం కి మితి త న్న శక్నుమః'. ఎన్నాపోప్పలే స్తోత్రాక్షేపపురస్సరమాక స్తోత్రా న్నివృత్తరాకిఱార్. ఇశ్శ్లోకత్తాల్, కఠవల్ల్యుపనిషత్సిద్ధమాన ద్వయత్తిల్ శ్రీశబ్దత్తై సార్థమాక వనుసన్ధిత్తరుళినారాయిÓÓ.

**అవ.-** (యస్యా స్త ఇత్యాది) జ్యేష్ఠన్ కైయిలే రాజ్యదారఙ్గళై ప్పఱికొడుత్తు చ్చురమడైన్ద సుగ్రీవనైప్పోలే, జ్యేష్ఠపుత్రన్కైయిలే అవై యిరణ్డైయుమ్ "పొయ్చ్చూతిల్"

---

భగవానునకు సదా అనుకూలంగా ఉన్నది అయిన, మహిమానం=గొప్పతనాన్ని, ప్రభుః త్వత్ వల్లభః అపి=ఈశ్వరుడైన నీవల్లభుడు కూడా, ఆత్మనః ఇవ=తన గొప్పతనంవలె, ఇయత్తయా=ఇంతటిది అని, మాతుం న అలమ్=పరిచ్ఛేదించలేడో, తామ్ త్వామ్= అటువంటి నిన్ను, దాస ఇతి=దాసుడను అని, ప్రపన్నః ఇతి చ=శరణు పొందినవాడను అని, తే దయామ్ విదన్ అహమ్=నీ కరుణను తెలిసే నేను, నిర్భయః=భయం లేనివాడనై, స్తోష్యామి=స్తుతిస్తాను.

**అవతారిక:-** భారతయుద్ధంలో "నేను యుద్ధం చేయను" అని వింటిని, బాణాలను కింద పడవేసిన అర్జునునకు గీతోపదేశాన్ని చేసి, శ్రీకృష్ణుడు యుద్ధం చేసేటట్లుగా చేసినట్లే, పిరాట్టియొక్క మహిమను చూచి, ఆమెను స్తుతించడం సాధ్యం కాదని వెనుకంజ వేసే ఈ యామునులను పిరాట్టి తన సౌలభ్యాన్ని దర్శింపజేసి, తనను స్తుతించడానికి ప్రయత్నించేటట్లు చేస్తున్నది- అన్నది ఇచటి అవతారికాసారం. ఇక్కడ దృష్టాంతంగా చూపబడ్డ మహాభారత వృత్తాంతాన్ని నాయనారాచ్చాన్‌పిళ్ళై వివరంగా అనుగ్రహించారు. అది ఇక్కడ సంగ్రహంగా విన్నపింపబడుతున్నది అగ్రజుడైన వాలివద్ద తన రాజ్యాన్ని, భార్యను కోల్పోయి, శ్రీరాముని శరణువేడిన సుగ్రీవునివలె, జ్యేష్ఠుడైన ధృతరాష్ట్రుని పుత్రుడు అయిన దుర్యోధనుని చేతిలో రాజ్యాన్ని, భార్యను **"పొయ్ చ్చూదిల్ తోÓÓ పొఱైయుడై మన్నర్"** (పెరియాÇ్వార్. తిరు-2-1-1) (మాయాజూదంలో అసూయను కల రాజు) అనే రీతిలో శకుని ఆడిన మాయాజూదంలో పాండవులు ఓడిపోయారు. **"పొఱైయుడై మన్నర్"** (అసూయను కలరాజు) అనేటట్లు పాండవులు ఓర్పుతో ఉన్నా, వారి పత్ని అయిన ద్రౌపదిని చేపట్టడంకోసం **"అరశర్‌తమ్ అరశర్‌క్కు ఇళైయరశన్ అణియిÇైయైచ్చెన్ఱు ఎన్దమక్కు ఉరిమై శెయ్ ఎన"** (పెరియ తిరు-2-3-6) (రాజరాజు అయిన దుర్యోధనుని తమ్ముడు దుశ్శాసనుడు ద్రౌపది దగ్గరకు పోయి- "మాకు దాస్యం చేయాలి" అనగా) అన్నట్లు ఆమె కేశాలను, కట్టుకొన్న వస్త్రాన్ని రాజరాజుగా తనను అభిమానించిన దుర్యోధనుడు తన తమ్ముడైన దుశ్శాసనునిద్వారా లాగించగా, కృష్ణా

తోట్ర్కెయాలే "పొతైయుడై మన్నరాన" "పాణ్డవర్తమ్ముడైయ పాఞ్జాలియై" "మఱుక్కి వల్ వలైప్పడుత్తుకైక్కు" "అరశర్తమరశత్కిళైయవ" నాన దుశ్శాసనన్ "అవ్వణియిÇయై" చ్చెన్ను, "ఎన్దమక్కు ఉరిమై శెయ్" ఎన్ను "శురికుÇలైయుమ్, తుకిలైయుమ్ పÖÖ" వరవీర్క్క, కృష్ణైయుమ్ కేశగ్రహణప్రాప్తైయాయ్ క్కొణ్డు, "అశుద్ధైయాయ్, ఏకవస్త్రైయాన ఎన్నై గురుక్కళుడైయ మున్నే నయిప్పిక్కై అన్యాయజ్ఞాణ్" ఎన్ను కూప్పిడచ్చెయ్తేయుమ్, కలైతలైకళై క్కైవిడామైయాలే, కైవిడుమ్బడి సమ్ప్రాప్తమాన మహాపత్తిలే, (హా కృష్ణ

---

అనబడే ఆ ద్రౌపదికూడా కేశపాశం లాగబడ్డదై, "బయట ఉన్నందున అపవిత్రతను కల్గిన దానను, ఏకవస్త్రను అయిన నన్ను పెద్దలకుముందు ఈ విధంగా ఈడ్చుకొనిరావడం తగునా?" అని ఎలుగెత్తి ఆక్రోశించినపుడుకూడా దుశ్శాసనుడు ఆమె వస్త్రాన్ని, తల సిగను విడువలేదు. ఆ విధంగా తనకు ప్రాప్తించిన గొప్ప ఆపదలో ఆమె తన రెండు చేతులను జోడించి, **"హే కృష్ణ ద్వారకావాస ! క్వాసి యాదవనందన! ఇమా మవస్థాం సంప్రాప్తా మనాథాం కి ముపేక్షసే, శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత, గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగతామ్"** (భార-సభా-90-42-43) (అసూయను కలరాజు) (శ్రీకృష్ణా! ద్వారకావాసా! యాదవకులనందనా! ఎక్కడ ఉన్నావు? ఈ అవస్థలో ఉన్న, అనాథను అయిన నన్ను ఎందుకోసం ఉపేక్షిస్తున్నావయ్యా!, శంఖం, చక్రం, గదలను ధరించినవాడా! ద్వారకను నివాసంగా కలవాడా! దాసుల చేయిని విడువనివాడా! గోవిందా! పుండరీకాక్షా! శరణు పొందిన నన్ను రక్షించు) అని **"ఎఙ్గుÓÓయెమ్బెరుమాన్"** (తిరునెడు-9) (స్వామీ! ఎక్కడ ఉన్నావు) అని దుఃఖాన్ని పొందినదై, "అనాథ అయిన నన్ను ఎందువల్ల నీవు రక్షించడం లేదు? దాసులను రక్షించడంలో నీకున్న త్వర ఎక్కడకు పోయింది? దాసులను రక్షించడంకోసమే ఉన్న శంఖం, చక్రం, గద మొదలైనవాటిని ధరించి ఇక్కడే సమీపంలోనే ఉండి, భక్తులను నశింపనీయకుండా రక్షించే అచ్యుతుడవై, కుడిచేయి ఏదో ఎడమ చేయి ఏదో తెలియని గొల్లకుకూడ రక్షకుడవై, అందరికీ సులభుడవై, దుఃఖంలో ఉన్నవారి దుఃఖాన్ని పోగొట్టే వికసించిన ఎఱ్ఱతామరలవంటి తిరునేత్రాలనుకల పుండరీకాక్షుడవై ఉన్నవాడా! నిన్ను శరణుపొందిన నన్ను రక్షించాలి" అని ఆక్రోశించిన రీతిలో, పాండవుల అభిమానాన్ని భంగపటిచే రీతిలో దుర్యోధనుడు, అతను తమ్ముడు అవమానపరచారు. **"పాణ్డవర్ తమ్మడైయ పాఞ్చాలి మఱుక్కమెల్లామ్ ఆణ్డజ్ఞనూÓÓవర్ తమ్పెణ్డిర్ మేల్ వైత్త అప్పన్"** (పెరియాÇ్వార్తిరు-4-3-6) (పాండవుల భార్య పాంచాలి దుఃఖాన్ని



ద్వారకావాసిన్ ఇత్యాది). "ఎఙ్గుÖÖ యెమ్బెరుమాన్!" ఇవ్వవస్థైయై ఆపన్నైయాయ్, అనాథైయాన వెన్నై ఎతుక్కాక ఉపేక్షిక్కిఱాయ్? ఉన్నుడైయ ఆశ్రితరక్షణత్వరై ఎజ్గే పోయిÖÖ. (శఙ్ఖచక్రగదాపాణ యిత్యాది) రక్షణపరికరఙ్గళాన శఙ్గచక్రాదికళై ధరిత్తుక్కొణ్డు ఇఙ్గే అడుత్తణిత్తాక వన్దు నిన్ను ఆశ్రితరై నÇవవిడాతవనుమాయ్, ఇడక్కై వలక్కై అఱియాత వఙ్ఞర్క్కుమ్ ఆశ్రయిక్కలామ్బడి అలర్న్ద శెన్దామరై ప్పూపోలే యిరుక్కిఱ తిరుక్కణ్గళై యుడైయైయాయిరుక్కిఱవనే! శరణాగతైయాన వెన్నై రక్షిక్కవేణుమ్" ఎన్ను ఆక్రన్దిక్కుమ్బడి అభిమానభఙ్గమాక ప్పరిభవిక్క, అతఱ్కాక అవర్ తఙ్గుమూరాక ప్పుక్కు ఐన్దు

---

అంతటినీ తీర్చి, దానిని నూఱుమంది కౌరవుల భార్యలపై పడవేసిన స్వామి) అనే రీతిలో పాంచాలి దుఃఖాన్ని తుడవడం కోసం **"శీరొన్ఱు తూదాయ్ త్తురియోదనన్ పక్కల్ ఊరొన్ఱు వేణ్డి"** (పెరియాÇ్వార్ తిరు-2-6-5) (గొప్ప దూతయై, దుర్యోధనుని దగ్గర ఒక ఊరును అడిగి) అనే విధంగా శ్రీకృష్ణుడు దూతగా పోయి పాండవులు అయిదుగురికి ఒక్కొక్క ఊరును కోరాడు. అయినా, **"కత్త క్కతిత్తు క్కిడన్ద పెరుఞ్జెల్వమ్ ఒత్తు ప్పొరిన్దిక్కొణ్డు ఉణ్ణాదు మణ్ణాళ్వాన్"** (పెరియాÇ్వార్, తిరు-1-9-3) (తగాదాకు కారణం అయిన సంపదను పాండవులతో కలసి అనుభవించకుండా తానే అంతా ఏలాలి అనేవాడు) అన్నట్లు లోకం అంతా తానే ఏలాలి అనే దుర్బుద్ధిని కల దుర్యోధనుడు "పాండవులకు ఒక సూది మోపినంత నేలను కూడ ఇవ్వను" అని శ్రీకృష్ణునితో బదులు పల్కినందువల్ల, **"పెఱాద పురోడత్తాలే పారొన్ఱి ప్పారదమ్ కైశెయ్దు"** (పెరియాÇ్వార్ తిరు-2-6-5) (ఒక ఊరును అడిగి, దానిని పొందని రోషంవల్ల భారతయుద్ధాన్ని నిర్వహించి) అనే రీతిలో భారతయుద్ధాన్ని తానే ముందుండి నడిపించాడు శ్రీకృష్ణుడు. **"మÓÓలర్ వీయ క్కోల్ కైయిల్ కొణ్డు పార్త్తన్ తన్తేర్మున్ నిన్ఱానై"** (పెరియతిరు-2-3-1) (శత్రువులు నశించేటట్లు చేతిలో చేతికఱ్ఱను గ్రహించి పార్థుని రథం ముందు నిలచినవానిని) అని, **"పార్త్తన్ శెల్వత్తేరేఱు శారదియాయ్ ఎదిర్న్దార్ శేనై శెరుక్కళత్తు త్తిఱలÇయ చ్చెన్ఱాన్తన్నై"** (పెరియ తిరు-2-10-8) (అర్జునుని గొప్పరథానికి సారథియై ఎదిర్చిన సేన గర్వాన్ని అణచి, వారి బలం నశించేటట్లు చేసినవానిని) అని చెప్పే రీతిలో పార్థసారథియై, పాదాలకు అలంకరించుకొన్న అందెలు మోగగా, చేతిలో తోలుకఱ్ఱ, చేతబట్టిన పగ్గాలతో, విరగబోసికొన్న తలతో సారథిగా నిలిచాడు. అతనిని చూచిన అర్జునుడు "కృష్ణా!" అని పిలిచి **"సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత"** (అచ్యుతా? రెండు సేనల నడుమ రథాన్ని నిలుపు) అని

వేణ్డిప్పెఱక్కొడామైయాలే, "ఊరొన్ఱు వేణ్డి"లుమ్, "కత్త క్కతిత్తు క్కిడన్ద పెరుఞ్జెల్వమొత్తు" ప్పొరున్దిక్కొణ్డు ఉణ్ణాతే, తన్ "కుడి కెడుమ్బడి" తానే "మణ్ణాళ్వానాన కొత్తుత్తలైవన్" "సూచ్యగ్రముమ్ కొడేన్" ఎన్ఱు తళ్ళివిడుకైయాలై, ఒన్ఱుమ్ "పెఱాత వురోడత్తాలే పారొన్ఱిప్పారతమ్ కై శెయ్తు" స్థానభ్రష్టరాయ్ తళర్న్దు. పటికొడుత్త రాజ్యత్తై ప్రాప్తిక్కైక్కు, "పఱ్ఱలర్ వీయ క్కోల్ కైయిల్ కొణ్డు పార్త్తన్ శెల్వ త్తేరేఱు శారతియాయ్", "కఴల్కళ్ శతఙ్గై క్కలన్దెఙ్గుమ్ "ఆరవారిప్ప," కైయుమ్ మాక్కోలుమ్, పిడిత్త కడివాళక్కయిఱుమ్, విరిత్త తలైయుమాయ్" క్కొణ్డు వినయమ్ తోఱ్ఱ "మున్నిన్ఱానై" అర్జుననుమ్ "హేకృష్ణ" ఎన్నఴైత్తు "ఉభయసేనామధ్యత్తిలే రథత్తై స్థాపి" ఎన్ఱు పారిత్తుక్కొణ్డు "ధర్మక్షేత్రత్తిలే" "శినప్పోరిలే" "యుయుత్సవః" ఎన్నుమ్బడి ఉద్యుక్తనాక, ఇత్తై క్కణ్డు "మలైపురైతోళ్ మన్నవరుమ్ మారతరుమ్ మఱ్ఱుమ్" పలరుమాయ్ క్కొణ్డు

---

ఆజ్ఞాపించిన రీతిలో శ్రీకృష్ణుడు తేరును నిలిపాడు. **"ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమావేతా యుయుత్సవః, మామకాః పాండవా శ్చైవ కి మకుర్వత సంజయ"** (సంజయా! ధర్మక్షేత్రం అయిన కురుక్షేత్రంలో యుద్ధం చేయగోరి వచ్చిన నా పుత్రులు దుర్యోధనాదులు, పాండవులును ఏం చేశారు!) అనే రీతిలో ధర్మక్షేత్రం అయిన కురుక్షేత్రంలో సంభవించిన పోరులో బంధువులను, గురువులను సహాయంగా చేసికొని యుద్ధం చేయాలని ముందుకు వచ్చిన "**పారిత్తెఴున్ద పడైమన్నరాయ్**" (పెరియ. తిరు-7-5-2) (జయించాలనే పట్టుదలతో పైకి లేచిన ఆయుధధారులైన రాజులు) అన్నట్లు అంధుని పుత్రుడైన దుర్యోధనుని చూచిన ఇంద్రకుమారుడు అర్జునుడు "**అస్థానస్నేహకారుణ్య ధర్మాధర్మధియాఽకులమ్, పార్థం ప్రపన్నమ్**" (గీతాసంగ్రహమ్-5) (తగని బంధువుల పట్ల ఉండే ప్రీతివల్ల, కారుణ్యం వల్ల, కల్గిన ధర్మంలో అధర్మబుద్ధిచేత కలత చెందిన వాడై, శరణు పొందిన అర్జునుని) అనే రీతిలో ధర్మబద్ధం అయిన యుద్ధాన్ని అధర్మంగా భావించి కలత చెందినవాడై, బంధువులను చంపడంలో ఉండే భయంచేత "**కిం నోరాజ్యేన గోవింద కిం భోగైః జీవితేన వా, యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ, త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ**" (భ. గీ-1-33) (గోవిందా! మాకు రాజ్యంతో ఏం పని? భోగాలతోను, జీవితంలోను ఏమి వని? ఎవరికోసం మేము రాజ్యభోగసుఖాలను కోరుకున్నామో, వారు శరీరాలను, ధనాన్ని, ప్రాణాలను అన్నిటిని విడిచి, యుద్ధంలో నిలిచిఉన్నారు) అనే రీతిలో రాజ్యభోగాలు, బంధువులను రక్షించడంకోసం ఏర్పడినవికదా! ఆ బంధువులే శత్రువులై యుద్ధరంగంలో



"పారిత్తెఴున్ద పడైమన్ననాన" "అన్దకన్ శిఱువనై క్కణ్డ" "ఇన్దిరన్ శిఱువనుమ్" "అస్థానస్నేహకారుణ్యధర్మాధర్మధియాకుల"నాయ్, బన్ధుక్కళ్‌పక్కల్ వధభీతియాలే, "కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా, యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ, త మేఽవస్థితా యుద్ధే" ఎన్ఱు రాజ్యభోగసుఖఙ్గళుమ్ స్వజనరక్షణార్థమాయన్ఱో విరుప్పతు. అవర్కళ్‌తాఙ్గళే యుద్ధత్తిలే అవస్థితరాన పిన్బు అవర్కళై హింసిత్తువరుమ్ రాజ్యభోగఙ్గళాల్ ఎన్న ప్రయోజన ముణ్డు?, "న హి మే జీవితేనార్థః", "న కాంక్షే విజయం కృష్ణ' " ఎన్ఱుకొణ్డు "విసృజ్య సశర ఞ్చాపమ్" ఎన్నుమ్బడి పోర్‌పడైకళై విట్టు "న యోత్స్యామి" ఎన్ఱు యుద్ధాన్నివృత్తనాన పడియై క్కణ్డు, "మామ్" ఎన్ఱు తన్ సౌలభ్యత్తై క్కాట్టి, "కరిష్యే వచనం తవ" ఎన్నప్పణ్ణి యుద్ధే ప్రవర్తిప్పిత్త కృష్ణనైప్పోలే,

---

ఎదురు నిలిచినపుడు ఆ బంధువులను చంపి, పొందే రాజ్యంతో ఏమి ఫలం? అని, **"న హి మే జీవితేనార్థః"** (రామా.సుందర-26-5) (నాకు ప్రాణంవల్ల ప్రయోజనం లేదు) అని, పల్కి **"ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్, విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః"** (భ.గీ-1-47) (అర్జునుడు ఈ విధంగా చెప్పి, బాణంతోకూడిన వింటిని విడిచి, శోకం నిండిన మనస్సును కలవాడై, రథంలో కూర్చుండిపోయాడు), **"సర్వథాఽహం న యోత్స్యామీత్యుక్త్వా.....ఉపాదిశత్"** (గీతాభాష్యం) (నాకూ ఎంత అపకీర్తి వచ్చినా నేను యుద్ధం చేయను అని పల్కి కూర్చుండి పోయాడు) అన్నట్లు యుద్ధంనుండి అర్జునుడు విరమించడాన్ని చూచి అతనికి గీతను పూర్తిగా ఉపదేశించి, చివరలో "**సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః**" (ఫలసాధనాలైన అన్ని ధర్మాలను సవాసనగా విడిచిపెట్టి, నన్ను ఒక్కనిమాత్రమే ఉపాయంగా నిశ్చయించుకో. నేను నిన్ను అన్ని పాపాలనుండి విడిపిస్తాను. దుఃఖించకు) అనే చరమశ్లోకంలో "**మామ్**" అని తన సౌలభ్యాన్ని, సౌశీల్యాన్ని చూపించి, "**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత, స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ**" (భ,గీ-18-73) (అచ్యుతా! విపరీతజ్ఞానమనే మోహం నశించింది. నీవల్ల యథార్థమైన జ్ఞానం, స్మృతి లభించింది. సందేహం తీరినవాడనై ఉన్నాను. నీపల్కుల ప్రకారం యుద్ధాన్ని చేస్తాను) అనే రీతిలో అర్జునుని "నీవు చెప్పినట్లుగా యుద్ధాన్ని చేస్తాను" అని అనేటట్లు యుద్ధానికి పురికొల్పిన శ్రీకృష్ణునివలె, లక్ష్మీదేవికూడా తనను స్తుతించడం ప్రారంభించి, తన పరత్వాన్ని గమనించి వెనుకకు తగ్గిన యామునులను తన సౌలభ్యాన్ని చూపి స్తుతించేటట్లు చేసింది.

"విస్మార్య దాస్యాత్మకమ్" ఎన్గిఅపడియే పిరాట్టివిషయత్తిలే అనాదికాలమ్ ఇÇన్ద వనుభవపరీవాహరూప వాచికకైంకర్యమాకిఅ స్తోత్రత్తిలే పారిత్తుక్కొణ్డు ఉద్యుక్తరాయ్, విషయవైలక్ష్యణ్యత్తై ప్పార్త్తవాతే, వేదఙ్గళాలుమ్, వైదికపురుషర్కళాలుమ్ ఎల్లై కాణవొణ్ణాతపడి అపరిచ్ఛేద్యమాయిరుక్కైయాలుమ్, తద్వైలక్షణ్యానురూపస్తోత్ర కరణహేతువాన జ్ఞానశక్తికళ్ తమక్కిల్లామైయాలుమ్, స్తోత్ర-స్తోతవ్యగతోత్కర్షాఉ

---

"ఈ యామునులు **"శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య విభవం విస్మార్య దాస్యాత్మకం వైష్ణవ్యా గుణమాయయాఉ త్మనివహాన్ విప్లావ్య పూర్వః పుమాన్, పుంసా పణ్యవధూవిడంబివపుషా ధూర్తా నివాయాసయన్ శ్రీరంగేశ్వరి ! కల్పతే తవ పరీహాసాత్మనే కేళయే"** (శ్రీగుణ-20) (శ్రీరంగనాయకీ! పురాణపురుషుడైన నీ నాథుడు శబ్దాదివిషయాలను దర్శింపజేసి, దాస్యరూపమైన సంపదను మఱచేటట్లు చేసి, వైష్ణవి అయిన తన త్రిగుణాత్మక ప్రకృతితో జీవసమూహాలను వంచించి, వేశ్య వేషాన్ని ధరించిన పురుషునిద్వారా ఆయాసపెట్టేతిలో, ఆయాసపెడతాడు-అని ఈ విధంగా నీ సంతోషంకోసం చేసే పరిహాసక్రీడలకోసం నేను ఉపయోగపడుతున్నాను) అన్న రీతిలో దివ్యదంపతులను దర్శించి, ఆనందించి, తత్పరీవాహరూపంగా వెలివడే వాచికకైంకర్యం అనే స్తుతిని అనాదికాలంగా చేసేవారు. అటువంటి వీరు పిరాట్టిని స్తుతించాలని ఆశపడి స్తుతిని ప్రారంభించినవారై, పిరాట్టి గొప్పతనాన్ని చూడగానే అది వేదాలచేత, వేదవిశేషజ్ఞులైన పెద్దలచేతకూడా ఎల్లను చూడ సాధ్యం కాని విధంగా అంతులేనిదై ఉండడంచేత, పిరాట్టి మహిమకు తగినట్లుగా స్తుతించడానికి తగిన జ్ఞానం, శక్తి తమకు లేనందువల్ల. స్తుతించే తాము నైచ్యానికి పరాకాష్ఠలోను, స్తుతింపబడే పిరాట్టి పరత్వానికి పర్యంతసీమలోను ఉన్నట్లు భావించి- ఈ విధంగా మహిమను కల పిరాట్టిగూర్చి చాలా నీచులవైన తాము స్తుతించడంవల్ల **"ఉన్తొల్ పుకÇ మాశూణాదో"** (తిరువాయ్-3-1-7) (నీ సహజసిద్ధమైన కీర్తి మాసిపోదా!), **"మÇజ్గాదో"** (వెలవెలపోదా) అనే రీతిలో "లక్ష్మీదేవికి అవద్యం కల్గించడంకంటే ఆమెకు కైంకర్యం అనే సామ్రాజ్యాన్ని కోల్పోయి దూరంగా ఉండడమే మేలు" అని తలచి, **"అÇక్కుడమ్బు ఎచ్చిల్ వాయాల్ తూయ్మైయిల్ తొణ్డనేన్ నాన్ శొల్లినేన్ తొల్లై నామమ్ పావియేన్ పిÇత్తవాఱు ఎన్గఞ్జినేఱ్కు"** (తిరుక్కుఱు-12) (మలినశరీరంతో, ఎంగిలినోటితో పరిశుద్ధిలేని నేను పాపిష్ఠివాడను. నీ అనాది నామాలను చెప్పాను. నేను చేసిన పాపం ఎటువంటిదో అని భయపడ్డాను) అని తలచి చాలా భయపడ్డవారై, తమనే



పకర్షజ్ఞళుడైయ సీమాభూమియై అనుసన్ధిత్తు, "ఇప్పడి ప్పూర్వవిషయత్తై ప్పుల్లియరాన నామ్ పేశిల్, "మాశూణాతో", "మÇజ్గాతో" ఎన్గిఅపడియే, అవద్యత్తై విళైప్పతిల్ కైఙ్కర్యసామ్రాజ్యత్తై ఇÇన్దు కడక్కనిఱ్కైయే కర్తవ్యమ్" ఎన్ఱు కరుతి, "అÇక్కుడమ్బెచ్చిల్ వాయాల్ తూయ్మైయిల్ తొణ్డనేన్ నాన్ శొల్లినేన్ తొల్లై నామమ్ పావియేన్ పిÇత్త వాఱెన్గఞ్జినేఱ్కు" ఎన్గిఅపడియే భీతభీతరాయ్ తమ్మై గర్హిత్తుక్కొణ్డు, "త్వాం వయం కథం బ్రూమః" ఎన్ఱుకొణ్డు స్తోత్రా న్నివృత్తరాన వివరై,

---

నిందించుకొంటూ "నిన్ను మేము ఏవిధంగా స్తుతించగలం?" అని స్తుతించడంనుండి వెనుకకు తగ్గారు.

ఈ విధంగా స్తుతించడానికి సంశయించిన ఈ ఆళవన్దార్‌ను లక్ష్మీదేవి తన సౌలభ్యాన్ని చూపి వీరి, సంశయాన్ని, సంకోచాన్ని తీర్చి, తనను స్తుతించేటట్లు కటాక్షిస్తున్నది ఈ రెండవ శ్లోకంనుండి. ఏవిధంగా అంటే-కరుణ మూర్తీభవించిన లక్ష్మీదేవి-"నాకు పరత్వం స్వరూపమై ఉండేటట్లే, సౌలభ్యం, సౌశీల్యం స్వరూపంగా ఉన్నది. అందువల్ల **"పేశువార్ ఎవ్వళవు పేశువర్ అవ్వళవే వాశమలర్త్తుÇాయ్ మాలైయాన్"** (మూన్ఱామ్. తిరు-21) (పలికేవారు ఎంతవరకు పల్కుతారో, సువాసనను కల పూలు, తులసితో కూర్చిన మాలెను కల స్వామి అంతమాత్రమే వారికి భాసిస్తాడు.) అనే రీతిలో మీ స్తుతికి, శక్తికి తగినట్లు నన్ను మలచుకొనగల్గినదానను నేను. దానితోపాటు, తల్లి అయినందువల్ల ఉండే గొప్ప వాత్సల్యగుణంచేతకూడా **"కిం మృష్టం సుతవచనం పున రపి మృష్టం సుతవచనమ్. పున రపి మృష్టం తదేవ సుతవచనమ్, మృష్టాదపి మృష్టతరం తదేవ పరిపక్వం సుతవచనమ్"** (ఏది మధురమైనది?, శైశవంలోని చిన్న బిడ్డ తీయని పలుకులు మధురమైనవి. ఇంకా మధురమైనది ఏది? ఆ బిడ్డ బాల్యంలోని ముద్దుపలుకులే. భోగ్యాలైన వస్తువులలోను భోగ్యం అయినది. యువకుడైన ఆ కుమారుని జ్ఞానం నిండిన పల్కులే) అనే లోకన్యాయాన్నిబట్టికూడా నా బిడ్డ అయిన మీ తీయని సూక్తులు నాకు చాలా మధురంగా ఉంటాయికదా!" - అని అనుగ్రహించి, వీరి వాచికకైంకర్యం అనే స్తుతికి అవరోధంగా ఉండే అజ్ఞానం మొదలైనవానిని పోగొట్టి, స్తుతించడానికి ఆవశ్యకం అయిన జ్ఞానాన్ని, శక్తిని కల్గించి, భయం తీరినవారై స్తుతించడం ప్రారంభించేటట్లు, **"అఞ్జలెన్ఱు కావిపోల్ వణ్ణర్ వన్దు ఎన్ కణ్ణుళ్ళే తోన్ఱినార్"** (తిరుక్కుఱు -12) (నీలోత్పలవర్ణాన్ని కలవాడు వచ్చి భయపడవద్దని నా నేత్రాలో ప్రత్యక్షం అయ్యాడు.) అనే రీతిలో వీరికి అభయాన్ని ఇచ్చి,

పెరియపిట్టియార్, “నమక్కు మేన్మై స్వరూపమానవోపాతి నీర్మైయుమ్ స్వరూపమ్ కాణుమ్. ఆనపిన్బు, “పేశువారెవ్వళవుపేశువర్” అవ్వళవాయ్ క్కాణుమ్ నా మిరుప్పతు. విశేషిత్తు మాతృత్వప్రయుక్తమాన వాత్సల్యత్తాలుమ్, ‘కిం మృష్టం సుతవచనమ్’’ ఎన్గిఱ న్యాయత్తాలుమ్, ఉమ్ముడైయ మழలైచ్చొల్ నమక్కు భోగ్యమాకక్కాణు మిరుప్పతు’’ – ఎన్ఱు ఇవరుడైయ వాగ్వృత్తిరూపస్తోత్రత్తాలే స్తోత్రకరణవిరోధియాన అవిద్యాదికళ్ నశిత్తు స్తోత్రకరణహేతువాన జ్ఞానశక్త్యాదికళుణ్డాయ్, నిర్భరరాయ్ స్తోత్రత్తిలే ప్రవృత్తరామ్బడి, “అఞ్జలెన్ఱు కావిపోల్ వణ్ణర్ వన్దెన్ కణ్ణుళే తోన్ఱినార్” ఎన్గిఱపడియే అభయప్రదానపూర్వకమాక “మయర్వఱ మతినల మరుళినన్” ఎన్గిఱపడియే ఇవర్పక్కలిలే కరుణాకటాక్షత్తై ప్పణ్ణి, “పూవళరుమ్

---

**“మయర్వఱ మదినలమ్ అరుళినన్”** (తిరువాయ్-1-1-1) (“అజ్ఞానరహితం అయిన భక్తి రూపాపన్నజ్ఞానాన్ని అనుగ్రహించాడు) అనే విధంగా వీరినిగూర్చి తన కటాక్షాన్ని వర్షించగా, **“పూవళరుమ్ తిరుమకళాల్ అరుళ్పెఱ్ఱు”** (పెరియ.తిరు-11-6-10) (పూవులో పెరిగే లక్ష్మీదేవి కరుణతో ఉజ్జీవించి) అనే విధంగా ఆటంకాలు తీరినవారై, ఆ పిమ్మట కల్గిన పరభక్తి- పరజ్ఞాన-పరమ భక్తులను కలవారై, పిరాట్టి స్వరూప-రూప-గుణాదుల గొప్పతనాన్ని చాలా స్పష్టంగా, సాక్షాత్తుగా దర్శించి, అనుభవించి, దానికి పర్యవసానంగా వాచికకైంకర్యం అయిన స్తుతిని ప్రారంభిస్తున్నారు.

మొదటి శ్లోకంలో పిరాట్టి పరత్వాన్ని అనుసంధించి, భయపడి స్తుతించడం నుండి వెనుకకు తగ్గారు. ఈ శ్లోకంలో పిరాట్టితో తమకున్న సంబంధాన్ని పురస్కరించుకొని, శరణు పొంది, మొదటి శ్లోకంలో స్తుతిని ప్రారంభించడానికి అవరోధంగా చెప్పబడ్డ పిరాట్టి గుణవైభవాన్నే ఉపయోగించుకొంటూ, దానివల్ల మిక్కిలి ప్రకాశించే ఈమె సౌలభ్యాది గుణాలను అనుసంధించి, అందువల్ల భయం తీరి, సమాధానం పొందినవారై, స్తుతించడం ప్రారంభించారు. **“ఎన్ మనమ్ పత్తి యన్ఱి అఱ్ఱకిల్లాదు ఇదఱ్కు ఎన్నినైవాయ్ ఎన్ణిట్టు అఞ్జువనే”** (ఇరామానుశ-89) (దీనికేమి అభిప్రాయం కల్గుతుందోనని భయపడుతున్నాను) అన్న రీతిలో స్తుతింపబడేవారి గొప్పతనాన్ని అనుసంధించడంవల్ల, తమ నైచ్యాన్ని అనుసంధించడంవల్ల స్తుతించేవారికి ఒక భయం కల్గడం, వారి సౌలభ్యం మొదలైన గుణాలను అనుసంధించడంవల్ల ఈ భయం తీరడం మనం చూస్తున్నాము. ఈ ఆళవన్దార్‌కూడా స్తోత్రరత్నంలో భగవానుని స్తుతించేడపుడు- **“దురంతస్యానాదేః రపరిహరణీయస్య మహతో నిహీనాచారో ఉహం**



తిరుమకళాలరుళ్ పెఱ్ఱు” నివృత్తవిరోధికరాయ్, ప్రాప్తమాన పరభక్త్యాదికళైయుడై-యరాయ్క్కొణ్డు, తత్స్వరూపరూపగుణవిశేషఙ్గళై విశదమాక సాక్షాత్కరిత్తు, అనుభవపరీవాహరూపమాన వాచికకైఙ్కర్యత్తిలే ప్రవృత్తరాకిఱార్.

కీழ், పరత్వానుసన్ధానత్తాలే భయప్పట్టు నివృత్తరానార్ ఇఙ్గు. కీழ்సమ్బన్ధ జ్ఞానపూర్వకమాక శరణ మ్బుకున్దు, స్తోత్రారమ్భాక్షేపహేతువాక చ్చొన్న స్తోతవ్యగతోత్కర్షత్తై ముఖాన్తరేణ దృఢీకరియానిన్ఱుకొణ్డు, తదుపచితసౌలభ్యవిశేషా నుసన్ధానత్తాలే భయమ్ శమిత్తు సమాహితరాయ్, స్తోత్రత్తిలే ప్రవృత్తరాకిఱార్. “ఎన్నినైవా యెన్ణిట్టఞ్జువనే” ఎన్గిఱపడియే విషయవైలక్షణ్యానుసన్ధానత్తాలుమ్, స్వదోషా నుసన్ధానత్తాలుమ్, స్తోతాక్కళుక్కు ఒరు భయమ్ జనిక్కుమ్. అన్ద భయమ్ సౌలభ్యాదిగుణానుసన్ధానత్తాలే శమిక్కవుమ్ కణ్డోమిఱే. “దురన్తస్యానాదేః” ఎన్ఱు తొడఙ్గి స్వదోషానుసన్ధానత్తాలే భయప్పట్టు, ‘తవ

---

**నృపశు రశుభస్యాస్పద మపి, దయాసింధో! బంధో! నిరవధికవాత్సల్యజలధే! తవ స్మారంస్మారం గుణగణ మితీచ్ఛామి గతభీః”** (స్తోత్ర-) (కరుణకు సముద్రంవంటివాడా! అంతులేనిది, ఆరంభం తెలియనిది, పోగొట్టడానికి సాధ్యం కానిది అయిన గొప్ప పాపానికి నేను నివాసం అయినా, నీ గుణసమూహాలను తలచి తలచి, భయంతీరిన వాడనై ఈ విధంగా ఆశపడుతున్నాను) అని తమ నైచ్యాన్ని అనుసంధించి, భయపడి తిరిగి భగవానుని గుణాన్ని అనుసంధించడంద్వారా ఆ భయం తీరినవారయ్యారుకదా! **“యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుత శ్చనేతి”** (తైత్తి-ఆనంద-1-9-1) (ఏ పరబ్రహ్మనుండి మనస్సుతో పాటు వాక్కులు ఆ పరబ్రహ్మను పరిచ్ఛేదించలేక వెనుదిరుగుతున్నవో, ఆ పరమాత్మయొక్క ఆనందాన్ని తెలిసినవాడు ఎవరివల్లా భయాన్ని పొందదు) అని ఉపనిషత్తులోను పరమాత్మ గుణాన్ని అనుసంధించేవారికి భయం లేదు- అని చెప్పబడిందికదా!

వీరు పిరాట్టిని స్తుతించాలని ఆశపడినా, శ్రీగుణరత్నకోశంలోని ఎనిమిదవశ్లోకంలో “**సూక్తిం సమగ్రయతు నః స్వయ మేవ లక్ష్మీః**” ఇత్యాదిగా చెప్పబడ్డరీతిలో ఈమె గొప్పతనానికి తగినట్లుగా దోషగంధవిధురమై, అందరిచేత తప్పుపాటువేయకుండా చూడబడేటట్లుంటే వాక్ సందర్భాలకు కారణం అయిన మంచి జ్ఞానం, భక్తి లక్ష్మీదేవి కరుణాకటాక్షం లేకపోతే కలుగదా! ఈ విషయాన్ని **“హే శ్రీర్దేవి! సమస్తలోకజననీం త్వా స్తోతు మీహామహే యుక్తాం భావయ భారతీం ప్రగుణయ ప్రేమప్రధానాం ధియమ్, భక్తిం బంధయ నందయాశ్రిత మిమం దాసం జనం తావకం**

స్మారం స్మారం గుణగణ మితీచ్ఛామి గతభీః" ఎన్ఱు భగవద్గుణానుసన్ధానత్తాలే అభయజ్ఞతరానారిఱే. "ఆనన్దం బ్రహ్మణో విద్వా న్న బిభేతి కుత శ్చ న" ఎన్నక్కడవతిఱే.

ఇనిత్తాన్ స్తోత్రేచ్చై యుణ్డానాలుమ్ "స్తోతు మీహామహే యుక్తాం భావయ భారతీమ్'' ఎన్ఱుమ్, ''సూక్తిం సమగ్రయతు నః'' ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే విషయవైలక్షణ్యాఽనుగుణమాక "అనాఘ్రాతావద్యమాయ్", "అనిమిషనిషేవ్యమాన " శబ్దసన్దర్భహేతువాన సమ్యక్ జ్ఞానభక్తికళ్ పెరియపిరియపిరాట్టియారుడైయ కరుణాకటాక్షత్తాలే యల్లతు. సిద్ధియాతిఱే. "యం త్వం దేవి నిరీక్షసే స బుద్ధిమాన్" ఎన్నక్కడవతిఱే. ఆకైయాల్ స్వవిషయస్తోత్రత్తిలే పారిత్తుక్కొణ్డు ప్రవృత్తరానపడియైయుమ్,

---

**లక్ష్యం లక్ష్మి, కటాక్షవీచివిసృతే స్తే స్యామ చామీ వయమ్"** (శ్రీస్తవ-2) (ఓ లక్ష్మీదేవీ! అన్ని లోకాలకు తల్లి అయిన నిన్ను స్తుతించాలని ఆశపడుతున్నాము. దానికి తగిన వాక్కును మాకును కల్గించు. ప్రేమతోకూడిన బుద్ధిని అనుగ్రహించు. భక్తిని ప్రసాదించు. నిన్ను ఆశ్రయించినవాడనై, నీకు దాసుణ్ణి అయిన నన్ను ఆనందింపజేయి. నీ కటాక్షప్రవాహానికి మేము లక్ష్యభూతులం కావాలి సుమా!) అని కూరేశులు, **"సూక్తిం సమగ్రయతు నః స్వయ మేవ లక్ష్మీః శ్రీరంగరాజమహిషీ మధురైః కటాక్షైః, వైదగ్ధ్యవర్ణగుణగుంభనగౌరవైః యాం కండూలకర్ణకుహరాః కవయో ధయంతి"** (శ్రీ గుణ-7) (సామర్థ్యంతో ప్రయోగింపబడ్డ అక్షరాలు, గుణాలు, పదాల పొందిక మొదలైనవాటిని కల ఏ సూక్తిని ఇంకా ఇంకా వినాలని ఆశను కల కర్ణకుహరాలను (రంధ్రాలను) కలవారై కవులు పానం చేస్తున్నారో, అటువంటి మా సూక్తిని శ్రీ రంగనాయకి తన మధురకటాక్షాలతో తానుగానే సంపూర్ణం చేయాలి) అని పరాశరభట్టర్ అనుగ్రహించారుకదా! **"స శ్లాఘ్యః స గుణీ ధన్యః స కులీన స్స బుద్ధిమాన్, స శూర స్స చ విక్రాంతో యం త్వం దేవి నిరీక్షసే"** (విష్ణు.పు-1-9-131) ( ఓ దేవీ ! నీవు ఎవరిని కటాక్షిస్తావో అతడే గొప్పవాడు. అతడే గుణవంతుడు. అతడే భాగ్యశాలి. అతడే పరాక్రమశాలి) అని శ్రీ విష్ణుపురాణంలోకూడా లక్ష్మీదేవి కటాక్షంచేతనే అన్ని గుణాలు కల్గుతాయని చెప్పబడిందికదా! అందివల్ల వీరు తనను స్తుతించాలని ఆశపడి, ప్రారంభించిన రీతిని, తన గొప్పతనానికి తగినట్లు స్తుతించడానికి తగిన జ్ఞానశక్తులు తమకు లేనందువల్ల స్తుతించడంనుండి వెనుకంజవేయడాన్ని చూచి, వీరు చేసే స్తుతిని వినడంలో తనకు ఉండే ఆసక్తివల్ల వీరు అందంగా స్తుతించగలిగేటట్లు వీరిని లక్ష్మీదేవి విశేషంగా కటాక్షించింది. దానిని గ్రహించి, **''దేవ్యా కారుణ్యరూపయా''** (లక్ష్మీతంత్రమ్-28-14) (కరుణే మూర్తిభవించిన లక్ష్మీదేవిచేత) అనే ప్రమాణానుసారం



విషయవైలక్షణ్యానురూపస్తోత్రకరణహేతువాన జ్ఞానశక్తికళ్ తమక్కిల్లామైయాలే స్తోత్రాన్ని వృత్తరానపడియైయుమ్ కణ్డు, ఇవర్ పణ్ణుకిఱ స్తోత్రశ్రవణకౌతుకత్తాలే యథాస్తోత్రమ్ పణ్ణవల్లరామ్పడి ఇవర్పక్కలిలే విశేషకటాక్షమ్ పణ్ణియరుళ, అత్తై యఱిన్దు, కారుణ్యరూపైయాన వివళ్ కరుణైక్కిలక్కాయ్, "ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్", "త మక్రతుం పశ్యతి వీతశోకః" ఎన్గాప్పోలే, "దాన్తే మయి తే దయాం విదన్ తే మహిమానం నిర్భయః స్తోష్యామి" ఎన్ఱుకొణ్డు విషయత్తై మఱుపాదురువ ప్పేశుకిఱే' నెన్ఱు ప్రతిజ్ఞై పణ్ణుకిఱార్.

---

వీరిని తన కరుణకు లక్ష్యం చేసింది. **"అణో రణీయాన్ మహతో మహీయన్ ఆత్మాగుహాయాం నిహితోఽ స్య జంతోః, త మక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్"** (తైత్తి.నా -9-1) (అణువుకంటే అణువై, పెద్దదైన వస్తువుకంటే పెద్దదైన పరమాత్మ ఈ జీవుని హృదయకుహరంలో ఉన్నాడు. కర్మబంధం లేనివాడై, మహిమశాలి అయిన ఆ పరమాత్మను అతని అనుగ్రహించేతనే జీవుడు దర్శించి, శోకం తీరినవాడవుతున్నాడు) అని ఉపనిషత్తులో చెప్పబడినట్లు పిరాట్టి అనుగ్రహంచేత దర్శించి యామునులు **"దాంతే దయాం తే విదన్ తే మహిమానమ్ అహమ్ నిర్భయః స్తోష్యామి"** అని పిరాట్టి మహిమను పూర్ణంగా స్తుతిస్తాను-అని ప్రతిజ్ఞ చేస్తున్నారు

**వ్యాఖ్యానం:-** ఈ విధంగా ఈ ఆళవన్దార్ లక్ష్మీదేవిని స్తుతించడానికి ఆమె కరుణను పొందినవారైతే, ఆ కరుణతో వీరి గొప్పగా తలిసికొని, ఆ లక్ష్మీదేవియొక్క ఏ గొప్పతనాన్ని పొగడుతున్నారు- అనే ప్రశ్న ఇక్కడ తలఎత్తుతుంది. ముందు శ్లోకంలో వేదాలకు, బ్రహ్మాదులకుకూడా పిరాట్టిని పరిచ్ఛేదించి పల్కడం సాధ్యం కాదన్నారు. ఈ శ్లోకంలో మనకు కూడా భర్తయై, బ్రహ్మ మొదలైనవారికి తండ్రియై, అన్నీ తెలిసినవాడై, సర్వశక్తియై ఉండే సర్వేశ్వరునకుకూడా ఈమె వైభవం పరిచ్ఛేదించి పల్కడం వీలుకాదంటున్నారు. **(యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽ పి ప్రభుః నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః)** అని అంటూ, లక్ష్మీదేవి అనుగ్రహంచేత వీరు పొందిన గొప్పతనం ఇదే.

ఈ విశేషకరుణను పొందనివారు ఈమె స్వరూపాన్ని, స్వభావాన్ని యథాతథంగా తెలియలేక, ఈమెనుగూర్చి ఈ క్రింది విధంగా పలు రీతుల్లో విభిన్నాభిప్రాయాలను కల్గి ఉన్నారు.

1) శాస్త్రాలలో ఈమె భగవానునకు అంతరంగవిశేషణంగా ఉన్నదని చూపడంకోసం ఈమె భగవానుని సత్తగా, భగవానుని అహంతగా (నేను అనే స్వభావంగా),

**వ్యాఖ్యానమ్ :** ఇప్పడి పెరియపిరాట్టియారుడైయ ప్రసాదమ్ పెరిరాకిల్, ఇవర్ ఇప్పోతు విశేషమాక వఱిన్దు పేశుకిఱ తెన్ ఎన్నిల్; కీ వేదఙ్గళుమ్ బ్రహ్మాదికళుమ్ పేశ నిల మల్ల వెన్టార్. ఇఙ్గు ఎజ్గళుక్కుమ్ మణాళనాయ్, బ్రహ్మాదికళుక్కుమ్ జనకనాయ్, సర్వజ్ఞనాయ్, సర్వశక్తియాయిరుక్కిఱ సర్వేశ్వరనుక్కుమ్ పరిచ్ఛేదిత్తు ప్పేశవొణ్ణాతెన్గిఱార్. (యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభు ర్నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యాఽనుకూలం స్వతః) ఎన్ను, ఇతువాయ్త్తు ఇవర్ పిరాట్టిప్రసాదత్తాలే పెరివిశేషమ్.

ఇవ్విశేషకటాక్ష మిల్లాతార్, ఇవళ్ స్వరూపస్వభావఙ్గళై ఉళ్ళపడి అఱియామల్, భగవదన్తరఙ్గవిశేషణద్యోతనార్థమాక, "భగవత్సత్తై, అహన్తై, భ్రమై (ప్రభై) ఇచ్ఛై, శక్తి, విద్యై" ఎన్నుమ్, విద్యాప్రవర్తకత్వత్తాలే 'విద్యై" ఎన్నుమ్ "ప్రకృతేః పురుషా చ్చాన్య

భగవానుని ప్రమగా (జ్ఞానంగా), భగవానుని ఇచ్ఛగా, భగవానుని శక్తిగా, భగవానుని విద్యగా- ఈవిధంగా పలు రీతుల్లో చెప్పబడింది. దానిని గ్రహించలేని కొందరు సత్త మొదలైనవాటితో కూడిన భగవానుడే శ్రీదేవి-అని శాస్త్రాలు చెబుతున్నవని అన్నారు.

2) పిరాట్టి మోక్షశాస్త్రాన్ని ఉపదేశించేది కనుక ఈమె **"విద్య"** అని శాస్త్రాలు చెప్పిన విషయాన్ని గ్రహించకుండా, మోక్షశాస్త్రమే ఈమె అని కొందరు భ్రమించారు.

3) **"యో యో జగతి పుంభావః స విష్ణు రితి నిశ్చయః, యో యస్తు నారీభావః స్యాత్తత్ర లక్ష్మీర్వ్యవస్థితా, ప్రకృతేః పురుషశ్చాన్య స్తృతీయో నైవ విద్యతే, అథ కిం బహునోక్తేన నరనారీమయో హరిః"** (సనత్కుమారసంహిత) (లోకంలో పుంభావం కనబడిన చోట అంతా విష్ణువు ఉన్నాడన్నది నిశ్చయం. స్త్రీభావం ఉన్నచోట అంతటా పిరాట్టి ఉన్నది. ప్రకృతికి అభిమానిదేవత అయిన పిరాట్టి, పురుషాభిమాని అయిన భగవానుడు తప్ప మూడవది ఏదీ లేదు. పలు మాటలెందుకు? స్త్రీ పురుషులు అందఱుగా ఉండేవాడు శ్రీమన్నారాయణుడే) అని, **"మూలప్రకృతి రీశానీ"** (లక్ష్మీసహస్రనామం -66) అని భగవానుడు పురుషులకు అభిమానిగా ఉన్నందువల్ల, లక్ష్మీదేవి మూలప్రకృతికి అభిమానిదేవతగా ఉన్నందువల్ల ఆ ఇద్దఱినీ పురుషుడు అని, ప్రకృతి అని చెప్పిన విషయాన్ని తెలిసికోకుండా పిరాట్టిని అచేతనం, సత్త్వాదిగుణత్రయంతో కూడినది అయిన మూలప్రకృతి అని కొందఱు భ్రమించారు.

4) పూర్వం గ్రహించిన ప్రమాణాలలో భగవానుడు పురుషులకు అభిమానిగాను, పిరాట్టి స్త్రీలకు అభిమానిగాను ఉండడాన్నిబట్టి, లక్ష్మీనారాయణులనే ఈ ఇద్దరిని స్త్రీగా,



స్తృతీయో నైవ విద్యతే" ఎన్గిఱపడియే శ్రీ- శ్రీశర్కళుడైయ ప్రకృతి -పురుషరూప విభక్తవిభూతివిశేషాభిమానిత్వద్యోతకమాక "మూలప్రకృతి రీశానీ" ఎన్నుమ్ శొల్లుకిఱ వకైక్కొణ్డు, తత్స్వరూపత్తై అచేతనమాక భ్రమిప్పతు, కర్మవశ్యై యెన్బతు, సత్త్వాదివిశిష్టభగవాన్దానే శ్రీయెన్బతు, స్త్రీరూపనిత్యవిగ్రహాన్తరవిశిష్టనానవనే ఇవళెన్బతు, దైత్యమోహనార్థమాక "ప్పెణ్ణాకి అముతూ"ట్టిన వడివుపోలే స్వయ మేవ భోగార్థమాక ప్పరిగ్రహిత్త కాదాచిత్కకాన్తావిగ్రహవిశిష్టనానవనే శ్రీ యెన్బతాయ్క్కొణ్డు- ఇప్పడైకళిలే భగవదైక్యమ్శొల్లువతు, అవిద్యై యెన్బతాయ్క్కొణ్డు అనర్థప్పడువర్కళ్. "ఆహు ర్వేదా నమానమ్" ఇత్యాది.

పురుషునిగా నిర్దేశించడం గమనించకుండా "స్త్రీశరీరం కల భగవానుడే పిరాట్టి" అని చెప్పినట్లుగా కొందఱు భ్రమపడ్డారు. కొందఱు "ఎల్లప్పుడూ ఉండే స్త్రీ రూపాన్ని ధరించిన భగవానుడే పిరాట్టి" అని అన్నారు. ఇంకా కొందరు -"అసురులను భ్రమింపజేయడంకోసం **"పెణ్ణాకి అముదూట్టుమ్ పెరుమానార్"** (పెరియ తిరు-2-6-1) (మోహినీరూపాన్ని దాల్చి, అమృతాన్ని తాగించిన స్వామి) అనే రీతిలో అమృతాన్ని చిలికినపుడు భగవానుడు మోహినీరూపంలో అవతారం ఎత్తినట్లే, తన భోగం కోసం ఒక్కొక్క సమయంలో భగవానుడే స్త్రీరూపాన్ని గ్రహించి, శ్రీదేవి అనే పేరును కల్గిఉంటాడని అన్నారు.

5) లక్ష్మి కర్మవశ్యురాలని మఱికొందరు అన్నారు.

6) లక్ష్మి అనిత్యమైనదని ఇంకా కొందఱు అన్నారు.

**"ఆహు ర్వేదా నమానం కతిచన కతిచారాజకం విశ్వ మేతత్ రాజన్వత్ కేచిదీశం గుణిన మపి గుణైః తం దరిద్రాణ మన్యే, భిక్షా వన్యే సురాజంభవ మితి చ జడా స్తే తలాతల్యకార్షుః యే తే శ్రీరంగహర్మ్యాంగణకనకలతే ! న క్షణం లక్ష్య మాసన్"** (శ్రీగుణ-11) (శ్రీరంగమందిరంలోని ముంగిటిలో ఉండే ఓ బంగారుతీగా! నీ కటాక్షానికి ఒక క్షణకాలం అయినా లక్ష్యభూతులు కాని కొందరు వేదం ప్రమాణం కాదని అన్నారు. కొందరు లోకం అనాథ అని అన్నారు. కొందఱు అనుమానంచేత సిద్ధించిన ఈశ్వరుని కల్గినది అని అన్నారు. గుణంతో కూడిన ఈశ్వరుని గుణం లేనివాడని కొందఱు అన్నారు. కొందరు భిక్షువు అయిన శివునిలో సర్వేశ్వరత్వం ఉన్నదని చెప్పారు. ఈ విధంగా ఈ మూఢులు ఒకరికొకరు విరుద్ధంగా పల్కుతున్నారు.) అని భట్టర్ లక్ష్మీకటాక్షం లేనందువల్ల పలువురు పలు రీతుల్లో భ్రమించి, ఆత్మనాశనాన్ని

ఇవర్ అఙ్గనన్దిక్కే, దివ్యచక్షుస్సై ప్పెర్రవరాకైయాలే తత్స్వరూపస్వభావఙ్గళై ఉళ్ళపడి అఱిన్దు, పరమచేతనై యెన్ఱుమ్, అకర్మవశ్యై యెన్ఱుమ్, ప్రకృతివ్యావృత్తై యెన్ఱుమ్, భగవత్స్వరూపభిన్నై యెన్ఱుమ్, నిత్యైయెన్ఱుమ్ నిర్ణయిత్తనుభవిక్కిఱార్.

(మనసి విలసతాక్ష్ణా భక్తిసిద్ధాఞ్జనేన శ్రుతిశిరసి నిగూఢం లక్ష్మి తే వీక్షమాణాః నిధి నివ మహిమానం భుఞ్జతే యేఽపి ధన్యా నను భగవతి దైవీం సమ్పద న్తేఽ

---

పొందుతున్నారు–అంటూ చెప్పినది ప్రకృతంలో అనుసంధేయం. పిరాట్టికి సంబంధించిన పలు వాదాలు, వాని నిరాసాలు దేశికుల వ్యాఖ్యలో వివరింపబడ్డాయి.

శ్రీయామునులు వారివలె కాకుండా పిరాట్టిచేత అనుగ్రహింపబడ్డ జ్ఞాననేత్రాన్ని కలవారు కనుక, ఆమె స్వరూపాన్ని, స్వభావాన్ని యథాతథంగా తెలిసికొని, ఆమె గొప్పదైన జ్ఞానమే స్వరూపంగాను, స్వభావంగాను కల్గినది అని, కర్మకు వశ్యురాలు కాదని, అచేతనం అయిన ములప్రకృతికంటే వేఱయినది అని, భగవానుని స్వరూపంకంటే వేఱయినది అని, నిత్యమైనది అని, భగవానునకు చాలా ప్రియమైనది అని, తనకు స్వామి అయిన భగవానుడు తప్ప మిగిలిన అందఱికన్న అధికురాలు అని, ఆమె కూడా, ఈశ్వరుడైన నారాయణునకు పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కాని గొప్పతనాన్ని కల్గినది అని నిశ్చయించి, దానిని ఈ శ్లోకంలో అనుభవిస్తున్నారు. ఇదే భావాన్ని తెలిపే భట్టర్ అనుగ్రహించిన ఈ క్రింది శ్రీగుణరత్నకోశశ్లోకం ఇక్కడ అనుభావ్యం.

“**మనసి విలసితాక్ష్ణా భక్తిసిద్ధాంజనేన శ్రుతిశిరసి నిగూఢం లక్ష్మి! తే వీక్షమాణాః, నిధి మివ మహిమానం భుంజతే యేఽపి ధన్యాః నను భగవతి దైవీం సంపదం తేఽభిజాతాః**” (12) **(భగవతి)** కల్యాణగుణాలను అన్నిటిని కల్గినదానా! **(హే లక్ష్మి)** లక్ష్మీదేవి అనబడే పిరాట్టీ ! **(ధన్యాః)** అనే వుత్పత్తినిబట్టి నీ కటాక్షానికి లక్ష్యభూతులై ఉండే సంపదను కలవారైన, **(యేఽపి)** ఏ పురుషులు. “**యేఽపి**” అని అన్నందువల్ల వారి గొప్పతనం మాటతో చెప్ప సాధ్యం కానిది–అని తెలుపబడింది. ఇక, తరువాతిభాగంతో ఈ భాగ్యశాలురు తమ జ్ఞాననేత్రంతో పిరాట్టి మహిమను తెలిసికొంటున్నారు – అని అంటున్నారు. ఈ జ్ఞాననేత్రాన్ని రాబోయే రెండు విశేషణాలతో విశేషిస్తున్నారు. **(భక్తిసిద్ధాంజనేన)** భూమిలో గుప్తంగా దాచబడి ఉండే నిధిని చూడడానికి పెట్టబడే అంజనం (కాటుక)వలె, వీరుకూడా నీ మహిమను దర్శించడంకోసం నీ స్వరూపం, రూపం, గుణాలు మెదలైనవాటిని సాటిలేని భక్తిని జ్ఞాననేత్రంలో అంజనంగా పెట్టుకుంటారు. ఆ జ్ఞాననేత్రం ఎక్కడ ఉన్నది? అని అంటే, **(మనసి విలసతా)** –మనస్సులో ప్రకాశిస్తున్నదని భావం **(అక్ష్ణా)** మనస్సులో వెలిగే ఆ జ్ఞాననేత్రంతో.



భిజాతాః). (భగవతి)–సకలకల్యాణగుణసమ్పన్నై యాయిరుక్కిఱ, (హే లక్ష్మి)–వారీర్ పెరియపిరాట్టియారే!, (ధన్యాః) “ధనం ప్రాప్తాః–ధన్యాః” ఎన్గిఱపడియే, దేవరీర్ కటాక్షవిషయత్వరూపభాగ్యత్తై యుడైయవర్కళాయిరుక్కిఱ, (యేఽపి) యాతొరు పురుషర్కళ్. “యేఽపి” ఎన్గిఱవిత్తాల్, అవర్కళుడైయ అతిశయమ్ వాచామగోచర మెన్ఱు సూచితమ్. (భక్తిసిద్ధాఞ్జనేన) ఉన్నుడైయ స్వరూపరూపగుణవిభూతికళిల్ అనితరసాధారణప్రావణ్యమాకిఱ గూఢార్థప్రకాశకసిద్ధాఞ్జనవిశేషమ్బోలేయిరానిన్ఱుమ్, (మనసి విలసతా) అత ఏవ హృదయత్తిలే ప్రకాశియానిన్ఱు ముళ్ళ, (అక్ష్ణా) దృష్టియాలే. ఙ్ఞానక్కణ్ణాలే యెన్ఱపడి, (శ్రుతిశిరసి) ఉపనిషత్తుక్కళిలే. జాత్యేకవచనమ్. “శ్రుతిశిరస్సు”

---

**(వీక్షమాణాః)** –దర్శిస్తున్నవారై–అనే పదంతో కలిపి అన్వయించాలి. ఈ జ్ఞాననేత్రంలో చూడబడే నిధి ఎక్కడ దాచబడి ఉన్నది? అని అంటే, **(శ్రుతిశిరసి నిగూఢమ్)** ఉపనిషత్తులలో దాచబడి ఉన్నది–అని అంటున్నారు, “**శ్రుతిశిరసి**” అనే ఏకవచనం జాత్యేకవచనం. వేదాంతాలలో – అనే అర్థాన్ని ఇస్తుంది. **“నిగూఢమ్”** అని అన్నందున వేదరహస్యం కాబట్టి ఈ నిధి చాలా మఱుగుపఱచబడి ఉన్నది–అని భావం. ఈ నిధి ఏది? అని అంటే, **(తే మహిమానమ్)**– నీ స్వరూప–రూప–గుణ–విభూత్యాదులు అనే మహిమలే ఆ గుప్తనిధి అని అంటున్నారు. ఈ నిధిని దర్శించి ఏం చేస్తారు? అని అంటే, **(నిధి మివ వీక్షమాణా స్సంతః)**– ఆపత్కాలంలో తగిన సహాయంగా ఉండే గుప్తనిధివలె ఈ నిధినికూడా సాక్షాత్తుగా దర్శించేవారై, **(యే భుంజతే)** పూర్వం ప్రస్తావించిన ఏ భాగ్యశాలురు అనుభవిస్తున్నారో. వారి గొప్పతనాన్ని ఇక మిగిలిన భాగంతో తెలుపుతున్నారు, **(తే దైవీం సంపదం అభిజాతా నను)**–ఆ భాగ్యశాలురు మోక్షానికి కారణమై, సహజమైన పరమాత్మసంబధాన్నిబట్టి ప్రకాశించేది, గుణాలను కల్గినది అయిన సంపదను అనుభవించడానికి పెట్టిపుట్టినవారుకదా! **(దైవీం సంపదమ్)** **“తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా”** (పెరియతిరు–7–7–1) (లక్ష్మికిసైతం లక్ష్మివంటి సంపద్రూపా!) అని తిరుమఙ్గైమన్నన్‌చేత, **“శ్రియః శ్రీః”** (లక్ష్మికికూడా లక్ష్మి) అని స్తోత్రరత్నంలోని –12వ శ్లోకంతో ఆళవందార్‌చేత, శ్రీగుణరత్నకోశంలోని 10వ శ్లోకంలో “**శ్రియః శ్రీః ! శ్రీరంగేశయ!**” అని భట్టర్‌చేత అనుగ్రహింపబడ్డ భగవానుని దివ్యదేహమే ఆ సంపద. **“అకలకిల్లేన్”** (తిరువాయ్–6–10–10) (విశ్లేషించలేను) అని అన్నట్లు లక్ష్మీదేవి అనే నీవు **“తణ్ణీర్ తణ్ణీర్”** అనేరీతిలో అనుభవించాలని తహతహలాడేటట్లు చేస్తుందికదా ఆ సంపద. **(దైవీం సంపదం తేఽభిజాతాః)**–ఆ

ఎన్నపడి. (నిగూఢమ్) అత్యన్తమ్ వేదరహస్యమాకైయాలే మఱైక్కప్పడానిన్నుళ్ళ, (తే మహిమానమ్) ఉన్నుడైయ స్వరూపాద్యైశ్వర్యత్తై, (నిధి మివ వీక్షమాణా స్సన్తః) ఆపత్తుక్కు "ఉఱుతుణై"యామ్ "శేమవైప్పు"పోలే సాక్షాత్కరియానిన్నుకొణ్డు, (భుఞ్జతే) అనుభవిక్కి ఱార్‌కళో, (తే పురుషాః దైవీం సమ్పదమ్) అవర్‌కళ్, మోక్షహేతుభూతమాయ్, దేవసమ్బన్ధినియాన ద్యోతమానాదిగుణఙ్గళైయుడైయ సమ్పత్తుణ్డు. "తిరువుక్కుమ్ తిరువాకియ" ఎన్నుమ్, "శ్రీః శ్రియః" ఎన్నుమ్, "అకలకిల్లేన్" ఎన్నుమ్, నీ "తణ్ణీర్ తణ్ణీర్" ఎన్నుమ్బడియాన అన్ద భగవద్విగ్రహమాకిఱ వైశ్వర్యత్తై, (అభి) సాక్షాత్కరిత్తు, (అభిజాతా నను)–అనుభవిక్క ఇట్టుప్పిఱన్దవర్‌కళన్నో. "అభిముఖీకృత్య జాతాః–ఉత్పన్నా భవన్తీతి శేషః" ఎన్నక్కడవతిఱే.

---

భగవానుని దివ్యతిరుమేని అనే సంపదను అనుభవించడానికి పెట్టిపుట్టిన భాగ్యశాలురుకదా! **"అభిముఖీకృత్య జాతాః అభిజాతాః"** అనే వ్యుత్పత్తిద్వారా అభిజాతశబ్దం పెట్టిపుట్టినవారిని చెబుతుంది. ఈ విధంగా భట్టర్‌చేత అనుగ్రహింపబడ్డ రీతిలో మహిమను కల్గిన ఆళవందార్ పిరాట్టియొక్క మహిమలను ఆమె కరుణతో యథాతథంగా దర్శించినవారు కాబట్టి, వాటిని అనుగ్రహిస్తున్నారు.

**(తే)** –"నీ యొక్క" అనే మధ్యమపురుషపదంచేత, ఈ పదం చివరలోని సంబోధనచేత, పిరాట్టి ఒక గొప్ప చేతన (జ్ఞానాన్ని కల్గినది)–అని తెలియజేశారు, **"బ్రహ్మేశాది"** అని ప్రారంభం అయిన మొదటిశ్లోకంలోని మూడవపాదంతో కర్మకు వశ్యులైన బ్రహ్మ, శివుడు మొదలైనవారివంటిదికాదు ఈమె అని, **"మాయా తే యవనికా"** (మూలప్రకృతి నీ తెర) అని చెప్పినందువల్ల ఈమె అచేతన అయిన ప్రకృతికంటె విలక్షణమైనది, వేఱయినది–అని తెలియజేశారు, **"కాంత స్తే పురుషోత్తమః"** (పురుషోత్తముడు నీ భర్త) అన్నందున భగవానునికంటే ఈమె వేఱయినది–అని తెలియజేశారు. **"సర్వాణి రూపాణి గాఢోపగూఢాని తే"** (భగవానుని అన్ని రూపాలు నీచే గాఢంగా సంశ్లేషింపబడినవి) అని అనడంవల్ల ఈమె నిత్యమైనది–అని చూపారు, **"లోకనాథదయితే"** అని అన్నందున ఈమె భగవానునకు ప్రియమైనది–అని తెలిపారు. **"ప్రభుః నాలం మాతుమ్"** (నీ నాథుడైన భగవానుడుకూడా నీ గొప్పతనాన్ని పరిచ్ఛేదించి పలుకలేడు) అని ఈమెకు ప్రభువైనవాడు భగవానుడని, అతనికికూడా అపరిచ్ఛేద్యం అయిన మహిమను కల్గినది ఈమె–అని తెలియజేశారు. ఈ విషయాలన్నీ ప్రమాణాలలోకూడా ప్రసిద్ధాలై ఉన్నాయి. **"హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** (పరమపురుషా!



"తే" ఎన్ను యుష్మచ్ఛబ్దసమ్బోధనైకళాలే చేతనత్వముమ్, "బ్రహ్మేశాది" ఇత్యాదియాలే కర్మవశ్యతాదాత్మ్యాభావముమ్, "మాయా తే యవనికా" ఎన్ను–ప్రకృతే రన్యత్వముమ్, "కాన్త స్తే పురుషోత్తమః" ఎన్గిఱ వ్యధికరణత్తాలే భగవత్స్వరూప భిన్నత్వముమ్, "సర్వాణి రూపాణి గాఢోపగూఢాని తే" ఎన్ను నిత్యత్వముమ్, "లోకనాథదయితే" ఎన్ను భగవదభిమతత్వముమ్, "లోకైకేశ్వరి" ఎన్ను సర్వోత్కృష్టతైయుమ్, "ప్రభు ర్మాతుం నాలమ్" ఎన్ను అపరిచ్ఛేద్యత్వముమ్ ఇవరాలే ప్రతిపాదిక్కప్పట్టతిఱే. "హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ", 'విష్ణుపత్నీ' ఎన్ను–భర్తృ–పత్నికళుడైయ స్వరూపభేదముమ్, "పద్మప్రియే" ఎన్ను–ప్రకృతేః. రన్యత్వ–అకర్మవశ్యత్వ–భగవదభిమతత్వాదికళుమ్, " నిత్యైవైషా" ఎన్ను నిత్యత్వముమ్,

---

నీకు భూదేవి, లక్ష్మీదేవులు పత్నులు) అనే పురుషసూక్తప్రమాణంచేతను, **"అస్యేశానో జగతో విష్ణుపత్నీ"** (యజుస్సంహిత -4-4-12) (ఈ లోకానికి ఈశ్వరిగా, విష్ణువునకు పత్నిగా ఉన్నది) అనే వేదవాక్యాలవల్ల ఈమె భర్త అయిన భగవానుడు, పత్ని అయిన ఈమె ఇద్దరూ స్వరూపంలో భిన్నులు–అని వ్యక్తమవుతుంది. **"పద్మప్రియా సుప్రసన్నా"** (లక్ష్మీసహస్రనామమ్-43) (పద్మంలో ప్రీతిని కల్గినది, మిక్కిలి ప్రసన్నంగా ఉండేది) అనే లక్ష్మీసహస్రనామంలోని నామాలవల్ల ఈమె గొప్ప చేతన–అని తెలుస్తున్నది **"శ్రీవాసుదేవమహిషీ పుంప్రధానేశ్వరేశ్వరీ"** (లక్ష్మీసహస్ర-1) (శ్రీవాసుదేవుని మహిషిగా, చిత్, అచిత్, ఈశ్వరులకు ఈశ్వరియై యున్నది) అనే లక్ష్మీసహస్రనామంవల్ల ఈమె అచేతనం అయిన మూలప్రకృతికంటె భిన్నురాలు అని, కర్మకు వశ్యురాలు కాదని, భగవానునకు ప్రియమైనది అని తెలుస్తున్నది. **"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ"** (విష్ణుపు-1-8-17) (జగన్మాతయై, విష్ణువును ఏనాడు విశ్లేషించకుండా ఉండే ఈ లక్ష్మీదేవి నిత్యమైనది) అనే ప్రమాణాన్నిబట్టి ఈమె నిత్యమైనదని స్ఫురిస్తున్నది. **"సర్వోత్కృష్టా సర్వమయీ"** (లక్ష్మీసహస్ర-12) (అందఱికంటే ఉత్తమురాలు అన్నీ తానై ఉన్నది) అనే లక్ష్మీసహస్రనామాన్నిబట్టి ఈమె భగవానుడుతప్ప మిగిలిన అందఱికంటే గొప్పది అని తెలుస్తున్నది. **"వాచః పరం ప్రార్థయితా ప్రపద్యేరన్ నియతః శ్రియమ్"** (శౌనకసంహిత) (ఆ వాక్కుకు అందని లక్ష్మితోకూడి ఉండే భగవానుని స్వరూపాన్ని పొందాలని ఆశించేవాడు ఎల్లప్పుడూ ఆ పిరాట్టిని పురుషకారంగా శరణు పొందతగినవాడు) అనే ప్రమాణాన్నిబట్టి ఈమె లెక్కించడానికి సాధ్యం కాని గొప్పతనాన్ని కల్గినది అనేది శ్రుతిస్మృతి సిద్ధం అని తెలుస్తున్నది. (దేశికులభాష్యంలో లక్ష్మిని గూర్చిన వివిధవాదాలు, వాటి నిరాసం విస్తృతంగా తెలుపబడ్డాయి.) **"దేవి శ్రుతిం భగవతీం**

"సర్వోత్కృష్టా సర్వమయీ" ఎన్ఱు ఉత్కృష్టత్తైయుమ్, "వాచః పరం ప్రార్థయితా ప్రపద్యే నియతః శ్రియమ్" ఎన్ఱు అపరిచ్ఛేద్యత్వముమ్ శ్రుతిస్మృతిసిద్ధఙ్గళాయిఱే యిరుప్పతు. "దేవి శ్రుతిం భగవతీమ్" ఎన్ఱు భట్టరుమరుళిచ్చెయ్‌తారిఱే. ఏతాదృశప్రమాణ ప్రసిద్ధితోÓÒ "యస్యా స్తే" ఎన్గిఱార్.

(తే) ఎన్ఱు కీÇచ్చొన్న వాకారఙ్గళెల్లామ్ నిఱమ్ పెఱుమ్పడి అతివిలక్షణమాయ్, తదాశ్రయమాన వసాధారణస్వరూపత్తై అరుళిచ్చెయ్‌కిఱార్. "ఉణర్ ముÇనలమ్" ఎన్గిఱపడియే. కట్టడఙ్గ "విజ్ఞానఘన"మాయ్, "ప్రజ్ఞానఘన" మువాన భగవత్స్వరూపమ్బోలే "జ్ఞానానన్దమయః" ఎన్గిఱపడియే జ్ఞానానన్దప్రాచుర్యత్తైయుడైయ

---

**ప్రథమే పుమాంసః త్వత్సద్గుణౌఘమణికోశగృహం గృణంతి, తద్ద్వారపాటనపటూని చ సేతిహాసస్తర్కణస్మృతి పురాణపురస్సరాణి**" (శ్రీ గుణరత్న-10) (దేవీ! పురాణపురుషులు వేదాన్ని నీ కల్యాణగుణసమూహాలనే మణులను పెట్టిన పేటికగాను, ఇతిహాసాలు, తర్కమీమాంసాదులు, స్మృతిపురాణాలు మొదలైనవానిని ఆ పెట్టెని తెఱువగల తలుపులుగాను చెబుతున్నారు) అనే శ్లోకంలో భట్టర్‌కూడా లక్ష్మీదేవినిగూర్చిన ఈ విషయాలను అన్నిటినీ అనుగ్రహించారుకదా. అటువంటి శ్రుతిస్మృత్యాది సకలప్రమాణాలలోను ప్రసిద్ధిని పొందిన విషయం **"యస్యా స్తే"** అనే పదాలతో తెలుపబడుతున్నది.

**(తే)** "నీ యొక్క" అని అంటూ ఇంతవరకు లక్ష్మీదేవికి పల్కిన మహిమలు అన్నీ గొప్పతనాన్ని పొందేటట్లుగా మిక్కిలి గొప్పదై, ఆ వైశిష్ట్యాలకు అన్నిటికీ వాసస్థానమైన, వైలక్షణ్యాన్ని కల లక్ష్మీదేవియొక్క, స్వరూపాన్ని తెలుపుతున్నారు. **"ఉణర్ ముÇనలమ్"** (తిరువాయ్-1-1-2) (పూర్ణంగా జ్ఞానానందమయుడై ఉండేవాడు) అని, **"విజ్ఞానఘనః", "ప్రజ్ఞానఘనః"** (బృహ-6-5-13) (పరబ్రహ్మ ఆనందమయమై ఉంటుంది) అనబడే భగవానుని స్వరూపంవలె, **"నాయం దేవో న మర్త్యో వా న తిర్యక్ స్థావరోఽపి వా, జ్ఞానానందమయస్త్వాత్మా శేషో హి పరమాత్మనః"** (ఈ జీవాత్మ దేవుడు కాడు. మానవుడు కాడు. పశుపక్ష్యాదులు కాడు. స్థావరం కాడు. ఈ నాల్గు విధాలైన శరీరాలలో ఉండే జ్ఞానానందమయుడైన ఆత్మ పరమాత్మకు శేషభూతుడుకదా!) అన్నట్లు జ్ఞానానందశేషత్వాలే స్వరూపంగా కల్గి ఉండే పిరాట్టియొక్క దివ్యాత్మస్వరూపాన్ని యామునులు అనుభవిస్తున్నారు. నమ్మాÇ్వార్లు **"యవన్-అవన్"** (తిరువాయ్-1-1-1) అని భగవానుని స్వరూపాన్ని యచ్ఛబ్ద- తచ్ఛబ్దాలను కలిపి పల్కి అనుభవించినట్లే,



దివ్యాత్మస్వరూపత్తై అనుభవిక్కిఱార్. ఆÇ్వార్, "ఎవన్-అవన్" ఎన్ఱు భగవత్స్వరూపత్తై యత్తచ్ఛబ్దఙ్గళాలే అనుభవిత్తాప్పోలే, ఇవరుమ్ పిరాట్టియుడైయ స్వరూపవైలక్షణ్యత్తై "యస్యా స్తే" ఎన్ఱు యత్తచ్ఛబ్దఙ్గళాలే నిర్దేశిత్తనుభవిక్కిఱార్. (తే)-పడర్క్కైయాకవిన్టిక్కే మున్నిలైయాక అరుళిచ్చెయ్‌కైయాలే ఇవర్ పణ్ణుకిఱ స్తోత్రశ్రవణత్తిలే తనక్కుణ్డాన కౌతుకమ్ తోన్ఱ మున్నే వన్దు ముకమ్ కాట్టి సాక్షాత్కరిప్పిత్తపడియుమ్ తోÓÒకిఱదు. కురుకైకావలప్పన్ యోగత్తిలే "ఎఙ్గుమ్ పక్కనోక్కఱియాదే" అనుభవిక్కిఱ సర్వేశ్వరన్

---

వీరు కూడా **"యస్యా స్తే"** అని ఆ శబ్దాలతో కలిపి పల్కి అనుభవిస్తున్నారు. "**యస్యా ఇత్యేవతా పర్యాప్తేఽప్యత్ర త ఇత్యధికోపాదానం ధర్మిగ్రాహకమానసిద్ధాసాధారణ విశేషద్యోతనార్థమ్**" అని దేశికవ్యాఖ్య. **(తే) "తస్యాః"** అని ప్రథమపురుషలో తెలుపకుండా, **"తే"** అని మధ్యమపురుషలో చెప్పినందువల్ల వీరు చేసే స్తుతిని వినడంలో తనకు ఉన్న ఆసక్తి స్ఫురించేటట్లు పిరాట్టి వీరి ముందుకువచ్చి ముఖాన్ని చూపించి, దర్శన మిచ్చింది-అని తెలుస్తున్నది. **"ఎఙ్గుమ్ పక్కనోక్కఱియాన్ ఎన్ పైన్దామరై క్కణ్ణనే"** (తిరువాయ్ 2-6-2) (నా తామరస నేత్రుడు ఎక్కడా పక్కచూపులు తెలియడు) అనే పాశురం ఈడు వ్యాఖ్యలో **"కురుకై కావలప్పన్ యోగనిలైయిల్ ఎమ్బెరుమానై అనుభవిత్తుక్కొణ్డిరున్దుమ్బోదు ఆళవన్దార్ వన్దు ఒరు శువరిన్ పిన్నాల్ మఱైన్దు నిఱ్క, ఎమ్బెరుమాన్ అవరై ఎట్టి ప్పార్త్తాన్"** అని కురుకైకావలప్పన్ అని గ్రహించినట్లు ఒక ఐతిహ్యం ఉట్టంకించబడింది. ఈ విధంగా యోగదశలో ఎక్కడా పక్కచూపులు చూడకుండా యోగి అయిన కురుకైకావలప్పన్‌తో కలసి ఉండే దశలోకూడా ఆ అనుభవాన్ని విడచి, యామునులను తన ముఖం ఎత్తి స్వామి చూడడంద్వారా వీరి విషయంలో తనకున్న గొప్ప ప్రీతిని అతడు వ్యక్తం చేశాడంటే, చాలా వాత్సల్యాన్ని కల తల్లి, అందరికీ సులభ అయిన పిరాట్టి వీరికి తన ముఖాన్ని చూపి, దర్శనాన్ని అనుగ్రహించడంలో ఆశ్చర్యం లేదుకదా! వీరుకూడా **"నిన్ తిరువరుళుమ్ పఙ్గయత్తాళ్ తిరువరుళుమ్ కొణ్డు"** (తిరువాయ్ 9-2-1) (నీకరుణతో, పంకజవాసిని కరుణతో) అనే రీతిలో ఇద్దఱి కృపను ఆశ్రయించి ఉంటారుకదా! పూర్వోక్త ఈడు వ్యాఖ్యలోని ఐతిహ్యంలో చెప్పబడినట్లు వీరికిమాత్రమే కాకుండా శొట్టైకులం అని వ్యవహరింపబడే శఠమర్షణగోత్రంలో పుట్టిన వీరి వంశానికి చెందిన అందఱిపట్ల భగవానుడు సహజమైన ప్రీతిని కలవాడుకదా!

**(మహిమానమ్)** ముందు శ్లోకంలో చెప్పిన రీతిలో ఉభయవిభూతులకు ఈశ్వరియై ఉండే మహిమను. "**విభూతిద్వయశేషిత్వరూపం, నిరతిశయానుకూలగుణ-**

అవ్వనుభవిత్తై విట్టు ఇవర్‌పక్కలిలే వ్యామోహమ్ పణ్ణినపడి కణ్డాల్ మాతృత్వప్రయుక్త-వాత్సల్యవిశిష్టైయాయ్, సర్వసులభైయాన ఇవళ్ ఇవరై ఇప్పడి విషయీకరిక్క-చ్చొల్లవేణుమో? ఇవర్‌దాన్ "నిన్‌తిరువరుళుమ్ పఙ్గయత్తాళ్ తిరువరుళుమ్ కొణ్డు" ఎన్గిఱపడియే ఇరువరుడైయ "అరుళ్‌కొణ్డాడుమ్ అడియవరా"య్‌త్తు. అవ్విషయీకారమ్ ఇవర్ అళవిలిన్ఱిక్కే ఇవ్వంశస్థరెల్లార్‌క్కుమ్ నైసర్గికమిఱే.

(మహిమానమ్) కీழ் "కాన్త స్తే" ఎన్ఱు తొడఙ్గిచ్చొన్న ఉభయవిభూతిశేషిత్వ-రూపమాన మహిమావై. (మహిమానమ్) సర్వేశ్వరనుక్కు అత్యంతాభిమతఙ్గళుమ్, అత్యంతానురూపఙ్గళుమాయిరుక్కిఱ స్వరూపవైలక్షణ్యత్తైయుమ్, గుణాదివైలక్షణ్యత్తైయుమ్

---

**యోగరూపం చ**" అని దేశికవ్యాఖ్య. **(మహిమానమ్)**– సర్వేశ్వరునకు మిక్కిలి ప్రియమైనదై, మిక్కిలి అనురూపంగా ఉండే పిరాట్టి స్వరూపంయొక్క గొప్పతనాన్ని, గుణాలు మొదలైనవాని గొప్పతనాన్ని ఒకటిగా కలిపి అనుభవించి, **"మహిమానమ్"** అని చెప్పినందువల్ల **"అణో రణీయాన్"** ఇత్యాది ప్రమాణాలలో చెప్పబడ్డ భగవానుని మహిమకంటె ఈమె మహిమ గొప్పది–అని స్ఫురింపజేయబడింది. దాహం చెందినవాడు "మంచినీళ్ళు మంచినీళ్ళు" అని తల్లడిల్లేటట్లు ఈమె మహిమ అతణ్ణికూడా తల్లడిల్లేటట్లు చేస్తుందికదా! **(త్వద్వల్లభః)– "చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి, న జీవేయం క్షణ మపి వినా తా మసితేక్షణామ్"** (రామా.సుందర–66–10) (సీత ఒక నెలకాలం సహించి ఉండగల్గినది అయితే చాలాకాలం జీవించగల్గినది అవుతుంది. నల్లని నేత్రాలను కల ఆమెను విడచి ఒక క్షణం కూడా నేను జీవించలేను) అని అతడే స్వయంగా చెప్పిన రీతిలో **"ఇఱైయుమ్ అకలకిల్లేన్"** (తిరువాయ్–6–10–10) (క్షణం కూడా విశ్లేషించలేను) అని అన్నట్లు అతనిని క్షణం అయినా విశ్లేషించలేకుండా నీవు తల్లడిల్లేటట్లే, నిన్ను క్షణంకూడా విశ్లేషించలేకుండా తల్లడిల్లేవాడై, నిన్ను పరిపూర్ణంగా అనుభవించి, నీకు చాలా విధేయుడై, మిక్కిలి ప్రియుడై ఉంటాడు. **(ప్రభుః)– "యో వేత్తి యగపత్సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః, తం ప్రణమ్య హరిం శాస్త్రం న్యాయతత్త్వం ప్రచక్ష్మహే"** (నాథముని–న్యాయతత్త్వమ్) (ఎవడు ఎల్లపుడూ అన్ని వస్తువులను ఒకే సమయంలో తానుగానే సాక్షాత్తుగా తెలిసికొంటున్నాడో, ఆ హరిని నమస్కరించి, న్యాయతత్త్వం అనే గ్రంథాన్ని రచిస్తున్నాము) అని నాథముని అనుగ్రహించినట్లే, అన్నిటినీ ఒకే కాలంలో చూడగల సామర్థ్యాన్ని కలవాడు. లేక, ఉభయవిభూతులను తన సంపదగా కలవాడనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు.



అనుసంధిత్తు త్తిరళ్ "మహిమానమ్" ఎన్గిఱార్. (తే మహిమానమ్)–ఎన్నైయాలే "మహిమాన మీశమ్" ఎన్గిఱ మహిమావిల్ వ్యావృత్తి తోற்றుకిఱదు. ఇదు అవనైయుమ్ "తణ్ణీర్ తణ్ణీర్" ఎన్నప్పణ్ణుమదిఱే. (త్వద్వల్లభః)–"న జీవేయం క్షణ మపి" ఎన్ఱు "ఇఱైయుమ్ అకల" కిల్లాద ఉన్నుడైయ ఉళ్‌మానమ్, పుఱమానమ్ అనుభవిత్తు అంతరఙ్గనాయ్, అత్యంతాభిమతనాయిరుక్కిఱవన్. (ప్రభుః) "యో వేత్తి యుగపత్సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః" ఎన్ఱు సర్వత్తైయుమ్ ఏకకాలత్తిలే సాక్షాత్కరిక్కవల్ల సామర్థ్యత్తై యుడైయవన్. అథవా, ఉభయవిభూత్యైశ్వర్యత్తై యుడైయవన్–ఎన్నవుమామ్.

---

**(ఇయత్తయా మాతుమ్ నాలమ్)**– ఈ విధంగా నీకు చాలా ఇష్టుడై, సర్వేశ్వరుడై ఉండేవాడుకూడా నీ గొప్పతనాన్ని ఇంతటిది అని పరిచ్ఛేదించి తెలియలేడు. **(తద్వల్లభః తే మహిమానం మాతుమ్ నాలమ్) "పిత్తర్ పనిమలర్‌మేల్ పావైక్కు"** (తిరునెడు–18) (చల్లని తామరపూవులో ఉండే లక్ష్మీవిషయంలో వ్యాముగ్ధుడు), అని, **"శార్వు నమక్కెన్ఱుమ్ శక్కరత్తాన్ తణ్‌తుழாయ్ తార్‌వాழ் వరైమార్బన్ తాన్ ముయఙ్గుమ్, కారార్‌న్ద వానమరు మిన్నిమైక్కుమ్ వణ్‌తామరై నెడుఙ్కణ్ తేనమరుమ్ పూమేల్ తిరు"** (మూన్ఱామ్. తిరు–100) (చక్రధారి, చల్లని తులసీమాలతో ప్రకాశించే పర్వతంవంటి వక్షస్సును కలవాడు తానే సంశ్లేషించి, మేఘాలతో నిండిన ఆకాశంలో మెఱుపువలె వెలిగేది, అందమైన తామరపూలవంటి కన్నులు కల్గినది, తేనెతో నిండినపూలలో నిత్యవాసాన్ని చేసే లక్ష్మి) అనే రీతిలో నీకు ప్రియుడైన అతడుకూడా నీ మాధుర్యాన్ని అనుభవించి, నీటిలో మునిగినవాడు నీళ్ళుతాగి, కళ్ళుతేలవేసి, మోహించేటట్లు, మోహాన్ని పొందుతాడే తప్ప గొప్పతనాన్ని ఇంతటిది అని పరిచ్ఛేదించి తెలిసికోగలడా !

**(తే మహిమానం ఇయత్తయా మాతుమ్)** – **"న సంపదామ్ సమాహారే విపదాం వినివర్తనే, సమర్థో దృశ్యతే కశ్చిత్ తం వినా పురుషోత్తమమ్"** (సంపదలను అన్నిటినీ ఇవ్వడంలో, విపత్తులను తొలగించడంలోను ఆ పురుషోత్తమునికంటే వేఱొక సమర్థుడు కన్పించడం లేదు) అనే ప్రమాణాన్నిబట్టి అన్నిటికీ సమర్థుడై భావించి ఉన్నా స్వామి నీ గొప్పతనాన్ని పరిచ్ఛేదించి తెలియగలడా? పరిచ్ఛేదించి తెలిసికోవచ్చునని దానిని కొలవాలని ప్రయత్నిస్తే అందుకు అతడు సమర్థుడుకాడనే తెలుస్తుంది. **(తే మహిమానం మాతుమ్ నాలమ్)** –తన గొప్పతనాన్నే తాను లెక్కించి తెలియలేనివాడు, తనస్వరూపం మొదలైనవాటికంటే గొప్పతనాన్నికల నీస్వరూపాదుల గొప్పతనాన్ని తెలియగలడా? రూపంయొక్క గొప్పతనాన్ని పరిచ్ఛేదించి తెలియడం సాధ్యమా?

(ఇయత్తయా మాతుం నాలమ్)-ఇప్పడి ఉనక్కు వల్లభనాయ్, ప్రభువాయిరుక్కిఱవనుమ్ ఇవ్వళవెన్ఱు పరిచ్ఛేదిక్కమాట్టాన్. (త్వద్వల్లభ స్తే మహిమానం మాతుం నాలమ్) "పిత్తర్ పనిమలర్‌మేల్ పావైక్కు" "తాన్ ముయఙ్గుమ్" ఎన్గిఱపడియే కుమిళ్ నీరుణ్ణు కణ్ణాఙ్గళైయిట్టుమదొళియ పరిచ్ఛేదిక్క శక్తనో?

(తే మహిమానమ్ ఇయత్తయా మాతుమ్) "సమర్థో దృశ్యతే కశ్చిత్" ఎన్ఱు అతిసమర్థ నెన్నా, అపరిచ్ఛేద్యవస్తువై ప్పరిచ్ఛేదిక్క ఇఴిన్దానాకిల్ అసమర్థనాయ్ విడుమత్తనై. (తే మహిమానమ్ మాతుం నాలమ్) తన్ స్వరూపవైలక్ష్ణ్యప్రయుక్తమాన ఉన్నుడైయ మహియానై అఱియవల్లనో? (మహిమానం మాతుం నాలమ్) స్వస్వరూపవైలక్ష్ణ్యత్తై ప్పరిచ్ఛేదిత్తు అఱియాదవన్ ఉన్నుడైయ స్వరూపవైలక్షణ్యత్తై ప్పరిచ్ఛేదిక్కవో? రూపవైలక్షణ్యత్తై ప్పరిచ్ఛేదిక్కవో? గుణాదివైలక్షణ్యత్తై ప్పరిచ్ఛేదిక్కవో?

---

గుణాదుల గొప్పతనాన్ని పరిచ్ఛేదించి తెలియడం సాధ్యమా? దేనిని ఇతడు ఇంత అని లెక్కకట్టి తెలియడానికి సాధ్యం? రూపం, గుణాలు మొదలైనవానికి స్థానం అయిన నీ స్వరూపం అతని ప్రాణం ధరించేటట్లు అతనిని చేయగల్గినది కాబట్టి **"చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి, న జీవేయం క్షణ మపి వినా తా మసితేక్షణామ్"** అనే ప్రమాణానుసారం "నిన్ను విడచి క్షణం కూడా ఉజ్జీవించలేను", అని అతడు చెప్పేటట్లు చేస్తుంది. నీ రూపంయొక్క గొప్పతనాన్ని చూస్తే, అది **"తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షితామ్, రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా"** అనే ప్రమాణాన్నిబట్టి **"అసితేక్షణా"** అని తెలుపబడ్డ సౌందర్యంతో అతని రూపసౌందర్యాన్ని మించి ఉంటుంది. నీ గుణాల గొప్పతనాన్ని చూస్తే శ్రీ గుణరత్నకోశంలోని "**మాతః! మైథిలి! త్వయి తథైవార్ద్రాపరాధా స్త్వయా రక్షంత్యా పవనాత్మజాల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా, కాకం తం చ విభీషణం శరణ మిత్యుక్తిక్షమౌ రక్షతః సా న స్సాంద్రమహాగస స్సుఖయతు క్షాంతి స్తవాకస్మికీ**" (తల్లీ! మైథిలీ! అపుడే అపరాధాన్ని చేసిన రాక్షసస్త్రీలను హనుమానునివద్దనుండి రక్షించిన నీచేత, కాకాసురుని, విభీషణుని "శరణు" అనే మాటను చెప్పిన తర్వాతనే రక్షించిన రాముని గోష్ఠి చాలా తక్కువగా చేయబడిందమ్మా! అటువంటి నీ నిర్హేతుకకృప పరమపాపిష్ఠివాళ్ళం అయిన మమ్ములనుకూడా ఆనందింపజేయనీ) అనే 50వ శ్లోకానుసారం భగవానుని గుణాలను అధఃకరించేదై ఉంటుంది, (**ఇయత్తయా మాతుమ్ నాలమ్**) – పరిచ్ఛేదించలేనిది అని చెప్పడం తప్ప భగవానుడుకూడా ఇంతటిది అని పరిచ్ఛేదించి తెలియలేడు.



ఎత్తైత్తాన్ పరిచ్ఛేదిప్పదు? ధర్మియాన స్వరూపవైలక్షణ్యమ్ సత్తయా ధారకమాకైయాలే "న జీవేయం క్షణ మపి" ఎన్నప్పణ్ణుమ్. రూపవైలక్షణ్యమ్. "తం చేయ మసితేక్షణా" న్గిఱపడియే తత్తోఽ వ్యధికమాయిరుక్కుమ్. (ఇయత్తయా మాతుమ్ నాలమ్) "అపరిచ్ఛేద్యమిత్తనై" ఎన్ఱు అళవిడుమల్లదు ఇవ్వళవెన్ఱు పరిచ్ఛేదిక్కమాట్టాన్.

ఇవ్వర్థత్తై దృష్టాంతముఖేన దృఢీకరిక్కిఱార్ (ఆత్మన ఇవ) ఎన్ఱు. (ఆత్మనో **మహిమాన మివ తే మహిమానమ్** ఇయత్తయా మాతుం నాలమ్) "తనక్కుమ్ తన్నై యఱివరియాన్" ఎన్గిఱపడియే తామ్ తన్ పెరుమై యఱియాతాప్పోలే, ఉన్నుడైయ

---

ఈ విషయాన్ని ఒక ఉదాహరణతో స్థిరీకరిస్తున్నారు-"**ఆత్మన ఇవ**" అని అంటూ. తన గొప్పతనాన్ని తాను తెలియలేకపోయినట్లే, నీ గొప్పతనాన్నికూడా స్వామి ఇంతమాత్రం అని లెక్కకట్టి తెలియలేడు. అతని స్వరూపం, రూపాలు, గుణాలు, విభూతులు-మొదలైనవి ఒక్కొక్కటి అంతులేనివిగా ఉంటాయికదా! "**యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చ న**" (తైత్తి-ఆనం-9-1) ( ఏ పరబ్రహ్మనుండి మనస్సుతోపాటు వాక్కులు ఆ పరబ్రహ్మను పరిచ్ఛేదించి తెలియలేక వెనుదిరుగుతున్నవో, ఆ పరమాత్మయొక్క ఆనందాన్ని తెలిసినవాడు ఎవరివల్ల భయపడడు) అనే ప్రమాణానుసారం అతని ఆనందగుణం ఒక్కటిని మాత్రం లెక్కించి తెలియాలని ప్రారంభించిన వేదాలు ఆ విధంగా లెక్కకట్టి తెలియలేక వెనుతిరిగినట్లే, నీ గొప్పతనాన్నిగూర్చి పలుకాలని ప్రారంభించిన ఇతడుకూడా వేదాలు పొందిన ఆ స్థితినే పొందుతాడు. "**ఆత్మన ఇవ**" అని, "**తే మహిమానమ్**" అని అన్నందువల్ల పిరాట్టికి అనురూపం అయిన అతని స్వరూపం, రూపాలు, గుణాలు, విభూతులు-మొదలైనవానిని అన్నిటినీ, ఇతనికి తగినవి అయిన పిరాట్టియొక్క స్వరూపం, రూపాలు, గుణాలు, విభూతులు మొదలైన అన్నిటితోచేర్చి వీరు అనుభవిస్తున్నారని తెలుస్తున్నది. శ్రీ భాష్యకారులుకూడా ''**భగవన్నారాయణ**'' అని, "**అభిమతానురూపస్వరూపరూపగుణ**" (భగవానుడైన నారాయణునకు ఇష్టంగాను, తగినవిగాను ఉండే స్వరూపం, రూపాలు, గుణాలు, ఐశ్వర్యం, విభూతి, శీలం మొదలైనవానిని కల్గినది) అని శరణాగతిగద్యలో చెప్పిన రీతిలో ఒకదానితో వేఱొకటి అనురూపం అయిన ఈ ఇద్దఱి స్వరూపం మొదలైనవానిని చేర్చి అనుభవించారుకదా!

(**త్వద్వల్లభోఽపి**)-నీకు ప్రియుడైన ఆ స్వామికూడా-అని భావం. "**అపి**" అనే పదం వేఱొకదానినికూడా కలుపుకొనే అర్థాన్ని ఇస్తుంది. ఇక్కడ, పూర్వం తెల్పిన

మహిమావై ఇవ్వళవెన్డఱియమాట్టాన్. అవనుడైయ స్వరూపరూపగుణవిభూతికళ్ ఓరొన్ఱే అపరిచ్ఛేద్యమిఱే. ఆనన్దగుణత్తై ప్పరిచ్ఛేదిక్క ఇఱిన్ద వేదఙ్గళ్ పట్టతుపడుమత్తనై. ఉన్నుడైయ పెరుమ్మైయై ప్పేశవిఱున్ద వివనుమ్. అవనుడైయ "యతో వాచో నివర్తన్తే" ఎన్గిఱతుక్కువిషయమ్ ఇతు వాయ్త్తు. "ఆత్మన ఇవ" ఎన్నుమ్, "తే మహిమానమ్" ఎన్ను మరుళిచ్చెయ్కైయాలే పిరాట్టిక్కనురూపఙ్గళాన అవనుడైయ స్వరూపరూపగుణవిభూతికళైయుమ్, ఇవనుక్కనురూపఙ్గళాన పిరాట్టియుడైయ స్వరూపరూపగుణవిభూతికళైయుమ్ శేర్త్తనుభవిత్తమై తోఱ్ఱుకిఱతు. భాష్యకారరుమ్ "భగవన్నారాయణ" ఎన్నుమ్, "అభిమతానురూపస్వరూపరూపగుణ" ఎన్నుమ్ ఇరువరుడైయవుమ్ స్వరూపాదికళై చ్చేర్త్తనుభవిత్తరుళినారిఱే.

---

బ్రహ్మ మొదలైనవారితో ఇతనిని (భగవానుని) కలుపుతున్నది. "**నుణ్ణుణర్విల్ నీలార్క్కణ్డత్తమ్మానుమ్ నిఱై నాన్ముకనుమ్**" (తిరువాయ్-6-1-10-8) (సూక్ష్మబుద్ధిని కల శివుడు, జ్ఞానపూర్తిని కల బ్రహ్మ) అని, "**ఎల్లైయిల్ ఞానత్తన్**" (తిరువాయ్-3-10-8) (అవధి లేని జ్ఞానాన్ని కలవాడు) అనే రీతిలో మిక్కిలి నిశితం అయిన జ్ఞానాన్ని కలవారైన బ్రహ్మ, రుద్రుడు మొదలైన గొప్ప దేవతలు, సహజంగానే అన్నిటినీ తెలిసినవాడైన సర్వేశ్వరుడూ అందఱూ కలిసి ఉండి పల్కినా నీ గొప్పతనం లెక్కకట్టి తెలియ లేరు-అని భావం. (పరిమిత) తక్కువ. జ్ఞానాన్ని, శక్తులను కల బ్రహ్మ మొదలైనవారితో అంతులేని జ్ఞాన, శక్తులనుకల భగవానుని ఒకటిగా చేయవచ్చునా? అని అంటే, వీరిమధ్యలో ఒకరితో వేఱొకరికి జ్ఞానం మొదలైనవాటిలో హెచ్చు తగ్గులు ఉన్నా, పిరాట్టియొక్క మహిమార్ణవాన్ని పరిచ్ఛేదించాలని ప్రయత్నించినపుడు అందులో అందఱూ మునిగిపోవడంలో తేడా ఏమీ లేనందువల్ల ఈ విధంగా ఒకటిగా చేసి పల్కడంలో అడ్డులేదు. పర్వతానికి, పరమాణువుకు, పరిమాణంలో ఒకదానితో వేఱొకదానికి తారతమ్యం ఉన్నా, మహాసముద్రంలో మునిగిపోయే విషయంలో వాటికి ఏ తేడా లేదు కదా! స్తోత్రరత్నంలోని "**వేదా శ్చతుర్ముఖముఖా శ్చ మహార్ణవాంతః కో మజ్జతో రణుకులాచలయో ర్విశేషః**" (8) అనే శ్లోకంలో ఆళవందార్ ఈ విధంగా అనుగ్రహించారుకదా!

ఈ విధంగా "**అపి**" శబ్దాన్ని సముచ్చాయకంగా గ్రహించకుండా, గొప్పతనాన్ని కల్గినది-అనే అర్థాన్ని చెబుతున్నదనికూడా గ్రహించవచ్చు, అంటే- మిక్కిలి గొప్ప జ్ఞానశక్తులను కల నీ వల్లభుడు కూడా తెలియలేడని భావం. "**య స్సర్వజ్ఞ సర్వవిత్**



(త్వద్వల్లభోఽపి) ఎన్గిఱ అపి శబ్దమ్-సముచ్చయార్థమాయ్, కీఴ్చ్చొన్న బ్రహ్మాదికళోడే ఇవనైయుమ్ సముచ్చయిత్తు, "నుణ్ణుణర్విల్ నీలార్కణ్డత్తమ్మానుమ్ నిఱై నాన్ముకనుమ్", "ఎల్లైయిల్ ఞానత్తన్" ఎన్గిఱపడియే అతిసూక్ష్మజ్ఞానికళాన బ్రహ్మరుద్రాదికళుమ్, స్వతస్సర్వజ్ఞనాన ఈశ్వరనుమ్ కృతసఙ్కేతరాయ్ ప్పేశిలుమ్, ఉన్నుడైయ మహిమావై ప్పరిచ్ఛేదిక్కమాట్టార్కళెన్గై. అల్పజ్ఞానశక్తికరాన బ్రహ్మాదికళోడే అతిశయితజ్ఞానశక్తినాన ఈశ్వరనై సముచ్చయిక్కలామో? వెన్నిల్, ఇవర్కళుక్కన్యోన్యమ్ జ్ఞానతారతమ్య ముణ్డేయాకిలుమ్, ఇవళుడైయ మహిమార్ణవత్తిలే మగ్నరామిడత్తిల్ ఒరు విశేష మిల్లామైయాలే ఇఙ్గనే యోజిక్క త్తట్టిల్లై. పర్వతపరమాణుక్కళుక్కు అణుత్వ-మహత్త్వరూపేణ అన్యోన్యమ్ వాశి యుణ్డేయాకిలుమ్, మహార్ణవత్తిలే మగ్నఙ్గళామిడత్తిల్ తన్నిలొరువాశి యిల్లైయిఱే.

---

**యస్య జ్ఞానమయం తపః**" (ముణ్డక-1-1-10) (ఏ పరమాత్మ అన్ని వస్తువుల స్వరూపాన్ని, స్వభావాలను తెలిసికొంటున్నాడో, ఎవని సంకల్పం జ్ఞానమయంగా ఉంటుందో) అని, "**పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ**" (శ్వేతా-6) (ఈ పరమాత్మకు పలు రీతులలోని, గొప్పదైన శక్తి, సహజమైన జ్ఞానం, బలం, (సృష్ట్యాది) కార్యాలు కలవని తెలియబడుతున్నవి) అనే రీతిలో అన్నిటినీ తెలిసినవాడై, అన్నిటికీ సమర్థుడై ఉండే భగవానుడుకూడా తెలియలేడని భావం. ఈ రీతిలో కాకుండా, "**అపి**" శబ్దాన్ని సముచ్చయార్థకం గానే గ్రహించి, వేఱొక రీతిలోకూడా అర్థాన్ని చెప్పవచ్చు. అది ఏమంటే, "**అపి**" శబ్దంచేత పిరాట్టిని కలిపి "నీ వల్లభుడుకూడా పరిచ్ఛేదించగలవాడు కాదు. నీవుకూడా పరిచ్ఛేదించగల్గినదానవు కావు" అనే అర్థం చెప్పవచ్చు. నీకు వల్లభుడైన అతడు, అతనికి వల్లభ అయిన నీవు ఒకటిగా చేరి నీ గొప్పతనాన్ని లెక్కకట్టి చెప్పాలని చూచినా లెక్కకట్టడానికి సాధ్యంకాదు-అని భావం. "**అపి-అనుక్తసముచ్చయార్థో వా. త్వం చ త్వద్వల్లభశ్చేత్యర్థః**" అని దేశికవ్యాఖ్య.

ఈ విధంగా లోకంలో ఉండే మిగిలిన అందఱికంటే గొప్ప జ్ఞానాన్ని, శక్తినికల ఇరువురుకూడా ఇంత అని చెప్పలేరని చెప్పడం "వీరు అన్నీ తెలిసినవారు" (సర్వజ్ఞులు) అని పలికే ప్రమాణాలతో పొసగుతుందా? అంటే, ఇంత అని చెప్పడానికి సాధ్యం కాని ఒక వస్తువును పరిచ్ఛేదించాలని ప్రయత్నించడం అజ్ఞానానికి ఎల్లగాకదా పర్యవసిస్తుంది. అందువల్ల ఈ విధంగా చెప్పడం తప్పు కాదు. "**విషయస్యాపరిచ్ఛిన్నత్వాత్ తత్ర సర్వజ్ఞస్య సర్వశక్తేరపి పరిచ్ఛిన్నత్వజ్ఞానాభావో న దోషాయ ఇతి భావః**" అని దేశికభాష్యం. "**దేవి త్వన్మహిమావధిః న హరిణా నాపి త్వయా జ్ఞాయతే యద్యప్యేవ మథాపి నైవ**

అథవా, అపి శబ్దమ్ అతిశయత్తిలేయాయ్, "య స్సర్వజ్ఞ స్సర్వవిత్", "పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే" *ఎన్గిఱ గుణఙ్గళై సముచ్చయిత్తు, "ఆత్మన ఇవ తే"* ఎన్గిఱపడియే సర్వజ్ఞనాయ్, సర్వశక్తికనుమాయిరుక్కిఱవను మెన్నవుమామ్. అఙ్గనుమన్ఱిక్కే, "త్వద్వల్లభ శ్చ న ప్రభుః, త్వ ఇచ్చ" ఎన్ఱు, సముచ్చయిత్తు ఉనక్కు వల్లభనానవవనుమ్, అవనుక్కు వల్లభైయాన నీయుమ్ కృతసఙ్కేతరాయ్ ప్పరిచ్ఛేదిక్క ప్పార్త్తాలుమ్ పరిచ్ఛేదిక్కప్పోకాతెన్నై.

ఇప్పడి లోకవిలక్షణజ్ఞానశక్తికరాన ఇరువరుమ్ పరిచ్ఛేదిక్క మాట్టార్కళెన్నై-ఇవర్కళుడైయ సర్వజ్ఞతైక్కు చ్చేరుమోవెన్నిల్, అపరిచ్ఛేద్యవస్తువై

---

**యువయోః సర్వజ్ఞతా హీయతే, యన్నాస్త్యేవ తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదుః వ్యోమాంభోజ మిదంతయా కిల విదన్ భ్రాంతోஉయ మిత్యుచ్యతే**" (శ్రీస్తవమ్-8) (దేవీ! నీ గొప్పతనంయొక్క అవధి హరిచేత, నీచేతకూడా తెలియబడడం లేదు. అయినా, మీ సర్వజ్ఞత్వానికి ఏ కొఱతా లేదు. లేని వస్తువును తెలియకుండా ఉండడం సర్వజ్ఞత్వానికి అనుగుణం అని పెద్దలంటారు. ఆకాశపద్మాన్ని ఒక వస్తువుగా తెలిసికొనేవాడు భ్రమించినవాడుగానే చెప్పబడుతున్నాడుకదా) అని వాస్తవాన్ని గ్రహించివారిలో అగ్రగణ్యులుగా చెప్పబడే కూరేశులు ఈ విషయాన్ని చాలా స్పష్టంగా తెలియజేశారుకదా! "**ఈదృశ శ్చ మహిమా వేదార్థసంగ్రహేஉప్యుక్తః - అనవధిక మహిమా మహిషీ-ఇతి. వివృత శ్చ గద్యారంభే భగవన్నారాయణేత్యాదినా**" అని దేశికవ్యాఖ్య.

ఈ విధంగా అన్నిటినీ తెలిసినవారై, అన్నిటికీ సమర్థులై ఉండే ఇరువురుకూడా పిరాట్టియొక్క గొప్పతనాన్ని ఇంత అని చెప్పలేక పోవడానికి కారణాన్ని అనంతరం తెలుపుతున్నారు (**నిరవధిమ్**) అంతులేనిది-అని భావం. ఇది (హేతుగర్భ విశేషణం.) అంతులేనిది కావడంవల్ల. ఈ పదం ఇంత అని చెప్పలేకపోవడానికి గల కారణాన్ని అంతర్భవించుకొన్నది (సూచిస్తున్నది) . పిరాట్టి గొప్పతనం అవధి లేనిది కనుక ఎవరిచేత ఇంతటిది అని చెప్పలేనిది- అని భావం. ఇందువల్ల అపరిచ్ఛేద్యం అయిన వస్తువును పరిచ్ఛేదించలేకపోవడం సర్వజ్ఞత్వానికి భంగం కల్గించదు-అని చెప్పబడినట్లయింది. ఇటువంటి అతిశయాన్నికల లక్ష్మియొక్క వైభవం అనుభవించతగినదై, పిరాట్టికూడా ప్రాప్యకోటిలోనికి చేరినది-అనే విషయాన్ని తెలిపేదై, ఈమెకు స్వామి అయిన

* కొన్నిప్రతుల్లో ఈభాగం లేదు.



*అపరిచ్ఛేద్యమెన్ఱఱికై-సర్వజ్ఞతైక్కనుగుణమాయ్,* అళవిడుకిఱేనెన్నై-అజ్ఞతైక్కెల్లైనిలమాయిరుక్కుమ్. ఆకైయాల్ ఇప్పడి చొల్ల క్కుఱైయిల్లై. ఇవ్వర్థత్తై తత్త్వవిదగ్రేసరరాన ఆళ్వాన్, "దేవి త్వన్మహిమావధి ర్న హరిణా నాపి త్వయా జ్ఞాయతే" ఎన్ఱు తొడఙ్గి స్పష్టమాక ప్రతిపాదిత్తరుళినారిఱే.

ఇప్పడి సర్వజ్ఞరాయ్, సర్వశక్తికరాయిక్కిఱ విరువర్క్కుమ్ పరిచ్ఛేదిక్క వొణ్ణామైక్కు హేతువెన్నెన్న వరుళిచ్చెయ్కిఱార్ (నిరవధిమ్) ఎన్ఱు. ఇతుతాన్ హేతుగర్భవిశేషణమాయ్, అవధిరహితమాకైయాలే ఒరువర్క్కుమ్ పరిచ్ఛేదిక్కప్పోకాదెన్నై, ఇత్తాల్ అపరిచ్ఛిన్నవస్తువై ప్పరిచ్ఛేదిక్కమాట్టామై సర్వజ్ఞత్వత్తుక్కు భఙ్గకమన్ఱెన్ఱతాయిఱ్ఱు. ఇప్పడి ఇవళుడైయ మహిమావానతు ఆశ్రితర్క్కు అనుభవయోగ్యమాయ్, పాప్యాన్తర్గతత్వ

---

భగవానుడు, ఈ ఇద్దఱికీ శేషభూతుడైన జీవుడు-అనే ఇద్దఱికీ తగినదై, "**ఎప్పొழுదుమ్ నాళ్ తిఙ్గళ్ ఆణ్డూழியూழிదొఱుమ్ అప్పొழுదైక్కప్పొழுదు ఎన్నారావముదమే**" (తిరువాయ్-2-5-4) (ఎప్పుడూ దినాలు, వారాలు, సంవత్సరాలు కల్పాలు గడచినా ఎప్పటికప్పుడు కొత్తగా అతృప్తామృతంగా తోచేవాడా!) అనే రీతిలో అనుభవించేవారికి ఎప్పటికప్పుడు కొత్తగా ఉంటుంది-అని అంటున్నారు తర్వాత. (**నిత్యానుకూలం స్వతః**) - సహజంగానే ఎప్పుడూ అనుకూలంగా ఉంటుంది. అంటే-తనకు జీవేశ్వరులిద్దఱితో గల సంబంధంచేత వెన్నెల, చందనం, మలయమారుతం-మొదలైనవానివలె ఎల్లప్పుడూ తన బిడ్డలైన జీవులు, భర్త అయిన సర్వేశ్వరుడు-అనే ఇద్దఱికీ అనుకూలంగా ఉంటుంది-అని భావం.

(**తాం త్వామ్**) -ఇంతవరకు చెప్పబడ్డ గొప్పతనాన్ని కల్గినదిగా శాస్త్రాలలో పొగడబడ్డ నిన్ను-అని భావం. వీరు ఈమెను స్తుతించడం తల్లి అయిన ఈమె స్వరూపానికి, బిడ్డ అయిన ఈ ఆళవన్దార్ స్వరూపానికి తగినది. కనుక, ఆమె గొప్పతనాన్ని కాని, వీరివద్ద ఉండే కొఱతను కాని చూచి సంకోచించనక్కఱలేని సంబంధం ఉన్నది కనుక, "నీ దాసుడననే కారణంచేత నేను నిర్భయంగా స్తుతిస్తున్నాను. "**దాస ఇతి చ త్వాం స్తోష్యామ్యహం నిర్భయః**" అని అంటున్నారు తర్వాత. (**దాస ఇతి త్వాం నిర్భయః స్తోష్యామి**) తిరుప్పావై 27, 28 పాశురాలలో చెప్పబడిన రీతిలో "**అఱివొన్ఱు మిల్లాద**" (జ్ఞానం ఏ మాత్రం లేని) గోపికలు "**కుఱైవొన్ఱు మిల్లాద**" (ఏ కొఱత లేని) గోవిందుని పాడి, "**పఱై**" అనే కైంకర్యాన్ని పొందడంకోసం "**ఉన్ఱన్నోడు ఉఱవేల్ నమక్కు ఇఙ్గు ఒழிక్క వొழிయాదు**" (తిరుప్పావై-29) (నీతో సంబంధాన్ని పోగొట్టుకోవడం మావల్ల

* ఈభాగం ద్రావిడప్రతిలో లేదు.

జ్ఞాపకమాయ్, శేషిశేషభూతరిరువర్క్కుమ్ అనుకూలమాయ్, "ఎప్పొఴతుమ్ నాళ్ తిఙ్గళాణ్డాఴియూఴితొఱు మప్పొఴతైక్కప్పొఴతు ఆరావముతమా" యిరుక్కు మెన్గిఱార్ (నిత్యానుకూలం స్వతః) ఎన్ఱు. స్వతః నిత్యానుకూలమా యిరుక్కైయావతు- తన్నతొరుస్వభావత్తాలే నిలా, తెన్ఱల్, చన్దనమ్బోలే ఎప్పోతుమ్ చేతనేశ్వరరిరువర్కళుక్కు మనుకూలమాయిరుక్కై .

(త్వాం) కీఴ్ ప్రతిపాదిక్కప్పట్ట పరత్వత్తాల్ వన్ద ప్రసిద్ధియై యుడైయ వున్నై. ఇప్పడి స్తోత్రన్దాన్ *ఇరువర్క్కుమ్ స్వరూపప్రయుక్తమాకైయాలే, ఆత్తలైయిల్ నిఱైవైయుమ్, ఇత్తలైయిల్ కుఱైవైయుమ్ పార్త్తు పిఱ్కాలిక్కవేణ్డాతపడియాన సమ్బన్ధముణ్డాకైయాలే (దాస ఇత్యహం నిర్భయః స్తోష్యామి) ఎన్గిఱార్, "అఱివొన్ఱుమిల్లాత వాయ్క్కులత్తార్", "కుఱైవొన్ఱు మిల్లాత కోవిన్దనై" "పాడిప్పఱై" కొళ్ళుకైక్కాక "ఉన్ఱన్నోడుఱవేల్ నమక్కిఙ్గొఴిక్క

కాదు) అని సంబంధాన్ని పురస్కరించుకొన్నట్లే, పిరాట్టియొక్క పరత్వాన్ని, తమ నైచ్యాన్ని చూచి "ఏ విధంగా స్తుతించగలం?" అని సంకోచించిన వీరు పిరాట్టితో ఉండే, వదులుకోవడానికి వీలులేని సంబంధాన్ని స్మరించి సమాధానాన్ని పొందినవారై, స్తుతించడం ప్రారంభించడంలో లోపం లేదు. మొదటిశ్లోకంలో "**ఫణిపతిః**" అని ప్రారంభించి, "**త్వద్దాసదాసీగణః**" అన్నంతవరకు నిత్యవిభూతిలోను, లీలావిభూతిలోను ఉండే అందఱు ఈమెకు శేషభూతులు-అని చెప్పడంవల్ల తాముకూడా శేషభూతులు అని స్పష్టపడినది కనుక, ఇక్కడ ప్రత్యేకంగా తాము దాసులమని చెప్పడంలో ఏం కారణం? అని అంటే, "**ఆక్షేపతః ప్రాప్తా దాభిధానికస్యైవ గ్రాహ్యత్వాత్**" (శ్రీ భాష్యమ్-1-1-1) (తాత్పర్యార్థంగా స్ఫురించేదానికంటే సాక్షాత్తుగా చెప్పబడేది గ్రహించతగినది కనుక) అని శ్రీ భాష్యంలో ప్రారంభంలో భగవద్రామానుజులు అనుగ్రహించినరీతిలో తాత్పర్యార్థంగా తెలిసేదానికంటే నేరుగా చెప్పబడేది ముఖ్యం కనుక, "నేను శేషభూతుణ్ణి" అని పల్కుతున్నారు. "**అరఙ్గమాళి ఎన్నాళి విణ్ణాళి**" (పెరియ తిరు-7-3-4) (శ్రీరంగనాథుడు నానాథుడు పరమపదనాథుడు) అని తిరుమఙ్గైయాఴ్వార్లు, "**శ్రీరంగనాథ మమ నాథ**" (శ్రీరంగగద్యమ్) అని భగవద్రామానుజులు సామాన్యంగా కలిపి చెప్పడంతో ఆగకుండా, తమకు స్వామి అనేది ప్రత్యేకంగాకూడా చెప్పారుకదా ! దీన్ని వేఱు విధంగాకూడా నిర్వహించవచ్చు. ఏ విధంగా అంటే- మొదటి శ్లోకంలో తమతోపాటు అందఱు లక్ష్మికి దాసభూతులు-అని

* "ఇవర్క్కు" అని పాఠాంతరం.



వొఴియాతు" ఎన్ఱు సమ్బన్ధత్తై మున్నిట్టాప్పోలే, ఇవరుమ్ పిరాట్టియుడైయ ఉత్కర్షత్తైయుమ్, తమ్ముడైయ నికర్షత్తైయుమ్ పార్త్తు "కథం బ్రూమః" ఎన్ఱు పిఱ్కాలిత్తవర్, తదవినాభావసమ్బన్ధానుసన్ధానత్తాలే సమాహితరాయ్ స్తోత్రత్తిలే ప్రవర్తిక్క కుఱై యిల్లై. "ఫణిపతిః" ఎన్ఱు తొడఙ్గి "త్వద్దాసదాసీగణః ఎన్ఱు ఉభయవిభూతియిలుళ్ళారుమ్ ఇవళుక్కు శేషభూతరెన్ఱు శొల్లుకైయాలే, తమ్ముడైయ. శేషత్వముమ్ అర్థాత్సిద్ధమాయిరుక్క, ఇఙ్గు విశేషిత్తరుళిచ్చెయ్యానెన్నెన్నిల్, "ఆక్షేపతః ప్రాప్తమాకైయెప్పఱ్ఱు ఆభిధానికమ్ ముఖ్యమాకైయాలే "దాసోऽహమ్" ఎన్గిఱార్. "అరఙ్గమాళి యెన్నాళి విణ్ణాళి" ఎన్ఱుమ్, "శ్రీరఙ్గనాథ మమ నాథ" ఎన్ఱుమ్ విశేషిత్తనుసన్ధిత్తార్కళ్. అఙ్గు స్వరూపమ్ శొల్లిఱ్ఱు, ఇఙ్గు స్తోత్రకరణయోగ్యతైక్కాక చ్చొల్లుకిఱతెన్నవుమామ్.

స్వరూపాన్ని తెలిపారు. ఇక్కడ స్తుతించడానికి యోగ్యతను తెలుపడంకోసం తిరిగి తమను "**దాసః**" అని చెబుతున్నారు- అని.

"**దాసః**" అనే పదంతో స్తుతించడానికిగల ఒక కారణాన్ని చెప్పారు. రెండవ కారణాన్నిగూర్చి తరువాత చెబుతున్నారు (**ప్రపన్నః**) అని అంటూ. (**త్వాం ప్రపన్నః అహం నిర్భయః స్తోష్యామి**) అని అన్వయించి అర్థం చెప్పాలి. గతి లేనివారికి గొప్ప గతిగా ఉండే నిన్ను వేఱే గతి లేనివాడనైన నేను రక్షకంగా విశ్వసించాను. నా ప్రాక్తన దోషాలను, నీ పూర్ణతను స్మరించి, ఆ పూర్ణతకు తగిన స్తుతి నీ వల్ల ఉత్పన్నం అయేటట్లు చేయడానికి కారణం అయిన నీ జ్ఞానశక్త్యాదిగుణాలను అనుసంధించి, నిర్భయంగా స్తుతిస్తున్నాను. "**వేఱి మాఱాద పూమేలిరుప్పాళ్ వినై తీర్క్కుమే**" (తిరువాయ్-4-5-4) (పరిమళం తగ్గని పూవుపై ఉండే లక్ష్మి పాపాలను తీరుస్తుంది) అనే రీతిలో "నీ దాసులకు ఉండే అడ్డంకులను అన్నిటినీ తొలగించగల్గినదానవు" అనేది అనుసంధించినపుడు నా ప్రాక్తన దోషాలకు భయపడనక్కఱలేదు. నీ విషయంలో ఆర్ద్రాపరాధినులై, రక్తసిక్తహస్తలై, వధార్హలై ఉండే రాక్షసస్త్రీలను కూడా "**పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ, కార్యం కరుణ మార్యేణ న కశ్చి న్నాపరాధ్యతి**" (వానరా ! పాపులైనా, పుణ్యం కలవారైనా, వధార్హులై ఉన్నవారివిషయంలో ఆర్యుడైనవాడు కరుణను చూపించాలి. అపరాధాన్ని చేయనివాడు ఎవడూ లేడు) అని హనుమంతుని సమాధానపఱచి, అతనిని తన దారికి వచ్చేటట్లు చేసి, అతనివద్దనుండి వారిని కాపాడి, "**తత స్సా హ్రీమతీ బాలా భర్తు ర్విజయహర్షితా, అవోచత్ యది తత్ తథ్యం భవేయం శరణం హి వః**" (లజ్జను కల్గినదై, భర్త జయాన్ని విని ఆనందాన్ని పొందినదైన ఆ సీతాదేవి "ఆ కల నిజమైతే మీకు నేను శరణం కాగలను" అని అన్నది) అనే

ద్వితీయహేతువై యరుళిచ్చెయ్‌కిఱార్ (ప్రపన్నః) ఎన్ఱు. (త్వాం ప్రపన్నోఽహం నిర్భయః స్తోష్యామి) అశరణ్యశరణ్యైయాన వున్నై అనన్యశరణనాన నాన్ శరణమ్బుకున్దేన్. ఎన్నుడైయ *పూర్వాపరాధఙ్గళైయుమ్, ఉన్నుడైయ పూర్తియైయుమ్ అనుసన్ధిత్తు, అప్పూర్తిక్కనురూప స్తోత్రకరణకారణ జ్ఞానశక్త్యాద్యనుసన్ధానత్తాలే నిర్భయనాయ్ స్తోత్రమ్ పణ్ణుకిఱేన్. "పూమేలిరుప్పాళ్ వినై తీర్‌క్కుమ్" ఎన్గిఱపడియే ఉన్నుడైయ ఆశ్రితవిరోధినిరసనానుసన్ధానత్తాలే ఎన్నుడైయ పూర్వాపరాధఙ్గళుక్కు అఞ్జవేణ్డువతిల్లై. ఆర్ద్రాపరాధైకళాయ్, వధార్హరాయిరుప్పారైయుమ్ "న కశ్చి న్నాఽపరాధ్యతి" ఎన్ఱు మఱుతలైత్తు మన్ఱాడి రక్షిప్పిత్తు, అవర్‌కళ్ భయమ్ శమిక్కుమ్బడి, "భవేయం శరణం

ప్రమాణానుసారం వారి భయం తీరేటట్లు నీవు వారికి అభయాన్ని ఇచ్చిన స్వభావాన్ని స్మరిస్తే నీ పరత్వాన్ని చూచి, దాసుడనైన నేను భయపడనక్కఱ లేదు. శ్రీ గుణరత్నకోశంలోని "**మాత ర్మైథిలి రాక్షసీ స్త్వయి తథైవార్ద్రాపరాధా స్త్వయా రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా**" ఇత్యాది 50వ శ్లోకానుసారం రక్తసిక్తహస్తలై, వధార్హలైన రాక్షసస్త్రీలనుకూడా రక్షించి, వారికి తల్లియై ఉండడంవల్ల కల్గిన వాత్సల్యంచేత ప్రవహించే, "**త్వత్ కరుణానిరీక్షణసుధా**" (చతుఃశ్లోకి-3) అని చెప్పబడే నీ కటాక్షంయొక్క గొప్పతనాన్ని అనుసంధిస్తే నా అజ్ఞానం, అశక్తి మొదలైనవానిని చూచి నేను భయపడనక్కరలేదు.

(**త్వాం ప్రపన్నోఽహం నిర్భయః**) - నిన్ను శరణం పొందిన నేను భయం తీరినవాడనయ్యాను. "**కాలేష్వపి చ సర్వేషు దిక్షు సర్వాసు చాచ్యుత, శరీరే చ గతౌ చాపి వర్ధతే మే మహద్భయమ్**" (జితంతే-1-9) (అచ్యుతా! అన్ని పుణ్యకాలాలలోను, అన్ని దిక్కులలో ఉండే పుణ్యక్షేత్రాలలోను, (ధర్మసాధనం అయిన) శరీరంలోను, శరీరాంతరగతిలోను, నాకు అధికమైన భయం కల్గుతున్నది) అనే రీతిలో మిగిలిన ఉపాయాలను ఆశ్రయిస్తేకదా భయపడాలి. నిన్ను ఆశ్రయించినవారికి భయం ఉన్నదా? (**త్వాం ప్రపన్నోఽహం నిర్భయః**) మోక్షానికి ఉపాయం-అని ప్రసిద్ధి చెందిన సర్వేశ్వరుని ఆశ్రయించినవాడనైతే, "**నచ్చరవిణై క్కిడన్ద నాద! పాదపోదినిల్ వైత్త శిన్దై వాఙ్గువిత్తు నీఙ్గ విక్క నీ ఇనమ్ మెయ్‌త్తన్ వల్లైయాదలాల్ అఱిన్దనన్ నిన్ మాయమే ఉయ్‌త్తు నిన్ మయక్కినిల్ మయక్కల్ ఎన్నై మాయనే**" (తిరుచ్చన్ద-85) (విషాన్నికల ఆదిశేషునిపై శయనించిన స్వామీ! నీ పాదపద్మంపై నిలిపిన మనస్సును దానినుండి తప్పించి, నన్ను వేఱే విషయాలపై లగ్నం చేసేటట్లు చేయగల సమర్థుడవని తెలిసికొన్నాను. ఆశ్చర్యకర

* "పూర్వ వృత్తఙ్గళైయుమ్" అని పాఠాంతరం.



హి వః" ఎన్ఱ ఉన్నుడైయ అభయప్రదానత్తినుడైయ నీర్మైయై అనుసన్ధిత్తాల్, ఉన్నుడైయ పూర్తిక్కఞ్జవేణ్డువతిల్లై. *"ఆర్ద్రాపరాధైకళాయ్" వధార్హా రాయిరుప్పారైయుమ్),* మాతృత్వప్రయుక్తమాన వాత్సల్యత్తాలే "త్వత్కరుణానిరీక్షణ సుధా" ఎన్నుమ్బడియాన ఉన్నుడైయ కటాక్షప్రభావత్తైయు మనుసన్ధిత్తాల్ ఎన్నుడైయ అజ్ఞానాశక్తికళుక్కు అఞ్జవేణ్డువతిల్లై.

(త్వాం ప్రపన్నోఽహం నిర్భయః) ఉపాయాన్తరఙ్గళై ప్పఠిఠినాలితే "వర్తతే మే మహ ద్భయమ్" ఎన్నుమ్బడి భయప్పడవేణ్డువతు. (త్వాం ప్రపన్నోఽహం నిర్భయః) ఉపాయభూతనాన ఈశ్వరనై ప్పనేనో? "వైత్త శిన్దై వాఙ్గువిత్తు నీఙ్గువిక్క" ఎన్నుమ్బడి అవనుడైయ స్వాతన్త్ర్యత్తై నినైత్తు అఞ్జుకైక్కు. పాపమే పచ్చైయాక వఙ్గీకరిత్తు, పారతన్త్ర్యైకవేషైయాయ్, భర్తావాన అవనైయుమ్ "త్రాహి త్రాహీతి" ఎన్ఱు ఘటిప్పిక్కవల్ల

చేష్టితాలను చేసే స్వామి! నన్ను నీ మాయలకు లోబడేటట్లు చేసి, ప్రాకృతశరీరాలలో ప్రవేశించనీయకు) అనే రీతిలో అతని స్వాతంత్ర్యాన్ని తలచి భయపడడానికి అవకాశం ఉన్నది. దాసుల దోషాన్నే ఉపహారంగా తలచి స్వీకరించి, భగవానునకు పరతంత్రగా ఉండడమే స్వభావంగా కల్గినదై, భర్త అయిన అతనినికూడ "**త్రాహి త్రాహీతి భర్తార ముపాచ దయయా విభుమ్**" (పాద్మపురాణం) (నాథుడైన భగవానుని ఉద్దేశించి (కాకాసురుణ్ణి) రక్షించు, రక్షించు- అని కృపతో సీతాదేవి పల్కింది) అనే ప్రమాణాన్నిబట్టి కోపాన్ని తీర్చి, అతనితో చేర్పించగలిగే సౌలభ్యాన్ని కల నిన్ను ఆశ్రయించిన నాకు, నా అడ్డంకులు తీరడానికి ఉపాయంగా నేను చేయవలసినది ఏదీ లేనందువల్ల, పొందదగిన ఉపేయంగా ఉండే నీ విషయంలో "**అహం శ్లోకకృత్**" (నేను శ్రీ మన్నారాయణుని విషయంగా ఉత్తమశ్లోకాలను రచించేవాణ్ణి) (తైత్తి. భృ. గు-10-6) అనే ప్రమాణానుసారంగా ముక్తాత్మలవలె నిన్ను అనుభవించడానికి పరీవాహరూపం అయిన శ్లోకాలను రచించి స్తుతిస్తాను-అని అంటున్నారు. (**త్వాం ప్రపన్నః**) నిన్ను శరణు పొందాను-అని అనడంవల్ల "**చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టా ముదారాం తాం పద్మనేమిం శరణు మహం ప్రపద్యే, అలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణే**" (శ్రీసూక్తం-5) (ఆనందస్వరూపిణి, మిక్కిలి ప్రకాశించేది, కీర్తితో వెలిగేది, భగవానునితో ఎల్లప్పుడు కూడి ఉండి, అతనిని సేవించేది, ఔదార్యాన్ని మిక్కిలిగా కల్గినది, పద్మంలో ఉండేది అయిన ఆ శ్రీదేవిని నేను శరణు పొందుతున్నాను. నా అశుభం తొలగుగాక. అందుకోసం నిన్ను నేను శరణు పొందుతున్నాను) అని శ్రీ

* ద్రావిడప్రతిలో ఈభాగం లేదు.

సౌలభ్యత్తైయుముడైయ ఉన్నై ప్పఱ్ఱిన వెనక్కు ఉపాయవిషయమాక కర్తవ్యాంశ మొన్ఱు మిల్లామైయాలే, ఉపేయభూతైయాన ఉన్ విషయత్తిల్ "అహంగ్ శ్లోకకృత్" ఎన్ఱు అనుభవ పరీవాహరూపమాన శ్లోకరచనైయే ప్పణ్ణి స్తుతిక్కిఱే నెన్గిఱార్. (త్వాం ప్రపన్నః) ఎన్గైయాలే, "తాం పద్మనేమిం శరణ మహం ప్రపద్యే" ఎన్గిఱ సూక్తార్థత్తై అనుష్ఠిత్తమై తోఱ్ఱుకిఱతు, ఇత్తై అడియొత్తియిఱే భాష్యకారరుమ్ "ప్రపద్యే" ఎన్ఱు పఱ్ఱిఱ్ఱు.

---

సూక్తంలో తన అశుభాలు తొలగడం కోసం పిరాట్టిని ఉపాయంగా ఆశ్రయించినట్లుగా చెప్పినట్లే వీరుకూడా స్తుతించడానికి అవరోధాలు తొలగడానికి ఉపాయంగా పిరాట్టిని ఆశ్రయిస్తున్నారు. దానిని అనుసరించికదా శ్రీ భాష్యకారులుకూడా శరణాగతిగద్యలో **"భగవన్నారాయణాభిమతానురూప . . . . . అశరణ్యశరణ్యా మనన్యశరణః శరణ మహం ప్రపద్యే"** అని పిరాట్టిని శరణు పొందారు.

ఈ విధంగా స్తుతిని ప్రారంభించేవారై, వేదంలో చెప్పిన రీతిలో స్తుతిస్తున్నారు. తర్వాత రెండు పదాలతో. **(లోకైకేశ్వరి లోకనాథదయితే)** అని. ఈ రెండు పదాలచేత **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (యజు–4-4-12) ( ఈ లోకానికి ఈశ్వరిగాను, విష్ణువునకు పత్నిగాను ఉన్నది) అనే వేదవాక్యంలో చెప్పబడ్డ అర్థం అనుసంధింపబడింది. దీనివల్ల విష్ణుపత్ని కాబట్టి ఈమె లోకానికి అంతటికీ ఈశ్వరిగా ఉన్నది–అని వ్యక్తమౌతున్నది. అతడు లోకైకేశ్వరుడు. అతని పత్ని కాబట్టి ఈమె లోకైకేశ్వరి. **"లోకైకేశ్వరః లోక్యతే ఇతి లోకః"** (ప్రమాణాలచేత తెలియబడుతున్నది కనుక లోకమని అనబడుతున్నది) అనే వ్యుత్పత్తిద్వారా ప్రమాణాలచేత తెలియబడే త్రివిధచేతనులకు అద్వితీయుడైన నియంత అని తెలుస్తున్నది. ఈశ్వరశబ్దం శ్రుతిస్మృతులలో చెప్పబడే సర్వశేషిత్వాన్ని (అందఱికి స్వామిగా ఉండే స్వభావాన్ని) చూపుతున్నది. **"ఈశ్వరశబ్దశ్చాత్రాంతర్నీతశేషిత్వం నియంతృత్వ మభిప్రైతి"** అని దేశికవ్యాఖ్య. **"పతిం విశ్వస్యాత్మేశ్వరమ్ . . .నారాయణమ్"** (తైత్తి.నారా–11) (లోకాలకు అన్నిటికీ పతి, తనకు తానే ఈశ్వరుడై ఉండేవాడు నారాయణుడే) అని సర్వశేషిత్వాన్ని, **"యద్వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య యః పర స్స మహేశ్వరః"** (తైత్తి–నారా–10-24) (వేదం ప్రారంభంలోను, చివరిలోను ఏ స్వరం ఉచ్చరింపబడుతున్నదో, తనకు కారణం అయిన అకారంలో ప్రతిష్ఠింపబడ్డ ఆ ఓంకారం అనే స్వరానికి అర్థంగా ఉండేవాడే మహేశ్వరుడు) అని, **"ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ, క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే, ఉత్తమః పురుషస్త్వన్యః**



ఆక, ఇప్పడి స్తోత్రత్తిలే ప్రవృత్తరాయ్క్కొణ్డు శ్రుతిచ్ఛాయైయాలే స్తోత్రమ్ పణ్ణుకిఱార్ (లోకైకేశ్వరి లోకనాథదయితే) ఎన్ఱు. ఇప్పదద్వయత్తాలుమ్ "అస్యేశానా జగతో విష్ణుపత్నీ" ఎన్గిఱ శ్రుత్యర్థమ్ సూచితమాయిఱ్ఱు. (లోకైకేశ్వరః) "లోక్యత ఇతి–లోకః" ఎన్గిఱ ప్రక్రియైయాలే ప్రమాణసిద్ధఙ్గళాన త్రివిధచేతనాఽచేతనఙ్గళుక్కుమ్ అద్వితీయనిర్వాహకన్. ఈశ్వరశబ్దమ్ శ్రుత్యాదికళిల్ ప్రతిపాదిక్కిఱ సర్వశేషిత్వత్తైయుమ్, "యః పర స్స మహేశ్వరః" ఎన్ఱుమ్, "యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః"

---

**పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః, యస్మాత్ క్షరమతీతోఽహ మక్షరా దపి చోత్తమః, అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః"** (క్షరుడని, అక్షరుడని లోకంలో పురుషులు రెండు విధాలైనవారు. అన్ని భూతాలు క్షరశబ్దవాచ్యులు. కూటస్థుడైన ముక్తాత్మ అక్షరశబ్దవాచ్యుడు. ఎవడు ముల్లోకాలలో ప్రవేశించి, వాటిని ధరించేవాడుగాను, ఏ కొఱత లేనివాడుగాను, నియమించేవాడుగాను, పరమాత్మ అని చెప్పబడేవాడుగాను ప్రకాశిస్తున్నాడో, ఆ పురుషోత్తముడు (పూర్వం చెప్పబడ్డ పురుషులిద్దరికంటె) విలక్షణుడు. నేను జ్ఞానంలో హెచ్చుతగ్గులున్న క్షరపురుషుని అతిక్రమించి ఉన్నందున, జ్ఞానంలో హెచ్చు తగ్గులు ఏమీ లేని ముక్తపురుషునికంటె గొప్పవానిగా ఉన్నందున, శ్రుతులలో, స్మృతులలో పురుషోత్తముడననే ప్రసిద్ధిని పొందాను) అనే గీతాప్రమాణాలలో స్పష్టంచేయబడ్డ సర్వనియంతృత్వాన్ని తైత్తిరీయనారాయణానువాకాలలోని వేదవాక్యాలు ప్రకటిస్తున్నాయికదా! ఈ విధంగా అందఱినీ నియమించే ఇతనిని నియమించడానికి వేఱొకడు లేడు–అనే విషయాన్ని పూర్వం ఉట్టంకింపబడ్డ నారాయణసూక్తవాక్యంలోని **"ఆత్మేశ్వరమ్"** (తనకు తానే ఈశ్వరుడు) అనే పదంచేతను, **"నాదనై ఞాలమ్ విఴుఙ్గుమ్ అనాదనై"** (తిరువిరు–79) (నాథుని, లోకాలను ఆరగించే తనకు ఏ నాథుడు లేనివానిని) అనే ద్రావిడవేదసూక్తిచేత చూపించబడిందికదా!

**(లోకైకేశ్వరః)** – అన్నపుడు "ఏక" శబ్దంచేత **"ఏక స్స్వతంత్రో జగతో బభూవ"** (లోకానికి ఒకే స్వతంత్రస్వామిగా ఉండేవాడు నారాయణుడు) అని, **"క్షరం ప్రధాన మమృతాక్షరం హరః క్షరాత్మానా వీశతే దేవ ఏకః"** (శ్వేతా–1-10) (క్షరమనేది ప్రకృతియే. అమృతం కాబట్టి అక్షర మనబడేవాడు జీవుడే. ప్రకృతి జీవులను ఒక దేవుడు నియమిస్తున్నాడు) అని, **"ఏకః శాస్తా న ద్వితీయోఽస్తి కశ్చిత్, యో హృచ్ఛయ స్త మహ మనుబ్రవీమి, తేనైవ యుక్తః ప్రవణాదివోదకం యథా నియుక్తోఽస్మి తథా**

ఎన్గుమ్ సర్వనియన్తృత్వత్తైయుమ్ నారాయణానువాకఙ్గళిలే ప్రతిపాదిత్తతిఱే. ఇప్పడి సర్వనియన్తావానవనుక్కు వేఱొరు నియన్తా విల్లై యెన్నుమత్తై "ఆత్మేశ్వరమ్" ఎన్గుమ్, "నాతనై ఞాలమ్ విౘఙ్గుమనాతనై" ఎన్గుమ్ ప్రతిపాదిత్తతిఱే.

(లోకైకేశ్వరః) ఎన్గవిడత్తిల్ ఏకశబ్దత్తాలే "ఏక స్స్వతన్త్రో జగతో బభూవ", "క్షరాత్మానా వీశతే దేవ ఏకః", "ఏక శ్శాస్తా న ద్వితీయోఽస్తి కశ్చిత్" ఇత్యాది ప్రమాణఙ్గళిలే సర్వనియన్తృత్వమ్ ఇవనుక్కే ఐకాన్తికమాక చ్చొల్లుకైయాలే,

---

**వహామి**" (భార-అశ్వ-27-1) (ఏ భగవానుడు హృదయంలో వేంచేసి ఉన్నాడో, అతనినిగూర్చి నేను పల్కుతున్నాను. నీరు పల్లంవైపు ప్రవహించేటట్లే, అతనితో చేరినవాడనై, అతడు ఏ రీతిలో నియమించాడో ఆ విధంగా కార్యాన్ని మోస్తున్నాను) మొదలైన శ్రుతి-స్మృతివాక్యాలలో అందఱినీ నియమించే స్వభావం ఇతనికి ఒక్కనికే ఉన్నట్లు చెప్పడంచేత లోకానికి అంతటికీ ఒకే నియంతగా ఉండేవాడు ఇతడు - అని చెప్పబడింది. "**ఈదృశేశ్వరపత్నీత్వా దిహ లోకైకేశ్వరీత్యుక్తమ్**" అని దేశిక భాష్యం. ఈ విధంగా సాటిలేని నియంతయొక్క పత్ని అయినందువల్ల "**లోకైకేశ్వరి**"-అని అంటున్నారు. ఈ పదంచేత "**ఈశానా దేవీ భువనస్యాధిపత్నీ**" (లోకానికి ఈశ్వరిగాను, సర్వాధికునకు పత్నిగాను ఉండేది) (యజు-కాఠ.-3-3), "**విశ్వస్య భర్త్రీ జగతః ప్రతిష్ఠా**" (యజు-కాఠ-3-3) లోకానికి స్వామినిగాను, ఆధారంగాను ఉండేది) అనే వేదవాక్యాల అర్థం తెలుపబడింది. ఈ పదానికి ఇంకొక రీతిలోకూడా అర్థాన్ని గ్రహించవచ్చు. (**లోకైకేశ్వరి**)- "**లోక**" శబ్దంచేత ప్రమాణాలద్వారా తెలియబడే భగవానుడు చెప్పబడడంవల్ల చిదచిదీశ్వరులనే త్రివిధతత్త్వాలను నియమించేది లోకైకేశ్వరి అని కూడా చెప్పవచ్చు. "**శ్రీవాసుదేవమహిషీ పుంప్రధానేశ్వరేశ్వరీ**" (లక్ష్మీసహస్ర-1) (శ్రీవాసుదేవుని మహిషి, చిత్- అచిత్- ఈశ్వరులనే తత్త్వత్రయానికి ఈశ్వరి) అని లక్ష్మీసహస్రనామంలోకూడా చెప్పబడింది. "**ఈశ్వరీం సర్వభూతానాం త్వామిహోపహ్వయే శ్రియమ్**" (శ్రీసూక్తమ్-9) (సర్వభూతాలకు ఈశ్వరియై, శ్రీదేవి అయిన నిన్ను ఇక్కడకు రమ్మని ఆహ్వానిస్తున్నాను) అనే శ్రీసూక్తప్రమాణం ఈమె సర్వభూతాలకు ఈశ్వరి అని చెప్పింది. సర్వభూతశబ్దానికి ఈశ్వరుడు తప్ప మిగిలిన భూతాలు-అని సంకోచించి అర్థం గ్రహించడానికి అవకాశం లేదు. "**శ్రీయతే ఇతి శ్రీః**" (అందరిచేత ఆశ్రయింపబడుతున్నది కనుక శ్రీః అనబడుతున్నది) అని శ్రీశబ్దానికిగల కర్మణివ్యుత్పత్తిద్వారా అర్థాన్ని గ్రహించినపుడు సర్వేశ్వరునితో పాటుగా అందఱిచేత



అద్వితీయనిర్వాహకత్వమ్ శొల్లుకిఱతు. ఇప్పడి అద్వితీయసర్వనిర్వాహకన్ పత్నియాకైయాలే (లోకైకేశ్వరి) ఎన్గిఱార్. ఇత్తాల్ "ఈశానా దేవీ భువనస్యాధిపత్నీ", "విశ్వస్య భర్త్రీ జగతః ప్రతిష్ఠా" ఎన్గిఱ శ్రుత్యర్థముమ్ సూచితమ్. అథవా, లోకశబ్దత్తాలే లోకసిద్ధమాన లోకనాథనైయుమ్ శొల్లి, తత్త్వత్రయనిర్వాహకై యెన్నవుమామ్. "పుంప్రధానేశ్వరేశ్వరీ" ఎన్నక్కడవతిఱే. "ఈశ్వరీం సర్వభూతానామ్" ఎన్గిఱవిడత్తిల్ సర్వశబ్దత్తుక్కు సఙ్కోచమిల్లామైయాలుమ్, కర్మణివ్యుత్పత్తియిల్ కర్తృసఙ్కోచ రాహిత్యత్తాలుమ్, "ఈశ్వరేశ్వరీ" ఎన్న త్తట్టిల్లైయిఱే. అవన్ పరమప్రణయియాకైయాలే

---

ఆశ్రయింపబడేది-అనే అర్థాన్ని గ్రహించవలసి ఉన్నది. అందువల్ల ఈశ్వరునకుకూడా ఈశ్వరి అని చెప్పడంలో అడ్డులేదు. అట్లయితే, ఇతనికి పరబ్రహ్మ అనే గొప్పతనమే లేకుండా పోయి, ఈమెకు ఆ అతిశయం వస్తుందే !- అని అంటే, రాదు. అతనికి కూడా ఈశ్వరి అని చెప్పడం అతడు ఈమెపట్ల గొప్ప అనురాగాన్ని కలవాడు కనుక ఈమెకు పరతంత్రుడై, ఈమె భ్రూభంగానుసారం కార్యాలను చేసేవాడై ఉంటాడు-అనే అర్థాన్ని గ్రహించాలి. అతడు ఈమెతోపాటుగా అందఱిలోను వ్యాపించి నియమించేవాడు. కనుక అతడే పరబ్రహ్మ. ఈమె అతనిని అనురాగంతో నియమిస్తుంది కాబట్టి ఈమె పరబ్రహ్మ కాదు. "**స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతాం సర్గోపసర్గస్థితీః స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః, యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలం క్రీడేయం ఖలు నాన్యథాఽస్య రసదా స్యాదైకరస్యాత్తయా**" (శ్రీస్తవమ్-1) (లోకాలను అన్నిటినీ సృష్టించి, రక్షించి, లయం చేసేటపుడు, స్వర్గనరకమోక్షాలను ప్రసాదించేటపుడు భగవానుడు ఎవరి తిరుముఖమండలాన్ని చూస్తూ, దాని ఇంగితాలకు వశమైనవాడై అన్ని కార్యాలను చేస్తాడో, ఆ పిరాట్టి మనకు శుభాలను ఇచ్చుగాక ! భగవానుడు ఆమెతో ఒకే అభిప్రాయాన్ని కలవాడై ఉన్నందున ఆమె ఇంగితాలకు అధీనుడై కార్యాలను చేయకపోయినట్లయితే ఆ కార్యాలు అతనికి ఆనందాన్ని కల్గించవు) అనే శ్రీస్తవంలోని మొదటి శ్లోకంలోను, "**ఐశ్వర్యం మహ దేవ వాల్ప మథవా దృశ్యేత పుంసాం హి యత్ తల్లక్ష్మ్యా స్సముదీక్షణా త్తవ యత స్సార్వత్రికం వర్తతే, తేనైతేన న విస్మయేమహి జగన్నాథోఽపి నారాయణః ధన్యం మన్యత ఈక్షణా త్తవ యత స్స్వాత్మాన మాత్మేశ్వరః**" (శ్రీస్తవమ్-6) (కొంచెంగా కాని, అధికంగా కాని అయిన ఏ సంపద ఈ లోకంలోనివారివద్ద కన్పిస్తున్నదో, అది శ్రీదేవి అయిన నీ కటాక్షం చేతనే అంతటా వెల్గుతున్నది. ఇందులో మేము ఆశ్చర్యపడడం లేదు. (ఎందుకంటే) జగన్నాథుడై,

ఇవళుక్కు నియామ్యనాయ్, భ్రుకుటీభటనాయితే యిరుప్పతు. "యస్యా వీక్ష్య", "జగన్నాథోఽపి" ఇత్యాది.

---

తనను తానే ఈశ్వరుడైన నారాయణుడుకూడా నీ కటాక్షంవల్ల తనను ధన్యునిగా తలుస్తున్నాడు) అనే శ్రీస్తవంలోని 6 వశ్లోకంలోను కూరేశులు భగవానుడు పిరాట్టియొక్క అనురాగానికి వశమైనవాడని అనుగ్రహించారుకదా !

ఈ విధంగా పిరాట్టితోపాటు అందఱికీ అంతర్యామి అయిన సర్వేశ్వరుడు కూడా ఈమెచేత నియమింపబడడానికి కారణం ఏది? అనే ప్రశ్నకు వీరే అనంతరం సమాధానాన్ని తెలుపుతున్నారు. **(లోకనాథదయితే)**– **"శక్కరత్తాన్ తణ్తుఴాయ్ త్తార్వాళ్ వరైమార్బన్ తాన్ ముయఞ్గుమ్ . . . . . పూమేల్ తిరు"** (మూన్ఱామ్. తిరు–100) (చక్రపాణి, చల్లని తులసీమాలను కల, పర్వతంవంటి వక్షస్సును కలవాడు, తాను సంశ్లేషించే .... పుష్పనివాసిని అయిన లక్ష్మి) అనే రీతిలో పిరాట్టితోపాటు అందఱిని నియమించేవాడై, అందఱికంటే అధికుడైన సర్వేశ్వరుడుకూడా ఈమెపట్ల గొప్ప అనురాగాన్ని కలవాడై, ఈమెకు వశుడై ఉండేటట్లుగా అతనికి దయితయై ఉంటుంది–అని భావం. "**దయితాశబ్ద ఇహ వల్లభత్వాభిప్రాయః సర్వభయాభయ హేతుభూతః సర్వేశ్వరోఽపి త్వదభిమతం నాతిక్రామతీతి భావః**" అని దేశికభాష్యం. ఈ వ్యాఖ్యలో భగవానుని లక్ష్మ్యధీనప్రాణనత్వాన్ని ఆశంకించి విస్తరంగా సమాధానింపబడింది. ఈ విధంగా గ్రహించకుండా, "**లోకైకేశ్వరి**" అని అతడు తప్ప మిగిలిన చేతనాచేతనాలకు అన్నిటికీ ఈమె ఈశ్వరిగా ఉండడానికి కారణం లోకనాథుడైన అతనికి దయితగా ఉండడమే–అని తెలుపుతున్నదని కూడా గ్రహించవచ్చు.

**(లోకనాథదయితే)** –"**రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమాహితా**" (రామా. బాల–1–26) (శ్రీరామునకు ప్రియపత్నిగాను, ఎల్లప్పుడు అతని ప్రాణాలవలె మంచిని చేసేదిగాను సీత ఉన్నది) అని ఈ పిరాట్టి అతనికి ప్రాణసమాన అని చెప్పబడిందికదా! తప్పులను చేసే చేతనులను, వారి వారి దోషాలకు తగినట్లు దండనను విధించే అడ్డులేని స్వాతంత్ర్యాన్ని కల ఈశ్వరునితో కలిపి కాపాడే పురుషకారభూతగా ఉంటుంది ఈమె. ఈమెకు ఈశ్వరునితో, అతనిచే నియమింపబడే జీవునితో గల అనాది అయిన సంబంధం, ఆ ఈశ్వరునకు పత్నిగా ఉండే సంబంధం ముఖ్యమైనవి. కాబట్టి, ఆ రెండు పదాలతో వాటిని చూపిస్తున్నారు. "**ఇవళ్ తాయాయ్, ఇవర్కళ్ క్లేశమ్ పొఱుక్కమాట్టాదే అవనుక్కు పత్నియాయ్, ఇనియ విషయమాయిరుక్కైయాలే**



ఇప్పడి సర్వనిర్వాహకనాన సర్వేశ్వరమ్ నియామ్యనాకైక్కు హేతు వెన్నెన్న, తదత్యన్తాభిమతైయాకైయాలే యెన్గిఱార్ (లోకనాథదయితే) ఎన్ఱు. "శక్కరత్తాన్–తణ్ తుఴాయ్త్తార్ వాళ్ వరైమార్బన్ తాన్ముయఞ్గుమ్" ఎన్గిఱపడియే సర్వనియన్తావాయ్, సర్వస్మాత్పరనాన సర్వేశ్వరనుమ్ అతివ్యాముగ్ధనాయ్, నియామ్యనామ్బడి, తద్వల్లభైయాయిరుక్కుమవళెన్గై. అథవా, "లోకైకేశ్వరి" ఎన్గిఱ లోకనియన్తృత్వత్తుక్కు హేతు–లోకనాథదయితైయాకైయాలే యెన్నవుమామ్.

(లోకనాథదయితే) "రామస్య దయితా భార్యా" ఎన్నక్కడవతిఱే. సాపరాధచేతనరై అపరాధానుగుణమాక దణ్డిక్కుమ్ నిరఙ్కుశస్వతన్త్రనాన ఈశ్వరనోడే ఘటిప్పిత్తు రక్షిప్పిక్కు మివళుక్కు, "ఇదమ్ప్రథమ" మిల్లాత ఈశేశితవ్యసమ్బన్ధముమ్,

---

**కణ్ణఴివఱ్ఱ పురుషకారమ్**" (ముముక్షుప్పడి–128) అని పరమప్రామాణికులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించారుకదా! ఈ విషయాన్నిగూర్చి వ్యాఖ్యానించే వేదాంతదేశికులు "**లోకైకేశ్వరః**" అని భగవానుడు నిర్దేశింపబడుతున్నాడని, అతని పత్ని కనుక ఈమె "**లోకైకేశ్వరి**" అవుతున్నదని అనుగ్రహించారు. కనుక ఇద్దఱు ముఖ్యోద్దేశ్యులు అనే అయిదవ పక్షాన్నివారు ఆదరించలేదు అని భావించవచ్చు – అని శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ అభిప్రాయం.

"మీరు మొదట స్తుతిని ప్రారంభించారు. నా పరత్వాన్ని చూచి వెనుకంజ వేశారు. "దాసుడను, ప్రపన్నుడను" అని నాతో సంబంధాన్ని చెప్పుకొంటూ, భగవానుని వశపఱచుకొనగల్గిన స్వభావాలు నా దగ్గర ఉండడాన్ని చూపుతూ స్తుతించడం ప్రారంభించారు. అయినా, నన్ను స్తుతించడానికి అడ్డు అయిన అజ్ఞానం మొదలైనవి తొలగి, స్తుతించడానికి తగిన జ్ఞానభక్తులు కలిగితేకదా మీ స్తుతిప్రయత్నానికి శోభ కల్గుతుంది. ఆ రెండూ లేవని వెనుకకు తగ్గిన మీరు ఇపుడు స్తుతిండానికి ఏం కారణం? అని పిరాట్టి అభిప్రాయంగా తలచి, "నా అజ్ఞానం మొదలైన వానిని తొలగించే పూర్ణమైన జ్ఞానాన్ని అనుగ్రహించే గొప్ప కరుణను నీవు నా విషయంలో చూపినందువల్ల నీ కరుణయొక్క మహిమను తెలిసికొని, భయం తీరి స్తుతిస్తున్నాను" అని అంటున్నారు తరువాత–"**దాంతే దయాం తే విదన్**" అని అంటూ.

ఈ విధంగా లక్ష్మీదేవి గొప్ప కరుణ లేకపోతే పూర్వం స్తుతించడానికి వెనుక తగ్గిన వీరు వెంటనే స్తుతించడానికి ప్రారంభించడం పొసగదుకదా ! "**బ్రహ్మాద్యా స్సకలా దేవా మునయ శ్చ తపోధనాః, త్వాం స్తోతు మపి నేశానాః త్వత్ప్రసాదలవం వినా**" (బ్రహ్మ మొదలైన దేవతలు తపోధనులైన మునులు అందఱు నీ అనుగ్రహలవం లేకపోతే

తత్పత్నీత్వసమ్బన్ధముమ్ ప్రధానమాకైయాలే, "లోకైకేశ్వరి లోకనాథదయితే" ఎన్ఱు ఉభయసమ్బన్ధత్తైయు మరుళిచ్చెయ్‌కిఱార్. "ఇవళ్ తాయాయ్" ఎన్ఱు తొడఙ్గి "అవనుక్కు ప్పత్నియాయ్" ఎన్ఱు సమ్బన్ధద్వయత్తైయు మరిళిచ్చెయ్‌తారిఱే అభియుక్తాగ్రేసరరాన పిళ్ళైలోకాచార్యరుమ్.

స్తోత్రత్తిల్ ప్రవృత్తరావతు, పరత్వానుసన్ధానత్తాలే నివృత్తరావతు, దాసనెన్బతు, ప్రపన్ననెన్బతు, సమ్బన్ధత్తై మున్నిడువతు, తద్వశీకరణసాధనమాన సౌలభ్యత్తై చ్చొల్లువతాయ్ క్కొణ్డు స్తోత్రత్తిలే ఉద్యుక్తరానాలుమ్, స్తోత్రవిరోధియాన అవిద్యాదికళ్ నశిత్తు స్తోత్రకరణసాధనజ్ఞానభక్తికళుణ్డానపోతిఱే స్తోత్రప్రవృత్తి సఫలమావతు, ఆనపిన్బు, అవై యిరణ్డు మిల్లై యెన్ఱు నివృత్తరాన నీర్ ఇప్పోతు ప్రవర్త్తిక్కైక్కు హేతు వెన్? ఎన్న,

---

నిన్ను స్తుతించలేరు) అనే ప్రమాణాన్నిబట్టి పిరాట్టి అనుగ్రహం లేకపోతే ఎవరివల్లకూడా ఈమెను స్తుతించడం సాధ్యం కాదు–అని చెప్పబడిందికదా ! ఈ విధంగా వీరి అతిశయం సిద్ధించడంకోసం "**దాంతే**" అనే పదంతో "**మయి**" "అనే పదాన్ని తెచ్చుకొని అర్థం చెప్పాలి, (**దాంతే మయి**) నీ కరుణను ఉద్బుద్ధం చేయగల దీనస్థితిలో ఉన్నవాడనై, ప్రపన్నుడను అయిన నా విషయంలో–అని భావం.

ఆ విధంగా కాకుండా, "**దాంతే**" అనే పదాన్ని పిరాట్టినిగూర్చిన సంబోధనగాకూడా గ్రహించవచ్చు. "కరుణామృతంతో పెరిగిన కల్పలతా" అని భావం. "**అనుకలతనుకాండాకల్పనారంభశుంభత్ ప్రతిదిశభుజశాఖ శ్రీసఖానోకహర్ధిః, స్తననయనగుళుచ్ఛస్ఫారపుష్పద్విరేఫా రచయతు మయి లక్ష్మీకల్పవల్లీ కటాక్షాన్**" (శ్రీ గుణ–3) (ప్రతిక్షణం లక్ష్మీదేవియొక్క లతవంటి తిరుమేనియొక్క ఆలింగనారంభంచేత నాల్గు దిక్కులలోను ప్రకాశించే భుజాలనే శాఖలను కల శ్రియఃపతి అనే వృక్షంయొక్క సంపదను కల్గినది, పూలగుత్తులవంటి స్తనతటాలను, వికసించిన పూలలోని తుమ్మెదలవంటి నేత్రాలను కల్గిన కల్పవృక్షంవంటి లక్ష్మి నా విషయంలో కటాక్షాలను కురియుగాక) అని, "**లక్ష్మీకల్పలతోత్తుంగస్తనస్తబక చంచలః, శ్రీరంగరాజ భృంగో మే రమతాం మానసాంబుజే**" (శ్రీరంగరాజస్తవమ్– 1–10) (పిరాట్టి అనే కల్పవృక్షంలో ఉండే ఉన్నతమైన స్తనతటాలనే పూలగుత్తులలో అటు ఇటు సంచరించే శ్రీ రంగనాథుడనే తుమ్మెద దాసుని మనస్సు అనే కమలంలో క్రీడించుగాక) అని భట్టర్ లక్ష్మీదేవిని కల్పకలతగా అనుగ్రహించారు. "**మలర్ వైకు కొడి**" (పెరియ తిరు– 8–7–8) (తామరపూవులో పొందికగా ఉండే తీగవలె సుకుమారం అయిన లక్ష్మి),



ఎన్నుడైయ అవిద్యాదినివర్తకమాయ్, జ్ఞానపూర్తిప్రదముమాన ప్రసాదవిశేషత్తై ఎన్బక్కలిలే పణ్ణియరుళుకైయాలే ఉన్నుడయ దయాప్రభావత్తై యఱిన్దు భయరహితనాయ్ స్తోత్రమ్బణ్ణుకిఱే నెన్గిఱార్ (దాన్తే దయాన్తే విదన్) ఎన్ఱు.

ఇప్పడి ఇవ్విశేషకటాక్షమిల్లాతపోతు కీళ్ నివృత్తరాన ఇవర్ ఉడనే స్తోత్రత్తిలే ప్రవృత్తిక్కక్కూడాతిఱే. "త్వాం స్తోతు మపి నేశానా స్త్వత్ప్రసాదలవం వినా" ఎన్ఱు తత్ప్రసాదత్తైయొళియ స్తోత్రమ్బణ్ణ క్షమనన్ఱెన్ఱతిఱే. ఆనపిన్బు ఇవర్ స్తోత్రమ్బణ్ణ వల్లరామ్బడి ఇవర్క్కు విశేషకటాక్షత్తై ప్పణ్ణినాళెన్గిఱ ఇవ్విశేషమ్ సిద్ధిక్కైక్కాక "దాన్తే మయి" ఎన్ఱు క్కూట్టిక్కొళ్వతు. (దాన్తే మయి) కృపోత్తమ్భకదీనావస్థావిశిష్టనాయ్, ప్రపన్ననాన ఎన్ విషయత్తిలే.

అథవా, (దాన్తే) ఎన్ఱు సమ్బుద్ధియాకవుమామ్. కరుణామృతసంవర్ధితైయాన కఱ్పకక్కొడియే. "లక్ష్మీకల్పవల్లీ", "లక్ష్మీకల్పలతా", "మలర్ వైకు కొడి,", "ఇన్నిళవఞ్జిక్కొడి,", "ఒరువల్లి త్తామరైయాళ్" ఎన్గిఱపడియే కనకకమలత్తిలుణ్డాన

---

"**ఇన్నిళవఞ్జిక్కొడి**" (పెరియ తిరుమడల్–78) (లేత ప్రబ్బలితీగ), "**ఒరువల్లి త్తామరైయాళ్**" (మూన్ఱామ్. తిరు. 16) (అందమైన రేకులను కల తామరపూవులో నివసించే లక్ష్మి) అనే రీతిలో బంగారంతో చేయబడ్డ ఒక తామరలో ఉండే కల్పవృక్షంవలె ఉంటూ, "**తూవియమ్ పుళ్ళుడై ద్దెయ్‌వవణ్డు తుదైన్ద వెమ్‌పెణ్మై**" (తిరువాయ్–9–9–4) (దివ్యమధుపం ఆస్వాదించిన నా స్త్రీత్వం) అనే రీతిలో లోకనాథుడనే తుమ్మెదచే భుజింపబడి, సొక్కిన తిరుమేనిని కలదానా!–అని భావం.

(**తే**) – తల్లియై ఉన్నందువల్ల కల్గిన వాత్సల్యంతో కూడిన నీయొక్క–అని భావం. (**తే దయామ్**)– "నీ కరుణ అని అంటూ భగవానుని కరుణకంటే గొప్పతనాన్ని తెలియజేస్తున్నారు. "**దేవ్యా కారుణ్యరూపయా**" (కరుణారూపిణి అయిన దేవిచేత) (లక్ష్మీతంత్రమ్–28–14) అనే రీతిలో కరుణమూర్తీభవించినదై. కరుణకంటే చాలా గొప్పది కదా !

(**తే దయామ్**)– చంపదగిన కాకాసురుని పాదాలపై పడేటట్లు చేసి, విభీషణుడు మొదలైనవారిని "శరణు" చెప్పిన తరువాతనే కాపాడిన శ్రీరాముని గోష్ఠిని–ఆర్ద్రాపరాధినులు, రక్తసిక్తహస్తలు అయిన రాక్షసస్త్రీలను చిత్రవధ చేయాలని ప్రయత్నించిన, వాక్చతురుడైన వాయుపుత్రునితో "**రాజసంశ్రయవశ్యానాం కుర్వంతీనాం పరాజ్ఞయా, విధేయానాం చ దాసీనాం కః కుప్యేత్ వానరోత్తమ**" (రామా. యుద్ధ. 16–38) (వానరశ్రేష్ఠా ! రాజుకు పరతంత్రలై, అతని ఆజ్ఞతో నన్ను బాధించేవారు, అతని వంశంలో

కల్పకలతైపోలే, లోకనాథనాన "తెయ్‌వవణ్డు తుతైన్ద వెమ్బెణ్మై" ఎన్నలామ్బడి తత్సంశ్లేషత్తాలే తువణ్డ వడివైయుడైయవళే !

(తే) మాతృత్వప్రయుక్తవాత్సల్యవిశిష్టయాన వున్నుడైయ. (తే దయామ్) ఎన్ఱు భగవత్కృపైయై వ్యావర్తిక్కిఱతు. భగవత్కారుణ్య త్తిలుమ్ అతిశయిత్తిఱే కారుణ్య రూపైయాన ఇవళ్ కరుణై యిరుప్పతు.

(తే దయామ్) వధార్హకాకాసుర- విభీషణాదికళై శరణోక్తికళ్ కైమ్ముతలాక రక్షిత్త కాకుత్థనుడైయ గోష్ఠియైయుమ్, ఆర్ద్రాపరాధైకళాన రాక్షసికళై చిత్రవధమ్బణ్ణత్తేడిన

ఉన్నవారు అయిన దాసీజనంవిషయంలో ఎవడు కోపపడతాడు?) అని పల్కి, "**పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ, కార్యం కరుణ మార్యేణ న కశ్చి న్నాపరాధ్యతి**" (రామా.యుద్ధ.-116-44) (వానరా ! పాపిష్ఠివారైనా, పుణ్యశాలురైనా, వధించతగినవారైనా, వారి విషయంలో గుణవంతుడైనవాడు కరుణను చూపాలి. అపరాధం చేయనివాడెవడైనా ఉన్నాడా?) అని పల్కి అతనిని అడ్డుకొని, అతనినికూడ తన దారిలోకి తెచ్చుకొని కాపాడిన నీ కరుణావైభవంవల్ల శ్రీరామగోష్ఠిని అధః కరించేటట్లుకదా, **"కరుణాసఖీ"** (క్షమాషోడశి) అన్నట్లు క్షమతో కూడి ఉండే కరుణే మూర్తిభవించిన నీ గొప్పతనం ఉన్నది. "**మాత ర్మైథిలి ! రాక్షసీ స్త్వయి తథైవార్ద్రాపరాధా స్త్వయా రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా, కాకం తం చ విభీషణం శరణ మిత్యుక్తిక్షమౌ రక్షతః సా న స్సాంద్రమహాగస స్సుఖయతు క్షాంతి స్తవాకస్మికీ**" (శ్రీ గుణ-50) (తల్లీ ! మైథిలీ! అపుడే అపరాధం చేసిన రాక్షసస్త్రీలను పవనసుతుని బారినుండి రక్షించిన నీచేత శరణు అన్న తరువాతనే కాకాసురుని, విభీషణుని రక్షించిన రాముని గోష్ఠి తక్కువగా చేయబడింది. అటువంటి నీ నిర్హేతుకకృప అనేది పరమపాపిష్ఠి వాళ్ళం అయిన మమ్ములనుకూడా ఆనందింపజేయాలి) అని భగవానుని కరుణ, క్షమ మొదలైనవానికంటె గొప్పతనంకల లక్ష్మీయొక్క , కరుణతో కూడిన, నిర్హేతుకం అయిన అతిశయాన్ని భట్టర్‌కూడా తమ విషయంలో ప్రవహించాలని ప్రార్థించారుకదా ! "**స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్, వధార్హ మపి కాకుత్థః కృపయా పర్యపాలయత్**" (రామా.సుందర-38-35) (భూమిపై పడ్డవాడు, శరణు పొందినవాడు అయిన ఆ కాకాసురుడు వధించ తగినవాడైనా, శరణ్యుడైన శ్రీరాముడు అతనిని తన కరుణతో రక్షించాడు) అని ఇతరులు పెట్టే మెతుకులను తిని బతికే కాకాసురునికూడా భగవానుడు కరుణతో కాపాడడానికి మూలకారణం ఈమె కరుణే అని అన్నది. "**త్రాహి త్రాహీతి భర్తార మువాచ దయయా విభుమ్**" (పాద్మపురాణమ్) ("రక్షించు, రక్షించు"



శొల్‌మిఱుజ్గనాన పవనాత్మజన్బక్కల్‌నిన్ఱుమ్ "పాపానాం వా శుభానాం వా" "రాజసంశ్రయవశ్యానాం కుర్వన్తీనాం పరాజ్ఞయా" ఎన్ఱుమ్ మఱుత్తు మన్ఱాడి రక్షిత్త వున్నుడైయ దయావైభవత్తాలే లఘూకరిక్కుమ్బడియాయన్ఱో "కరుణాసఖి"యాన క్షాన్తియిన్ ప్రభావ మిరుప్పతు. ఇప్పడి భగవత్కారుణ్యక్షాన్తికళిలుమ్ అతిశయితమాన పిరాట్టియినుడైయ "కరుణాసఖి" యాన వాకస్మికక్షాన్తియై "సాన్ద్రమహాగసః స్సుఖయతు" ఎన్ఱు భట్టర్ ప్రార్థిత్తరుళినారిఱే. ఇన్నముమ్ "కృపయా పర్యపాలయత్" ఎన్ఱు బలిభుక్కాన కాకత్తై రక్షిత్త కృపైక్కు మడి "త్రాహి త్రాహీతి భర్తార మువాచ దయయా విభుమ్"

అని అంటూ దయతో నాథుడైన భర్తతో సీతాదేవి పల్కింది) అని పాద్మపురాణం పల్కిందికదా! (**దయామ్**)- "**స్వాతంత్ర్యనిరపేక్షా పరదుఃఖాసహిష్ణుతా దయా**" (శ్రీభాష్యమ్) (తనకు ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా ఇతరుల దుఃఖాన్ని చూచి సహించలేకుండా ఉండడం దయ) అని శ్రీ భాష్యంలో నిర్వహింపబడ్డ కరుణ, "**దాసీనాం రావణస్యాహం మర్షయామీహ దుర్బలా**" ( రామా. యు-116-41) (వీరి కన్నీటిని చూడలేని దుర్బలను అయిన నేను రావణుని దాసీజనం అయిన వీరిని మన్నిస్తాను) అని నీచేతనే అనుష్ఠింపబడడాన్ని చూస్తున్నాముకదా.

(**విదన్**)- తెలిసినవాడనై. (నేను స్తుతిస్తున్నాను.) ఈ విధంగా కరుణలో సాటి వచ్చేవారు, మించినవారు ఎవరూ లేరని అన్ని ప్రమాణాలలోను పొగడబడిన, నీకరుణనే ధారకంగా కల్గినవాడను, నీచేత అనుగ్రహింపతగినవాడను, నన్ను విషయంగా చేసికొన్నది అయిన నీ కరుణలోని గొప్పతనాన్ని తెలిసినవాడనైన నేను స్తుతిస్తున్నాను-అని కలిపి అర్థాన్ని చెప్పాలి. "**దాంతే మయి**" అని పదాన్ని తెచ్చుకొని అర్థాన్ని చెప్పకుండా, "**దాంతే పురుషే తే దయాం విదన్**" అని సామాన్యం అయిన పుంలింగపదాన్ని తెచ్చుకొని అర్థాన్ని చెప్పవచ్చు. దీనులైన మానవుల విషయంలో నీ కరుణనే తెలిసినవాడను అయిన నేను-అని దీని భావం. అపుడుకూడా దీనపురుషులలో వీరుకూడా ఒకరేకదా ! ఈ విధంగా సామాన్యంగా అన్వయించి, అర్థం చెప్పడంవల్ల వీరినిగూర్చి పిరాట్టియొక్క కృపాతిశయం వ్యక్తం అవుతుంది. కనుక ఈ అర్థంలో వైలక్షణ్యం ఉన్నది. లేక, "**దాంతే**" అనే శబ్దం నమస్కరించినవానిని నిర్దేశిస్తుంది- అని కూడా చెప్పవచ్చు. కేవలం నమస్కరించినవాని విషయంలోకూడా అనుగ్రహించేదానవు నీవు-అని భావం. "**ధర్మనిత్యే మహాబుద్ధౌ బ్రహ్మణ్యే సత్యవాదిని, ప్రశ్రితే దానశీలే చ సదైవ నివసామ్యహమ్**" (ధర్మంలో ఎప్పుడూ అభినివేశాన్ని కలవాడు, గొప్ప బుద్ధిమంతుడు, బ్రహ్మజ్ఞుడు, సత్యవాది,

ఎన్నుమ్ ఉన్ దయైయిఱే. (దయామ్) "స్వార్థనిరపేక్షపరదుఃఖాఽసహిష్ణుతా దయా" ఎన్గి లక్షణలక్షితైయాన కృపై "మర్షయా మీహ దుర్బలా" ఎన్ఱ వున్నక్కళిలే అనుష్ఠాన శేషమాయన్ఱో విరుప్పతు.

(విదన్) ఇప్పడి సమాభ్యధికరహితైయాయ్, సర్వలోకప్రసిద్ధైయాయ్, త్వద్దయైక ధారకనాయ్, దయనీయనాన వెన్నై విషయీకరిత్త వున్ దయాప్రభావత్తై అఱియానిన్ఱుకొణ్డు "దాన్తే పురుషే తే దయాం విదన్" ఎన్ఱు సామాన్యమాక యోజిక్కవుమామ్. అప్పోతుమ్, అన్ద న్యాయమ్తమక్కు మొక్కుమిఱే. ఇప్పడి సామాన్యేన వరుమ్ అన్వయత్తిలుమ్ విశేషాన్వయత్తుక్కు విశేషప్రయోజన ముణ్డు. దాన్తశబ్దమ్ ప్రశితమాత్రపరమాకవుమామ్. "ధర్మనిత్యే మహాబుద్ధౌ బ్రహ్మణ్యే సత్యవాదిని, ప్రశ్రితే దానశీలే చ సదైవ నివసామ్యహమ్" ఎన్ఱు ప్రశ్రితనిదత్తిలుమ్ తనక్కుణ్డాన విశేషాభిమానత్తై స్వయమేవ అరుళిచ్చెయ్తాళిఱే.

---

నమస్కరించేవాడు, దానశీలుడు-అనే వీరివద్ద నేను ఎల్లప్పుడూ ఉంటాను) అని అంటూ నమస్కరించినవాని దగ్గర తనకు ఉండే గొప్ప ప్రేమను తానే వ్యక్తం చేసిందికదా !

**ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధాసంధుక్షణా ద్రక్ష్యతే**
**నష్టం ప్రాక్ స్తదలాభత స్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్ ।**
**శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే**
**సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥ 3 ॥**

ప్రతి:- తత్ అలాభతః=ఆ కటాక్షం పొందనందువల్ల, ప్రాక్ నష్టం=పూర్వం నశించిపోయిన, త్రిభువనం= ముల్లోకాలు, సంప్రతి=ఇపుడు, ఈషత్=కొంచెం, త్వత్ కరుణా నిరీక్షణసుధాసంధుక్షణాత్=నీ కరుణాకటాక్షం అనే అమృతవర్షం కురవడంవల్ల, అనంతోదయమ్=అంతులేని గొప్పతనాన్ని కలిగి ఉండేటట్లుగా, రక్ష్యతే= రక్షింపబడుతున్నది, నృణాం=మానవులకు, సంసృతి+అక్షర వైష్ణవ+ అధ్వసు= ఐశ్వర్య-కైవల్య - పరమపదాలలో, శ్రేయః=శ్రేయస్సు, అరవిందలోచన- మనః కాంతాప్రసాదాత్ ఋతే= పుండరీకాక్షుని మనస్సుకు ప్రియురాలు అయిన శ్రీదేవియొక్క అనుగ్రహంలేకుండా, కర్హిచిత్ న హి సంభావ్యతే=ఏనాడూ కలుగదుకదా

**అవతారిక** :- మొదటిశ్లోకంతో భగవానుడుతప్ప మిగిలిన అందఱికంటే మిన్నగా ఉండే లక్ష్మీదేవి గొప్పతనాన్ని అనుసంధించి, "**అమ్మాన్ ఆழிప్పిరాన్**" (తిరువాయ్-5-1-7) (స్వామి, చక్రధారి) అన్నట్లు అందఱికంటే గొప్పది అయిన ఆ



"లోకైకేశ్వరి లోకనాథదయితే, యస్యా స్తే నిరవధిం స్వతో నిత్యానుకూలం మహిమానం ప్రభు స్తద్వల్లభోఽపి ఆత్మన ఇవ ఇయత్తయా మాతుం నాలమ్, తాం త్వా మహం దాస ఇతి ప్రపన్న ఇతి చ దాంతే మయి తే దయాం విదన్ నిర్భయః స్తోష్యామీత్యన్వయః.

**3) అవ :-** ప్రథమశ్లోకత్తాలే పెరియపిరాట్టియారుడైయ సర్వోత్కర్షప్రకాశమాన పరత్వత్తై అనుసన్ధిత్తు, "అమ్మానాழிప్పిరాన్" ఎన్నాప్పోలే సర్వోత్కృష్టవిషయత్తై సర్వాఽపకృష్టనాన నాన్ స్తోత్రమ్బణ్ణుకైయావతెన్? ఎన్ఱు భీతరాయ్, "త్వాం వయం కథం బ్రూమః" ఎన్ఱు నివృత్తరానార్. ద్వితీయశ్లోకత్తాలే నివృత్తరాన తమ్ముడైయ స్తోత్రశ్రవణకౌతుకత్తాలే స్తోత్రవిరోధికళ్ నశిత్తు స్తోత్రకరణకారణజ్ఞానాదికళుణ్డామ్బడి కటాక్షిత్తు దయైయై పణ్ణి, అత్తై యఱిన్దు సమ్బన్ధజ్ఞానపూర్వకమాక శరణు మ్బుకున్దు, కీழ స్తోత్రారమ్భాక్షేప హేతువాక చ్చొన్న స్తోతవ్యగతోత్కర్షత్తై ముఖాన్తరేణ దృఢీకరియానిన్ఱుకొణ్డు, తదుపశ్లిష్టసౌలభ్యవిశేషత్తై యనుసన్ధిత్తు స్తోత్రగత దయనీయదశానురూపహేతువాలే స్తుత్యారమ్భసమాధానమ్ పణ్ణినార్. ఇప్పడి

---

పిరాట్టిని, అందఱికంటే అధముణ్ణి అయిన నేను స్తుతించడం ఏవిధంగా ? అని భయపడి, "నిన్ను మేము ఏ విధంగా స్తుతించగలం? అని వెనుకంజవేశారు. రెండవ శ్లోకంతో- వెనుకకు తగ్గిన తమ స్తుతిని వినడంలోని ఆసక్తిచేత, స్తుతికి అడ్డం అయిన వానిని పోగొట్టి, స్తుతించడానికి కారణాలు అయిన జ్ఞానం మొదలైనవి కలిగేటట్లు చేసిన పిరాట్టితో తమకు ఉన్న సంబంధాన్ని పురస్కరించుకొని, శరణు పొంది, మొదటి శ్లోకంలో స్తుతిని ప్రారంభించలేనందులకు కారణంగా చెప్పిన లక్ష్మీపరత్వాన్ని రెండు రీతులలో స్థిరీకరిస్తూ, ఆ పరత్వంతో కూడిన సౌలభ్యాన్ని అనుసంధించి, స్తుతించే తాము అనుగ్రహింపబడతగినవారైఉండడాన్ని తెలుపుతున్నట్లుగా సమాధానాన్ని చెప్పారు. ఆ విధంగా స్తుతిని ప్రారంభించడంలో ఆక్షేపాన్ని, దానికి సమాధానాన్ని తెలిపే నెపంతో పిరాట్టియొక్క పరత్వాన్ని, సౌలభ్యాన్ని అనుసంధించి, స్తుతించడం ప్రారంభించి, ఆమె అందఱిచేత ఆశ్రయింపబడతగినది-అని తెలుపడంకోసం ఆమె సకలపురుషార్థాలను ఇవ్వగల్గినది-అనే విషయాన్ని ఈ మూడవ శ్లోకంలో ఒక దృష్టాంతాన్ని చూపుతూ వివరిస్తున్నారు. **"ఏవం స్తుత్యాక్షేపసమాధానవ్యాజేన స్వామిత్వసౌలభ్యాదికం ప్రతిపాద్య స్తోతు ముపక్రాంతః సర్వాశ్రయణీయత్వాయ సకలపురుషార్థహేతుత్వ ముదాహరణ విశేషార్థాంతరన్యాసాభ్యా ముపపాదయతి"** అని దేశికవ్యాఖ్య.

స్తోత్రారమ్భాక్షేపసమాధానవ్యాజేన పిరాట్టియినుడైయ పరత్వ- సౌలభ్యజ్ఞళై అనుసన్ధిత్తు, స్తోత్రత్తిలే ఉపక్రమిత్తు, తత్సర్వసమాశ్రణీయత్వఖ్యాపనార్థమాక సకలపురుషార్థప్రదత్వత్తై ఉదాహరణసహితమాక ఉపపాదిక్కిఱార్ ఇతిల్ (ఈషత్త్వత్ ఇత్యాదియాలే).

“దాన్తే మయ తే దయాం విదన్ అహం నిర్భయః స్తోష్యామి” ఎన్ఱు నామ్ ఉమ్మై క్కటాక్షిత్తోమాకవుమ్, అత్తాలే ఉమ్ముడైయ అభిమతమ్ సిద్ధిత్తతాకవుమ్ శొన్నీర్. లోకత్తిలే చేతనర్క్కు ఇష్టానిష్టప్రాప్తిపరిహారఙ్గళుక్కు హేతుక్కళ్ అవ్వవరుడైయ పుణ్యపాపఙ్గళాయన్ఱో ఇరుప్పతు. ఆయిరుక్క, ఉమ్ముడైయ అభిమతమ్ నమ్ముడైయ కటాక్షత్తాలే సిద్ధిత్త తెన్నుమిడమ్ నమ్బక్కలిలే ఆదరాశతియత్తాలే శొన్నవిత్తనైయిఱే! యెన్న, “నాన్ ఒరువిషయత్తిల్ పక్షపాతత్తాలే శొల్లుకిఱేనల్లేన్. వస్తుస్థితియై ఆరాయ్న్దు పార్త్తవిడత్తిల్ త్రిక్షణాఽవస్థాయియాయ్ నశిత్తప్పోకిఱ పుణ్యపాపఙ్గళ్ మూర్తీకరిత్తిరున్దు ఫలప్రదమాకిఱనవల్లవిఱే, “పుణ్యాపుణ్యా వీశ్వరప్రీతికోపౌ” ఎన్గిఱపడియే “తున్బ విన్బ

---

గత శ్లోకంలో “**దాంతే మయి తే దయాం విదన్ అహం నిర్భయః స్తోష్యామి**” అని చెప్పిన విషయాన్ని విన్న పిరాట్టి, “బాధపడతగిన స్థితిలో ఉండే నా విషయంలో నీకు ఉన్న అనుగ్రహాన్ని తెలిసికొన్న నేను భయం తీరినవాడనై, స్తుతిస్తున్నాను” అని నేను మిమ్ములను కటాక్షించినట్లు, అందువల్ల మీ ఆశ నెఱవేరినట్లు పలికారు. లోకంలో ఆశించినది లభించకపోవడానికి, ఆశించనిది సంభవించడానికి వారి వారి పాపాలేకదా కారణంగా ఉంటాయి. ఆ విధంగా ఉండగా, మీ ఆశ నా కటాక్షంవల్ల సిద్ధించింది-అని చెప్పడం నా విషయంలోగల పక్షపాతంవల్లనే కదా” అని అనుకున్నట్లు భావించి. “నేను ఎవరి విషయంలోను పక్షపాతంతో చెప్పలేదు. వాస్తవస్థితిని గమనించి చూస్తే మూడు క్షణాలు మాత్రమే నిలిచేవై, వెంటనే నశించి పోయే పుణ్యపాపరూపకర్మలు ఒక రూపాన్ని దాల్చి నిలిచి, ఫలాన్ని ఇవ్వలేవు కదా ! “**పుణ్యాపుణ్యా వీశ్వరప్రీతికోపౌ**” (పుణ్యం, పాపం అనేవి క్రమంగా ఈశ్వరుని ప్రీతికోపాలే) అనే రీతిలో “**తున్బ ఇన్బ వినైకళ్**” (తిరువాయ్ -3-6-8) (సుఖదుఃఖాలకు కారణమైన కర్మలు) అని చెప్పబడే పుణ్యపాపాలను శాసించే భగవానుని ప్రీతి, కోపాలు ఆశించినవి, ఆశించనివి కూడా సంభవించడానికి కారణాలు. అయితే, అతని అనుగ్రహానికి కారణం నీ కటాక్షం, అతని నిగ్రహానికి కారణం నీ కటాక్షాభావం. అందువల్ల చేతనులందఱి నైచ్యానికి, ఔన్నత్యానికి కారణం క్రమంగా నీ కటాక్షరాహిత్యం, నీ కటాక్షం కల్గడమే. నా ఆశ నెఱవేరడానికిమాత్రమే కాకుండా చేతనులందఱికీ ఐశ్వర్యం మొదలైన పురుషార్థాలవల్ల



వినైకళుక్కు” నిర్వాహకనాన ఈశ్వరనుడైయ ప్రియాఽప్రియఙ్గళే అభిమతాఽనభిమతసిద్ధికళుక్కు హేతుక్కళ్. అవనుడైయ కోపప్రసాదఙ్గళుక్కు మడి ఉన్నుడైయ కటాక్షతదభావఙ్గళాకైయాలే, సకలచేతనరుడైయ అనర్థాభ్యుదయఙ్గళుక్కు హేతు ఉన్నుడైయ కరుణాకటాక్షలాక్షాలాభఙ్గళాయిరుక్కుమ్. ఆనవిన్బు, ఎన్నుడైయ అభిమతసిద్ధిక్కేయన్ఱిక్కే, సకలచేతనర్క్కుమ్ ఐశ్వర్యాదికళాల్ శ్రేయస్సు ఉన్నుడైయ ప్రసాదతాలల్లతు సమ్భవియాతిఱే” ఎన్ఱు తత్పురుషార్థప్రదత్వత్తై సోదాహరణమాక ప్రతిపాదిక్కిఱార్ (ఈషత్) ఇత్యాది శ్లోకత్తాలే.

**వ్యాఖ్యానమ్ :** పిరాట్టియినుడైయ అనుగ్రహైకదేశమే అనన్తానిష్టనివృత్తిక్కుమ్, అనన్తాభ్యుదయసిద్ధిక్కుమ్ నిదానమెన్గిఱ విశేషద్యోతనార్థమాక (ఈషత్) ఎన్గిఱార్.

---

గొప్పతనం కల్గడం నీ అనుగ్రహం లేకపోతే సిద్ధించదు.” అని పిరాట్టి అన్ని పురుషార్థాలను ఇస్తుంది అనే విషయాన్ని సదృష్టాంతంగా ఈ మూడవశ్లోకంలో వివరిస్తున్నారు.

**వ్యాఖ్యానం** :- పిరాట్టి కొంచెం అనుగ్రహిస్తే, అది అంతులేని అనిష్టాలు తీరడానికి, అంతులేని అతిశయాలు సిద్ధించడానికి కారణం ఔతుంది-అని తెలుపడం కోసం “**ఈషత్**” అని అంటున్నారు. చాలా కొంచెం అని దీని అర్థం. “**బ్రహ్మాద్యా స్సకలా దేవా మునయ శ్చ తపోధనాః, త్వాం స్తోతు మపి నేశానా స్త్వత్ప్రసాదలవం వినా**” (బ్రహ్మాది సకలదేవతలు, తపస్సునే ధనంగాకల మునులుకూడా నీ అనుగ్రహం ఏ కొంచెం అయినా ఉంటే తప్ప నిన్ను స్తుతించలేరు) అనే ప్రమాణంలో “**త్వత్ప్రసాదలవమ్**” అని చెప్పబడడాన్ని సూచిస్తున్నారు. (**త్వత్**) - అనే పదంతో. “**ప్రణిపాతప్రసన్నా**” (రామా.సుంద- 27-45) అనే రీతిలో నమస్కరించివారిని అనుగ్రహించేది, “**సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీమ్, క్షిప్రప్రసాదినీమ్ దేవీం శరణ్యాం చింతయే దితి**” (అన్ని కోఱికలను, ఇచ్చేది, అందమైనది, సంసారసాగరాన్ని దాటించేది, త్వరగా అనుగ్రహించేది, అయిన లక్ష్మిని ఈ రీతిలో శరణు పొందదగినదిగా భావించాలి) (స్వాయంభువమ్) అనే రీతిలో శీఘ్రంగా అనుగ్రహించేది అయిన పిరాట్టియొక్క వైలక్షణ్యం తెలుపబడుతున్నది. ఇందువల్ల, అనుగ్రహం-ఆగ్రహం అనే రెండిటిని చూపే భగవానునివలె కాకుండా, ఈమె అనుగ్రహాన్నిమాత్రమే సహజంగా కల్గినది-అనే ఈమె అతిశయం చెప్పబడింది. “**పద్మే స్థితా పద్మవర్ణా పద్మనాభప్రియా శుభా, సదాఽనుగ్రహసంపన్నా సా దేవీ మే ప్రసీదతు**” (మంకణసంహిత)- (పద్మంలో ఉండేది, పద్మవర్ణాన్ని కల్గినది, పద్మనాభునకు

"త్వత్ప్రసాదలవం వినా". ఎన్గతిఱే. త్వచ్ఛబ్దత్తాలే "ప్రణిపాతప్రసన్నై" యాయ్, "క్షిప్రప్రసాదిని" యామ్బడియాన అసాధారణస్వభావమ్ సూచిక్కప్పడుకిఱతు, ఇత్తాల్, నిగ్రహాఽనుగ్రహస్వభావనాన ఈశ్వరనిలే వ్యావృత్తమాన అనుగ్రహైకస్వభావమ్ శొల్లప్పట్టతు. "పద్మే స్థితా పద్మవర్ణా పద్మనాభప్రియా శుభా, పద్మానుగ్రహసంపన్నా సా దేవీ మే ప్రసీదతు" ఎన్నుమ్, "అనుగ్రహపరా మృద్ధి మనఘాం హరివల్లభామ్", నమామి కమలాం కాంతాం క్షమాం క్షీరోద సంభవామ్" ఎన్నుమ్ అనుగ్రహైక స్వభావత్వమ్ శొల్లప్పట్టదిఱే.

(ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధాసన్ధుక్షణాత్) ఉన్నుడైయ అనిష్టనివర్తనేష్టప్రాపణాఽనుగుణమాన కరుణైయై హేతువాకవుడైత్తాన కటాక్షలేశామృతోద్రేకత్తాలే. (నిరీక్షణమ్) కరుణాహేతుకనిరీక్షణమ్. కరుణయావిషయీకరణమ్. నిరీక్షణశబ్దత్తాలే

---

ప్రియమైనది, మంగళాకార అయినది, ఎల్లప్పుడు కరుణ నిండినది అయిన ఆ దేవి నాకు అనుగ్రహించాలి) అని, "**అనుగ్రహపరామ్ బుద్ధిమ్ అనఘాం హరివల్లభామ్ నమామి కమలాం కాంతాం క్షమాం క్షీరోద- సంభవామ్**" (లక్ష్మ్యష్టోత్తరమ్-4) (అనుగ్రహం నిండి ఉన్నది, సంపదగా ఉండేది, పాపం లేనిది, హరికి ప్రియమైనది, కమల అని చెప్పబడేది, కాంత అని చెప్పబడేది, ఓర్పును కల్గినది, పాలకడలినుండి ఉద్భవించినది అయిన లక్ష్మిని నమస్కరిస్తున్నాను) అని "ఈమె కరుణనే సహజంగా కల్గినది" అని ఘోషింపబడుతున్నదికదా!

(**ఈషత్ త్వత్ కరుణానిరీక్షణ సుధాసంధుక్షణాత్**) - "నీ కటాక్షలేశం అనే అమృతవర్షంచేత అపూర్వకృత్యాలు సంభవిస్తున్నవి" అని అనంతరం చెప్పబోతారు. ఆ కటాక్షలేశం దాసుల అనిష్టాలను పోగొట్టి, ఇష్టాలను అనుగ్రహించడానికి కరుణ కారణం అవుతున్నది - అని అంటున్నారు. (**కరుణానిరీక్షణ**)-కరుణ కారణంగా గల కటాక్షం-అని అర్థం. లేక, కరుణకు లక్ష్యంగా చేయడం నిరీక్షణశబ్దంచేత ఔపచారిక ప్రక్రియలో చెప్పబడిందనికూడా గ్రహించవచ్చు. "**కరుణయా విషయీకరణం వా నిరీక్షణ శబ్దేనోపచర్యతే**" అని దేశికవ్యాఖ్య. కరుణచేత ప్రేరేపించబడికదా కటాక్షం పుడుతుంది, "**దేవరాజ దయాసింధో దేవదేవ జగత్పతే, త్వదీక్షణసుధాసింధువీచి విక్షేపశీకరైః, కారుణ్య మారుతానీతైః శీతలై రభిషించ మామ్**" (తిరుక్కచ్చినంబి దేవరాజాష్టకం-8) (వరదరాజా! కరుణాసముద్రా! దేవదేవా! జగత్పతీ! దుఖాలను తీర్చే నీ దాసుని కారుణ్యం అనే వాయువుచే కొనిరాబడేవి, చల్లనివి అయిన నీ కటాక్షామృతసముద్రంలోని కెఱటాల



ఉపచరిక్కిఱతావుకవుమామ్. కరుణాప్రేరితమాయిఱే నిరీక్షణ ముణ్డావతు. "కారుణ్యమారుతానీతైః" ఎన్గదితే. (నిరీక్షణసుధాసంధుక్షణాత్) "త్వదీక్షణసుధాసిన్ధువీచి-విక్షేపశీకరైః" ఎన్గిఱపడియే కటాక్షామృతవృష్టికళాలే-యెన్గై, ఏఎవమ్భూతకటాక్షన్దాన్ సకలాత్మసఞ్జీవనమా యిరుక్కైయాలే సుధైయాక నిరూపిక్కిఱార్. సుధైయాలుణ్డాన సమ్యగుల్లాసనత్తాలే. కటాక్షవిక్షేపత్తాలే యెన్గై. (రక్ష్యతే) ఉపద్రవరహితమాక స్థాపిక్కప్పడుకిఱతు.

(ప్రాక్) ఉన్నుడైయ వుపేక్షాకాలత్తిలే. (తదలాభతః) ఉన్నుడైయ నిరీక్షణా లాభత్తాలల్లతు, ఉన్నుడైయ కోపత్తాలన్ఱిఱే. "కః కుప్యే ద్వానరోత్తమ" ఎన్ను

---

తుంపురులతో నన్ను తడపాలి) అనే ప్రమాణంలో "**కారుణ్యమారుతానీతైః**" (కరుణ అనే గాలిచే తీసికొని రాబడే కటాక్షం) అని చెప్పబడిందికదా. (**నిరీక్షణసుధాసంధుక్షణాత్**)- ఇంతకుముందు ఉట్టంకించిన దేవరాజాష్టకప్రమాణంలో అనుగ్రహించిన రీతిలో "నీ కటాక్షం అనే అమృతసముద్రంలోని చూపులనే అలల తుంపురులవల్ల"- అని భావం. ఈ కటాక్షం ఆత్మలను అన్నిటినీ ఉజ్జీవింపచేసేది కాబట్టి దానిని అమృతంగా రూపిస్తున్నారు. "**సుధాసంధుక్షణాత్**" అంటే ఆ అమృతంయొక్క చక్కని వర్షంతో-అని అర్థం. కటాక్షం పడినందువల్ల-అని తాత్పర్యం. (**రక్ష్యతే**)- హాని కలుగకుండా కాపాడబడుతన్నది. శ్లోకంలోని మిగిలినభాగంతో ఇది వివరింపబడుతున్నది,

(**ప్రాక్**) నీవు కటాక్షించనపుడు, (**తదలాభతః**)- ఆ కటాక్షం లభించనందున- అని అర్థం. "**రాజసంశ్రయవశ్యానాం కుర్వంతీనాం పరాజ్ఞయా, విధేయానాం చ దాసీనాం కః కుప్యేత్ వానరోత్తమ**" (రామా.సుందర-116-38) (వానరశ్రేష్ఠా ! ప్రభువుకు పరతంత్రలు, అతని ఆజ్ఞవల్ల నాకు బాధను కల్గిస్తున్నవారు, అతని వశంలో ఉన్నవారు అయిన రాక్షసి దాసీజనుల విషయంలో ఎవడు కోపిస్తాడు ?) అనే రీతిలో వాక్చతురుడైన హనుమంతునకు నీకు కోపం తగదు-అని ఉపదేశించే లక్ష్మికి కోపం కలిగే అవకాశం లేనందువల్ల, "**తదలాభతః**" అనే పదం కోపాన్ని సూచించదు. తాత్కాలికంగా కటాక్షంయొక్క లేమినే సూచిస్తుంది. (**నష్టమ్**)- ఇంచు మించుగా నశించి ఉండగా. (**త్రిభువనమ్**)- ముల్లోకాలలో ఉండే జీవులందఱు. "**మంచాః క్రోశంతి**" (పడుకలు రోదిస్తున్నవి) అని అంటే పడుకలలోని బిడ్డలు రోదిస్తున్నారని అర్థం అయినట్లే, "**త్రిభువనమ్**" అనే పదం ముల్లోకాలలో ఉండే చేతనులను అందఱినీ లక్షిస్తుంది.

(**సంప్రతి**)- నీ కటాక్షవీక్షణానికి ఒక క్షణం లక్ష్యం కాని ఇపుడున్న స్థితిలో.

శౌల్మిఱుజ్గనుక్కుమ్ ఉపదేశిక్కిఱ వునక్కు కోపముణ్డాక సమ్భావనై యిల్లైయితే. (నష్టమ్) వినష్టప్రాయమాన. (త్రిభువనమ్) ఇత్తాల్, త్రైలోక్యాన్తర్వర్తియాన సకలలోకజ్గళైయుమ్ ఉపలక్షిక్కిఱతు."మఞ్చాః క్రోశన్తి" ఇతివత్.

(సమ్ప్రతి) ఉన్నుడైయ "కటాక్షవీక్షాక్షణలక్ష్య"మాన దశైయిలే. (అనన్తోదయమ్) యథా భవతి, పూర్వకాలత్తిలుమ్ అతిశయితాభ్యుదయమామ్బడి. (రక్ష్యతే) ప్రాక్ తదలాభతో నష్టం త్రిభువనం సమ్ప్రతి ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధాసన్ధుక్షణాత్ అనన్తోదయం రక్ష్యతే.

దుర్వాసశ్శాపత్తాలే నిఃశ్రీకమామ్బడి భువనత్రయత్తైయుమ్ పరిత్యజిత్తు పయోదధియిలే పిరాట్టి యెఴున్దరుళిపోతు తత్కటాక్షాభావత్తాలే "అస న్నేవ" ఎన్నుమ్బడి

---

**(అనంతోదయం యథా భవతి)** ముందున్నదానికంటె ఎక్కువ అతిశయం కల్గి ఉండేటట్లుగా. **(రక్ష్యతే)**- ఇంతకుముందు ఆ కటాక్షం లభించినందున ఇంచుమించుగా నశించిన ముల్లోకాలు ఇపుడు నీ కరుణాకటాక్షానికి కొంచెం లక్ష్యం కాగానే ఇంతకుముందుకంటే ఎక్కువ గొప్పతనం కల్గి ఉండేటట్లు కాపాడబడుతున్నవి.

దీనికి రెండు విధాలైన అర్థాలు చెప్పవచ్చు. దుర్వాసముని శాపవశంచేత నశించి పోయిన ముల్లోకాలు లక్ష్మీకటాక్షంచేత కాపాడబడిన వృత్తాంతాన్ని తెలిపే అర్థం మొదట వివరింపబడుతున్నది. దుర్వాసుని శాపంచే సంపద నశించేటట్లు ముల్లోకాలను విడచి, క్షీరాబ్ధిలోనికి లక్ష్మి వెడలినపుడు ఆమె కటాక్షం లేకపోవడంవల్ల "**అసన్నేవ**" అన్నట్లు అసత్ప్రాయంగా పడి ఉన్న ఆ ముల్లోకాలు "**క్షీరోదా చ్ఛ్రీ సముత్పన్నా శ్రూయతేఽమృతమంథనే, భృగోః ఖ్యాత్యాం సముత్పన్నేత్యేతదాహ కథం భవాన్**" (విష్ణుపు-1-8-16) (అమృతమథనకాలంలో క్షీరాబ్ధినుండి లక్ష్మి అవతరించిందని వినబడుతున్నది. భృగువుకు ఖ్యాతి అనే భార్యవల్ల లక్ష్మి ఉద్భవించిందని మీరు ఎందుకని చెబుతున్నారు ?) అని, "**శెఴుజ్కడల్ అముదినిల్ పిఱన్ద అవళుమ్**" (పెరియతిరు-2-7-1) (నిబిడమైన సముద్రంలో అవతరించిన లక్ష్మి), "**అముదిల్ వరుమ్ పెణ్ణముదు**" (పెరియతిరు -6-1-2) (అమృతంకంటే అరుదైన లక్ష్మి అనే అమృతం) అనే రీతిలో అమృతం కోసం క్షీరాబ్ధిని చిలికినపుడు లక్ష్మి అందులోనుండి ఉద్భవించి, "**దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణభూషితా, పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః**" (విష్ణుపు-1-9-105) (స్నానం చేసినది, దివ్యమైన మాలికలను, వస్త్రాలను ధరించినది, ఆభరణాలచే అలంకరింపబడినది అయిన లక్ష్మి దేవతలంతా



నష్టమాన త్రిభువనమ్, పిన్బు "క్షీరోదా చ్ఛ్రీ స్సముత్పన్నా శ్రూయతేఽమృతమన్థనే", "శెఴుజ్గడలముతిని ఱ్పిఱన్ద వవళుమ్" ఎన్నుమ్బడి "అముతిల్ వరుమ్ పెణ్డముతాయ్" అవతరిత్తు, "దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణభూషితా, పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలమ్'' ఎన్గిఱపడియే స్నాతైయాయ్, మహార్హవసనైయాయ్, చిత్రమాల్యానులేపైయాయ్క్కొణ్డు "తికఴ్కిన్ఱ తిరుమార్బిలే" శేర్న్దు, "అకిలకిల్లే" నిఱ్ఱైయుమ్" ఎన్ఱు తిరుక్కలన్దు సంశ్లేషిత్తవనన్తరమ్, తన్నుడైయ కారుణ్యశీతలకటాక్షసుధా వర్షత్తాలే వఴియవార్క్క, అనన్తరమ్, అత్తాలే సత్తై పెఱ్ఱు సమృద్ధమానపడియై ఇశ్శ్లోకత్తిలే అరుళిచ్చెయ్కిఱార్. "త్వయా దేవి పరిత్యక్తం సకలం భువనత్రయమ్, వినష్టప్రాయ మభవత్, త్వయేదానీం సనాధితమ్" ఎన్ఱు ఇవ్వర్థమ్ ఇన్ద్రనాలే శొల్లప్పట్టతిఱే. ఇప్పడి అన్వయవ్యతిరేకజ్గళాలే బ్రహ్మేన్ద్రప్రభృతిచేతనరుడైయ వైశ్వర్యమ్ పిరాట్టియినుడైయ

---

చూస్తుండగానే భగవానుని వక్షఃస్థలాన్ని చేరింది) అనే రీతిలో స్నానాన్ని చేసినదై, గొప్ప వస్త్రాలను ధరించినదై, అద్భుతమైన పూమాలికలను, ఆభరణాలను అలంకరించుకొన్నదై, భగవానుని "**తికఴ్కిన్ఱ తిరుమార్బు**" (తిరువాయ్-10-6-9) (ప్రకాశించే వక్షఃస్థలం) అనే రీతిలో క్షణంకూడా విశ్లేషించలేనట్లు, స్థిరంగా సంశ్లేషించిన తర్వాత తన కరుణతో చల్లగా ఉండే కటాక్షం అనే అమృతవర్షంతో ఈ ముల్లోకాలను తడిపింది. వెంటనే, సత్తను పొంది ముల్లోకాలు సంపత్సమృద్ధిని పొందిన తీరు ఈ శ్లోకంలో అనుగ్రహిస్తున్నారు- అనేది మొదటి అర్థం. "**త్వయా దేవి పరిత్యక్తం సకలం భువనత్రయమ్, వినష్టప్రాయ మభవత్ త్వయేదానీం సమేధితమ్**'' (విష్ణు. పు-1-9-122) ( దేవీ ! నీచే విడువబడ్డ ముల్లోకాలు మొత్తం నశించి పోయాయి. ఇపుడు నీ కరుణచేత ఉజ్జీవించాయి) అని ఈ అర్థం ఇంద్రునిచేత చెప్పబడిందికదా ! ఈ విధంగా బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన చేతనుల సంపద లక్ష్మీకటాక్షం ఉన్నపుడు అతిశయాన్ని పొందింది. అది లేనపుడు నశించింది-అని ఈ శ్లోకంలోని పూర్వార్ధంతో తెలిపారు. "**బ్రహ్మాద్యా శ్చ సురా స్సర్వే మునయ శ్చ తపోధనాః, ఏధంతే త్వత్పదచ్ఛాయా మాశ్రిత్య కమలేశ్వరి**" (కాశ్యపీయమ్) (కమలేశ్వరీ! బ్రహ్మ మొదలైన సకలదేవతలు, తపోధనులైన మునులందఱూ నీ పాదాల నీడను చేరి ఉజ్జీవిస్తున్నారు) అని ఈ విషయం కాశ్యపసంహితలో చెప్పబడింది కదా ! "**యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణా మైశ్వర్యహేతు రితి విశ్వజనీన మేతత్, తాం శ్రీ రితి త్వదుపసంశ్రయణా న్నిరాహుః త్వాం హి శ్రియః శ్రియ ముదాహు రుదారవాచః**" (వైకుంఠ.స్తవ-29) (ఏ పిరాట్టి కటాక్షం ఇంద్రుడు మొదలైన దేవతలకు ప్రతిక్షణం ఐశ్వర్యహేతువు అవుతున్నదన్నది

కటాక్షధీనమెన్ను మిడమ్ దర్శిప్పిక్కప్పట్టతు. "బ్రహ్మాద్యా శ్చ సురా స్సర్వే మునయ శ్చ తపోధనాః, ఏధన్తే త్వత్పదచ్ఛాయా మాశ్రిత్య కమలేశ్వరి" ఎన్నక్కడవతిఱే. "యస్యాః కటాక్షణ మనుక్షణ" మిత్యాది.

అథవా, (ఈషత్త్వదిత్యాది) "పృథివ్యప్సు లీయతే" ఇత్యారభ్య "తమః పరే దేవ ఏకీభవతి", "న బ్రహ్మా నేశానః", "ఆసీ దిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్, అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వదా", "ఒన్ఱు న్దేవు ములకు ముయిరుమ్ మఱ్ఱుమ్ యాతు మిల్లా వన్ఱు" ఇత్యాదిప్పడియే, సర్వసంహారకాలత్తిలే ఉన్ఱుడైయ

---

సర్వజనసమ్మతమో, ఆ పిరాట్టి నిన్ను ఆశ్రయించి ఉన్నదనేకారణం చేతనే ఆమెకు "శ్రీః" అనే నిరుక్తిని చెబుతున్నారు. ఉదారవాక్కులను కల తిరుమళిశైయాళ్వార్, ఆళవన్దార్వంటివారు నిన్నేకదా లక్ష్మికికూడా లక్ష్మి అయినవాడవంటున్నారు) అని శ్రీవైకుంఠస్తవంలో ఈ విషయాన్ని కూరేశులు అనుగ్రహించడం ఇక్కడ అనుసంధేయం.

ఇక, రెండవ అర్థం వివరింపబడుతున్నది. అది ఏమంటే– పిరాట్టి కటాక్షం లేనందువల్ల ప్రళయకాలంలో నశించిన అన్ని లోకాలు, ఆమె సృష్టికి అనుకూలంగా భగవానుని వీక్షించిన వెంటనే అతనిచే సృష్టింపబడి, మిక్కిలి వృద్ధితో ప్రకాశించే విషయాన్ని ఈ అర్థం చెబుతున్నది. **"అత్ర ప్రళయాదికం వివక్షిత మితి కేచిత్"** అని దేశికవ్యాఖ్య

**"పృథివ్యప్సు ప్రలీయతే, ఆప స్తేజసి లీయంతే, తేజో వాయౌ లీయతే, వాయు రాకాశే లీయంతే, ఆకాశ మింద్రియేషు, ఇంద్రియాణి తన్మాత్రేషు, తన్మాత్రాణి భూతాదౌ లీయతే, భూతాదిః మహతి లీయతే, మహా నవ్యక్తే లీయతే, అవ్యక్త మక్షరే లీయతే, అక్షరమ్ తమసి లీయతే, "తమః పరే దేవ ఏకీభవతి**" (సుబాల–2) (భూమి జలంలో లయిస్తున్నది. జలం తేజస్సులో లయిస్తున్నది. తేజస్సు వాయువులో లయిస్తున్నది. వాయువు ఆకాశంలో లయిస్తున్నది. ఆకాశం ఇంద్రియాలలో లయిస్తున్నది. ఇంద్రియాలు తన్మాత్రలలో, తన్మాత్రలు భూతాదిలో లయిస్తున్నవి. భూతాది మహాన్‌లో లయిస్తున్నది. మహాన్ అవ్యక్తంలో లయిస్తున్నది. అవ్యక్తం అక్షరంలో అక్షరం తమస్సులో లయిస్తున్నది. తమస్సు పరమాత్మలో లీనమవుతున్నది) అని సుబాలోపనిషత్తులో, **"ఆసీ దిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్, అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః, సోఽభిధ్యాయ శరీరాత్ స్వాత్ విసృక్షుః వివిధాః ప్రజాః, అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్**" (మను–1–5–8) (ఈ లోకం



కటాక్షమృతవృష్ట్యలాభత్తాలే "అస న్నేవ" ఎన్నుమ్పడి నామరూపవిభాగానర్హమాయ్, నష్టమాన త్రిభువనమానతు– "అప ఏవ ససర్జాదౌ", "తత్సృష్ట్వా" ఎన్ఱుమ్ శొల్లుకిఱ సృష్టికాలత్తిలే, "నారాయణా ద్బ్రహ్మా జాయతే", "సర్వే నిమేషా జజ్ఞిరే", "సర్వాణి, రూపాణి విచిత్య ధీరః", "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి", నాన్ముకన్ తన్నొడు తేవలరులకోడుయిర్ పడైత్తాన్", "నారాయణన్ పడైత్తాన్" ఇత్యాది ప్రమాణాకారేణ అణ్డజ్గళినుడైయవుమ్ తదన్తర్వర్తిదేవతిర్యఙ్మనుష్యస్థావరరూప చతుర్విధసృష్ట్యున్ముఖనాయ్‌కొణ్డు, "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి", "తేజ ఐక్షత", "ఆప ఐక్షన్త" ఎన్ఱు సృష్టిక్కక్కడవనాక ప్పార్త్తరుళినపోతు, "యద్భ్రూభఙ్గాః ప్రమాణం

---

తమస్సులో లీనమై ప్రత్యక్షంకానిదై, అనుమానంచేత తెలియబడనిదై, తర్కంచేత తెలియబడనిదై, అన్ని విధాలుగాను ఏపని చేయనిదై (నిద్రపోతున్నదానివలె అచేతనమై) ఉన్నది. ఆ పరమాత్మ పలు విధాలైన ప్రజలను సృష్టించగోరి, సంకల్పించి, తన శరీరంనుండి జలాన్ని మొదట సృష్టించాడు. అందులో జీవుడనే విత్తును విత్తాడు) అని మనుస్మృతిలోను, "**ఒన్ఱుమ్ తేవుమ్ ఉలకుమ్ ఉయిరుమ్ మఱ్ఱుమ్ యాదు మిల్లా అన్ఱు**" (తిరువాయ్–4–10–1) (దేవతలు, లోకాలు, జీవులు, మిగిలినవి ఏమీలేని అపుడు) అని తిరువాయ్మొళిలోను, "**నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్**" (నాన్ముకన్ తిరు–1) (చతుర్ముఖుని నారాయణుడు సృష్టించాడు) అని నాన్ముకన్ తిరువన్దాదిలోను, ఇంకా పలు ప్రమాణాలలోను చెప్పిన రీతిలో అండాలను, వాటిలో ఉండే దేవ–తిర్యక్–మనుష్య–స్థావరాది చతుర్విధ జీవులను సృష్టించాలని సంకల్పించింది. "**తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత, తత్తేజ ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి తదపోఽసృజత, తా ఆప ఐక్షత**" (ఛాందోగ్య–6–2–3.4) (ఆ పరబ్రహ్మ నేను పలు విధాలుగా కాగలను" అని సంకల్పించింది. అది తేజస్సును సృష్టించింది. తేజస్సును శరీరంగా గ్రహించి ఆ పరబ్రహ్మ "నేను అనేకంగా కాగలను" అని సంకల్పించింది. అది జలాన్ని సృష్టించింది, జలాన్ని శరీరంగా గ్రహించిన ఆ బ్రహ్మ సంకల్పించింది....) ఇత్యాదిగా ఛాందోగ్యంలోను చెప్పిన రీతిలో ఆయా భూతాలకు అంతర్యామిగా ఉండి సృష్టిసంకల్పాన్ని చేసింది. "**యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః వేదాంతా స్తత్త్వచింతా మురభిదురసి యత్పాదచిహ్నై స్తరంతి, భోగోపోద్ఘాతకేళీచుళకిత భగవద్వైశ్వర్యరూప్యానుభావా సా నః శ్రీ రాస్తృణీతా మమృతలహరిధీలంఘనీయై ర పాంగైః**" (శ్రీగుణ–4) (భగవానుని స్థావరజంగమాత్మకసృష్టిలోగల తారతమ్యాలకు ఎవరి కనుబొమల కదలికలు కారణమో, ఉపనిషత్తులు మురారి వక్షఃస్థలంలో ఎవరి

స్థిరచరచనాతారతమ్యే మురారేః", "సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః, అఙ్గీకారిభి రాలోకై స్సార్థయన్త్యై", "ఉల్లాసపల్లవితపాలిత", "సర్గోపసర్గస్థితీ స్స్వర్గమ్" ఎన్ఱు తొడఙ్గి–"యస్యా వీక్ష్య ముఖం తదఙ్గితపరాధీనో విధత్తేఽఖిలమ్" ఇత్యాదిప్రమాణప్రకారేణ ఉన్నుడైయ భ్రుకుటీభటనాయ్, త్వదిఙ్గితపరాధీననాయ్క్కొణ్డు, సమస్తచిద్విధానమ్ పణ్ణుకిఱ అవనుడైయ అన్ద కటాక్షానుగుణమాక కరుణామృతకటాక్షవిక్షేపఙ్గళై నీ పణ్ణుకైయాలే యన్ఱో నామరూపవిభాగానర్హమాయ్ క్కొణ్డు రక్షిక్కప్పడుకిఱదు. (ఈషత్త్వకరుణా నిరీక్షణసుధాసన్ధుక్షణాత్ సమ్ప్రత్యనన్తోదయం యథా భవతి తథా రక్ష్యతే)

---

పాదముద్రలను చూచి పరతత్త్వవిచారాన్ని ముగిస్తున్నవో, భోగంయొక్క ఆరంభదశలో ఉన్న లీలలచే అల్పంగా చేయబడిన భగవానుని ప్రభావాన్ని కల్గినదైన ఆ లక్ష్మీదేవి అమృతప్రవాహం అని భావించదగిన తన కటాక్షాలతో మనలను మునిగేటట్లు చేయాలి) అని, "**శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః, అంగీకారిభి రాలోకైః సార్థయంత్యై కృతోఽంజలిః**" (శ్రీగుణ–1) (సకల చేతనాచేతనాలను సృష్టించడంవల్ల భగవానునకు కలిగే శ్రమాన్ని తన అంగీకరాన్ని చూపే కటాక్షాలతో సఫలంగా చేసే లక్ష్మినిగూర్చి అంజలి చేయబడింది) అని, "**ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీ నిర్వాహకోరకితనేమకటాక్షలీలామ్, శ్రీరంగహర్మ్యతలమంగళదీపరేఖాం శ్రీరంగరాజ మహిషీం శ్రియమాశ్రయామః**" (శ్రీగుణ–2) (ఏడు లోకాలను భగవానుడు సృష్టించగానే చిగురించినదిగా, అతనిచే రక్షింపబడ్డ ఆ ఏడు లోకాల నిర్వాహంచేత మొగ్గ తొడిగినట్లుగా. ఉండే అర్ధకటాక్షలీలను కల్గినది, శ్రీరంగహర్మ్యానికి ఒక మంగళదీపకళికగా ఉన్నది, శ్రీరంగనాథుని దివ్యమహిషి అయిన శ్రీదేవిని ఆశ్రయిస్తున్నాను) అని పరాశరభట్టర్‌చేత, "**స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతాం సర్గోపసర్గస్థితీః స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః, యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలం క్రీడేయం నాన్యథాఽస్య రసదా స్యాదైకరస్యాత్తయా**" (శ్రీస్తవమ్–1) (లోకాలను అన్నింటినీ సృష్టించి, రక్షించి, లయింపజేయడం, స్వర్గ–నరక– మోక్షాలను ఇవ్వడం చేసేటప్పుడు భగవానుడు ఎవరి తిరుముఖమండలాన్ని చూచి, అందలి ఇంగితాలకు వశుడై, అన్ని పనులను చేస్తాడో, ఆ పిరాట్టి మనకు మంగళాలను అనుగ్రహించుగాక. ఆమె ఇంగితాలకు పరాధీనుడై కార్యాలను చేయకపోతే ఆ కార్యాలు అతనికి ఆనందాన్ని కల్గించవు) అని కూరేశులు అనుగ్రహించిన రీతిలో నీ కనుబొమల కదలికలకు వశుడై, నీ ముఖకవళికలను చూచి ప్రవర్తించేవాడై, చేతనాచేతనాలను అన్నిటినీ సృష్టించే అతని



(ప్రాక్తదలాభతో నష్టం త్రిభువనం సంప్రతి ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధా సన్ధుక్షణా దనన్తోదయం రక్ష్యతే) "ఎత్తనైయుమ్ వాన్ మఱన్దకాలత్తుమ్ పైఙ్గూழ்కళ్" ఎన్గిఱపడియే కడుఙ్గోడైయిలే కమర్ పిళన్దు ఉలర్న్దు నొన్ద పయిరానతు నినైవఱ మేఘమేతి వర్షిత్తాల్ సత్తై పెఱ్ఱు ధరిత్తు ఫలపర్యన్తమామాపోలే, "మழைక్కణ్ మడన్దై" యాన నీ కుళిరక్కటాక్షిక్కైయాలేయన్ఱో, మున్బు నష్టమాన జగత్తు, ఇప్పోతు మహీమహీధర జలధిరూపమాయ్, దేవతిర్యఙ్మనుష్యస్థావరరూప చతుర్విధదేహప్రవేశచతురరాన

---

ఆ కటాక్షాన్ని అనుసరించి కరుణామృతకటాక్షాలను వర్షించినందువల్లకదా నామరూపాదిభేదాలను కల్గినదై రక్షింపబడుతున్నది. "**ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధా–సంధుక్షణాత్.....సంప్రతి అనంతోదయం యథా భవతి తథా రక్ష్యతే**" అని అన్వయించాలి.

(**ప్రాక్తదలాభతో నష్టం త్రిభువనం సంప్రతి ఈషత్ త్వత్ కరుణానిరీక్షణ–సుధాసంధుక్షణాత్ అనంతోదయం రక్ష్యతే)– "ఎత్తనైయుమ్ వాన్ మఱన్ద కాలత్తుమ్ పైఙ్గూழ்కళ్**" (పెరుమాళ్ తిరు–5–7) (ఎంతగానో వర్షాభావం కల్గిన కాలంలో పైరు) అనే రీతిలో తీవ్రమైన వర్షాభావంవల్ల నేల ఎండి బీటలు పడి, ఎండిపోయిన పైరు, తటాలున ఒక మేఘం వచ్చి వర్షిస్తే, తిరిగి అది జీవనం పోసుకొని పెరిగి ఫలించేటట్లే, "**మழைక్కణ్ మడన్దై**" (తిరువిరు–52) (వర్షంవలె చల్లని చూపును కల లక్ష్మి) అనబడే నీవు చల్లగా కటాక్షిస్తేకదా, మొదట నశించిఉండే లోకం ఇపుడు భూమి, పర్వతాలు, సముద్రాలు మొదలైనవానిని కల్గినదై, దేవ–తిర్యక్–మనుష్య–స్థావరాలనే చతుర్విధశరీరాలను ఎత్త గల్గిన ఆత్మలను కల్గినదై, ఆత్మలకు అనుభవించతగిన భోగ్యవస్తువులు, భోగాలకు తగిన సాధనాలు, భోగాన్ని అనుభవించే చోట్లు (భోగ్య–భోగోపకరణ– భోగస్థానాలు) అనే పలు రీతుల్లో వృద్ధిచెందింది–అని ప్రళయాన్ని పురస్కరించుకొని ఉండే సృష్టిలో ఈమెకు అప్రధానం అయిన భాగం చెప్పబడుతున్నదనికూడా చెప్పవచ్చు. ఇదే రెండవ అర్థం. ఈ విధంగా లక్ష్మీదేవికి అప్రధానం అయిన అన్వయాన్ని గ్రహించకుండా ఇద్దఱూ లోకానికి నిమిత్త ఉపాదానరూపాలు అయిన ప్రధానజగత్కారణాలు అవుతున్నారు అని అంటే, "నిమిత్త ఉపాదాన జగత్కారణరూపంగా ఉండే బ్రహ్మ ఒక్కడే" అని తెలిపే సహస్రాధికశ్రుతిస్మృతి వాక్యాలు అర్థరహితాలే అవుతాయి. ఈ సందర్భంలో పెరియవాచ్చాన్ పిళ్ళై, నాయనారాచ్చాన్‌పిళ్ళై తమ చతుఃశ్లోకీవ్యాఖ్యానాలలో ఈ క్రింది ఐతిహ్యాన్ని ఉట్టంకించారు.

వాత్మాక్కళైయుడైత్తాయ్, భోగోపకరణభోగస్థానరూపేణ అభివృద్ధమాయ్‌త్తైన్ఱు అప్యయపూర్విక్కైయాన సృష్టియిల్ ఇవళుక్కన్వయమ్ శొల్లవుమామ్.

ఇప్పడి జగత్కారణత్వత్తిల్ ఇవళుక్కన్వయముణ్డో? వెన్ఱు ప్రశ్నమ్బణ్ణిన నడూదూరమ్మాళై క్కుఱిత్తు ప్పిళ్ళానరుళిచ్చెయ్‌త వార్త్తైయై ఇవ్విడత్తిలే అనుసన్ధిప్పతు. అతావతు– "ఇవ్వర్థత్తిల్ సన్దేహ ముణ్డో"? "ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజా శ్చోత్పాదయితవ్యాః" ఎన్ఱు ప్రమాణమ్ శొల్లుకైయాలే సహధర్మచారిణియాన ఇవళుక్కు మన్వయ ముణ్డు" ఎన్ఱరుళిచ్చెయ్‌తతు.

---

"జగత్కారణంలో పిరాట్టికి ఈ విధం అయిన (అప్రధానం అయిన) అన్వయం ఉన్నదా?" అని నడాదూర్ అమ్మాళ్ తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్‌ను ప్రశ్నించారట. అందుకు పిళ్లాన్ "ఈ విధంగా (అప్రధానం అయిన) అన్వయం పిరాట్టికి ఉన్నదని అనడంలో సందేహం లేదు. "**ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజా శ్చోత్పాదయితవ్యాః**" (ధర్మదంపతులైన మనం ఇద్దఱం కలిసి కర్మలను చేయాలి, సంతానాన్ని పొందాలి) అనే లోకరీతిలోకూడా దంపతులు వివాహసమయంలో తామిద్దరు చేరి కర్మలు చేయాలి. బిడ్డలను కనాలి–అని సంకల్పం చేయాలని ధర్మశాస్త్రం చెబుతున్నందున, "ఈశ్వరునకు సహధర్మచారిణి అయిన ఈమెకుకూడా అప్రధానం అయిన అన్వయం ఉన్నది" అని బదులిచ్చారట. ఈ ఐతిహ్యాన్నిబట్టి భగవానుడు–లక్ష్మి అనే ఇద్దఱికీ సమానం అయిన అన్వయం ఉన్నది– అని కొందఱు భావిస్తున్నారు. ఈ ఐతిహ్యాన్ని ఉట్టంకించడానికిముందు భగవానునకు ఒక్కనికే నిమిత్త–ఉపాదానకారణంగా ఉండే జగత్కారణత్వాన్ని, పిరాట్టికి అతనిని ప్రేరేపించేదిగా ఉండే అప్రధానం అయిన జగత్కారణత్వాన్నే చెబుతున్నారు– అనే వాస్తవాన్ని వారు గ్రహించలేదు. అంతేకాక, "సహధర్మచారిణి" అనే పదంలో "**సహ**" శబ్దం ఉన్నందున, "**సహయుక్తేఽప్రధానే**" అనే పాణిని సూత్రానుసారంగా పిరాట్టి అన్వయం అప్రధానం అయినది– అని, భగవానుని అన్వయంతో సాటి వచ్చేది కాదు – అని స్పష్టంగా తెలుస్తున్నది. లోకరీతిలో కూడా కర్మలను చేసేటపుడు పురుషుడే వాటిని చేస్తున్నాడు–అనేది భార్యయొక్క అప్రాధాన్యాన్ని సూచిస్తుంది. "**మాతా భస్త్రా పితుః పుత్రః యస్యాం జాతాః స ఏవ సః** " (తల్లి బిడ్డను ఉంచే సంచియే. పురుషుడే ఆమెనుండి బిడ్డగా ఉద్భవిస్తున్నాడు) అనే వచనం పిల్లలను కనేటపుడుకూడా భార్య అప్రాధాన్యాన్ని తెలుపుతున్నది, లోకరీతిలోవలె లక్ష్మీదేవి గర్భంనుండి ఈ లోకాన్ని సృష్టిస్తే ఆమె ఉపాదాన కారణం కాదా? అని



ఉక్తార్థసమర్థనవ్యాజత్తాలే సకలపురుషార్థఙ్గళుమ్ తత్ప్రసాదాధీమాయిరుక్కు మెన్గిఱార్ (శ్రేయ ఇత్యాదియాలే). (అరవిన్దలోచనమనఃకాన్తాప్రసాదాదృతే నృణాం సంసృత్యక్షరవైష్ణవాధ్వసు శ్రేయః కచిత్ న సమ్భావ్యతే హి) (అరవిన్దలోచనః) "తస్య యథా కప్యాసం పుణ్డరీక మేవ మక్షిణీ" ఎన్ఱు "గమ్భీరామ్భస్సముద్భూతమాయ్ సుమృష్ట నాళమాయ్, రవికరవికసితము"మాన "వసితేక్షణై"యితే ఇవళ్. 'త్వత్ప్రసాదాదృతే"

---

కొందరు సందేహపడే అవకాశం ఉన్నది. కనుక, ఆ సందేహాన్ని తీర్చి, భగవానుడు తానొక్కడే ఉపాదాన కారణంగాను, నిమిత్తకారణంగాను ఉన్నట్లు తెలుపడం కోసం "అతడు తన గర్భంనుండే నాభీకమలాన్ని సృష్టించి, బ్రహ్మమొదలైన అందఱినీ సృష్టిస్తున్నాడు, లోకాన్ని సృష్టించి వ్యక్తం చేస్తున్నాడు"– అని వేలాది ప్రమాణాలు ఘోషిస్తున్నాయి. అందువల్ల భగవానునివలె పిరాట్టికూడా నిమిత్తోపాదానకారణంగా ఉండే బ్రహ్మమే–అని కొందరు బలంగా వాదించడం ప్రమాణాలకు అనుకూలం కాదు – అని శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ అభిప్రాయం.

శ్లోకంలోని పూర్వభాగంలో చెప్పబడ్డ అర్థాన్ని స్థిరీకరించి, వివరించడంకోసం శ్లోకంలోని ఉత్తరార్ధంలో పురుషార్థాలను అన్నిటినీ మానవులు పిరాట్టి అనుగ్రహంవల్ల పొందుతున్నారు అని "**శ్రేయః**" ఇత్యాదిగా తెలియజేస్తున్నారు. (**అరవిందలోచనమనః కాంతాప్రసాదాదృతే నృణాం సంసృత్యక్షరవైష్ణవాధ్వసు శ్రేయః కర్హిచిత్** న **సంభావ్యతే హి**) పుండరీకాక్షుని మనోవల్లభ అయిన లక్ష్మీదేవి కరుణ లేకపోతే మానవులకు ఐశ్వర్యకైవల్య భగవత్ప్రాప్తులనే మూడు విధాలైన పురుషార్థాలను పొందడం అనే అతిశయం ఏ నాడూ కలుగదుకదా–అనేది ఉత్తరార్ధంలోని తాత్పర్యం. (**అరవిందలోచన**) అరవిందలోచనుడని భగవానుని నిర్దేశిస్తున్నారు. "**య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశ ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ**" (ఛాందో–1–6–7) (సూర్యునిమధ్యలో సువర్ణంవంటి అందమైన రూపాన్ని కల ఏ పరమపురుషుడు కన్పిస్తున్నాడో, అతడు అవయవాలను కలవాడు. అతనికి సూర్యునిచే వికసించిన తామరలవంటి రెండు కన్నులున్నాయి) అనే రీతిలో కప్యాసం అయిన తామరలవంటి రెండు కన్నులను కలవాడు పరమాత్మ. "**కప్యాసమ్**" అనే పదంతో తామర "లోతైన నీటిలో పుట్టినది" అని, "బలిసిన కాడను కల్గినది", "సూర్యకిరణాలవల్ల వికసించినది" అని విశేషింపబడుతున్నది అని, అటువంటి తామరపూవుయొక్క రేకులవంటి నిర్దుష్టమైన, విశాలమైన కన్నులను

ఎన్న వమైన్దిరుక్క, ఇవ్విశేషణమెన్నెన్నిల్, "జితంతే", "తామరైక్కణ్ణనై" ఎన్ఱు ఉభయవిభూతియైయు మెఴిత్తు వాఴ్గకిఱ "అనైత్తులకముడైయ వరవిన్దలోశననై" యుమ్ వశీకరిక్క వాల్లభ్యప్రసిద్ధి తోఱ్ఱ విశేషిక్కిఱార్. ఇత్తాల్, సర్వస్మాత్పరనాయ్, స్వతన్త్రనానవనుమ్ ఇవళ్ ప్రసాదపాత్రమానార్ క్కొఴియ క్కార్యమ్ శెయ్యా నెన్ఱు మిడమ్ తోఱ్ఱుకిఱదు. "అరవిన్దలోచనమనఃకాన్తా". ఎన్గైయాలే "విష్ణోః కటాక్షమ్", "యం

---

కలవాడు భగవానుడు అని ఈ ఉపనిషద్వాక్యం చెబుతున్నదని వేదార్థసంగ్రహంలో భగవద్రామానుజులవారు తెలిపారు. అతనికి అనురూపం అయిన శీలం, గుణం, వయస్సు మొదలైనవానిని కల ఈ లక్ష్మి "**అసితేక్షణ**" (నల్లని నేత్రాలను కల్గినది) (రామా.సుందర. 16–5) అని శ్రీరామాయణం తెలిపింది, "నీ కటాక్షం లేకపోతే" అని చెప్పగా సరిపోతుండగా, "**అరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే**" (అరవిందలోచనుని ప్రియరాలి అనుగ్రహం లేకపోతే) అని చెప్పడంలో ఏం తాత్పర్యం? అని అంటే, దానికి బదులు ఈ రీతిగా చెప్పవచ్చు– "**జితం తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన**" (జితంతే–1–1) (పుండరీకాక్షా ! నీచే ఆత్మవస్తువు జయింపబడింది. లోకాలను అన్నిటినీ సృష్టించినవాడా!) ఇది నాది కాదు. నీదే అయింది.) అనే ప్రమాణం, "**తామరైక్కణ్ణనై**" (తిరువాయ్–2–6–3), "**అనైత్తులకు ముడైయ అరవిన్దలోశనై**" (తిరువాయ్–6–7–10) (అన్ని లోకాలను కల అరవిందలోచనుడు) అనే తిరువాయ్ మొఴి సూక్తులు ఘోషించేటట్లు ఉభయవిభూతులను జయించేటట్లు చేసే ఆ తామరసనేత్రునికూడా వశీకరించుకోగల మనోవల్లభ ఈమె–అనే ఈమె గొప్పతనాన్ని వ్యక్తీకరించడంకోసం ఈ విధంగా విశేషించారు. ఇందువల్ల అందరికంటే అధికుడై, సర్వస్వతంత్రుడైన పురుషుడు అయిన అతడుకూడా ఈమె అనుగ్రహానికి లక్ష్యభూతులైనవారికితప్ప మఱి ఎవరికీ ఏ కార్యాన్ని చేయడు–అని స్ఫురిస్తున్నది. "**అరవిందలోచనమనఃకాంతా**" అని అన్నందున "**ఈశ్వరస్య చ సౌహార్దం యదృచ్ఛాసుకృతం తథా, విష్ణోః కటాక్ష మద్వేష మాభిముఖ్యం చ సాత్త్వికైః, సంభాషణం షడేతాని హ్యాచార్యప్రాప్తిహేతవః**" (భగవానుని సౌహార్దం, జీవుడు అనుకోకుండా చేసిన సత్కర్మ, దాని కారణంగా భగవానుడు కటాక్షించడం, భగవానునిపట్ల ద్వేషం లేకపోవడం, అతని పట్ల అనుకూలభావం, భాగవతాభిమానం – అనే ఆఱు జీవుడు ఒక ఆచార్యుని ఆశ్రయించడంలో హేతువులు అవుతాయి. "**జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్వికః చ తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః** (భార–శాంతి–358–73) (జన్మించేటపుడు ఎవరిని మధుసూదనుడు కటాక్షిస్తున్నాడో అతడు సాత్త్వికుడు



పశ్యే న్మధుసూదనః" ఎన్ఱు శొల్లుకిఱవనుడైయ సౌహార్దప్రకాశకముమాన కటాక్షముమ్ ఏతదధీన మెన్నుమిడమ్ సిద్ధమితే.

(మనఃకాన్తా) తదత్యన్తాభిమతై యెన్ఱపడి. కీఴ్ "కాన్త స్తే" ఎన్ఱుమ్, ఇఙ్గ "మనఃకాన్తా" ఎన్ఱుమ్ శొల్లుకైయాలే పరస్పరానుకూలతయా సర్వాభిమతప్రదత్వత్తిలే ఉభయర్క్కుముళ్ళ సౌహృదసామరస్యమ్ స్పష్టమాయిఱ్ఱు. "అస్యా దేవ్యాః" ఇత్యాది. (ప్రసాదాత్) దయావిశేషత్తాలే. (కాన్తాప్రసాదాత్) "ప్రసాదపరమౌ" ఎన్ఱు శొల్లుకిఱ అవనుడైయ ప్రసాదత్తుక్కు మడియాన ప్రసాదత్తాలే. "మఴైక్కణ్ మడన్దై"యాకైయాలే

---

అని తెలియదగినవాడు. అతడే మోక్షపురుషార్థాన్నిగూర్చి చింతించేవాడు–అని తెలియదగినవాడు) అని చెప్పబడేదై, ఒక జీవుని విషయంలో అతడు మొట్టమొదటగా చేసే నిర్హేతుకకృపను చూపే కటాక్షంకూడా ఈ పిరాట్టియొక్క పురుషకారంచేతనే కల్గుతుందని స్పష్టమవుతున్నది.

**(మనఃకాంతా)**– భగవానునకు చాలా ప్రియమైనది–అని భావం. మొదటి శ్లోకంలో "**కాంత స్తే**" అని "భగవానుడు ఈ పిరాట్టికి ప్రియుడు" అని అనుగ్రహించారు. ఇక్కడ "**మనఃకాంతా**" అని అనడంద్వారా "ఆమె ఇతనికి ప్రియమైనది" అని అంటున్నారు. ఈ విధంగా చెప్పడంవల్ల ఒకరికి వేఱొకరు అనుకూలురై ఉండి, దాసులకు అందఱికీ వారు కోరినవానిని అనుగ్రహించడంలో ఇద్దరూ ఒకే అభిప్రాయాన్ని కల్గిఉన్నారని తెలుస్తున్నది. "**అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్**" (రామా.సుందర–15–52) (సీతాదేవి మనస్సు భగవానునియందు, అతని మనస్సు అతనియందు స్థిరంగా ఉన్నది) అని శ్రీరామాయణంలో కూడా ఈ అభిప్రాయైక్యం చెప్పబడింది. "**ఏతేన పరస్పరానుకూలతయా సర్వత్ర వ్యాపారే సామరస్యం వ్యజ్యతే**" అని దేశికవ్యాఖ్య. (ప్రసాదాత్)– కరుణ అనే నీ అనుగ్రహంతో. **(కాంతాప్రసాదాత్)**– "**ప్రసాదపరమౌ నాథౌ మమ గేహ ముపాగతౌ, ధన్యోఽహ మర్చయిష్యామీత్యాహ మాల్యోపజీవనః**" (విష్ణు.పు–5–19–21) (గొప్ప అనుగ్రహం కలవారు, స్వామియై ఉన్నవారు. అయిన ఈ బలరామకృష్ణులు నా ఇంటికి వచ్చారు. నేను ధన్యుణ్ణి అయ్యాను. వారిని పూజిస్తాను– అని పూలను అమ్మి జీవించే మాలాకారుడు అన్నాడు) అని చెప్పబడే అతని అనుగ్రహానికికూడా మూలకారణం అయిన ఈమె కరుణచేత "**మఴైక్కణ్ మడన్దై**" (తిరువిరు–52) (వర్షంవలె చల్లని చూపును కల లక్ష్మి) అని చెప్పబడేది కాబట్టి, అతని చల్లని అనుగ్రహంకూడా వేడినీళ్ళతో సమానం అని చెప్పదగినట్లగా చాలా చల్లగాకదా, కోపం అనేది తెలియనిదై, కరుణమూర్తీభవించినదైన ఈమె అనుగ్రహం

అవనుడైయ కుళిర్న్ద వరుళుమ్ వెన్నీరెన్నలామ్బడి అతిశీతలమాయితే శీతలస్వభావైయాన ఇవళ్ దయై యిరుప్పతు. (ఋతే) అనుగ్రహైకస్వభావైయాన వివళుక్కోరిడత్తిలుమ్ సమ్భవియామైయాలే, *తన్నివృత్తిరూపప్రసాదయోగత్తాలొழியయ-వెన్గై.

(సంసృత్యక్షరవైష్ణవాధ్వసు) పారిశేష్యప్రమాణత్తాలుమ్, పురుషార్థసమభివ్యాహారత్తాలుమ్ సంసృతిశబ్దమ్-ఐశ్వర్యపరమ్. "ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా" ఎన్డు విశదీకరుత్తరుళినారిటే. ఆనాల్, ఐశ్వర్యత్తై సంసృతిశబ్దత్తాలే అరుళిచ్చెయ్

---

ఉంటుంది. **(ఋతే)**-లేకపోతే. ఈమె కృప లేకపోతే- అని భావం. కోపంతో కలసి ఉండే కరుణను కల ఇతనికి, కోపం తీరడమే కృప అవుతుంది, కోపం అనేదే తెలియనిదై, కరుణే మూర్తీభవించినదైన ఈమెకు కోపం తీరడం అనే కృప ఉండే అవకాశమే లేదు. అందువల్ల ఈమె కృపే కృప-అని భావం.

**(సంసృత్యక్షరవైష్ణవాధ్వసు)** – "అక్షర" శబ్దం కేవలాత్మానుభవమనే కైవల్యాన్ని చెబుతుంది. "**వైష్ణవాధ్వా**" అన్నది భగవత్ప్రాప్తి అనే గొప్ప మోక్షాన్ని చెబుతుంది. ఈ విధంగా ఈ రెండు పదాలు క్రమంగా ఆత్మానుభవమనే పురుషార్థాన్ని, ఈశ్వరానుభవమనే పురుషార్థాన్ని తెలుపుతున్నందున సామాన్యంగా సంసారాన్ని నిర్దేశించదగిన "**సంసృతి**" శబ్దం ఇక్కడ పరిశేషన్యాయానుసారం అచిదనుభవం అయిన ఐశ్వర్యపురుషార్థాన్ని చెబుతన్నదని గ్రహించాలి. "**ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా కస్మైచిదంజలిభరం వహతే వితీర్య, అస్మై న కించిదుచితం కృత మిత్యథాంబ త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః**" (శ్రీగుణ-59) (తల్లీ ! ఐశ్వర్యం, కైవల్యం, పరమపదం- అనే వీటిలో దేనినైనా కేవలం ఒక అంజలి భారాన్ని మోసేవానికి అనుగ్రహించినా, "ఇతనికి తగినది ఏదీ చేయలేకపోయానే! అని లజ్జిస్తావు, ఇదేమి ఔదార్యమమ్మా! నీవే చెప్పు) అనే శ్లోకంలో భట్టరు "**ఐశ్వర్యమ్ అక్షరగతిమ్, పరమపదమ్**" అని మూడు పురుషార్థాలను స్పష్టంగా నిర్దేశించారు. ఇక్కడ ఐశ్వర్యాన్ని సంసారాన్ని నిర్దేశించే సంసృతిశబ్దంతో చెప్పడానికి కారణం ఏమి? అని అంటే, "**కొళ్ళెన్డు కిళర్న్దెழுన్ద పెరుఞ్జెల్వమ్ నెరుప్పాక**" (తిరువాయ్-4-9-4) (తీసికో! అని వృద్ధిచెందే సంపదను నిప్పుతో సమానంగా), "**అల్లల్ ఎనదేతోற்ற ఎరితీయిల్ శుడుమ్**" (జ్ఞానసారమ్-19) (దుఃఖాలను కల్గించి, అగ్నిజ్వాలలో దహించేటట్లు) అనే రీతిలో ఐశ్వర్యం నిప్పువలె కాల్చేది అనే వైరాగ్యంతోనే. కులశేఖరాழ్వార్లవలె, "**ఇన్బముమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్**" (పెరుమాళ్ తిరు-4-5) (ఆనందం, సంపద, భూలోకాధికారం వద్దు),

---

* "దయావిశేషరూప ప్రసాదత్తాలొழியయ" అని ఉంటే సరసం.



వానెన్ ? ఎన్నిల్, "కొళ్ళెన్డు కిళర్న్దెழுన్ద పెరుఞ్జెల్వమ్ నెరుప్పాక" ఎన్డు శొల్లుకిఱపడియే ఐశ్వర్యమ్ "అల్లలెన త్తోற்ற ఎరితీయిఱ్ఱుడు"మ్బడియాన వైరాగ్యత్తాలే, "ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్", "పెற்றాలుమాతరియేన్", "వానాళుమ్ శెల్వము మిమ్మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్" ఎన్డు ఐహలౌకికమాన వైశ్వర్యత్తైయుమ్, పారలౌకికమాన వైశ్వర్యత్తైయుమ్ పరిత్యజిత్తు, "మా స్మభూత్" ఎన్డిరుక్కుమ్ స్వాభిప్రాయత్తాలుమ్, "అనర్థాఖ్యమ్" ఎన్నువ్వబడి అనర్థావహమాకైయాలుమ్, అల్పాఽస్థిరత్వాదిదోషదుష్టమాకైయాలుమ్, "ధనం ప్రాప్య మాద్య న్నుచ్చై ర్న మాం స్మరేత్"

---

"**పెற்றాలుమ్ ఆదరియేన్**" (4-10) (పొందినా ఆదరించను), "**వానాళుమ్ శెల్వముమ్ మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్**" (4-2) (స్వర్గాన్ని పాలించే సంపద, భూలోకాధికారం నాకు వద్దు) అని చెప్పే రీతిలో ఈ లౌకికసంపదను, బ్రహ్మపదవిపర్యంతం అయిన పరలోకైశ్వర్యాన్నికూడా విడిచినవారు ఈ ఆళవందార్ అనేది "**తవ దాస్యసుఖైక సంగినామ్.....**" **ఇతరావసథేషు మాస్మభూ దపి మే జన్మ చతుర్ముఖాత్మనా**" అనే స్తోత్రరత్నసూక్తి వలన స్పష్టమవుతున్నది. "**అనర్థాఖ్యం ధనం ప్రాప్య మాద్యంత్యుచ్చై ర్న మాం స్మరేత్**" (భాగవతమ్-10-81-20) (అనర్థమే మూర్తీభవించినదైన ధనాన్ని పొంది, మిక్కిలి మదాన్ని పొందినవాడై నన్ను స్మరించడు) అని భాగవతంలో చెప్పిన రీతిలో ఐశ్వర్యం అనర్థాన్ని కలుగజేస్తుంది. అల్పంగాను, అస్థిరంగానూ ఉంటుంది. గర్వాన్ని కల్గించి, భగవానుని మఱచిపోయేటట్లు చేస్తుంది. ఇటువంటి ఐశ్వర్యాలతో నిండినది, చెడ్డను కలుగజేసేదిగా ఉండడంచేత సంసారాన్ని నిర్దేశించే "**సంసృతి**" శబ్దంతో ఐశ్వర్యాన్ని చెబుతున్నారు. అక్షరశబ్దంతో ఆత్మానుభవాన్ని చెబుతున్నారు. "**విజ్ఞానసారథి ర్య స్తు మనఃప్రగ్రహవా న్నరః, సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్**" (కఠ-1-3-9) (ఎవడు మంచి జ్ఞానాన్ని సారథిగాను, మనస్సును పగ్గాలుగాను. కల్గి ఉన్నాడో, అతడు సంసారానికి ఆ దరిలో ఉండే విష్ణువుయొక్క పరమపదాన్ని పొందుతున్నాడు) అని చెప్పబడే అర్చిరాదిగతియొక్క ఎల్ల అయిన పరమపదాన్ని పొంది, భగవానుని అనుభవించడాన్ని "**వైష్ణవాధ్వ**" శబ్దంతో లక్షణాప్రక్రియలో సూచిస్తున్నారు. "**వైష్ణవాధ్వశబ్దేన గతివిశేషద్వారా భగవత్ప్రాప్తి ర్లక్ష్యతే**" అని దేశికవ్యాఖ్య ఈ మూడు పురుషార్థాలలో-అని "**సంసృత్యక్షర వైష్ణవాధ్వసు**" అనే ప్రయోగం యొక్క అర్థం. (**శ్రేయః**)-గొప్పదైన ఆనందం-అని అర్థం. లేక, ఇది ఆ ఆనందాన్ని కల్గించే పుణ్యాన్ని చెబుతుందనికూడా గ్రహించవచ్చు. "**పుణ్యశ్రేయసీ**

ఎన్గిఱపడియే మదహేతువాయ్, భగవత్స్మరణవిరోధియాయ్, ఇవ్వాకారజ్గళినాలే సంసారమ్ అవద్యకరమాయిరుక్కైయాలుమ్ సంస్కృతిశబ్దత్తాలే ఐశ్వర్యత్తై అరుళిచ్చెయ్ కిఱార్. అక్షరశబ్దత్తాలే ఆత్మానుభవత్తై చ్చొల్లుకిఱతు. వైష్ణవాధ్వశబ్దత్తాలే "సోఽధ్వనః పార మాప్నోతి" ఎన్గిఱ గతివిశేషద్వారా భగవత్ప్రాప్తియై లక్షిక్కిఱతు. ఇవఱ్ఱిల్, (శ్రేయ) శ్రేష్ఠతమసుఖమ్, తత్సాధనసుకృతవిశేషమాకవుమామ్. "శ్రేయసీ సుకృతం వృషః" ఎన్దతిఱే.

(నృణాం) అఖిలక్షేత్రజ్ఞర్ క్కెల్లామెన్డపడి. (న సమ్భావ్యతే) న సిద్ధ్యతి యెన్డపడి. "తిరుమామకళ్ తన్నరుళాలులకిల్ తేర్మన్నరాయ్" ఎన్డుమ్, "శెడియారాక్కై యడియారై చ్చేర్తల్ తీర్క్కుమ్ తిరుమాల్" ఎన్డుమ్, "తిరుమకళాలరుళ్ పెఱ్ఱు ప్పొన్నులకిల్ పొలివర్తామే" ఎన్డు మరుళిచ్చెయ్దపడియే ఐశ్వర్యకైవల్య భగవల్లాభరూప-పురుషార్థజ్గళెల్లామ్ పెరియపిరాట్టియారుడైయ ప్రసాదత్తాలల్లతు పెఱవరితాకైయాలే, "సంసృత్యక్షరవైష్ణవాధ్వసు శ్రేయః ప్రసాదాదృతే నృణాం న సమ్భావ్యతే హి" ఎన్గిఱార్. "పద్మయోని రిదం ప్రాప్య పఠన్ స్తోత్రం తతః పరమ్, దివ్యఇచ్ఛ చాష్టగుణై శ్వర్యం తత్ప్రసాదాచ్చ లబ్ధవాన్", "బ్రహ్మాదీనాం యదాయత్తం వైభవం యస్య సా స్వయమ్ , తస్య కైముత్యనిర్ధార్య మీశ్వరత్వం శ్రియఃపతేః" ఎన్డు బ్రహ్మాద్యైశ్వర్యత్తోడు, బ్రహ్మజనకనాన ఈశ్వరనుడైయ ఐశ్వర్యత్తోడు వాశియఱ తత్ప్రసాదాధీనమా యిరుక్కుమ్పడియై ప్రతిపాదిత్తతిఱే. "ఆకుగ్రామనియామకాత్" ఎన్డుమ్, "ఏకో

సుకృతం వృషః" (పుణ్యం, శ్రేయస్సు, సుకృతం, వృషం (ధర్మం) అనే నాల్గు పదాలు ఒకే అర్థాన్ని కల్గినవి) అని నిఘంటువులో పుణ్యం, శ్రేయస్సు ఒకే అర్థాన్ని కల్గినదిగా చెప్పబడ్డాయి.

**(నృణామ్)**- మానవులందఱికి. **(న సంభావ్యతే)**- కలుగదు అని భావం. "**న హి**" అనే పదం ఈ విషయం ప్రసిద్ధి చెందింది- అనే విషయాన్ని తెలుపుతుంది "**తిరుమామకళ్ తన్నరుళాల్ ఉలకిల్ తేర్ మన్నరాయ్ ఒలిమాకడల్శూళ్ న్ద శెఢనీరులకాణ్డు తికళ్వర్కళే**" (పెరియతిరు-2-9-10) (లక్ష్మి అనుగ్రహంచేత లోకంలో రథాలను నడిపే ప్రభువులై శబ్దించే గొప్పసముద్రంచేత చుట్టబడి ఉన్న భూమిని పాలించి పరిఢవిల్లుతారు) అని తిరుమఙ్గైయాళ్వార్లు ఐశ్వర్య పురుషార్థం ఈమె అనుగ్రహంచేత కల్గుతుందని అనుగ్రహించారు. "**శెడియారాక్కై అడియారై చ్చేర్దల్ తీర్క్కుమ్ తిరుమాల్**" (తిరువాయ్-1-5-7) (దాసులు హేయమైన శరీరసంబంధం పొందడాన్ని తీర్చే శ్రియః పతి) అని నమ్మాళ్వార్లు కైవల్యపురుషార్థం శ్రియఃపతి అనుగ్రహంవల్ల కల్గుతుందని అనుగ్రహించారు. "**తిరుమకళాల్ అరుళ్ పెఱ్ఱు మన్నులకిల్ పొలివర్తామే**" (పెరియతిరు- 11-6-10) (లక్ష్మి అనుగ్రహాన్ని పొంది పరమపదంలో పరిఢవిల్లుతారు) అని తిరుమఙ్గైయాళ్వార్లు పరమపదంలో భగవానుని పొందడం ఈమె అనుగ్రహంచేతనే అని అనుగ్రహించారు, ఈ విధంగా మూడు పురుషార్థాలు ఈమె అనుగ్రహం లేకపోతే లభించదు. కనుక, ఐశ్వర్య, కైవల్య-భగవత్ప్రాప్తులలో అతిశయం లక్ష్మి అనుగ్రహం లేకపోతే కలుగదు కనుక. "**సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం న సంభావ్యతే కర్హిచిత్**" అని వీరు అంటున్నారు, "**పద్మయోని రిదం ప్రాప్య పఠన్ స్తోత్రం తతః పరమ్, దివ్యం చాష్టగుణైశ్వర్యం తత్ప్రసాదా చ్చ లబ్ధవాన్**" (బ్రాహ్మపురాణమ్) (నాభీకమలంనుండి పుట్టిన చతుర్ముఖుడు ఈ స్తోత్రాన్ని పొంది, పఠించి దాని తరువాత దివ్యాలు అయిన ఎనిమిది విధాలైన సంపదను ఆ లక్ష్మి అనుగ్రహంచేత పొందాడు), "**బ్రహ్మాదీనాం యదాయత్తం వైభవం యస్య సా స్వయమ్, తస్య కైముత్యనిర్ధార్య మీశ్వరత్వం శ్రియఃపతేః**" (బ్రాహ్మపురాణం) (బ్రహ్మాదులకు వైభవం ఎవరివల్ల కల్గుతుందో, ఆ లక్ష్మి ఎవరికి శేషభూతురాలో, ఆ శ్రియఃపతి ఈశ్వరత్వం కింపునర్న్యాయసిద్ధం) అని పురాణాలలో బ్రహ్మ మొదలైనవారి సంపద, బ్రహ్మను సృష్టించిన భగవానుని సంపద ఈ పిరాట్టియొక్క అనుగ్రహంచేతనే లభిస్తుంది అని చెప్పబడిందికదా. శ్రీపరాశరభట్టర్కూడా శ్రీగుణరత్నకోశంలో "**అకుగ్రామనియామకా దపి విభో రాసర్వనిర్వాహకాత్ ఐశ్వర్యం యదిహోత్తరోత్తరగుణం శ్రీరంగభర్తుః ప్రియే, తుంగం మంగళ ముజ్జ్వలం గరిమవత్ పుణ్యం పునః పావనమ్ ధన్యం యత్తదద శ్చ వీక్షణభవ స్తే పంచషా విప్రుషః**" (శ్రీగుణ-15) (ఓ శ్రీరంగనాయకీ! అల్పగ్రామాధికారి నుండి సర్వలోకనిర్వాహకుడైన పరమాత్మవరకుగల ఉత్తరోత్తరం ఉన్నతమైన ఏ ఐశ్వర్యం ఉన్నదో అది, ఏవి ఉన్నతంగా, మంగళంగా, ప్రకాశవంతమైనవిగా, గొప్పతనం కలిగినవిగా, పుణ్యంగా, పావనంగా, భాగ్యఫలరూపంగా వెలుగుతున్నవో, ఆ వస్తువులు-మీ కటాక్షం యొక్క ఐదాఱుకణాలే సుమా!) అని, "**ఏకో ముక్తాతపత్రప్రచలమణిఘణాత్కారిమౌళి ర్మనుష్యః దృప్యద్దంతావళస్థో న గణయతి న తాన్ యత్ క్షణం క్షోణిపాలాన్, యత్తస్మై తిష్ఠతేఽన్యః కృపణ మశరణో దర్శయన్ దంతపంక్తీ తత్తే శ్రీరంగరాజప్రణయిని! నయనోదంచితన్యంచితాభ్యామ్ !**" (శ్రీగుణ-16) (శ్రీరంగనాయకీ! ఒక మానవుడు మదగజంపైన ఉండి, ముత్యాలమయం అయిన గొడుగులో కదలాడే మణులతో ధ్వనించే కిరీటాన్ని కలవాడై, తనకు నమస్కరించిన

ముక్తాతపత్రప్రచలమణిఘృణాత్కారి” ఎన్ఱుమ్, “ఐశ్వర్య మక్షరగతిమ్” ఎన్ఱుమ్ భట్టరుమ్ ఇవ్వర్థత్తై ప్రకటీకరిత్తరుళినారిఱే.

“ప్రసాదాదృతే శ్రేయో న సమ్భావ్యతే” ఎన్గైయాలే అవనుడైయ సకలఫల ప్రదత్వముమ్ ఏతదధీనమెన్నుమిడమ్ తోన్ఱుకిఱతు. “అశేషజగతాం సర్గోపసర్గస్థితీః స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వఞ్చ కుర్వన్హరిః, యస్యా వీక్ష్య ముఖం

---

రాజులను క్షణకాలం అయినా లెక్కపెట్టడం లేదు. వేఱొకడు, గతి లేనివాడై, తన దీనస్థితి తెలిపేటట్లు (అతనికి) తన దంతపంక్తిని చూపిస్తూ నిలుచున్నాడు. ఈ తారతమ్యం క్రమంగా నీ నేత్రాలు కొంచెం తెఱవడంవల్ల, మూయడం వల్లను ఏర్పడుతున్నది) అనే శ్లోకం “**ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా**” ఇత్యాది శ్లోకం ఈ విషయాన్ని ఘోషిస్తున్నవి.

ఈమె అనుగ్రహం లేకపోతే ఏ పురుషార్థంలోని అతిశయం అయినా ఎవరికీ కలుగదు– అని అనడంవల్ల భగవానుడు మోక్షంతోపాటు అన్ని పురుషార్థాలను అనుగ్రహించగల్గినవాడు–అని పేరు పొందడం ఈమె సంబంధంచేతనే అని తెలుస్తున్నది, “**స్వస్తి శ్రీ ర్దిశతాత్**” అనే శ్రీస్తవంలోని మొదటి శ్లోకంలో కూరేశులు లోకాన్ని సృష్టించడం మొదలైన కార్యాలను, పురుషార్థాలను అనుగ్రహించడాన్ని లక్ష్మీదేవి కనుబొమల కదలికలను, ఆమె ముఖంలోని భావాలను గమనించే చేస్తాడని అనడంచేత, అతడు పురుషార్థాలను ప్రదానంచేయడం కూడా ఆమె ముఖంలోని భావాలను చూచే చేస్తాడని చెప్పనక్కఱలేదు!

“**హి**” శబ్దం “**ఉదారామ్**” మొదలైన చోట్లలో శ్రీ సూక్తంలోను, ఆఴ్వార్ల శ్రీసూక్తులలోను, ఇతిహాసపురాణాలలోను ఆ విషయం ప్రసిద్ధమైనది–అని తెలుపుతున్నది. “**హిశబ్దేన శ్రీసూక్త శ్రీస్తుత్యాదిషు సర్వశాస్త్రేషు చ ప్రసిద్ధిః ద్యోత్యతే**” అని దేశిక వ్యాఖ్యానం. “ఈమె ఈ ప్రభావం ఇంద్రుడు మొదలైనవారి ప్రభావాలవలె ఒక్కొక్క కాలంలో నశించిపోయేదేనా!” అని అంటే, అటువంటిది కాదు. ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉంటుంది–అని అంటున్నారు చివరిపదంతో. (**కర్హిచిత్**)–ఎల్లప్పుడూ–అని భావం. అశ్వమేధయాగంవంటి పుణ్యాలచేత కలిగే మహిమలు కాబట్టి ఇంద్రుడు మొదలైనవారి మహిమలు కాలాన్నిబట్టి నశించిపోయేవిగా ఉంటాయి. అడ్డులేని సంకల్పాన్ని కల భగవానుని సంకల్పాన్ని ఈమె మహిమ అనుసరించి ఉంటుంది కనుక ఇది ఒకే రీతిలో ఉంటుంది–అని భావం.



తదిఙ్గితపరాధీనో విధత్తేఽఖిలమ్” ఎన్ఱు జగత్సృష్ట్యాదికళుమ్, పురుషార్థసృష్టియుమ్ తదిఙ్గితపరాధీనమానాల్ పురుషార్థప్రదత్వమ్ తదధీనమెన్న చ్చొల్లవేణ్డావిఱే.

“హి” శబ్దమ్–శ్రీసూక్తాదిప్రసిద్ధిపరమ్. ఇవళుడైయ ప్రభావముమ్ ఇన్ద్రాదికళ్ *ప్రభావమ్పోలే కాలభేదమాయిరుక్కుమో? వెన్నిల్; అఙ్గనన్ఱిక్కే, ఏకరూపమాయిరుక్కు మెన్గిఱార్. (కర్హిచిత్) ఎన్ఱు. కదాచిదిత్యర్థః. కర్మాధీనప్రభావమాకైయాలే కాలభేదభేద్యమా యిరుక్కుమ్ అతు. సత్యసఙ్కల్పాధీనప్రభావమాకైయాలే ఇతు ఏకరూపమాయిరుక్కు మెన్ఱపడి.

నను, “అమృతస్యైష సేతుః”, “స ప్రీతోఽలం ఫలాయ”, “ఫల మత ఉపపత్తేః”, “మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్” ఇత్యాది ప్రమాణఙ్గళ్ మోక్షప్రదత్వత్తై ముకున్దనుక్కే అసాధారణమాక ప్రతిపాదియానిఱ్క, ఇఙ్గే పిరాట్టిక్కు మోక్షోపాయత్వమ్ శొల్లుకై స్వేతరసమస్తసహాయాఽనపేక్షోపాయత్వత్తుక్కు చ్చేరుమో? వెన్నిల్; “ఇవళ్

---

ఈ విధంగా అన్ని పురుషార్థాలు ఈ పిరాట్టికి అధీనాలు–అని అన్నట్లయితే, అపుడు తలఎత్తే కొన్ని ఆక్షేపాలను ప్రస్తావించి, వాటికి సమాధానం ఇకపై విన్నపింపబడుతున్నది. (ఈ విషయం దేశికుల భాష్యంలో కూడా విస్తృతంగా చర్చింపబడింది.) “**అమృతస్యైష సేతుః**” (ముండక–2–2–5) (సంసారసముద్రానికి ఆవలితీరంలో ఉండే మోక్షాన్ని పొందడంకోసం ఈ భగవానుడే (ఉపాయం) అవుతున్నాడు), “**స ప్రీతోఽలమ్ ఫలాయ**” (దమిడభాష్యమ్) (ప్రీతిని పొందిన భగవానుడే ఫలాన్ని ఇవ్వగలవాడు), “**ఫల మత ఉపపత్తేః**” (బ్రహ్మ. సూ–3–2–37) (ఈ పరమపురుషునివలననే మోక్షం సిద్ధిస్తుంది. అదే ఉపపన్నం కనుక) “**ఆరోగ్యం భాస్కరా దిచ్ఛే ద్ధన మిచ్ఛే ద్ధుతాశనాత్, ఈశ్వరాత్ జ్ఞాన మన్విచ్ఛే న్మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్**” (మాత్స్యపురాణమ్–67–41) (సూర్యునివల్ల ఆరోగ్యాన్ని కోరాలి, అగ్నివల్ల ధనాన్ని కోరాలి, శివునివల్ల జ్ఞానాన్ని కోరాలి, జనార్దనునివల్ల మోక్షాన్ని కోరాలి) మొదలైన ప్రమాణాలలో ముకుందుడు (ముక్తిని ఇచ్చేవాడు) అని పేరు పొందిన భగవానుడే మోక్షాన్ని ఇచ్చే స్వభావాన్ని కలవాడని చెప్పబడగా, ఇక్కడ పిరాట్టికికూడా మోక్షాన్ని ఇచ్చే స్వభావాన్ని చెప్పడం, తనను విడచి వేఱే ఏ సహాయాన్ని ఎదురుచూడని భగవానుని మోక్షోపాయానికి పొసగుతుందా? అన్నది ఇక్కడ ఒక ఆక్షేపం. దీనికి సమాధానం ఈ క్రిందివిధంగా చెప్పవచ్చు. ఇక్కడ ఈ పిరాట్టికి సాక్షాత్తు మోక్షాన్ని ఇచ్చే స్వభావం ఉన్నదని చెప్పబడలేదు. ఈమె పురుషకారం చేస్తేనే తప్ప భగవానుడు మోక్షాన్ని

* “ప్రసాదమ్పోలే” అనిపాఠాంతరం.

పురుషకారమానాలల్లతు ఈశ్వరన్ కార్యమ్ శెయ్యాన్" ఎన్గిఱ నిశ్చయనిబన్ధనమాక పరమ్పరయా మోక్షప్రదత్వమ్ శొన్నవిత్తాల్ తన్నిరపేక్షోపాయత్వవిరోధమ్ ప్రసజ్గియాతిటే. "ఉపాయోపేయత్వే తదిహ తవ తత్వమ్" ఎన్ను ఉపాయత్వమ్ స్వతస్సిద్ధమానాలుమ్, ఇవళ్ పురుషీకరియాతవిడత్తిల్ అతు కార్యకరమాకాతిటే. అన్వయవ్యతిరేకజ్గళాలే తలైపెఱ్ఱారుమ్, తలైయఱుప్పుణ్డారుమాయిటే యిరుప్పతు.

అతిల్, పురుషకారసాపేక్షత్వమ్ ఉపాయనైరపేక్ష్యభఙ్గకమాకాతో? వెన్నిల్; స్వీకారదశైయిల్, ఫలప్రదానశైయిల్ ఫలప్రదత్వహేతువాన జ్ఞానశక్త్యాదికళాల్

---

ఇవ్వడు-అనే నిశ్చయంతో ఏర్పడ్డ మోక్షపరంపరాకారణత్వమే ఇక్కడ ఈమెకు చెప్పబడుతున్నది. అందువల్ల ఈమె మోక్షాన్ని భగవానునిద్వారా అనుగ్రహింపచేస్తుందే తప్ప తాను నేరుగా ఇచ్చేది కాదు. అందువల్ల భగవానుడు సహాయాంతరాన్ని అపేక్షించని మోక్షోపాయంగా ఉంటాడు-అనే గొప్పతనానికి ఏ కొఱత రాదు. "**ఉపాదత్తే సత్తాస్థితినియమనాద్యైః చిదచితౌ స్వముద్దిశ్య శ్రీమా నితి వదతి వాగౌపనిషదీ, ఉపాయోపేయత్వే తదిహ తవ తత్త్వం న తు గుణౌ అత స్త్వాం శ్రీరంగేశయ శరణ మవ్యాజ మభజమ్**'' (శ్రీరంగరాజ-ఉత్తర-88) (ఓ శ్రీరంగనాథా! శ్రీమన్నారాయణుడవైన నీవు సృష్టి-స్థితి-నియమనాది కార్యాలతో చేతనాచేతనాలను తనకోసం గ్రహిస్తున్నావు- అని ఉపనిషద్వాక్యం చెబుతున్నది. అందువల్ల ఇక్కడ ఉపాయత్వం-ఉపేయత్వంకూడా నీకే సహజమైనవి. మిగిలిన ఉపాయోపేయాలవలె అవి కృత్రిమమైనవి కావు. అందువల్ల నిన్ను నిర్వ్యాజమైన ఉపాయంగా శరణు పొందుతున్నాను) అని భట్టర్ అనుగ్రహించిన రీతిలో భగవానుని మోక్షోపాయత్వం సహజమైనది అయినా ఈమె పురుషకారం చేయనపుడు అది ఫలించదుకదా! ఈమె కూడి ఉన్నప్పుడు కాకాసురుడు ఉజ్జీవించడం, ఈమె దగ్గరలేనపుడు రావణుడు శిరచ్ఛేదాన్ని పొందడం-ఈమె పురుషకారం చేయవలసిన ఆవశ్యకతను చూపుతున్నవికదా!

"ఈ విధంగా ఉన్నా, ఈమె పురుషకారం చేయడాన్నిబట్టే స్వామి మోక్షం ఇస్తాడని అంటే, అతడు ఏ సహాయాన్ని ఎదురుచూడని మోక్షోపాయం అన్న సిద్ధాంతం సిద్ధించదుకదా!" అన్నది ఇంకొక ఆక్షేపం. దీనికి సమాధానాన్ని ఈక్రింది విధంగా చెప్పవచ్చు. భగవానుడు ఒక జీవునకు మోక్షాన్ని ఇచ్చేటప్పుడు రెండు స్థితులుంటాయి. అవి ఏవి? అని అంటే, (1) స్వీకారదశ, (2) ఫలప్రదానదశ. స్వీకారదశలో స్వీకరింపబడే



పూర్ణనాకైయాలే, ఉభయనిరపేక్షమాక కార్యమ్ శెయ్యవల్లనాకైయాలే పురుషకారసాపేక్షత్వమ్ ఉపాయనైరపేక్ష్యభఙ్గకమా మిత్తనైయల్లతు, వరణకాలత్తిల్ సాపేక్షత్వమ్ నిరపేక్షత్వభఙ్గకమాకాతెన్నతాయిఱ్ఱు. ఆకైయిటే "ఉపాయస్వీకారత్తిల్ పురుషసాపేక్షముమాయ్, పురుషకారసాపేక్షముమాయిరుక్కుమ్. కార్యకాలత్తిల్ ఉభయనిరపేక్షమాయిరుక్కుమ్" ఎన్ను ఆచార్యాగ్రేసరరాన పిళ్ళైలోకాచార్యరు మరుళిచ్చెయ్‌తతు. "లక్ష్మ్యా సహ-రక్షకః" ఎన్గిఱవిడత్తిల్ ఇవళుక్కుమ్ ఉపాయాన్వయమ్ శొల్లిఱ్ఱిటే యెన్నిల్, అఙ్గుమ్ అప్రధానార్థే తృతీయైయాకైయాలే, అప్రధానరక్షణమాన పురుషకారభావమే

---

ఒక చేతనుడు ఆవశ్యకం అయినట్లే పురుషకారంకూడా ఆవశ్యకం. ఫలప్రదానదశలో మోక్షఫలాన్ని అనుగ్రహించడానికి తగిన జ్ఞానం, శక్తి మొదలైనవాటితో నిండి ఉండడంచేత భగవానుడు ఆ దశలో స్వీకరింపబడే చేతనుని కాని, పురుషకారం చేసే లక్ష్మిని కాని ఎదురు చూడకుండా మోక్షాన్ని ఇవ్వగలవాడు. కాబట్టి ఆదశలో పురుషకారాన్ని ఎదురు చూడడు. కనుక "ఏ సహాయాన్ని అపేక్షించకుండా మోక్షాన్ని ఇవ్వగలవాడు భగవానుడు" అనే అతని గౌరవానికి ఏ కొఱత లేదు. ఈ రీతిగా మోక్షాన్ని అనుగ్రహించే సంకల్పాన్ని చేసేటపుడు భగవానుడు వేఱొకరిని అపేక్షించడం అతని నిరపేక్షోపాయత్వానికి కొఱతనే కల్గిస్తుంది తప్ప, స్వీకరించేటపుడు పురుషకారాన్ని ఎదురుచూడడం దానికి ఏ కొఱతను కల్గించదదు-అని భావం. ఈ కారణంచేతనే ''**ఉపాయస్వీకారకాలత్తిల్ పురుషసాపేక్షముమాయ్, పురుషకారసాపేక్షముమాయిరుక్కుమ్. కార్యకాలత్తిల్ ఉభయనిరపేక్షమాయిరుక్కుమ్**'', (శ్రీవచనభూషణమ్-చూర్ణిక-268) అని ఆచార్యాగ్రేసరులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించారు. "**లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా, రక్ష్యక స్సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే**". (లక్ష్మీతంత్రమ్-28-14) (కారుణ్యమే మూర్తీభవించిన లక్ష్మితో కలసిన స్వామియే రక్షకుడు అని అన్ని సిద్ధాంతాలలోను, వేదాంతాలలోను కీర్తింపబడుతున్నాడు) అని ఈ పిరాట్టికికూడా భగవానునితో కూడి ఉండి రక్షించడం అనే ఉపాయత్వం చెప్పబడిందికదా! అని అంటే, ఆ ప్రమాణంలో ''**లక్ష్మ్యా సహ రక్షకః**'' అని చెప్పబడినందువల్ల ''**సహయుక్తేஉప్రధానే**'' (ప్రాణిని-2-3-19) అని పాణిని సూత్రానుసారం అప్రధానం అనే అర్థంలో తృతీయావిభక్తి వచ్చింది కనుక అప్రధానరక్షణం అయిన పురుషకారస్వభావమే చెప్పబడింది. ద్వయంలో "**శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే**" అనే ఉపాయాన్ని వరించడాన్ని చెప్పే మొదటివాక్యంలో **"నార"** శబ్దంతో చెప్పబడే వాత్సల్యం మొదలైన గుణాలవలె, జ్ఞానం-శక్తి మొదలైన గుణాలవలె, **"చరణ"**.

శొల్లుకిఱతు. ఉపాయవరణప్రతిపాదకమాన పూర్వవాక్యత్తిలే వాత్సల్యాదివత్, జ్ఞానశక్త్యాదివత్, విగ్రహవత్, ఇవళైయుమ్ ఉపాయవిశేషణమాక చ్చొల్లుకైయాలే, ఇవళుక్కుమ్ గుణాదివదుపాయత్వమ్ సిద్ధమిఱే యెన్నిల్, వాత్సల్యాదికళ్ ఆశ్రయణసౌకర్యాపాదకఙ్గళాయుమ్, జ్ఞాశక్త్యాదికళ్ ఆశ్రితకార్యాపాదకఙ్గళాయుమ్, విగ్రహమ్ శుభాశ్రయమాయుమ్, ఉపయోగిక్కుమవైయాకైయాలే, ఇవఱ్ఱుక్కు తదనువిధాయిత్వమాత్రమేయిఱే ఉళ్ళతు. ఇప్పడియే ఇవళుమ్ తదనువిధాయియా- యిరుక్కైయాలే పురుషకారభావమ్ ఇవళుక్కు నియతమాయిరుక్కు మెన్టిఱే ద్వయత్తిలుమ్ నిర్ణయిత్తతు. కిఞ్చ, గుణాదికళుక్కు ఉపాయత్వముణ్డాకిలుమ్ ఇవళుక్కు

---

శబ్దంచే చెప్పబడే తిరుమేనివలె **"శ్రీమ"** చ్ఛబ్దం చేత చెప్పబడే ఈ పిరాట్టినికూడా ఉపాయానికి విశేషణంగా చెప్పడంచేత, ఈమెకుకూడా గుణాలు, తిరుమేని మొదలైనవానివలె ఉపాయత్వం సిద్ధిస్తుందా? అని అంటే, వాత్సల్యం, సౌశీల్యం, సౌలభ్యం, స్వామిత్వం–అనే నాల్గు గుణాలు జీవుడు భగవానుని ఆశ్రయించడంలో సహకరిస్తాయి. జ్ఞానం, శక్తి–మొదలైన గుణాలు ఆశ్రయించిన జీవుని కార్యాన్ని నెరవేర్చడంలో సహాయపడుతాయి. తిరుమేని చేతనునిచే ఆశ్రయింపబడే శుభాశ్రయంగా ఉండి, సహాయపడుతుంది. అందువల్ల ఈ గుణాలకు, తిరుమేనికి ఉపాయం అయిన భగవానుని అనుసరించే స్వభావమే ఉన్నది. ముఖ్యమైన ఉపాయత్వం లేదు. ఆ విధంగానే, ఈ లక్ష్మికికూడా భగవానుని అనుసరిస్తున్నదై. ఉండడంవల్ల ఈమెకు పురుషకారస్వభావమే ఎప్పుడూ ఉన్నది–అని ద్వయాన్ని వివరించేటపుడు మన ఆచార్యులు నిర్ణయించారు. అంతేకాక, గుణాలకు, తిరుమేనికి ఉపాయత్వం ఉన్నదని తలచినా, ఈమెకు పురుషకారస్వభావమే ఎల్లప్పుడూ ఉన్నదని (పరన్దరహస్యం మొదలైన గ్రంథాలలో) ఆచార్యులు నిర్వహించారు. అందువల్ల ఈమెకు పురుషకారస్వభావమే అంగీకరించతగినది–అని చెప్పబడింది.

ద్వయంలోని మొదటివాక్యంలో శ్రీదేవి, గుణాలు మొదలైనవానికికూడా ఉపాయవిశేషణంగా ఉండడం సాధారణమై ఉండగా, గుణాలకు ఉపాయస్వభావాన్ని అంగీకరించి, పిరాట్టికి ఉపాయత్వం లేదు, పురుషకార్వమే ఉన్నది–అని (పరన్దరహస్యమ్) మొదలైనవానిలో చెప్పడానికి ఏం కారణం ? అని అంటే, జ్ఞానం–శక్తి మొదలైన గుణాలు భగవానుడు మోక్షాన్ని అనుగ్రహించాలని సంకల్పించినపుడు అతడు మోక్షాన్ని అనుగ్రహించడంలో సహకరిస్తున్నందువల్ల, పిరాట్టి ఆ స్థితిలో మోక్షాన్ని



ప్పురుషకారభావమ్ నియతమాయిరుక్కుమెన్టిఱే ఆచార్యర్కళ్ నిర్వహిత్తతు. ఆకైయాల్, ఇవళుక్కు ప్పురుషకారభావమే అఙ్గీకార్య మెన్టతాయిఱ్ఱు.

లక్ష్మీగుణాదికళుక్కు విశేషణత్వమ్ అవిశిష్టమాయిరుక్క, గుణఙ్గళుక్కు ఉపాయత్వమ్ అఙ్గీకరిత్తు, ప్పిరాట్టిక్కు ప్పురుషకారత్వ మఙ్గీకరిక్కైక్కు హేతువెన్ ? ఎన్నిల్; గుణఙ్గళ్ కార్యోపయోగయాలేయుమ్, గుణఙ్గళుక్కు ఉపాయత్వముమ్, ఇవళుక్కు ప్పురుషకారత్వముమ్ అఙ్గీకరిక్క త్తట్టిల్లై.

నను, పిరాట్టిక్కు ఉపాయత్వఙ్గొళ్ళిల్ ఉపాయనైరపేక్ష్యమ్ సిద్ధియాతవోపాతి, గుణఙ్గళుక్కు ఉపాయత్వమ్ కొళ్ళిల్ తన్నైరపేక్ష్యహాని వారాతో? వెన్నిల్, గుణఙ్గళ్ పృథగ్బుద్ధిప్రవర్తకమల్లామైయాలుమ్, గుణద్వారా గుణికార్యమ్ శెయ్కై నైరపేక్ష్య ప్రవర్తకమల్లామైయాలుమ్, గుణద్వారా గుణికార్యమ్ శెయ్కై నైరపేక్ష్యభఙ్గకమన్ఱు.

---

అనుగ్రహించడానికి ఏ సహాయం చెయ్యనందువల్ల గుణాలకు ఉపాయత్వం, పిరాట్టికి పురుషకారత్వం అంగీకరించడంలో లోపం లేదు.

అట్లయితే, పిరాట్టికి ఉపాయత్వం గ్రహిస్తే, "భగవానుడు సహాయాంతరాన్ని ఆపేక్షించని ఉపాయం" అనే దానికి కొఱత ఏర్పడేటట్లే, గుణాల ఉపాయత్వం గ్రహిస్తే ఆ కొఱత ఏర్పడదా ? అని అంటే, గుణాలు చేతనాలు కావు. కనుక. ప్రత్యేకంగా ఒక సంకల్పం చేయడానికి యోగ్యతను కల్గినవి అవి కావు. అందువల్ల ఆ గుణాలమూలంగా వాటిని కల్గినవాడైన భగవానుడు సంకల్పించి మోక్షాన్ని ఇవ్వడం "అతడు వేఱొక సహాయాన్ని అపేక్షించని ఉపాయం" అనే గొప్పతనానికి కొఱతను కల్గించదు. ఇక, పిరాట్టి విషయంలో అయితే ఆమె ఒక చేతనద్రవ్యం. అందువల్ల ఆమెకు ప్రత్యేకంగా సంకల్పం చేసే యోగ్యత ఉన్నది. కనుక పిరాట్టికి ఉపాయత్వాన్ని అంగీకరిస్తే, "భగవానుడు వేఱొక సహాయాన్ని ఆపేక్షించని ఉపాయం" అనే అతిశయం లేకుండా పోతుంది. ఈ కారణంవల్లనే మన ఆచార్యులు ఉపాయానుష్ఠానాన్ని తెలిపే ద్వయం మొదటివాక్యంలో **"చిత్రగుమానయ"** (పలు రంగులను కల పశువులను కలవానిని తీసికొని రా) అనే ప్రయోగంలోవలె పిరాట్టికి ఉపలక్షణత్వాన్ని గ్రహించి, ఉపేయాన్ని ప్రార్థించే ద్వయం రెండవ వాక్యంలో **"దండినమ్ ఆనయ"** (దండాన్ని కలవానిని తీసికొనిరా) అనే చోటలోవలె పిరాట్టికి విశేషణత్వాన్ని అనుసంధించడాన్ని ముఖ్యనిర్వాహంగా అంగీకరించారు.

ఇక్కడ దీనికిపైన ఇంకో ఈ ఆక్షేపం తల ఎత్తుతుంది. ద్వయంలోని మొదటివాక్యంలోను, రెండవవాక్యంలోను శ్రీమచ్ఛబ్దం సమానంగా ప్రయోగింపబడి

ద్రవ్యత్వేన పిరాట్టిక్కు పృథగ్బుద్ధి ప్రవృత్తియోగ్యతై ఉణ్డాకైయాలే, తదుపాయత్వే ఉపాయనైరపేక్ష్యమ్ జీవియాతితే. ఆకైయితే-ఉపాయానుష్ఠానప్రకాశకమాన పూర్వవాక్యత్తిలే ''చిత్రగు మానయం'' ఎన్గిఅవిడత్తిఱ్పోలే పిరాట్టిక్కు ఉపలక్షణత్వముమ్, ఉపేయప్రార్థనాప్రకాశమాన ఉత్తరవాక్యత్తిల్ "దండిన మానయ" ఎన్గిఅవిడత్తిఱ్పోలే పిరాట్టిక్కు విశేషణత్వముమ్ నిర్ణయిత్తు అనుసంధిత్తదుమ్.

ఇరణ్డిడత్తిలుమ్ శబ్దమొత్తిరుక్కైయాలే ఏకప్రకారమాక ఉభయత్ర నిర్వహమ్బణ్ణ ప్రాప్తమాయిరుక్క, ఏకత్ర ఉపలక్షణత్వముమ్, అన్యత్ర విశేషణత్వము మెన్డిప్పడి విభజిక్కిఱతుక్కు గమనికై ఎన్ ? ఎన్నిల్, వ్యాక్యద్వయత్తిలుమ్ విశేషప్రతిపాదకశబ్దఙ్గళ్ సమానమాయిరుక్కచ్చెయ్‌తేయుమ్, "అర్థా త్ప్రకరణా ల్లిఙ్గా దౌచిత్యా దర్థనిర్ణయః" ఎన్గిఱ న్యాయత్తాలే పూర్వవాక్యమ్ ఉపాయప్రకరణమాకైయాలే, వాత్సల్యాదిగుణవిశిష్టన్ ఉపాయ మెన్డుమ్, ఉపేయప్రకరణమాన ఉత్తరవాక్యత్తిల్ సర్వశేషియాన వస్తువే ఉపేయ

ఉన్నందున, రెండు వాక్యాలలోను పిరాట్టిని విశేషణంగా గ్రహించే అర్థనిర్వాహాన్ని చేయవలసి ఉండగా, మొదటివాక్యంలో పిరాట్టికి ఉపలక్షణత్వం, రెండవ వాక్యంలో విశేషణత్వం- అనే విభాగాన్ని చెప్పడానికి ఏం కారణం? అన్నది ఆ ఆక్షేపం. దీనికి సమాధానాన్ని ఈ క్రింది విధంగా చెప్పవచ్చు. ద్వయంలోని రెండు వాక్యాలలోను విశేష్యాన్ని నిర్దేశించే నారాయణశబ్దం ఒకటిగానే ఉన్నా, **"అర్థాత్ ప్రకరణా ల్లింగా దౌచిత్యా దర్థనిర్ణయః"** (అర్థం, ప్రకరణం, లింగం, ఔచిత్యం-అనే వానినిబట్టి అర్థాన్ని నిర్ణయించాలి) అనే న్యాయాన్నిబట్టి మొదటివాక్యం ఉపాయప్రకరణం కనుక నారాయణశబ్దం వాత్సల్యం మొదలైన గుణాలతో కూడిన నారాయణుని ఉపాయంగా తెలుపుతున్నది అని, ఉపాయాన్ని తెలిపే రెండవవాక్యంలో సర్వశేషి అయినవాడే ఉపేయం అని నారాయణశబ్దం తెలుపుతున్నదని-ఈ విధంగా రెండు వాక్యాలను విభజించి అర్థనిర్ణయం చేసినట్లే, విశేషణాన్ని చెప్పే శ్రీమచ్ఛబ్దం రెండు వాక్యాలలోను సమానంగా ఉన్నా, ఉపాయాన్ని తెలిపే మొదటి వాక్యంలో భగవానుడు వేఱొక సహాయాన్ని ఆశించని ఉపాయం-అని సిద్ధించడం కోసం పిరాట్టికి ఉపాయత్వాన్ని గ్రహించకుండా, పురుషకారత్వాన్ని గ్రహించడం తగినదే అవుతుంది. ఉపేయాన్ని తెలిపే రెండవవాక్యంలో పిరాట్టి, భగవానులు చేరికలో కైంకర్యం చేయడం స్వరూపానుగుణం కాబట్టి, పిరాట్టికి విశేషణత్వం గ్రహించడమే తగినది. కనుక, ఇటువంటి ఈ అర్థవైలక్ష్యణాన్ని ఉద్దేశించి, మొదటివాక్యంలో పిరాట్టికి ఉపలక్షణత్వం అని, రెండవవాక్యంలో విశేషణత్వం-అని విభాగించి అర్థం చెప్పడం తప్పు కాదు.



మెన్డుమ్ విభజిత్తు అర్థనిర్ణయమ్ పణ్ణినాప్పోలే, విశేషణపాదకశబ్దఙ్గళ్ ఉభయత్ర సమానమాయిరున్దతేయాకిలుమ్, ఉపాయప్రకరణత్తిల్ భగవదుపాయత్వనైరపేక్ష్యసిద్ధిక్కాక పిరాట్టిక్కు ఉపాయత్వానఙ్గీకారేణ పురుషకారత్వఙ్కొళ్ళుకై ఉచితమాకైయాలుమ్, ఉపేయప్రకరణత్తిల్ మిథునవిషయకైఙ్కర్యమే స్వరూపానురూపమాకైయాలుమ్, పిరాట్టిక్కు విశేషణత్వఙ్కొళ్ళుకై ఉచితమాకైయాలుమ్ – ఆకిఱ ఇవ్వర్థస్వారస్యత్తై ప్పθ0 ఇప్పడి విభజిక్క త్తట్టిల్లై.

ఉపలక్షణమావతు-ఉపలక్ష్యాద్బహిర్భూతమాయ్. ఉపలక్ష్య ప్రతీత్యుపాయమాన ధర్మవిశేషమ్. ''శాఖాయాం చన్ద్రః'' ఇత్యాది. పితావుక్కు హితపర్వతమ్ అసాధారణమామ్. ప్రియపర్వతమ్ ఇరువరుక్కు మవిశిష్టమాయిరుక్కై లోకసిద్ధమితే. మాతావుక్కు ప్రజాహితపరత్వమ్ పారతన్త్ర్యభఙ్గకమితే. కించ, "చరణమ్" ఎన్డు

ఉపలక్షణం అంటే-తనచే ఉపలక్షింపబడే విషయంకంటే (ఉపలక్ష్యంకంటే) బాహ్యమై (వేఱుగా) ఉన్నదై, ఆ ఉపలక్ష్యాన్ని తెలియడానికి తగిన స్వభావమై ఉండేది. **"శాఖాయాం చంద్రః"**. (కొమ్మలలో చంద్రుడు) అన్నది దీనికి ఒక ఉదాహరణం. లోకంలో కూడా తండ్రి హితం అనే మంచిని చేస్తాడని, ప్రియాన్ని తల్లి, తండ్రి ఇద్దఱూ చేస్తారని సాక్షాత్తు కనపడుతున్నది. తల్లి తన బిడ్డకు తానే చేయాలని ప్రయత్నించడం ఆమె తన భర్తకు వశంగా ఉండే స్థితికి పొసగదు. అంతేకాక, **"శ్రీమన్నారాయణచరణమ్"** అని ఏకవచనంలో చెప్పినట్లయితే, అది జాత్యేకవచనమై, **"చరణాన్"** అని అర్థం గ్రహించడానికి అవకాశం ఏర్పడి, పిరాట్టికి, భగవానునకు ఉపాయత్వం సిద్ధిస్తుంది-అన్నది అడ్డుకోవడంకోసమే ద్వయంలోని మొదటివాక్యంలో **"శ్రీమన్నారాయణచరణౌ"** అని ద్వివచనంలో ప్రయోగింపబడింది. "రెండు శ్రీచరణాలను" అని అన్నందున వాటినికల భగవానుడు ఉపాయం అవుతున్నాడు- అని తెలుపుతుందే తప్ప, వేఱొక చేతనవస్తువు ఏదీ ఉపాయం అవుతుందని చూపదు. విశేష్యం ప్రధానం అనే దాన్నిబట్టి "రెండు శ్రీపాదాలు" అని చెప్పబడిందే తప్ప, విశేషణం అయిన పత్నియొక్క శ్రీపాదాలను చేర్చిచెప్పడంలో ఇది అడ్డు కాదు-అని అంటే, ఆవిధంగా చెప్పినా, ప్రాధాన్యం విశేష్యానికే, అప్రాధాన్యం విశేషణానికే కాబట్టి అప్రధానం అయిన ఉపాయత్వం-అనే పురుషకారత్వమే పిరాట్టికి సిద్ధిస్తుంది.

ఇద్దఱూ ప్రత్యేక ఉపాయం అని చెప్పడం "లక్ష్మితో కూడిన భగవానుడు ఉపాయం" అనే పూర్వవాక్యానికి పొసగదు. లక్ష్మితోకూడిన భగవానుడు ఉపాయం అని అంగీకరించి, ఈమెకుకూడా ఫలాన్ని అనుగ్రహించే స్వభావాన్ని అంగీకరిస్తే,

ఏకవచనప్రయోగమ్ పణ్ణినాల్ ఉపలక్షణమాయ్, విశేషణత్తుక్కు ముపాయాన్వయమ్ సమ్భవిత్తువిడు మెన్ఱు తద్వ్యావృత్త్యర్థమిఱే ద్వివచనప్రయోగమ్ పణ్ణుకిఱతు. ద్వివచనమ్-మఱ్ఱొన్ఱైయుమ్ సహియాతిఱే. విశేష్యప్రాధాన్యతః శొన్న ద్వివచనమ్ పత్నీవిశేషణత్తుక్కుమ్ అవిశిష్టమెన్నిల్, అప్పోతుమ్ ప్రాధాన్యమ్ విశేష్యత్తుక్కేయాయ్, విశేషణత్తుక్కు అప్రాధాన్యమాకైయాలే, అప్రధానోపాయమాన పురుషకారభావమే సిద్ధిత్తువిడుమిఱే.

ఇరువరుమ్ ప్రత్యేకోపాయమెన్నుమతు-''లక్ష్మీవిశిష్ట ముపాయమ్'' ఎన్గిఱత్తోడు శేరాతు. విశిష్టమ్ ఉపాయమెన్ఱఙ్గీకరిత్తు, ఇవళుక్కుమ్ ఫలప్రదత్వమ్ శొల్లుమ్బోతు ఈశ్వరనుక్కు ఫలప్రదానహేతువాన జ్ఞానశక్త్యాదికళిన్ఱియిలే యొఴియవేణుమ్. జ్ఞానశక్తికళుణ్డెన్నిల్, అప్పోతు ఏతదుపాయభావనిరపేక్ష్యమాక స్వయ మేవ ఫలప్రదక్షమనిఱే. ఫలప్రదహేతువాన జ్ఞానశక్త్యాదికళై ఉణ్డాక్కుకిఱాళెన్నిల్, గుణఙ్గళ్ వన్దేఱియాయ్, స్వాభావికఙ్గళిన్ఱియిలే ఒఴియుమ్. స్వాతన్త్ర్యతిరోహితఙ్గళాన

---

భగవానునకు ఫలాన్ని అనుగ్రహించడానికి కారణం అయిన జ్ఞానం, శక్తి మొదలైనవి లేవు అని చెప్పినట్లవుతుంది. అతని ఆ జ్ఞానశక్తులు ఉన్నాయి అని ఒప్పుకొంటే అపుడు పిరాట్టి ఉపాయత్వాన్ని ఎదురు చూడకుండా తానే ఫలాన్ని ఇవ్వగలవాడవుతాడు. ఇతడు ఫలాన్ని ఇవ్వడానికి కారణాలు అయిన జ్ఞానం శక్తి మొదలైనవానిని పిరాట్టి కల్గిస్తున్నది-అని చెబితే, ఆ జ్ఞానం, శక్తి మొదలైన గుణాలు ఔపాధికాలై, నైసర్గికాలు కాకుండా పోవలసి వస్తుంది. "చేతనుని అంగీకరించే మొదటి స్థితిలో భగవానుని నిరంకుశస్వాతంత్ర్యంతో మఱుగుపడి పోయిన వాత్సల్యం మొదలైన గుణాలను ఈమె పురుషకారాన్ని చేసి ఉద్బుద్ధం చేసేటట్లే, మఱుగుపడిన జ్ఞానం, శక్తి మొదలైనవానిని వ్యక్తం చేస్తుంది- అని అంటే, వాత్సల్యాదులను మఱుగుపఱచే స్వాతంత్ర్యంవలె, జ్ఞానం, శక్తి మొదలైనవానిని మఱుగుపఱచే గుణం ఏదీ లేదే ! ఆ విధంగా ఒక గుణం ఉన్నది అని చెబితే, **"ఞాన మవLతే కొణ్డు ఎల్లా క్కరుమఙ్గళుమ్ శెయ్"** (తిరువాయ్-3-10-8) (జ్ఞానాన్ని ఉపయోగించి అన్ని కార్యాలను చేసే) అనే రీతిలో జ్ఞానంతో శ్రమించకుండా, ఎల్లప్పుడూ సృష్టికార్యాన్ని చేయడం పొసగకుండా పోతుంది. ఏదో ఒక రీతిలో ఈమెకు మోక్షోపాయత్వంలో భాగం ఉన్నది-అని చెప్పాలని చూస్తే, **"యద్యస్తి మయి శుశ్రూషా యద్యస్తి చరితం తపః, యది వాస్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః"** (రామా సుందర-53-29) (నాకు పతిశుశ్రూష ఉన్నట్లయితే, నేను తపస్సు ఆచరించి ఉన్నట్లయితే, నా నాథునకు ఏకపత్నీత్వం ఉన్నట్లయితే అగ్ని అయిన నీవు



వాత్సల్యాదికళై ప్రకాశిప్పిక్కిఱాప్పోలే తిరోహితజ్ఞానశక్తికళై ప్రకాశిప్పిక్కిఱాళెన్నిల్, అవఱ్ఱుక్కు స్వాతన్త్ర్యమ్బోలే ఇవఱ్ఱుక్కు ఒరు తిరోధాయక గుణ మిల్లైయే. ఉణ్డెన్నిల్, "ఞానమ.˙.తే కొణ్డెల్లాక్కరుమఙ్గళుమ్" ఎన్గిఱపడియే జ్ఞానఙ్గొణ్డు శోమ్బాతే నిరన్తరసృష్టి పణ్ణక్కూడాతిఱే. యేన కేన ప్రకారేణ ఉపాయాన్వయమ్ శొల్లిల్, "శీతో భవ" ఎన్నవల్ల దివ్యశక్తియుణ్డాయిరుక్క, స్వరక్షణే స్వప్రవృత్తియాకిఱ వశుద్ధి ఇత్తలైయిలిల్లై యెన్ఱుమ్, "తస్మింశ్చ బహవో గుణాః" ఎన్ఱు ఉపాయపూర్త్తిక్కడియాన గుణపూర్త్తి అత్తలైక్కే ఉళ్ళతెన్ఱుమ్ దర్శిప్పిత్తు, స్వప్రాప్తిక్కుమ్ "తత్తస్య సదృశం భవేత్" ఎన్ఱు స్వస్వరూపానురూప-పారతన్త్ర్యానుసన్ధానమాక తన్నిరపేక్షోపాయత్వత్తై ప్పార్త్తిరుక్కు మ్బడియాన ఇవళ్ పరిశుద్ధప్రకృతిక్కు అతు శేరాతిఱే.

---

హనుమంతునకు చల్లనివాడవు కావాలి) అని అంటూ హనుమంతుని తోకలో పెట్టిన నిప్పును చల్లగా చేయగల శక్తి సీతా పిరాట్టికి ఉన్నా, ఆ శక్తితో రావణుని దహించకుండా, శ్రీరాముడు వచ్చి మనలను కాపాడి, తీసికొనిపోవడమే తగినది-అనే భావంతో, **"ఆశంసేయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యతే పతిః, అంతరాత్మా చ మే శుద్ధ స్తస్మిం శ్చ బహవో గుణాః"** (రామాసుందర-37-14) (వానరశ్రేష్ఠా! నాభర్త త్వరలోనే నన్ను, దరిచేరతాడు అని ఎదురుచూస్తున్నా. నా మనస్సు తనను తాను రక్షించుకోవడంకోసం తాను ప్రయత్నం చేయడం అనే అశుద్ధి లేనిది. అతనిలో పలు గుణాలున్నాయి) అని తన పారతంత్ర్యానికి కొఱతరాకుండా తనను రక్షించడానికి తగిన పూర్ణగుణాలు భగవానునివద్దనే ఉన్నవి అని చూపి, **"శరై స్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః, మాం నయే ద్యది కాకుత్థ్సః తత్తస్య సదృశం భవేత్"** (రామా. సుందర-39-30) (శత్రువుల బలాన్ని మర్దించే శ్రీరాముడు లంకను బాణాలతో కలత చెందేటట్లు చేసి, నన్ను పిలుచుకొని పోయినట్లయితే, ఆ విధంగా చేయడం వారికే తగినది) అనే రీతిలో తనను రక్షించడం శ్రీరామునకే తగినది అని తన స్వరూపానికి తగిన పారతంత్ర్యాన్ని అనుసంధించి, భగవానుడు ఏ సహాయాన్ని ఎదురుచూడని ఉపాయం అని నమ్మి, తత్ప్రకారం నడచిన ఈమె పరిశుద్ధమైన స్వభావానికి అది పొసగదు.

దీనికి పిమ్మట, ఇంకొక ఆక్షేపం తల ఎత్తుతున్నది. లక్ష్మి భగవానునకు స్వరూపనిరూపక కాబట్టి లక్ష్మీదేవితో కూడిన నారాయణుడైన శ్రియఃపతియే ఉపాయం అని అంగీకరించాలి.**"యద్యపి సచ్చిత్తో న నిర్భుగ్నదైవతం గుణగణం మనసాஉనుధావేత్ తథాప్యన్తర్గుణా మేవ దేవతాం భజతే, తత్రాపి సగుణైవ దేవతా ప్రాప్యతే"** (ద్రమిడ

నను, శ్రియఃపతియే ఉపాయ మెన్ఱు అజ్గీకరిక్కవేణ్డుకైయాలే నిరూప్య స్వరూపత్తుక్కు చ్చొన్న ఉపాయత్వమ్ నిరూపకస్వరూపత్తుక్కుమ్ "యద్యపి సచ్చిత్తః" ఎన్గిఱ న్యాయత్తాలే అనివర్త్యమాయ్క్కొణ్డు తన్నడైయే వారాతో? వెన్నిల్, స్వరూపనిరూపకత్వేన నిరూప్యనిరూపకజ్గళుక్కు అవర్జనీయసమ్బన్ధముణ్డేయాకిలుమ్, ఉపాయవరణదశైయిల్ స్వరూపనిరూపకజ్గళాన జ్ఞానానన్దజ్గళ్ ఉపయోగ మిల్లామైయాలే నిరూపకమాత్రమాయ్ నిఱ్కిఱాప్పోలే, భగవత్స్వరూపనిరూపకమాన లక్ష్మీస్వరూపముమ్ కారణత్వదశైయిఱ్పోలే ఉపాయదశైయిల్ తన్నాల్ కొళ్వతొరు ప్రయోజన మిల్లామైయాలే, తత్స్వరూపక నిరూపకత్వమాత్రత్తిలే అన్వయిత్తు, తదసాధారణోపాయ- త్విత్తిల్ అన్వయియామ లిరుక్కైయాలే నిరూపకమాన ఏతత్స్వరూపత్తుక్కు ఉపాయత్వమ్ వారాతిఱే.

---

భాష్యమ్) (సత్తు అయిన బ్రహ్మను ధ్యానించేవాడు, దేవుడు అనే ఆ పరబ్రహ్మను విడిచిన గుణసమూహాన్ని మాత్రం మనస్సుతో ధ్యానించకపోయినా, గుణాలతోకూడిన దేవతను ఉపాసిస్తున్నాడు. అందులోను, గుణంతో కూడిన దేవతను పొందుతున్నాడు) అని ద్రమిడభాష్యకారులు అనుగ్రహించిన గుణసిద్ధిన్యాయంతో ఈమెచే నిరూపింపబడే భగవానునకు చెప్పిన ఉపాయత్వం, అతనిని నిరూపించే ఈమెకుకూడా రాదని అడ్డుపెట్టడానికి వీలులేకుండా, తనకు తానే వస్తుందే-అన్నది ఆ ఆక్షేపం. దీనికి సమాధానాన్ని ఈ క్రింది విధంగా చెప్పవచ్చు. భగవానుడు ఈమెచే నిరూపింపబడేవాడు గాను, ఈమె అతనిని రూపించేదిగాను-ఈ విధంగా ఒకరితో ఇంకొకరు విడదీయరాని సంబంధాన్ని కలవారైనా, భగవానుని స్వరూపాన్ని నిరూపించే జ్ఞానం, ఆనందం మొదలైన స్వభావాలు చేతనుని కార్యాన్ని చేయడానికి ఉపకరించకుండా కేవలం నిరూపకంగా ఉండేటట్లే, నిరూపకంగా ఉండే పిరాట్టికూడా చేతనుని కార్యాన్ని చేయడానికి ఏ సహాయం చేయనందువల్ల కేవలం నిరూపకగానే ఉంటుందని చెప్పాలి. భగవానుడు లోకానికి కారణం అయినపుడు, అతనిని లోకాలను సృష్టించేటట్లు ప్రార్థించడం మొదలైన కార్యాలను ఈమె చేయడంచేత, ఈమెకు అప్రాధాన్యం అయిన జగత్కారణత్వాన్ని ఒప్పుకొంటాము. ఆ రీతిలోనే, భగవానుడు చేతనునకు మోక్షాన్ని అనుగ్రహించే కార్యాన్ని చేసేటపుడు ఈమె ఏ సహాయాన్ని చేయనందువల్ల జ్ఞానానందాలవలె కేవలం నిరూపకగానే ఉంటుంది. ఉపాయత్వంలో భాగాన్ని (అన్వయాన్ని) కల్గినది కాబోదు-అనే చెప్పాలి.

అంతేకాక, ఉపాయం అయిన భగవానునకు విశేషణాలు అయిన వాత్సల్యం మొదలైన గుణాలకు "భగవానుని చేతనుడు ఆశ్రయించడలో సహాయపడుతున్నవి" అనే ప్రయోజనం ఉన్నది. జ్ఞానం, శక్తి మొదలైన గుణాలకు "జీవుని సంసారసంబంధాన్ని



కిఞ్చ, ఉపాయవిశేషణమాన గుణవిగ్రహజ్గళుక్కు సౌకర్యాపాదకత్వేనవుమ్, కార్యాపాదకత్వేనవుమ్,శుభాశ్రయత్వేనవుమ్, కార్యభేద ముణ్డాకిఱాప్పోలే, తద్విశేషణ భూతైయాన పిరాట్టిక్కుమ్ ఉపాయదశైయిల్ ఉపాయత్వరహితమాక పురుష కారత్వరూపకార్యభేద ముణ్డాక త్తట్టిల్లై. "లక్ష్మీభర్తుః దాసదాసస్య దాసః", "తిరుమాలే నాను మునక్కు ప్పÇవడియేన్'. ఎన్గిఱపడియే స్వరూపదశైయిల్ శేషత్వస్వరూపత్తుక్కుమ్, "శ్రియా సార్ధమ్", "తిరుమాలే నిన్టే యాట్చెయ్య" ఎన్గిఱపడియే స్వరూపానురూపమాక ప్రాప్యదశైయిల్ కైజ్కర్యత్తుక్కుమ్ మిథునమే ప్రతిసమ్బన్ధియాక వేణ్డినవోపాతి, ఉభయానురూపమాన వుపాయదశైయిలుమ్ అవశ్యాపేక్షితమాన ఉపాయ

---

పోగొట్టి, పరమసామ్యాన్ని ఇవ్వడంలో సహాయపడుతున్నవి" అనే ప్రయోజనం ఉన్నది. భగవానుని తిరుమేనికి "శుభాశ్రయమై ఉండి భగవానునిపట్ల చేతనుని అభినివేశం పొందేటట్లు చేసి, అతనిని మోక్షం పొందేటట్లు చేస్తున్నది" అనే ప్రయోజనం ఉన్నది. వీటివలెనే భగవానునకు విశేషణంగా ఉండే ఈ పిరాట్టికికూడా చేతనునకు భగవానుడు మోక్షాన్ని ఇచ్చేటపుడు "ఉపాయత్వంలో భాగం లేకుండా, ఆశ్రయించేటప్పుడు పురుషకారాన్ని చేయడం అనే ఫలం ఉన్నది" -అని అంగీకరించడంలో ఏ దోషం లేదు. పిరాట్టికి, భగవానునితో మూడు దశలలో సంబంధం ఉన్నది. **"భువనభవనస్థిత్యపాయైకహేతోః లక్ష్మీభర్తుః నరహరితనోః దాసదాసస్య దాసః"** (లోకాలను సృష్టించి, రక్షించి లయం చేసే అద్వితీయకారణపురుషుడైన శ్రియఃపతి నరసింహరూపుని దాసుని దాసునకు దాసుడను) అని, **"తిరుమాలే !నానుమ్ ఉనక్కు ప్పÇవడియేన్"** (తిరుప్పల్లాణ్డు-11) (శ్రియఃపతీ! నీకు నేను అనాదిగా శేషభూతుడను) అని పల్కిన రీతిలో స్వామిగా ఉండే దశ ఒకటి. ఆ దశలో శేషభూతుడైన జీవునకు ఇద్దఱూ కలిసే శేషిభూతులవుతున్నారు. **"వైకుంఠే తు పరే లోకే (శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైః భాగవతై స్సహ"** (శైవపురాణమ్) (గొప్ప లోకం అయిన వైకుంఠంలో జగత్పతి, భావించడానికి సాధ్యం కాని స్వరూపాన్ని కలవాడు అయిన విష్ణువు భక్తులతో, భాగవతులతో కూడినవాడై శ్రీదేవితోపాటు వేంచేసి ఉంటాడు) అని, **"తిరుమాలే నిన్టే ఆట్చెయ్య"** (తిరువాయ్-8-3-8) (శ్రియః పతీ! నిన్నే సేవించాలని) అని చెప్పే కైంకర్యాన్ని స్వీకరించే దశ రెండవది. స్వరూపానికి తగిన ప్రాప్యమై ఉండి, కైంకర్యాన్ని స్వీకరించే ఈ దశలోను, ఒక మిథునమే కైంకర్యాన్ని స్వీకరిస్తున్నది. ఇక, శేషిగా ఉండడానికి, కైంకర్యాన్ని స్వీకరించడానికి తగిన, తప్పక ఆవశ్యకం అయిన ఉపాయంగా ఉండే దశ మూడవది. ఈ మూడవదశలో **"సర్వధర్మాన్**

ప్రతిసమ్బన్ధిత్వత్తిల్ స్వవ్యతిరిక్తసమస్తసహాయాఽనపేక్షమాన ఉపాయత్తినుడైయ "మా మేకమ్" ఎన్గిఱ నైరపేక్ష్యభఙ్గమాన వుపాయత్వత్తిల్ అన్వయమఱ్ఱు తద్విరోధమాక పురుషకారత్వరూపప్రతిసమ్బన్ధిత్తిలే ఇవళుక్కన్వయమాకక్కడవతు.

నను స్వాయమ్భువే "సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీమ్, క్షిప్రప్రసాదినీం దేవీం శరణ్యాం చిన్తయే దితి" ఎన్ఱుమ్, బ్రాహ్మే "సకృద్విభాతా సర్వార్తిసముద్రపరిశోషిణీ, భవభఙ్గాపహారిణీ పరనిర్వాణదాయినీ" ఎన్ఱుమ్ *ఇత్యాది

---

**పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"** (భ.గీ-18-66) (ఫలసాధనాలైన అన్ని ధర్మాలను సవాననగా విడచిపెట్టి నన్ను ఒక్కణ్ణే ఉపాయంగా విశ్వసించు. నేను నిన్ను అన్ని పాపాలనుండి విడిపిస్తాను) అనే ప్రమాణంలో ఉన్న "**మామ్, ఏకమ్**" అనే పదాలు "భగవానుడు ఉపాయం అయేటపుడు తనకంటే వేఱయిన ఏ చేతనుని సహాయాన్ని అపేక్షించడు" అని ఘోషిస్తున్నాయి. ఇందువల్లనే ఈ స్థితిలో పిరాట్టికి అన్వయం చెబితే భగవానుడు వేఱెవ్వరినీ ఎదురుచూడకుండా ఉపాయం అవుతున్నాడు అనే గొప్పతనానికి కొఱత కల్గుతుంది. కనుక ఉపాయస్వభావంలో ఈ విరోధం కలుగకుండేటట్లు పురుషకారత్వంలోనే ఈమెకు భాగం ఉన్నది-అని ఒప్పుకోవాలి.

దీనికి పిమ్మట ఇంకో ఆక్షేపం తల ఎత్తుతున్నది. అది ఏమంటే- **"సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీమ్, క్షిప్రప్రసాదినీం దేవీం శరణ్యాం చింతయే దితి"** (స్వాయంభువమ్) (అన్ని ఇష్టాలను ఇచ్చేది, అందమైనది, సంసారసాగరాన్ని దాటించేది, త్వరగా అనుగ్రహించేది అయిన లక్ష్మిని ఈ రీతిలో శరణు పొందడానికి యోగ్యుడుగా భావించాలి) అని స్వాయంభువంలో లక్ష్మి అన్ని కోఱికలను ఇస్తుంది అని, సంసారసముద్రాన్ని దాటిస్తుంది అని చెప్పబడింది, **"ఆత్మవిద్యా సా దేవీ త్వం విముక్తిఫలదాయినీ"** (విష్ణు.పు-1-9-20) (దేవీ ! నీవే ఆత్మజ్ఞానాన్ని ఇచ్చేదానివిగాను, ముక్తిఫలాన్ని ఇవ్వడమే స్వభావంగా కల్గినదానివిగాను ఉన్నావు) అని శ్రీ విష్ణుపురాణంలో ఈమె ముక్తిఫలాన్ని ఇవ్వడమే ప్రకృతిగా కల్గినది-అని చెప్పబడింది. **"సకృద్విభాతా సర్వార్తిసముద్రపరిశోషిణీ, భవభంగాపహారిణీ పరనిర్వాణదాయినీ"** (శ్రీసహస్రనామం-87, 122, 123) (ఉదయించి అస్తమించని జ్యోతివలె ప్రకాశించేది, సమస్తదుఃఖాలు అనే సముద్రాన్ని ఎండిపోయేటట్లు చేసేది, సంసారమనే నైచ్యాన్ని

---

* ఇక్కడ కొంత భాగం లోపించినట్లు తోస్తుంది.



ప్రమాణఙ్గళ్ ఇవళుడైయ ఉపాయభావత్తై చొల్లిఱ్ఱియాకిలుమ్, అవై శరణ్యనుడైయ ఇచ్ఛానువిధాయిత్వసూచకఙ్గళాకక్కడవతు. ఇతుక్కు నియామక మెన్? ఎన్నిల్.

"లక్ష్మీం పురుషకారేణ వృతవన్తః" ఎన్ఱుమ్, "లక్ష్మీః పురుషకారేణ వల్లభా ప్రాప్తియోగినీ, ఏతస్యా శ్చ విశేషోఽయం నిగమాన్తేషు శబ్ద్యతే" ఎన్ఱుమ్,"లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా.....నాన్యథా లక్షణం భవేత్" ఎన్ఱుమ్ పురుషకారత్వత్తైయే లక్షణమాక

---

పోగొట్టేది, గొప్ప మోక్షాన్ని ఇచ్చేది) అని బ్రహ్మాండపురాణంలో ఉండే లక్ష్మీసహస్ర-నామంలోగల ఈమె తిరునామాలు దుఃఖసముద్రాన్ని ఇంకించేది అని, సంసారభంగాన్ని పోగొట్టేది అని, మోక్షాన్ని ఇచ్చేది అని ఘోషిస్తున్నాయి. వీటివల్ల ఈమెకు మోక్షోపాయత్వంలోనూ అన్వయం ఉన్నదని తెలుస్తున్నదే (ఈ ప్రమాణాన్నిబట్టే శ్రీదేశికులు పిరాట్టికి అప్రధానం అయిన మోక్షోపాయత్వాన్ని ఒప్పుకొన్నారు-అని తర్వాత వివరింపబడుతుంది) ఈ రీతిలో ప్రమాణాలున్నపుడు ఈమెకు అప్రధానం అయిన మోక్షోపాయాన్ని ఒప్పుకొంటే ఏమి లోపం?-అన్నది ఆ ఆక్షేపం.

దీనికి సమాధానాన్ని ఈ విధంగా చెప్పవచ్చు, ఈ ప్రమాణాలు మోక్షోపాయత్వంలో ఈమెకు అన్వయం ఉన్నదని చెప్పినా, భగవానుడు చేతనునకు మోక్షాన్ని ఇవ్వాలని అనుకున్నపుడు ఈమె అతని ఆశయానికి అంగీకరిస్తుంది అన్నది తెలుపుతుందనే చెప్పాలి. **"లక్ష్మీం పురుషకారేణ వృతవన్తః"** (విష్వక్సేనసంహిత) (లక్ష్మిని పురుషకారంగా వరించినవారై) అని, **"లక్ష్మీః పురుషకారేణ వల్లభా ప్రాప్తియోగినీ, ఏతస్యా శ్చ విశేషోఽయం నిగమాన్తేషు శబ్ద్యతే"** (పాంచరాత్రం) (నాకు వల్లభఅయిన లక్ష్మి పురుషకారం చేయడంద్వారా నన్ను పొందిస్తుంది. ఈమె పురుషకార మహిమ వేదాంతలలో చెప్పబడింది.) అని, **"లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా.....నాన్యథా లక్షణం భవేత్"** (పాంచరాత్రం) (లక్ష్మి పురుషకారం చేసేదిగానే నిర్దేశింపబడింది... ఈమెకు వేరేవిధమైన, అంటే ఉపాయరూపం అయిన లక్షణం లేదు.) అని లక్ష్మికి ఉపాయత్వం నిషేధింపబడింది. భగవానునకే అది నిశ్చయింపబడింది. లక్ష్మి మోక్షానికి కారణభూతురాలు అని సామాన్యంగా అన్వయక్రమంలో చెప్పిన ప్రమాణాలకంటే లక్ష్మికి మోక్షప్రదత్వం లేదు అని నిషేధిస్తూ వ్యతిరేకక్రమంలో చెప్పిన ప్రమాణాలు ప్రబలాలు. అర్థాన్ని స్థిరపరచడంలో ఇవి దృఢమైనవి. ఇదేవిధంగా భగవానుడే ఈ విషయం స్వయంగా తనకు, లక్ష్మికి అభిమతం అని, **"మమాపి చ మతం హ్యేతత్"** (నాకుకూడా ఇది అభిమతం) అని అంటూ అనుగ్రహించాడుకూడా. ఇది సత్సంప్రదాయంకూడా

చ్చొల్లి, అన్యథా లక్షణ మిల్లైయెన్ఱు ఉపాయతత్త్వై నిషేధిత్తతితే. అన్వయత్తిలుమ్ వ్యతిరేకమ్ అర్థదార్ఢ్యత్తుక్కుఱుప్పాకైయాలే ఇతువే ప్రబలప్రమాణప్రసిద్ధమాకైయాలుమ్, భగవదభిమతమాకైయాలుమ్, పిరాట్టిక్కత్యన్త మభిమతమాకైయాలుమ్, సమ్ప్రదాయసిద్ధమాకైయాలుమ్, ఏతదనుగుణమాక అవఱ్ఱై యోజిక్క త్తట్టిల్లై. తదనుగుణమాక ఇవఱ్ఱై యోజిక్కుమిడత్తిల్, ప్రబలప్రమాణవిరోధముమ్ భగవదనభిమతత్వముమ్, లక్ష్మ్యనభిమతత్వముమ్, సమ్ప్రదాయవిరోధముమ్ సమ్భవిక్కుమ్.

ఆకైయాలే సకలప్రమాణప్రమాతృపరిగృహీతమాన పురుషకారభావమే సారాసారవివేచనత్తుక్కు పరిగ్రాహ్యమ్ ఎన్ఱదాయిఱ్ఱు. "ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదా శ్చ", "యద్యదాచరతి శ్రేష్ఠః", "మేలైయార్ శెయ్వనకళ్ వేణ్డువన" ఎన్నక్కడవతితే.

---

పూర్వాచార్యులు అందఱూ ఇందువల్లనే ఏకకంఠంగా పిరాట్టికి పురుషకారత్వాన్ని అంగీకరించారు. అందువల్ల పూర్వం ప్రస్తావించిన ప్రమాణాలకు, ఆ ప్రమాణాలకు తగినట్లుగా పురుషకారత్వంలో దృష్టిని కల్గినది–అని అర్థాన్ని గ్రహించాలి. పూర్వం ఉట్టంకించిన ఆ ప్రమాణాలకు అనుకూలంగా, తరువాత ఉట్టంకించిన ఈ ప్రమాణాలకు అర్థం గ్రహించి, ఇవి ఉపాయత్వంలో దృష్టిని కల్గినవి అని చెప్పకూడదా? అని అంటే, ఈ విధంగా గ్రహిస్తే, "లక్ష్మికి మోక్షోపాయత్వం లేదు"–అని వ్యతిరేకంగా చెప్పే ప్రబలప్రమాణాలకు విరోధం, భగవానుని అభిప్రాయానికి అంగీకార్యం కాదు–అనే కొఱత, లక్ష్మీదేవి మనస్సుకు అభిమతం కాదు అనే–కొఱత, భట్టర్ మొదలైన సకలపూర్వాచార్యులు "పిరాట్టికి పురుషకారత్వమే ఉన్నవి, ఉపాయత్వం లేదు" అని పలికే సత్సంప్రదాయంతో విరోధిస్తుంది–అనే కొఱత కల్గుతుంది.

అందువల్ల "సారం ఇది, అసారం ఇది" అన్నది విభజించి గుర్తించగల వివేకులు అందఱూ ప్రమాణాలచేత, ఆ ప్రమాణాలకు అర్థనిష్కర్షాన్ని చేసిన ప్రమాతలైన పూర్వాచార్యులచేతను అంగీకరింపబడ్డ పురుషకారత్వమే పిరాట్టికి ఉన్నదని అంగీకరింపబడిందని స్పష్టమౌతున్నది. **"ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదా శ్చ"** (ఆపస్తంబధర్మసూత్రమ్)–(ధర్మాన్ని తెలిసినవారి ఆచారం (ముఖ్యం అయిన) ప్రమాణం, వేదాలుకూడా ప్రమాణమే అని ఆపస్తంబధర్మసూత్రంలోనూ వేదంకంటే శిష్టాచారమే ప్రమాణమని చెప్పబడింది. **"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః, స యత్ ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే"** (భ.గీ–3–21) (జ్ఞాని ఏ యే కార్యాలను అనుష్ఠిస్తాడో ఆయా కార్యాలనే జ్ఞానం లేని మిగిలిన మానవులు అనుసరిస్తారు. ఆ జ్ఞాని కర్మలను



ఆక, ఇశ్శ్లోకత్తాలే "పెరియపిరాట్టియార్ స్వకరుణాకటాక్షలేశత్తాలే స్వాశ్రితర్క్కు సకలపురుషార్థఙ్గళైయుమ్ ప్రసాదిత్తరుళువర్. సకలపురుషార్థవిలక్షణమోక్షత్తై తదసాధారణోభయభూతనాయ్, స్వవశవర్తియాయ్, స్వాపాంగేఙ్గితపరాధీననాన ఈశ్వరనై క్కొణ్డు కొడుప్పిత్తరుళువర్. ఆనపిన్బు, పురుషార్థాంతరఙ్గళోడు, విలక్షణపురుషార్థత్తోడు వాశియఱ సకలశ్రేయస్సుమ్ త్వత్ప్రసాదత్తాలల్లదు సంభవియాదు" ఎన్ఱు మిడత్తై స్థిరీకరిత్తరుళినారాయ్త్తు. శ్రీసాత్త్వతత్తిలే అవనుక్కు మోక్షప్రదత్వముమ్, దేవిక్కు ఐశ్వర్యప్రదత్వముమ్ విభజిత్తు స్వయమేవ స్పష్టమాక అరుళిచ్చెయ్దారితే.

---

ఎంతవరకు అనుష్ఠిస్తాడో అంత వరకే లోకంకూడా అనుష్ఠిస్తుంది) అని గీతలోను, **"మేలైయార్ శెయ్వనకళ్ వేణ్డువన"** (తిరుప్పావై–26) (పెద్దలు చేసే వానిలో కావలసినవి) అను గోదాదేవి ఈ విషయాన్ని ద్రఢీకరించారు.

నాయనారాచ్చాన్‌పిళ్ళై విస్తృతంగా చేసిన ఈ నిర్ణయాలకు చతుఃశ్లోకిలోని మూడవ శ్లోకానికి భాష్యాన్ని ప్రసాదిస్తూ శ్రీదేశికులు చివరలో అనుగ్రహించిన సమాధానం ఈ విధంగా ఉన్నది, **"మోక్షప్రదే భగవతి ముముక్షూణాం ఘటకతయైషా తిష్ఠతీతి సర్వసమ్మతమ్. పరిపూర్ణానుభవప్రదానసంకల్ప స్తు భగవతః స్వస్యైవ వా, సపత్నీకస్య వేతి యథా ప్రమాణం భవతు"** (మోక్షాన్ని అనుగ్రహించే భగవానుని విషయంలో ముముక్షువుకు ఈమె ఘటకురాలుగా (జీవులను స్వామి దగ్గరకు స్వామివద్దకు చేర్పించే పురుషకారస్వరూపిణిగా) ఉంటుంది–అన్నది అందఱు ఆచార్యులు అంగీకరించినది. పరిపూర్ణానుభవం అనే మోక్షాన్ని అనుగ్రహించే సంకల్పాన్ని భగవానుడు తానే చేస్తాడా? లేక, పత్నితో కలసి చేస్తాడా?–అన్నది ప్రమాణాల ప్రకారం కానివ్వండి) అని ఈ రీతిలో అనుగ్రహించడం ద్వారా మోక్షప్రదానసంకల్పాన్ని భగవానుడే చేస్తున్నాడు–అన్నది నాయనార్ పక్షం అని, పత్నితో కూడి చేస్తున్నాడు–అన్నది తమ పక్షమని దేశికులు స్పష్టం చేశారు. తమ పక్షాన్ని తెలిపేటపుడు **"శ్రీ శ్రీశయో ర్వా'.** (మోక్షప్రదాన సంకల్పం చేయడం భగవానుడు, లక్ష్మి ఇద్దరూ కూడి ఉండి) అని చెప్పకుండా, **"సపత్నీకస్య వా"** (పత్నితో కూడిన భగవానునకా?) అని అనుగ్రహించడంవల్లను, ఉపాయత్వంలో పిరాట్టికి అప్రధానత్వమే తమ అభిప్రాయమని సూచించారు. ఇందువల్లకూడా దేశికులు నాల్గవ పక్షాన్నే స్పృశించారు అని, అయిదవ పక్షాన్ని కాదన్నారు అని తెలుస్తున్నది.–అని శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ అభిప్రాయం. ఈ విధంగా ఈ శ్లోకంతో–"లక్ష్మీదేవి తన కరుణ నిండిన కటాక్షంతో తన దాసులకు అన్ని పురుషార్థాలను అనుగ్రహిస్తుంది.

**అవతారికై:-** (శాంతేత్యాది) "త్రయాణాం భరతాదీనాం భ్రాతృణాం దేవతా చ యా, రామస్య చ మనఃకాంతా ప్రాణేభ్యోఽపి గరీయసీ" ఎన్గిఱ ప్రమాణానుసారేణ "కాంత స్తే పురుషోత్తమః" ఎన్ఱు కర్తవ్యర్థత్తైయుమ్, "ఫణిపతిః" ఎన్ఱు తొడఙ్గి క్కర్మణ్యర్థత్తైయుమ్ అనుసంధిత్తు, ఆక, ఇవ్వడి ఉభయవిభూతినాథనై ఆశ్రయిత్తుక్కొణ్డిరుక్కైయాలే "శ్రీః"

మిగిలిన అన్ని పురుషార్థాలకంటే గొప్పదైన మోక్షాన్ని దాన్ని అనుగ్రహించే ఏకైకోపాయంగా ఉన్నవాడు, తనకు వశమై ఉన్నవాడు అయిన సర్వేశ్వరునిద్వారా అనుగ్రహింపజేస్తోంది. అందువల్ల మిగిలిన పురుషార్థాలతో, ఉత్తమపురుషార్థం అయిన మోక్షంతో భేదం లేకుండా అతిశయం అంతా లక్ష్మి అనుగ్రహించకపోతే లభించదు" అనే విషయాన్ని నొక్కి చెప్పినట్లయింది. శ్రీసాత్త్వతసంహితలో భగవానుడు " నేను మోక్షప్రదాతను" అని, "శ్రీదేవి ఐశ్వర్యాన్ని ఇస్తుంది" అని విభజించి, స్పష్టంగా పలికాడుకదా!

**శాంతానందమహావిభూతి పరమం యద్బ్రహ్మ రూపం హరేః**
**మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్ ।**
**యాన్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి చా**
**న్యాహుః స్వై రనురూపరూపవిభవైః గాఢోపగూఢాని తే ॥ 4 ॥**

శాంత=షడూర్ములను లేనిదై, ఆనంద=ఆనందమయమై, మహావిభూతి=గొప్పవిభూతులను కల్గినదై, పరమమ్=తనకంటె గొప్పది వేఱొకటి లేనిదై, బ్రహ్మ=పెద్దదై ఉన్నందున, (ఇతరులను) పెద్దదిగా చేసినందువల్ల బ్రహ్మశబ్దంచే చెప్పదగినదై ఉండే, హరేః యత్ రూపం=హరియొక్క ఏ స్వరూపం ఉన్నదో, తతః అపి=దానికంటె, తత్ ప్రియతరమ్=ఆ భగవానునకు చాలా ప్రియంగా ఉండేది, మూర్తమ్=కంటితో దర్శించతగినది, బ్రహ్మ=బ్రహ్మశబ్దంచే వ్యవహరింపబడేది, అత్యద్భుతమ్=మిక్కిలి అద్భుతం అయినది అయిన, రూపం యత్ =ఏ రూపం ఉన్నదో, యథాసుఖం విహరతః =ఇష్టం వచ్చినట్లు విహరించే, భగవానునకు, అన్యాని రూపాణి యాని=మిగిలిన ఏ రూపాలు ఉన్నవో, తాని సర్వాణి=ఆ స్వరూపరూపాలన్నీ, తే=నీకు, స్వైః అనురూపరూపవిభవైః =అసాధారణాలై, తగినవై ఉండే దివ్యరూపాలచేత, గాఢోపగూఢాని ఆహుః=చక్కగా అలింగనం చేయబడినవి-అని ప్రమాణాలు చెబుతున్నవి

**అవతారిక:-** "**త్రయాణాం భరతాదీనాం భ్రాతౄణాం దేవతా చ యా, రామస్య చ మనఃకాంతా ప్రాణేభ్యోఽపి గరీయసీ**" (భరతుడు మొదలైన ముగ్గురు సహోదరులకు



ఎన్ఱ అసాధారణమాన తిరునామత్తై ఉడైయైయాయ్, అవనుక్కుమ్ పూజ్యైయామ్బడియాన గుణపూర్తియైయుడైయ ఉన్నై జ్ఞానశక్త్యాదిగుణహీననాన నాన్ స్తోత్రమ్ పణ్ణువదు ఎజ్ఞనే? ఎన్ఱు భీతభీతరాయ్ స్తోత్రాన్నివృత్తరానార్ ప్రథమశ్లోకత్తిలే.

ఇప్పడి నివృత్తరానపడియై క్కణ్డు "ఇవర్ పణ్ణుకిఱ సోత్రత్తై శ్రవిత్తు శ్రవిప్పిత్తాలన్ఱో "శ్రుణోతీతి శ్రీః", "శ్రావయతీతి శ్రీః" ఎన్గిఱ నిరుక్త్యనురూపాసాధారణ నామమ్ నమక్కు నిలైనిఱ్పదు. ఆనపిన్బు, ఇవర్ యథాస్తోత్రమ్ పణ్ణవల్లరామ్బడి కటాక్షిప్పోమ్" ఎన్ఱు కణిశిత్తు, ఇవర్పక్కలిలే కరుణాకటాక్షత్తై ప్పణ్ణి, "ఇతొరు దయావిశేష

ఏ సీతాదేవి దేవతయై ఉన్నదో, రామునకు మనోవల్లభయై, అతనికి ప్రాణంకంటె గొప్పదై ఉన్నదో) అనే రామాయణశ్లోకాన్ని అనుసరించి, **"కాంత స్తే పురుషోత్తమః"** అని, **"శ్రయతే ఇతి శ్రీః"** (భగవానుని ఆశ్రయించి ఉన్నది కాబట్టి **"శ్రీ ః"** అనబడుతున్నది) అనే శ్రీశబ్దార్థాన్ని, **"ఫణిపతిః"** అని ప్రారంభించి, **"శ్రీయతే ఇతి శ్రీః"** (మిగిలినవారిచే ఆశ్రయింపబడేది కాబట్టి **"శ్రీః"** అనబడుతున్నది) అనే శ్రీ శబ్దార్థాన్ని అనుసంధించి, "ఈ రీతిలో ఉభయవిభూతిలో ఉన్నవారిచేత ఆశ్రయింపబడేదానవై ఉభయవిభూతి నాథుని ఆశ్రయించి ఉన్నందున **"శ్రీః"** అనే ప్రత్యేకమైన నామాన్ని కల్గినదానవై అతనిచేకూడా పొగడబడతగినట్లు గుణపూర్తిని కల్గిన నిన్ను జ్ఞానం, శక్తి మొదలైన గుణాలను ఏ మాత్రం లేని నేను స్తుతించడం ఏవిధంగా సాధ్యం?" అని చాలా భయపడినవారై! స్తుతి చేయడంనుండి వెనుకకు తగ్గారు.

ఈ విధంగా వెనుకంజవేయడాన్ని చూచి పిరాట్టి "వీరు చేసే స్తుతిని మేముకూడా విని, భగవానునకు వినిపించినపుడుకదా **"శృణోతి ఇతి శ్రీః"** (చేతనుని దీనాలాపాలను వింటుంది కనుక **"శ్రీః"** అనబడుతున్నది), **"శ్రావయతి ఇతి శ్రీః"** ( ఆ దీనోక్తులను భగవానుని వినిపిస్తుంది కనుక శ్రీః అనబడుతున్నది) అనే వ్యుత్పత్తులచేత వ్యక్తం అయే శ్రీశబ్దార్థం మనకు స్థిరంగా నిలచి ఉంటుంది. అందువల్ల వీరిని యథాతథంగా స్తోత్రాన్ని చేయగలిగేటట్లు కటాక్షిస్తాను" అని భావించి, వీరి విషయంలో కరుణతో కటాక్షించగా, ''ఈ విధంగా గొప్ప దయను నా విషయంలో ప్రసరింపజేసిందికదా!" అని లక్ష్మియొక్క సౌలభ్యాన్ని అనుసంధించి, సమాధానాన్ని పొందినవారై, పిరాట్టికి, తమకు ఉండే సంబంధాన్ని పురస్కరించుకొని యామునులు శరణు పొందారు. దానితో మొదటిశ్లోకంలో చెప్పిన రెండు శ్రీశబ్దార్థాలు-**"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (యజుస్సంహిత-4-4-12) (ఈ లోకానికి ఈశ్వరి, విష్ణువునకు పత్ని) అనే ప్రమాణవాక్యంనుండి స్పష్టపడే అర్థం అనే విషయాన్ని **"లోకైకేశ్వరి**

మిరున్దవడియెన్?'' ఎన్ను తత్సౌలభ్యానుసంధానత్తాలే సమాహితరాయ్, సంబంధజ్ఞానపూర్వకమాక శరణమ్ పుకున్దు, కీழ் "శ్రయతే, శ్రీయతే" ఎన్ను శొన్న వ్యుత్పత్తిద్వయార్థముమ్ "అస్యేశానా" ఇత్యాది వేదాంతసిద్ధ మెన్నుమిడత్తై "లోకైకేశ్వరి, లోకనాథదయితే" ఎన్ను సూచిప్పియానిన్నుకొణ్డు సమాహితరాయ్, భయముమ్ శమిత్తు, స్తోత్రత్తిలే ప్రవృత్తరానార్ ద్వితీయశ్లోకత్తిలే

ఇప్పడి ఆక్షేపసమాధానవ్యాజేన ప్రవృత్తమాన శ్లోకద్వయత్తాలుమ్, తత్పరత్వసౌలభ్యఙ్గళై అనుసంధిత్తు, "తిరువడికళై ఆశ్రయిత్తార్క్కు తత్కటాక్షలేశత్తాలే సకలపురుషార్థఙ్గళుమ్ సంభవిక్కుమ్. ఆదిల్లాదార్క్కు ఒరు శ్రేయస్సుమ్ సిద్ధియాదు" ఎన్నుకొణ్డు పిరాట్టియినుడైయ సర్వసమాశ్రయణీయత్వఖ్యాపనార్థమాక సకలపురుషార్థ ప్రదత్వత్తై అరుళిచ్చెయ్దు, అనంతరమ్ ప్రత్యయమాన మతుప్పిన్ అర్థత్తై అరుళిచ్చెయ్ వదాక త్తిరువుళ్ళమ్పఱ్ఱి, భగవత్స్వరూపగుణాదికళిల్ తత్సహధర్మచారిణియాన

---

**లోకనాథదయితే"** అని అనుగ్రహించి, సమాధానాన్ని పొందిన భయం తీరినవారై స్తుతించడానికి రెండవ శ్లోకంలో వీరు ప్రారంభించారు.

ఈ విధంగా స్తుతించడం సాధ్యం కాదు-అని చెప్పే మొదటిశ్లోకంతో పిరాట్టి పరత్వాన్ని, సమాధానాన్ని పొంది స్తుతించడం ప్రారంభించిన విషయాన్ని తెలిపే రెండవ శ్లోకంతో పిరాట్టి సౌలభ్యాన్ని అనుసంధించి, ''లక్ష్మి శ్రీపాదాలను ఆశ్రయించినవారికి ఆమె కటాక్షవీక్షణాలచే అన్ని పురుషార్థాలు లభిస్తాయి. ఈ విధంగా ఆశ్రయించనివారికి ఏ మంచి కలుగదు" అని పల్కి, పిరాట్టి అందఱిచేత ఆశ్రయింప తగినది అనే విషయాన్ని తెలుపడంకోసం, "ఆమె పురుషార్థాలను అన్నిటినీ ఇస్తుంది" అని మూడవ శ్లోకంలో అనుగ్రహించారు. ఈవిధంగా ఇంతవరకు మూడు శ్లోకాలలో ద్వయం ప్రారంభంలో ఉండే **"శ్రీమత్"** అనే ప్రయోగంలో ప్రకృతి అయిన శ్రీ శబ్దంయొక్క అర్థాన్ని అనుగ్రహించి, తర్వాత ప్రత్యయం అయిన **"మతుప్"** యొక్క అర్థాన్ని అనుగ్రహించాలని తలచి, భగవానుని స్వరూపం, రూపం, గుణం-మొదలైనవాటిలో అతనిని సహధర్మచారిణి అయిన ఈమెయొక్క స్వరూపాదులకు ఉండే గాఢమైన చేరికను అనుసంధిస్తూ, **"లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా, రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే"** (లక్ష్మీతంత్రమ్-28-14) (కారుణ్యమే మూర్తీభవించిన లక్ష్మితో కలసియే భగవానుడు రక్షకుడు అవుతున్నాడు-అని అన్ని సిద్ధాంతాలలోను, వేదాంతాలలోను పొగడబడుతున్నది) అనే ప్రమాణాన్నిబట్టి **"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైః భాగవతై స్సహ"** (శైవపురాణమ్)



ఇవళుడైయ స్వరూపాదికళుక్కు ఉణ్డాన అయోగవ్యవచ్ఛేదత్తై అనుసంధియానిన్నుకొణ్డు "లక్ష్మ్యా సహ రక్షకః", "శ్రియా సార్ధమ్" ఎన్గిఱపడియే ఉభయవిభూతిక్కుమ్ నిత్యరక్షకమాయ్, నిత్య ప్రాప్యమాన నిత్యయోగత్తై అనుభవిత్తు, నిరస్తసమస్త-ప్రతిబన్ధకరాయ్, ప్రాప్తపరిపూర్ణమనోరథరాయ్, "తిరుమాలాలెఙ్గుమ్ తిరువరుళ్ పెఱ్ఱు ఇన్బుఱువర్" ఎన్గిఱపడియే శ్రియఃపతియినుడైయ నిర్హేతుకకృపైయాలే నిరతిశయానన్దత్తై ప్రాపిత్తు, స్తోత్రత్తై త్తలైక్కట్టుకిఱార్ తురీయశ్లోకత్తాలే.

**వ్యాఖ్యానమ్ :** (శాన్తానన్తమహావిభూతి పరమం యద్బ్రహ్మ రూపమ్) ఎన్గిఱ విప్పళవాలే-దివ్యాత్మస్వరూపత్తై అనుభవిక్కిఱార్. "శాన్తానన్తమ్ చిదానన్దం యద్బ్రహ్మ

---

(గొప్పలోకం అయిన పరమపదంలో జగత్పతి, భావించడానికి సాధ్యం కాని స్వరూపాన్ని కల్గినవాడైన విష్ణువు, భక్తులతో, భాగవతులతో కూడినవాడై శ్రీదేవితోకలసి వేంచేసి ఉంటాడు) అనే ప్రమాణాన్నిబట్టి ఉభయవిభూతులను ఎల్లప్పుడు రక్షించేవారై, ఎల్లప్పుడూ ప్రాప్యులై ఉండే లక్ష్మి, నారాయణులనే మిథునం ఎల్లప్పుడూ చేరి ఉంటారు-అని అనుభవించి, ఆటంకాలు అన్నీ తీరి, స్తుతించాలని తలచిన తమ కోరిక నెఱవేఱినవారై, **"తిరుమాలాల్ ఎఙ్గుమ్ తిరువరుళ్ పెఱ్ఱు ఇన్బుఱువర్"** (తిరుప్పావై-30) అనే రీతిలో (శ్రియఃపతియొక్క నిర్హేతుకకృపచేత మహానందాన్ని పొంది చతుఃశ్లోకి అనే స్తుతిని నాల్గవ శ్లోకంతో ముగిస్తున్నారు.

**వ్యాఖ్యానం:- (శాంతానందమహావిభూతిపరమం యద్బ్రహ్మ రూపం హరేః)-** శ్లోకంలోని ఈ భాగంతో భగవానుని దివ్యాత్మస్వరూపాన్ని అనుభవిస్తున్నారు. **"శాంతానందమ్ చిదానందమ్ యద్బ్రహ్మ పరమం ధ్రువమ్, మహావిభూతిసంస్థానం సర్వతః సమతాం గతమ్''** (లక్ష్మీతంత్రమ్-17-5) (షడూర్ములను లేనిదై, అంతు లేనిదై, జ్ఞానానందమయమై, గొప్పదై, స్థిరమైనదై, గొప్ప విభూతిని, తిరుమేనిని కల్గినదై, అంతటా సమానమైన స్థితిని కల్గినదైన ఏ పరబ్రహ్మ స్వరూపం ఉన్నదో..) అని లక్ష్మీతంత్రంలో భగవానుని దివ్యాత్మస్వరూపాన్ని నిర్ణయించి చెప్పే శ్లోకాన్ని మనస్సులో పెట్టుకొని వీరు ఈ విధంగా అనుగ్రహించారు.

**(శాంత)**-శాంతి అంటే **"అశనాయాపిపాసే చ శోకమోహౌ జరామృతీ, షడూర్మిభి ర్వివిశుద్ధా..."** (శ్రుతి) (ఆకలి, దాహం, శోకం, మోహం, ముసలితనం, మరణం అనే ఆఱు ఊర్ములను లేనిది) అనే వేదప్రమాణంలో చెప్పినట్లు ఆఱు ఊర్ములను లేనిదై, **"అపక్షయవినాశాభ్యాం పరిణామర్ధి జన్మభిః, వర్జితః శక్యతే వక్తుం య స్సదాఽస్తీతి కేవలమ్''** (విష్ణుపు-1-2-11) (క్షీణించడం, నశించడం, పరిణామం ,వృద్ధి,

పరమం ధ్రువమ్ మహావిభూతిసంస్థానం సర్వత స్సమతాం గతమ్'' ఎన్గిఱ దివ్యాత్మస్వరూపనిర్ణాయకప్రమాణత్తై యట్కొణ్డాయ్త్తు ఇవరిప్పడిఅరుళిచ్చెయ్తతు.

(శాన్తేతి) శాన్తి యావతు- "అశనాయాఽపిపాసే చ శోకమోహౌ జరామృతీ, షడూర్మిభి ర్విశుద్ధా" ఎన్ఱు శ్రుతిసిద్ధషడూర్మిరహితమాయ్, "అపక్షయవినాశాభ్యాం పరిణామర్ధిజన్మభిః, వర్జిత శ్శక్యతే వక్తుం య స్సదాఽస్తీతి కేవలమ్" ఎన్ఱు పురాణరత్నోక్త ప్రకారత్తాలే షడ్భావవికారరహితముమాయిరుక్కై. ఇత్తాల్, అఖిలహేయ ప్రత్యనీకమాయిరుక్కుమ్ దివ్యాత్మస్వరూప మెన్ఱతాయ్త్తు. స్వయం హేయరహిత-మాయిరుక్కైయన్ఱిక్కే, హేయప్రతిభటముమాయ్, స్వాశ్రితహేయ నివర్తకముమాయిఱే యిరుప్పతు. కల్యాణైకతానత్వముమ్ అర్థత స్సిద్ధమాకిఱతు. "హేయప్రత్యనీకత్వమ్

---

పుట్టుక-అనే వీటిని లేనివాడు, ఎల్లప్పుడు ఉన్నాడు అని చెప్పబడేవాడుగా ఉండేవాడు భగవానుడు) అని శ్రీ విష్ణుపురాణంలో తెల్పినట్లు ఆఱు భావవికారాలను లేనిగా ఉండడం. దీనివల్ల ''దోషాలను అన్నిటినీ లేనిదిగా ఉండే దివ్యాత్మస్వరూపం'' అని చెప్పబడినట్లయింది. తాను దోషాలను వేనినీ లేనిదై ఉండడంతోపాటు, దోషాలకు ప్రతిభటమై, తనను చేరినవారి దోషాలను పోగొట్టేదై కదా దివ్యాత్మస్వరూపం ఉంటుంది. భగవత్స్వరూపం హేయప్రత్యనీకం (దోషప్రతిభటం) అని చెప్పిన ఈ పదంచేత కల్యాణైకతానత్వం (కల్యాణగుణాలకు అన్నిటికీ అద్వితీయవాసస్థానంగా ఉండడం) తాత్పర్యార్థంగా సిద్ధిస్తుంది. "హేయప్రత్యనీకత్వం ఉన్న చోటనే కల్యాణైకతానత్వం ఉంటుంది" అనికదా మన ఆచార్యుల శ్రీసూక్తి. **"అరుకల్ ఇలాయ పెరుఞ్జీర్"** (తిరువాయ్-1-9-3) (దోషాలు లేని గొప్ప కల్యాణగుణాలు) అనే ఆఴ్వార్ల శ్రీ సూక్తిని అనుసరించి **"అఖిలహేయప్రత్యనీకకల్యాణైకతాన . . . . స్వరూప"** (శరణాగతిగద్య-5) (హేయగుణాలకు అన్నిటికీ ప్రత్యనీకంగాను, మంగళగుణాలకు అద్వితీయస్థానంగాను ఉండే స్వరూపాన్ని కలవాడు) అని పరమాత్మకే తగిన ఈ రెండు లక్షణాలతో కూడిన భగవానుని దివ్యాత్మస్వరూపాన్ని భాష్యకారులు శరణాగతిగద్యలో అనుగ్రహించారుకదా! **"ఈశ్వరన్ అఖిలహేయ ప్రత్యనీకానంతజ్ఞానానందైకస్వరూపనాయ్"** (తత్త్వత్రయం-141) అనే ఆ భగవద్రామానుజుల ప్రయోగాన్ని అనుసరించి శ్రీ పిళ్ళైలోకాచార్యులవారుకూడా అనుగ్రహించారు. **"శాంతానందమ్ చిదానందమ్"** ఇత్యాదిగా పూర్వం ఉట్టంకింపబడ్డ లక్ష్మీతంత్రం (17-5) ప్రమాణంలోని **"శాంతానందమ్"** అనే పదం, అందులోనే తర్వాత గల **"చిదానందమ్"** అనే పదాన్ని ఉపలక్షణ రీతిలో చూపుతుంది. **"య ఆత్మా అపహతపాప్మా విరజో విమృత్యుః విశోకోఽ**



పుక్కవిడత్తే కల్యాణైకతానత్వముమ్ పుకుమ్" ఎన్ఱిఱే అరుళిచ్చెయ్తతు. "అరుకలిలాయ పెరుమ్ శీర్'' ఎన్గిఱపడియే, ''అఖిలహేయప్రత్యనీకకల్యాణైకతాన'' ఎన్ఱు ఉభయలిఙ్గవిశిష్టవస్తువై అనుభవిత్తరుళినారిఱే భాష్యకారర్. ''ఈశ్వరన్ అఖిలహేయప్రత్యనీకానన్తజ్ఞానానన్దైకస్వరూపనాయ్" ఎన్ఱు తద్దివ్యసూక్తియై ప్పిన్శెన్ఱు అనుభవిత్తరుళినారిఱే పిళ్ళైలోకాచార్యరుమ్. "శాన్తానన్దం చిదానన్దమ్" ఎన్ఱుమ్ ముక్తకణ్ఠమాక చ్చొన్న లక్షణద్వయత్తిల్ ఇఙ్గొన్ఱై ఒన్ఱు లక్షిక్కిఱతు. ఇత్తాల్-"అపహతపాప్మా విజరః" ఎన్ఱు తొడఙ్గి "సత్యకామ స్సత్యసఙ్కల్పః" ఎన్గిఱ ప్రమాణార్థమ్ శొల్లిఱ్ఱు.

అనన్తపదత్తాలే త్రివిధపరిచ్ఛేదరహితమాయిరుక్కు మెన్ఱపడి. అతావతు-విభుత్వా ద్దేశతః పరిచ్ఛేదరహితముమాయ్, నిత్యత్వాత్కాలతః పరిచ్ఛేదరహితముమాయ్, సమస్తవస్తుప్రకారిత్వాత్స్వసదృశవస్తుపరిచ్ఛేద రహితముమాయిరుక్కు మెన్ఱపడి.

---

**విజిఘత్సోఽపిపాస స్సత్సకామ స్సత్యసంకల్ప స్సోఽన్వేష్టవ్యః"** (ఛాందో-8-7-1) (ఏ ఆత్మ పాపం లేనివాడుగాను, ముసలితనం లేనివాడుగాను, మరణం లేనివాడుగాను, శోకం లేనివాడుగాను, ఆకలి లేనివాడుగాను, మరణం లేనివాడుగాను, దాహం లేనివాడుగాను, సత్యమైన కల్యాణ గుణాలను, వట్టిపోని సంకల్పాలను కలవాడుగాను ఉన్నాడో, అతడు అన్వేషించతగినవాడు) అని ఛాందోగ్యోపనిషద్వాక్యంలో చెప్పబడ్డ అర్థం ఇందులో తెలుపబడింది.

**"శాంత"** అనే పదాన్ని అనుసరించి ఉండే అనంతశబ్దంచేత భగవానుని దివ్యాత్మస్వరూపం మూడు విధాలైన పరిచ్ఛేదాలు లేనిదై ఉంటుంది-అని చెప్పబడింది. అంటే-అంతటా వ్యాపించి విభుస్వరూపమై ఉండడంచేత దేశపరిచ్ఛేదాన్ని కల్గి ఉండడం అనే పరిమితి కూడా దీనికి లేదు. ఎప్పుడూ ఉండే నిత్యవస్తువై ఉండడంచేత కాలంవల్ల పరిచ్ఛిన్నమై ఉండడంకూడా దీనికి లేదు. అన్ని వస్తువులను తనకు ప్రకారంగా కల్గి ఉండడంచేత ఇటువంటి తనతో సాటివచ్చే వస్తువు వేఱొకటి లేనందున వస్తుపరిచ్ఛేదం దీనికి లేదు-అని భావం. **''శాంతానంద''** అనే పాఠాంతరం ఉండడంచేత **"జ్ఞానానందమయం యస్య స్వరూపం పరమాత్మనః"** (ఏ పరమాత్మయొక్క స్వరూపం జ్ఞానానందమయమై ఉన్నదో) అనే రీతిలో ఆనందశబ్దంద్వారా దివ్యాత్మస్వరూపం ఆనందమయమై ఉంటుందని సూచింపబడింది. **''ఉణర్ ముఴునలమ్''** (తిరువాయ్-1-2) అని ఆఴ్వార్లు భగవానుని స్వరూపం పూర్ణంగా జ్ఞానమయంగా, ఆనందమయంగా ఉంటుందని సూచించారుకదా ! **"యథా సైంధవఘనోఽనంతరోఽ**

అథవా, "శాన్తానన్ద" ఎన్ఱు పాఠమాయ్, "జ్ఞానానన్దమయం యస్య స్వరూపం పరమాత్మనః" ఎన్గిఱపడియే ఆనన్దమయమాయిరుక్కు మెన్నవుమామ్. "ఉణర్ముழு నలమ్" ఎన్నక్కడవతిఱే. ముழு ఉణర్వుమ్, ముழு నలముమాయ్, "యథా సైన్ధవఘనః." ఎన్నుమాపోలే, "విజ్ఞానఘన"ముమాయ్, "ప్రజ్ఞానఘన"ముమాయిఱే స్వరూప మిరుప్పతు. ఇత్తాల్ స్వానుభవదశైయిల్ ప్రకాశముమాయ్, సుఖరూపముమా యిరుక్కు మెన్గై. "శాన్తానన్ద" ఎన్ఱు స్వరూపనిరూపకఙ్గళాన జ్ఞానానన్దామలత్వాదికళై

---

**బాహ్యః కృత్స్నః ప్రజ్ఞాన ఘన ఏవ"** (బృహ-6-5-134) (ఏ ఉప్పుగల్లులో అన్ని చోట్ల మొత్తం రసం నిండి ఉంటుందో, ఆ రీతిలోనే ఈఆత్మ అన్ని చోట్ల మొత్తం జ్ఞానమయంగానే ఉంటుంది) అని బృహదారణ్యకోపనిషత్తులోకూడా బ్రహ్మస్వరూపం విజ్ఞానఘనమై, అనగా-మొత్తం జ్ఞానరూపమై ఉంటుంది-అని చెప్పడంద్వారా ప్రజ్ఞానఘనంగా-అనగా-అంతటా ఆనందమయంగా ఉంటుంది-అని చెప్పిందికదా! ఇందువల్ల భగవానుని స్వరూపం తనను తానే అనుభవించే స్థితిలో జ్ఞానమయమై, అనగా - స్వయంప్రకాశమై, ఆనందమయమై-అనగా-సుఖరూపమై ఉంటుంది అని భావం.

**"శాంతానంద"** అని భగవానుని స్వరూపాన్ని నిరూపించే జ్ఞానంగా ఉండడం, అనంతంగా ఉండడం, ఆనందంగా ఉండడం, అమలుడై ఉండడం-మొదలైనవానిని చెప్పడంచేత ఈ విధంగా నిరూపించబడ్డ స్వరూపంలో ఉండే జ్ఞానం, శక్తి మొదలైన కల్యాణగుణసమూహాలుకూడా చెప్పబడినట్లయింది. స్వరూపంతో చేరిన ధర్మభూతజ్ఞానంయొక్క పలు విధాలైన పరిణామాలైకదా ఈ గుణాలున్నాయి. **"సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్"** (పు.సూ-1-1-) (పరమపురుషుడు వేయి శిరస్సులను, వేయి కన్నులను, వేయి పాదాలను కలవాడు) అనే ప్రమాణంలోను, **"య స్సర్వజ్ఞ స్సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః"** (ముణ్డక-1-1-10) ( ఏ పరమాత్మ అన్ని వస్తువుల స్వరూపాన్ని, స్వభావాలను తెలిసికొంటున్నాడో, ఎవని సంకల్పం జ్ఞానమయంగా ఉంటుందో) అనే ప్రమాణంలోను, **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** (శ్వేతా-6) (ఈ పరమాత్మకు పలు విధాలైన, గొప్పదైన శక్తి, సహజమైన జ్ఞానం, బలం, (సృష్టించడం మొదలైన) కార్యాలు ఉన్నాయని తెలుస్తున్నది) అనే ప్రమాణంలోను ఈ గుణాలు భగవానునకు ఉన్నాయని ఘోషింపబడుతున్నది కదా !



చ్చొన్న ఇత్తాల్ నిరూపితస్వరూప విశేషణఙ్గళాక జ్ఞానశక్త్యాద్య సఙ్ఖ్యే యకల్యాణగుణ గణఙ్గళుమ్ ఉక్తప్రాయఙ్గళ్. స్వరూపానుబన్ధికళాయిఱే ఇవై యిరుప్పన."సహస్రాక్షః", "సర్వజ్ఞః" ఇత్యాది ప్రమాణసిద్ధమిఱే.

(మహావిభూతి) మహత్తుక్కళాయ్, శుద్ధాఽశుద్ధఙ్గళాన విభూతిద్వయత్తై యుడైత్తాయ్, "అకల్ విశుమ్బుమ్ నిలనుమ్ ఇరుళార్ వినై కైడ" "అఙ్గాతుమ్ శోరామే యాళ్ కిన్ఱ" "పాదోఽస్య విశ్వా భూతాని, త్రిపాదస్యాఽమృతం దివి" ఎన్గిఱపడియే ఉభయవిభూతియోగముమ్ శొల్లుకిఱతు.

(పరమమ్) "పరో మా యస్మా త్సః పరమః" ఎన్ఱు నిరుపమమాకైయాలే సర్వోత్కృష్టమాయ్. (యత్) "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ", "ఆనన్దో బ్రహ్మ", "ఆనన్దో

---

**(మహావిభూతి)** -పెద్దవై, ఒకటి శుద్ధంగా, వేఱొకటి అశుద్ధంగా ఉండేది అయిన నిత్యవిభూతి, లీలావిభూతి-అనే రెండు సంపదలు కలవాడై ఉండడం భగవానుని స్వరూపం-అని భావం.**"అకల్ విశుమ్బుమ్ నిలనుమ్ ఇరుళార్ వినై కెడ"** (తిరువిరు-33) (విశాలమైన పరమపదంలో, భూమిలో అజ్ఞానహేతుకాలైన కర్మలు నశించేటట్లు), **"పొఙ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్కిన్ఱ ఎమ్బెరుమాన్"** (నాచ్చియార్ తిరు-11-3) (ఎగిసిపడే అలలను కల సముద్రంచేత పరివేష్టితం అయిన భూమి, పరమపదం-అనే వీనిలో ఏమీ చెదఱిపోకుండా పాలించే స్వామి) అనే దివ్యప్రబంధ సూక్తులలోను, **"ఏతావా నస్య మహిమా అతో జ్యాయాం శ్చ పూరుషః, పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి"** (పురుష సూ.3) (ఇతని మహిమ ఇంతటిది. పరమపురుషుడు దీనికంటె గొప్పవాడు. (ప్రాకృతం అయిన) అన్ని లోకాలు ఇతని విభూతిలో నాల్గవభాగం. పరమపదంలో ఇతని (విభూతిలో) నాశం లేని మూడు భాగాలు ఉన్నవి) అని పురుషసూక్తంలోను భగవానునకు సొత్తుగా ఉన్నదని చెప్పబడ్డ రెండు విభూతులను తెలుపుతుంది.

**(పరమమ్)- "పరో మా యస్మాత్ సః పరమః"** (దేనికంటె మేలైనది లేదో అది **"పరమమ్"** అనబడుతున్నది) అనే వ్యుత్పత్తిచేత **"ఒత్తారుమ్ మిక్కారుమ్ ఇలై"** (నిస్సమాభ్యధికం) (సరి అయినవారు, అధికులు లేరు) అయినది భగవత్స్వరూపం-అని భావం. **(యత్)-"సత్యం జ్ఞాన మనంతమ్ బ్రహ్మ, యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్, సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి"** (తైత్తి-ఆనంద-1-2) (వికారం లేనిది అయినందువల్ల) ఆనందమయంగా ఉండే

బ్రహ్మేతి వ్యజానాత్”, “నిష్కళంకో నిరఞ్జనః”, “న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే”, “ఒత్తార్ మిక్కారై యిలైయాయ”, “సంజ్ఞాయతే ఇత్యాది”, “మననుణర్ వళవిలన్” ఇత్యాదిప్రమాణప్రసిద్ధియై యచ్ఛబ్దమ్ సూచిప్పిక్కిఱతు. (బ్రహ్మ) “బృహత్త్వా ద్బృంహణత్వా చ్చ బ్రహ్మ ఇత్యభిదీయతే” ఎన్గు నిరతిశయబృహత్త్వ- బృంహణత్వ యుక్తమాయ్. ఇత్తాల్ స్వరూపవిభుత్వమ్ శొల్లుకిఱతు. (రూపమ్) స్వరూపమ్. ఆక,

---

బ్రహ్మను హృదయగుహలో ఉన్నదిగా ఎవడు ఉపాసిస్తున్నాడో, అతడు పరమపదంలో సర్వజ్ఞుడైన పరబ్రహ్మతోకూడ అన్ని కల్యాణగుణాలను అనుభవిస్తాడు) అని, **“ఆనంద ఆత్మా బ్రహ్మ”** (తైత్తి. ఆనంద-5) ( ఆనందమయుడైన ఆత్మయే పరబ్రహ్మ) అని, **“ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్”** (తైత్తి-భృగు-6) (ఆనందం పరబ్రహ్మ అని తెలిసికొన్నాడు) అని తైత్తిరీయోపనిషద్వాక్యంలోను, **“నిష్కలంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాత శ్శుద్ధో దేవ ఏకో నారాయణః’’** (నారాయణోపనిషత్-2) (కళంకం లేనివాడై దోషరహితమైనవాడై, ప్రాకృతం అయిన భేదాన్ని, నామాలను లేనివాడై, శుద్ధుడై, ప్రాకృతం అయిన భేదాన్ని, నామాలను లేనివాడై, పరిశుద్ధుడై ఉండే దేవుడు నారాయణు డొక్కడే) అనే నారాయణోపనిషద్వాక్యంలోను, **“పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ”** (శ్వేతా-6) (ఈ పరమాత్మకు పలు విధాలైనది, గొప్పది అయిన శక్తి, సహజమైన జ్ఞానం, బలం, సృష్ట్యాదికార్యాలు ఉన్నాయని తెలుస్తున్నది) అనే ఉపనిషద్వాక్యంలోను, **“ఒత్తార్ మిక్కారై ఇలైయాయ మామాయా”** (తిరువాయ్-2-3-2) (నిస్సమాభ్యధికుడవైన, ఆశ్చర్యకరచేష్టలను చేసేవాడా!), **“మననుణర్ వళవిలన్”** (తిరువాయ్-1-1-2) (మనస్సులో కలిగే జ్ఞానమాత్రంతో తెలియబడగలవాడు కాడు) అనే ద్రావిడవేదవాక్యాలలోను, **“సంజ్ఞాయతే యేన తదస్తదోషం శుద్ధం పరం నిర్మల మేకరూపమ్, సందృశ్యతే వాఽప్యధిగమ్యతే వా తత్జ్ఞాన మజ్ఞాన మతోఽన్యదుక్తమ్”** (విష్ణు. పు-6-5-37) (ఏ జ్ఞానంచే దోషరహితమైనది, శుద్ధమైనది, నిర్మలమైనది, సమానమైనది, తనకు మించినది ఏదీ లేనిది అయిన ఆ పరబ్రహ్మ తెలియబడుతున్నదో, చూడబడుతున్నదో, పొందబడుతున్నదో అదే జ్ఞానం. దానికంటే వేఱయినది అజ్ఞానం) మొదలైన ఉపనిషత్‌వాక్యాలలోను ఈ అర్థం ప్రసిద్ధమైనది-అని **“యత్”** శబ్దం తెలుపుతున్నది. **“యచ్ఛబ్దః సర్వోపనిషత్ ప్రసిద్ధిం సూచయతి”** అని దేశికుల వివరణం. **(బ్రహ్మ)-“బృహత్త్వాత్ బృంహణత్వా చ్చ తద్బ్రహ్మేత్యభిధీయతే”** (విష్ణు.పు-3-3-22) (పెద్దదిగా ఉన్నందున, మిగిలినవానిని పెద్దదిగా చేస్తున్నందున బ్రహ్మమని అది చెప్పబడుతున్నది) అని శ్రీ విష్ణుపురాణంలో చెప్పిన రీతిలోనే **“బృహత్త్వమ్”** (మిక్కిలి



అఖిలహేయప్రత్యనీకకల్యాణైకతానమాయ్, త్రివిధపరిచ్ఛేద- రహితమాయ్, విభూతిద్వయనిర్వాహకముమాయ్, నిరుపమముమాయ్, విభువాయ్, సకలోపనిషత్ప్రసిద్ధమాన వాత్మస్వరూపత్తై అనుభవిత్తారాయ్‌త్తు.

(శాన్త) ఎన్గైయాలే “అవికారాయ శుద్ధాయ” ఎన్గిఱ ద్వయార్థముమ్, అనన్తపదత్తాలే, “నిత్యాయ” ఎన్గిఱ పదార్థముమ్, “పరమం రూపమ్” ఎన్గైయాలే “పరమాత్మనే” ఎన్గిఱపదార్థముమ్, మేలే “రూపమ్” ఎన్గైయాలే “సదైకరూపాయ” ఎన్గిఱపదార్థముమ్ స్పష్టమాయిఱు

(హరేః) “హరి ర్హరతి పాపాని” ఎన్గిఱపడియే స్వాశ్రితరుడైయ స్వప్రాప్తిప్రతిబన్ధక సకలపాపనివర్తకనానవనుడైయ. అథవా, (హరేః) “దేవదేవో హరిః పితా” ఎన్గిఱపడియే

---

పెద్దదిగా ఉండడం), **“బృంహణత్త్వమ్”** (ఇతరులను పెద్దది చేయడం)-అనే రెండు స్వభావాల మేలైన ఎల్లను కల్గినది కనుక ఈ స్వరూపం బ్రహ్మశబ్దానికి అర్థం అవుతున్నది. ఇందుచే ఈ స్వరూపం అంతటా వ్యాపించి ఉన్నదని చెప్పబడుతున్నది. **(రూపం)** అంటే స్వరూపం. కాబట్టి ఇంతవరకు, దోషప్రతిభటమై, మంగళాలకు అన్నిటికి ఏకతానమై, మూడు విధాలైన పరిచ్ఛేదాలను లేనిదై, ఉభయవిభూతులను నిర్వహించేదై, సాటిలేనిదై, అంతటా వ్యాపించినదై-అని ఉపనిషత్తులలో ప్రసిద్ధిచెందినదై ఉండే భగవానుని దివ్యాత్మస్వరూపాన్ని అనుసంధించారు.

**‘‘శాంత’’** అన్నందున **‘‘అవికారాయ శుద్ధాయ నిత్యాయ శుద్ధాయ పరమాత్మనే, సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే”** (విష్ణు.పు-1-2-1) (వికారాలు వేనినీ లేనివాడై ,శుద్ధుడై, నిత్యుడై, పరమాత్మయై, ఎల్లప్పుడూ ఒకే విధమైన రూపాన్ని కలవాడై, అందఱినీ జయించేవాడైన విష్ణువుకు నమస్కారం) అనే శ్లోకంలోని **“అవికారాయ శుద్ధాయ”** అనే మొదటి రెండు పదాల అర్థం, **“బ్రహ్మ, రూపమ్”** అనే పదాలచే **‘‘పరమాత్మనే’’** అనే నాల్గవ పదంయొక్క అర్థం, ఈ శ్లోకంలో రెండవపాదంలోగల **“రూపమ్”** అనే పదంచేత **“సదైకరూప రూపాయ”** అనే అయిదవ పదంలోని అర్థం, మొదటిపాదంలో ఉండే **“హరేః, బ్రహ్మ”** అనే పదాలతో మిగిలిన **“విష్ణవే సర్వజిష్ణవే”** అనే ఆఱవ, ఏడవపదాల అర్థం స్పష్టీకరింపబడినట్లయింది.

**(హరేః) -“హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః, అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః”** (హర్యష్టకమ్) (చెడ్డ మనస్సుకలవారిచే ఇచ్ఛ లేకుండా స్మరింపబడినా హరి వారిపాపాలను లేకుండా చేస్తాడు. మనఃపూర్వకంగా కాకపోయినా తాకబడిన నిప్పు దహిస్తుందికదా) అనే ప్రమాణాన్నిబట్టి తనను ఆశ్రయించినవారికి,

సకలచేతనర్క్కుమ్ సాక్షాత్పితావానవనుడైయ-వెన్నాకవుమామ్. "పితృమాతృసుత" ఇత్యాది. "నామసహస్రవాన్" ఎన్గిఱపడియే "ఆయిరమ్‌పేరుడైయపిరానా" యిరుక్కవుమ్, ఇవ్విడత్తిల్ "హరిః" ఎన్గిఱ తిరునామత్తై అరుళిచ్చెయ్‌తతుక్కు క్కరుత్తెన్? ఎన్నిల్, పెరియపిరాట్టియారై ప్పురుషకారమాకప్పఱ్ఱిన ప్రీత్యతిశత్తాలే "అవావఅచ్చూఴరియై" ఎన్నాప్పోలే, స్వానుభవసకలప్రతిబంధకనివృత్తిపూర్వకమాక స్వాపేక్షితమాన ఇరువరుమాన శేర్త్తియై యథామనోరథమ్ అభినివేశమ్ తీర అనుభవిప్పిత్తపడియై స్పష్టమాక్కుకైక్కాక

---

తనను పొందడానికి అడ్డుగా ఉండే అన్ని పాపాలను పోగొట్టేవానియొక్క-అని భావం, ఆ రీతిలో కాకుండా, **(హరేః)- "త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా, త్వయైవ విష్ణునా చాంబ జగద్వ్యాప్తం చరాచరమ్"** (విష్ణుపు-1-9-126) (తల్లీ ! అన్ని లోకాలకు నీవు తల్లివి, దేవదేవుడైన హరి తండ్రి. నీచేతను, విష్ణువుచేతను ఈ లోకం అంతా వ్యాపింపబడి ఉన్నది) అనే రీతిలో చేతనులందఱికి సాక్షాత్తు తండ్రి అయిన వానియొక్క-అనే అర్థంకూడా గ్రహించవచ్చు. **"పితృమాతృసుతభ్రాతృదార మిత్రాదయోఽపి వా, ఏకైకఫలలాభాయ సర్వలాభాయ కేశవః"** (తల్లి, తండ్రి, పుత్రులు, సోదరులు, మిత్రులు మొదలైనవారు అందఱూ ఒక్కొక్క ఫలాన్ని పొందడానికి హేతుభూతులు. అన్నిఫలాలకు హేతువు కేశవుడు) అనే ప్రసిద్ధప్రమాణంలో చెప్పబడినది కదా! **"సహస్రాస్యః సహస్రాక్షః సహస్రచరణో విభుః, సహస్రబాహుః సర్వజ్ఞో దేవో నామసహస్రవాన్"** (వేయి ముఖాలను కలవాడై, వేయికన్నులను కలవాడై, వేయి బాహువులను కలవాడై వెలిగే దేవుడు వేయి నామాలను కలవాడు) (భారతే-భీష్మ) అనే ప్రమాణానుసారం వేయి నామాలను కల స్వామి అయినా, ఇక్కడ **"హరిః"** లక్ష్మీదేవిని అనే నామాన్ని ప్రయోగించడంలో ఏమి ఉద్దేశ్యం? అని అంటే, పురుషకారంగా ఆశ్రయించిన సంతోషాతిశయంచేత **''అవావఅ చ్చూఴ్ అరియై''** (తిరువాయ్-10-10-11) (ఆర్తి హరించేటట్లు సంశ్లేషించే హరిని) అనే చోటవలె తమకు అనుభవించడానికిగల అన్ని అడ్డంకులను పోగొట్టి, తాము ఆశించే దివ్యదంపతులను తాము దర్శించేటట్లు, అనుభవించేటట్లు పరిపూర్ణంగా భగవానుడు తమను అనుగ్రహించాడనే విషయాన్ని తెలియజేయడంకోసం **"హరిః"** అనే తిరునామాన్ని అనుగ్రహించారు. **"సర్వాపేక్షితప్రదనాన సర్వేశ్వరనై"** (ఈడు-10-10-11) అనికదా నంబిళ్ళైకూడా **"అరియై"** అనే పదానికి అర్థాన్ని అనుగ్రహించారు. **"ఆర్తిహరత్వవిశిష్టన్"** (ఆచార్యహృదయమ్-218) అనికదా ఆచార్యహృదయంలోకూడా పదవదశకసారార్థం చెప్పబడింది.



"హరిః" ఎన్ఱ తిరునామత్తై యరుళిచ్చెయ్‌కిఱార్. "సర్వాపేక్షితప్రదనాన సర్వేశ్వరనై" ఎన్ఱితే అరుళిచ్చెయ్‌తతు. "ఆర్తిహరత్వవిశిష్టన్" ఎన్ఱితే నిగమత్తిలు మరుళిచ్చెయ్‌తతు.

"బ్రహ్మాణ మిన్ద్రం రుద్ర ఇచ్చ యమం వరుణ మేవ చ, ప్రసహ్యా హరతే యస్మా త్తస్మాద్ధరి రితీర్యతే" ఎన్గిఱపడియే "నెఱ్ఱిమేల్ కణ్ణానుమ్ నిఱైమొఴివాయ్ నాన్ముకనుమ్ నీణ్డనాల్‌వాయొఱ్ఱైక్కొ వెణ్బకట్టిలొరువనైయు ముళ్ళిట్ట వమరరోడుమ్, కడలరైయన్ విఴుఙ్గామల్ తాన్ విఴుఙ్గి", "తమః పరే దేవ ఏకీభవతి" ఎన్గిఱ పడియే తన్‌సఙ్కల్పత్తిల్ ఏకీభవిక్కుమ్బడియాన సర్వసంహర్తృత్వత్తైయుమ్, "అశేషాణాం హి భూతానాం ప్రభవో హరిః", "యస్య నాభిసముద్భూతపఙ్కజా దభవ జ్జగత్" ఎన్గిఱపడియే అవ్యయపూర్వకమాన జగత్కారణత్వత్తైయుమ్ ప్రతిపాదిక్కిఱ విత్తిరునామత్తై

---

**"బ్రహ్మాణ మింద్రం రుద్రం చ యమం వరుణ మేవ చ, ప్రసహ్యా హరతే యస్మా త్తస్మాత్ హరి రితీర్యతే"** (హర్యష్టకమ్) (బ్రహ్మను, ఇంద్రుని, రుద్రుని, యముని, వరుణుని బలాత్కరించి సంహరిస్తాడు కాబట్టి హరి అని అనబడుతున్నాడు) అనే రీతిలో "బ్రహ్మ, రుద్రుడు ఇంద్రుడు మొదలైన దేవతలను ప్రళయకాలంలో సంహరించేవాడు" అని హరిశబ్దానికి ప్రమాణాలలో వేఱొక అర్థం చెప్పబడింది. అందువల్ల **"నెఱ్ఱిమేల్ కణ్ణానుమ్ నిఱైమొఴివాయ్ నాన్ముకనుమ్ నీణ్డనాల్ వాయ్ ఒఱ్ఱైక్కొవెణ్‌పకట్టిల్ ఒరువనైయుమ్ ఉళ్ళిట్ట అమరరోడుమ్ కడలరైయాన్ విఴుఙ్గామల్ తాన్ విఴుఙ్గి"** (పెరియతిరు-11-6-3) (ఫాలాక్షుడు, వేదాలను ఉచ్చరించే బ్రహ్మ, పొడుగైన వేలాడే నోటిని తొండాన్ని కల శ్వేతగజం అయిన ఐరావతాన్ని కల ఇంద్రుడు, మొదలైన దేవతలు అందరిని జయశీలుడైన సముద్రుడు మింగకుండా తానే ఆరగించి) అని తిరుమఙ్గైయాఴ్వార్లచేత, **"పృథివ్యప్సు ప్రలీయతే, ఆప స్తేజసి లీయంతే, తేజో వాయౌ లీయతే, వాయు రాకాశే లీయతే, ఆకాశ మింద్రియేషు, ఇంద్రియాణి తన్మాత్రేషు, తన్మాత్రాణి భూతాదౌ లీయంతే, భూతాదిః మహతి లీయతే, మహా నవ్యక్తే లీయతే, తమః పరే దేవ ఏకీభవతి"** (భూమి జలంలో లయిస్తున్నది. జలంలో అగ్నిలో లయిస్తున్నది. అగ్ని వాయువులో లయిస్తున్నది. జలంలో అగ్నిలో లయిస్తున్నది. అగ్ని వాయువులో లయిస్తున్నది. వాయువు ఆకాశంలో లయిస్తున్నది. ఆకాశం ఇంద్రియాలతో, ఇంద్రియాలు తన్మాత్రలతో చేరుతున్నవి. తన్మాత్రలు భూతాది అనే తామసాహంకారంలో లయిస్తున్నవి. అహంకారం మహాన్‌లో లయిస్తున్నది. మహాన్ అవ్యక్తంలో లయిస్తున్నది. అవ్యక్తం తమస్సులో లయిస్తున్నది. తమస్సు గొప్పవాడైన

యరుళిచ్చెయ్‌కైయాలే నారాయణశబ్దార్థత్తై వివక్షిత్తరుళిచ్చెయ్‌తారెన్నుమిడమ్ తోఱ్ఱు కిఱతు.

"నరా జ్ఞాతాని తత్త్వాని", "ఆపో నారా ఇతి ప్రోక్తాః" ఎన్గిఱపడియే జగత్కారణత్వవాచకమాయిఱే నారాయణశబ్దమ్‌తానిరుప్పతు. అన్ద జగత్కారణత్వన్దాన్ "ఒన్ఱు న్దేవు ములకు ముయిరుమ్ మఱ్ఱుమ్ యాతు మిల్లా వన్ఱు నాన్ముకన్‌తన్నొడు తేవరులకోడుయిర్‌పడైత్తాన్" ఎన్గిఱపడియే అప్యయపూర్వకమాయిరుక్కుమిఱే. అన్ద అప్యయపూర్వకమాన జగత్కారణత్వత్తై ఇత్తిరునామమ్ ప్రతిపాదిక్కైయాలే

---

దేవునిలో (పరమాత్మలో) ఒకటి అవుతున్నది) (సుబాల-2) అనే ప్రమాణంలోను చెప్పబడ్డ తన సంకల్పంచేత దేవతలను అందఱిని, అన్ని వస్తువులను తనతో ఏకం అయేటట్లు చేయడం అనే సర్వసంహర్తగా ఉండే ఈ గొప్పతనమే హరిశబ్దార్థం. ఇందుచేత- **"రక్షతు త్వా మశేషాణాం భూతానాం ప్రభవో హరిః, యస్య నాభిసముద్భూతపంకజా దభవ జ్జగత్"** (విష్ణుపు-5-5-14) (ఎవని నాభీకమలంనుండి లోకం పుట్టినదో, సర్వభూత కారణుడైన ఆ హరి నిన్ను రక్షించుగాక) అనే ప్రమాణంలో భగవానుడే జగత్కారణం అని చెబుతున్నదని ఈ తిరునామాన్ని చెప్పడంచేతను, నారాయణశబ్దార్థాన్ని మనస్సులో ఉద్దేశించే ఇక్కడ ఆళవన్దార్ **"హరి"** శబ్దాన్ని ప్రయోగించారని తోస్తుంది.

**"నరా జ్ఞాతాని తత్త్వాని నారాణీతి తతో విదుః, తాన్యేవ చాయనం తస్య తేన నారాయణః స్మృతః"** (భార-అను 186-7) (నరుడనే భగవానునివల్ల తత్త్వాలన్నీ పుట్టినవి. అందువల్ల వాటిని నారాలని తెలిసికొంటున్నారు. అవే అతనికి వాసస్థానం. అందువల్ల అతడు నారాయణుడు అని అనబడుతున్నాడు) **"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః, తా యదస్యాయతనం పూర్వం తేన నారాయణః స్మృతః"** (మను-1-10) (జలం నారం అని అనబడుతున్నది. నరుడనే భగవానునివల్ల పుట్టినదికదా ఇది, ఆ జలం అతనికి మొదట వాసస్థానం అయింది. అందువల్ల అతడు నారాయణుడనబడుతున్నాడు) అనే రీతిలో నారాయణశబ్దం జగత్కారణత్వాన్ని చెబుతుందికదా! ఆ జగత్కారణత్వంకూడా **"ఒన్ఱుమ్ తేవుమ్ ఉలకుమ్ ఉయిరుమ్ మఱ్ఱుమ్ యాదు మిల్లా అన్ఱు నాన్ముకన్ తన్నొడు దేవరులకోడు ఉయిర్ పడైత్తాన్"** (తిరువాయ్-4-10-1) (ఏ దేవతలు, లోకాలు, జీవులు మిగిలిన ఎవ్వరూ లేని ఆ సమయంలో చతుర్ముఖునితోపాటు, దేవలోకంతోపాటు జీవులను సృష్టించాడు) అనే రీతిలో ప్రళయపూర్వకంగాకదా సృష్టి ఉంటుంది. ప్రళయపూర్వకం అయిన



నారాయణపదపర్యాయ మెన్నుమిడమ్ సిద్ధమిఱే. ఆకైయాలేయన్ఱో "విశ్వం నారాయణం హరిమ్" ఎన్ఱుమ్, "అఱ్పుతన్ నారాయణ నరి" ఎన్ఱుమ్ వేదాన్తద్వయత్తిలుమ్ సహ పఠిత్తతు. భట్టరుమ్. "అంఘ్రీ హరే రాశ్రయే", "తస్యైవేతి హరే ర్వివిచ్య కథితమ్" ఎన్ఱ వాక్యద్వయత్తిలుమ్ నారాయణపదద్వయపర్యాయమాక హరిశబ్దత్తై యరుళిచ్చెయ్‌తారిఱే.

అనన్తరమ్ కీఴ్ అనుభూతమాయ్, అమూర్తముమాన స్వరూపత్తుక్కాశ్రయ మాయ్, మూర్తమాన దివ్యమఙ్గళవిగ్రహత్తై అనుభవిక్కిఱార్ (మూర్తం బ్రహ్మ) ఎన్ఱ

---

జగత్కారణత్వాన్ని ఈ హరినామం చెప్పడంవల్ల ఇది నారాయణనామంతో ఒకే అర్థాన్ని కల్గినది అని స్పష్టమవుతున్నదికదా! అందువల్లనేకదా **"విశ్వం నారాయణం హరిమ్"** (తైత్తి. నా-11) లోకానికి అంతటికీ అంతర్యామిగాను, సంహారకుడుగాను ఉండేవాడు నారాయణుడే) అని సంస్కృత వేదంలోను, "**అఱ్పుతన్ నారాయణన్ అరి**" (తిరువాయ్-8-6-10) (ఆశ్చర్యభూతుడు, నారాయణుడు, హరి) అని ద్రావిడవేదంలోను నారాయణ-హరినామాలు ఒకటిగా చేర్చి పఠింపబడ్డాయి. భట్టర్‌కూడా-**"ఈశానాం జగతా మధీశదయితాం నిత్యానపాయాం శ్రియం, సంశ్రిత్యాశ్రయణోచితాఖిలగుణ-స్యాంఘ్రీ హరే రాశ్రయే, ఇష్టోపాయతయా శ్రియా చ సహితాయాత్మేశ్వరా యార్థయే కర్తుం దాస్య మశేష మప్రతిహతం నిత్యం త్వహం నిర్మమః"** (అష్టశ్లోకి-6) (లోకానికి ఈశ్వరియై, సర్వేశ్వరునకు పత్నియై, ఏనాడూ స్వామిని విశ్లేషించలేనిదైన లక్ష్మిని పురుషకారంగా ఆశ్రయించి, ఉపాయంగా ఆశ్రయించతగిన అన్ని గుణాలను కల్గిన హరియొక్క శ్రీపాదద్వంద్వాన్ని ఇష్టోపాయంగా ఆశ్రయిస్తున్నాను. పిరాట్టితో కూడిన ఆత్మేశ్వరుడైన భగవానునివద్ద అడ్డులేనిది విచ్ఛిన్నం లేని కాలం అంతా కైంకర్యాన్ని చేయాలని మమకారరహితుడనై ప్రార్థిస్తున్నాను) అనే ద్వయంలోని అర్థాన్ని చెప్పేటప్పుడు, **"మంత్రబ్రహ్మణి మధ్యమేన నమసా పుంసః స్వరూపం గతిః గమ్యం శిక్షిత మీక్షితేన పురతః పశ్చా దపి స్థానతః, స్వాతంత్ర్యం నిజరక్షణం సముచితా వృత్తి శ్చ నాన్యోచితా తస్యైవేతి హరే ర్వివిచ్య కథితం స్వస్యాపి నార్హం తతః"** (అష్టశ్లోకి-2) (గొప్పమంత్రం అయిన అష్టాక్షరిలో మధ్యలో ఉండే **"నమః"** అనే పదాన్ని ముందు వెనుక అన్వయించి, ఉన్నచోటనే అన్వయించి చూచేటపుడు జీవుని స్వరూపం, ఉపాయం, ఫలం-అనే మూడు శిక్షింపబడుతున్నాయి. స్వాతంత్ర్యం, తనను రక్షించడం, స్వరూపానురూపం అయిన కైంకర్యం-అనే ఇవి వేఱెవ్వరికి తగినవి కావు. ఆ హరికే తగినవి అని వివరించి

తొడజ్గి- (యదత్యద్భుతమ్) ఎన్నుమళవాక. (మూర్తమ్) స్పర్శరూపాదిగుణజ్గళోడేకూడి, పరమపదపర్యన్తాది దేశపరిచ్ఛిన్న విగ్రహమాయిరుక్కై. (మూర్తమ్) "శక్తయః పంచ విఖ్యాతాః పఞ్చోపనిషదాఖ్యయా'' ఎన్గిఅపడియే పఞ్చోపనిషత్సంజ్ఞికజ్గళాన పఞ్చశక్తిమయమాయిఱే విగ్రహ మిరుప్పతు. పఞ్చోపనిషత్తుక్కళావన-"పరమేష్ఠీ పుమాన్విశ్వో నివృత్తి స్సర్వ ఏవ హి" ఎన్గిఅపడియే, పరమేష్ఠి-పురుష- విశ్వ- నివృత్తి-సర్వ-సంజ్ఞికజ్గళాన అప్రాకృతభూతపఞ్చకజ్గళ్. ఏవంవిధపఞ్చోపనిషత్తుక్కళ్తాన్ శబ్దాదిపఞ్చగుణవిశిష్టజ్గళాయిరుక్కైయాలే "పరమేష్ఠీ స్మృత శ్శబ్దే స్పర్శే తు పురుషః

---

చెప్పబడుతున్నది. అందువల్ల ఇది జీవునకు సంబంధించినవి కావు, అని తిరుమంత్రంలో **"నమః"** శబ్దార్థాన్ని వివరించేటపుడు, తిరుమంత్ర-ద్వయాలలో ఉండే **"నారాయణ"** పదంతో ఒకే అర్థాన్ని కల్గినదిగా **"హరి"** నామాన్ని అనుగ్రహించారుకదా! ఈ విధంగా మొదటి పాదంలో ఇంతవరకు భగవానుని దివ్యాత్మస్వరూపం చెప్పబడింది,

ఇక, రెండవ చరణంతో- మొదటిపాదంలో అనుసంధింపబడినదై రూపం లేనిదైన దివ్యాత్మస్వరూపానికి ఆధారమై, మూర్తం అయిన (రూపం కల్గినదైన) దివ్యమంగళవిగ్రహాన్ని అనుభవిస్తున్నారు. **(మూర్తమ్)**- స్పర్శ, రూప, రస, శబ్ద, గంధాలనే అయిదు గుణాలతో కూడినదై, పరమపదం, క్షీరాబ్ధి మొదలైన దేశాలలో ఉండే తిరుమేనియై ఉండడం-అని అర్థం. **"స్పర్శరూపాదియుక్తం పరమపర్యంకాది దేశపరిచ్ఛిన్నం చేత్యర్థః"** అని దేశికవ్యాఖ్య. **(మూర్తమ్) - "శక్తయః పంచ విద్యాయాః పంచోపనిషదాఖ్యయా"** (పాంచరాత్రమ్)- (పంచోపనిషత్తులని పేరుపడ్డ అయిదు శక్తులు ప్రసిద్ధిని పొందినవి), **"పరమేష్ఠీ పుమాన్ విశ్వో నివృత్తి స్సర్వ ఏవ హి, పరమేష్ఠీ స్మృతః శబ్దే స్పర్శే తు పురుషః స్మృతః, విశ్వాత్మా తేజసి ప్రోక్తో నివృత్త్యాత్మా రసే స్మృతః, సర్వాత్మా కథితో గంధే విషయే పురుష స్స్మృతః"** (పాంచరాత్రమ్) (పరమేష్ఠీ, పుమాన్, విశ్వం నివృత్తిః, సర్వః-అని అయిదు పంచోపనిషత్తులు. పరమేష్ఠి శబ్దాన్ని, పుమాన్ స్పర్శను, విశ్వః అనే ఉపనిషత్తు రూపాన్ని, పుమాన్ నివృత్తి రసాన్ని, సర్వః అనే ఉపనిషత్తు గంధాన్ని, పురుషుడు విషయాన్ని కల్గినవిగా చెప్పబడుతున్నాయి) అని పాంచరాత్రంలో తెల్పిన రీతిలో అయిదు శక్తులు అని, అయిదు ఉపనిషత్తులు అని చెప్పబడే శుద్ధసత్త్వద్రవ్యాలచే రూపొందిన తిరుమేని, పరమేష్ఠీ, పుమాన్, విశ్వః, నివృత్తిః, సర్వః-అనే పేర్లను కల, అప్రాకృతాలైన అయిదు భూతాలు, శబ్దస్పర్శరూపరసగంధాలనే అయిదు గుణాలతో కూడి ఉన్నాయి అని, గుణాలతో



స్మృతః, విశ్వాత్మా తేజసి ప్రోక్తో నివృత్త్యాత్మా రసే స్మృతః, సర్వాత్మా కథితో గన్ధే విషయే పురుషః స్మృతః" ఎన్గిఅపడియే పరమేష్ఠ్యాదిసంజ్ఞికజ్గళాన భూతపఞ్చకముమ్, శబ్దస్పర్శరూపరసగన్ధసంజ్ఞికపఞ్చగుణత్వేన ప్రమాణ ప్రసిద్ధజ్గళాయిరుక్కుమే. ఆకైయాలే, ఏతాదృశ పఞ్చగుణకాకాశాద్యప్రాకృతభూతపఞ్చకమయమాయిరుక్కైయాలే "మూర్తమ్" ఎన్గిఱార్.

ఇచ్చేతనన్ కర్మానుగుణమాక ప్పరిగ్రహిక్కుమ్ దేహమాకిలిఱే "మణ్ణాయ్ నీరెరికాల్ మఞ్జులావు మాకాశముమామ్", "మఞ్జుశేర్ వానెరి నీర్ నిలజ్గాలివై మయజ్గి నిన్ఱ వఞ్జు శేరాక్కై" ఎన్గిఅపడియే ప్రాకృతపఞ్చభూతమయమాయిరుప్పతు. ఇజ్గనన్ఱిక్కే "పంచైతా శ్శక్తయః ప్రోక్తాః పరస్య పరమాత్మనః, అశేషజగదాధారాః పదే దివ్యే వ్యవస్థితాః" ఎన్ఱు భగవచ్ఛక్తిత్వేన సమస్తకార్యపదార్థాధారకజ్గళాయ్క్కొణ్డు పరమపదత్తిలే ఏతద్విగ్రహమాయుమ్, తదీయవిగ్రహజ్గళాయుమ్, విమానమణ్డపగోపురప్రసాదాది రూపేణవుమ్ పరిణమిక్కిఱ అప్రాకృతభూతపఞ్చకమయమాయిఱే యిరుప్పతు.

---

కూడిన ఆ అయిదు భూతాలతో రూపొందింది కాబట్టి భగవానుని తిరుమేనిని **"మూర్తమ్"** (రూపాన్ని కల్గినది) అని అన్నారు.

ఈ లోకంలో ఉండే జీవుడు తాను చేసిన కర్మను అనుసరించి పరిగ్రహించే దేహం అయితేకదా **''మణ్ణాయ్ నీరెరికాల్ మఞ్జులావుమ్ ఆకాశముమామ్''** (పెరియతిరు-1-9-6) (మన్ను, నీరు, నిప్పు, గాలి, మేఘాలు సంచరించే ఆకాశంగా) **''మఞ్జుశేర్ వానెరి నీర్ నిలమ్ కాలివై మయజ్గి నిన్ఱ అఞ్జు శేరాక్కై''** (పెరియతిరు-9-7-8) (మేఘాలు చేరే ఆకాశం, నిప్పు, నీరు, భూమి, గాలి అనే ఇవి కలిసి ఉండే అయిదింటి సమ్మేళనం అయిన శరీరం) అనే రీతిలో ప్రాకృతమై, దోషాలను కల పంచభూతాలలో నిర్మింపబడ్డదై ఉంటుంది. ఆ విధంగా కాకుండా, **"పంచైతాః శక్తయః ప్రోక్తాః పరస్య పరమాత్మనః, అశేషజగదాధారాః పదే దివ్యే వ్యవస్థితాః"** (పాంతరాత్రమ్) (వీటికంటే గొప్పవాడు అయిన పరమాత్మకు శక్తులుగా చెప్పబడే ఈ అయిదు పరమపదంలో ఉంటూ విశ్వాన్ని అంతటినీ ధరిస్తున్నవి) అని పాంచరాత్రశాస్త్రంలో చెప్పిన రీతిలో అప్రాకృతాలు అయిన ఈ అయిదు భూతాలే పరమపదంలో భగవానుని శక్తులని వ్యవహరింపబడేవై, ఈ ప్రాకృతలోకంలో ఉండే అన్ని కార్యవస్తువులకు ఆధారమై ఉండేవై, పరమపదంలో పరవాసుదేవవిగ్రహంగాను, అతని దాసులైన నిత్యముక్తుల విగ్రహాలుగాను, విమాన, మండపం, గోపుర, హర్మ్య, నందనవనాదులుగాను పరిణమిస్తున్నాయి-అని చెప్పబడుతున్నది కదా! అందువల్లనే **"న తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేదోఽస్థిసంభవా"** (వరాహపురాణమ్-34-40)

ఆకైయాలేయితే "న తస్య ప్రాకృతా మూర్తి ర్మాంసమేదోఽస్థిసమ్భవా", "న భూతసఙ్ఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః", "పఞ్చశక్తిమయో దేవః" ఎన్ను ప్రాకృతత్వనిషేధపూర్వకమాక అప్రాకృతత్వత్తై ప్రతిపాదిక్కిఱతు.

ఇప్పడి ప్రాకృతమాకైయాలే శుద్ధసత్వమయముమాయితే విగ్రహ మిరుప్పతు, రజస్తమస్సుక్కళ్ కలశాతే శుద్ధియోగత్తాలే కేవలసత్వమాయ్, "సత్వం విష్ణుప్రకాశకమ్", "తత్ర సత్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్" ఎన్ను అతిప్రకాశకవస్తువాకైయాలే జ్ఞానానన్దమయచేతనతద్గుణతిరోధాయక త్రిగుణాత్మకప్రాకృతశరీరవ్బోలన్రిక్కే, స్వవైలక్షణ్యత్తాలే స్వాన్తర్గతచామీకరప్రకాశకమాణిక్యమఞ్జూషైపోలే స్వాన్తఃస్థిత దివ్యాత్మస్వరూపతద్గుణగణ సమ్యక్ప్రకాశనచాతుర్యసహితముమాయిరుక్కుమ్.

---

(అతని తిరుమేని మాంసం, కొవ్వు, ఎముకలు–అనే వీనితో ఏర్పడ్డ, ప్రకృతి సంబంధాన్ని కల శరీరం కాదు) అని, **"సంభూతసంఘుసంస్థానో దేహోఽస్య పరమాత్మనః"** (భార–శాంతి–206–60) (అయిదు శక్తుల రూపాన్ని కలవాడు దేవుడు) అని ఇతిహాసపురాణాది శాస్త్రాలలో భగవానుని తిరుమేని ప్రాకృతమైనది కాదు, అప్రాకృతం–అని ఘోషింపబడుతున్నది.

ఈ విధంగా అప్రాకృతమై ఉండడంవల్ల ప్రాకృతవస్తువులవలె రజస్తమస్సుల కలయికతో కాకుండా, శుద్ధసత్త్వమయంగానే ఉంటుందికదా ఈ తిరుమేని. **"సత్త్వం విష్ణుప్రకాశకమ్"** (సత్త్వగుణం విష్ణువును ప్రకాశింపజేసేది), **"తత్ర సత్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్)** (భ.గీ–14–6) (ఆ మూడు గుణాలలో సత్త్వగుణం నిర్మలంగా ఉంటుంది కనుక వస్తువుల యథార్థస్వరూపాన్ని తెలియజేస్తుంది. ఆరోగ్యాన్ని కల్గిస్తుంది) అనే రీతిలో, ఈ విధంగా రజస్తమస్సులు కలవకుండా సత్త్వగుణాన్ని మాత్రమే కల్గినదై ఉండడంవల్ల అన్నిటినీ ప్రకాశింపజేసే ద్రవ్యమై ఉంటుంది. కనుక జ్ఞానానందమయుడైన చేతనుని, అతని గుణాలను మఱుగుపఱచే త్రిగుణాలను కల ప్రాకృతశరీరంవలె కాకుండా, తన మహిమతో, రత్నపేటిక తనలో ఉండే బంగారు కణికను బయటికి వ్యక్తం చేసేటట్లు, ఈ తిరుమేని తన లోపల ఉండే దివ్యాత్మస్వరూపాన్ని, దాని గుణసమూహాలను చక్కగా ప్రకాశింపజేయగల్గినదై ఉంటుంది.

ఈ రీతిలో అప్రాకృతద్రవ్యాత్మకమై, శుద్ధసత్త్వగుణం ఒక్కటినే కల్గినదై ఉన్నా, **"సవ్యం పాదం ప్రసార్య శ్రితదురితహరం దక్షిణం కుంచయిత్వా జానున్యాదాయ సవ్యేతర మితరభుజం నాగభోగే నిధాయ, పశ్చా ద్బాహుద్వయేన ప్రతిభటశమనే ధారయన్ శంఖచక్రే దేవీభూషాదిజుష్టో జనయతి జగతాం శర్మ వైకుంఠనాథః"**



ఇప్పడి అప్రాకృతమాయ్, శుద్ధసత్వాత్మకమాయిరున్దతే యాకిలుమ్, "సవ్యం పాదం ప్రసార్య శ్రితదురితహరిమ్" ఇత్యాదిప్పడియే చరణకమలకరకమలనయనారవిన్ద వక్త్రారవిన్దప్రముఖదివ్యావయవ సంఘాతాత్మకమాయిరుక్కైయాలే, "యత్ర ధూమ స్తత్రాగ్నిః" ఇతివత్, అనిత్యత్వవ్యాప్తసావయత్వహేతువాలే అనిత్యత్వవ్యాప్యసావయవత్వ ప్రముక్తప్రాకృతశరీరవత్ అనిత్యత్వమ్ ప్రసజ్గిక్కుమే? యెన్నిల్, న ప్రసఙ్గః. సర్వత్ర అనిత్యత్వే సావయవత్వమ్ హేతువాక మాట్టాతు. పిన్నై యేతు? ఎన్నాల్ అవయ వారబ్ధత్వమే అనిత్యత్వే హేతువాకక్కడవతు. ఇఙ్గనన్నాకిల్, హస్తపాదాద్యవయవ సంయుక్తనాన చేతననుక్కుమ్ అనిత్యత్వమ్ ప్రసజ్గిక్కుమ్. ఆకైయాలే దివ్యవిగ్రహత్తుక్కు

---

(అష్టాక్షరీధ్యానశ్లోకం) (దాసుల దుఃఖాన్ని తీర్చే ఎడమపాదాన్ని చాచి, కుడి శ్రీపాదాన్ని మడచి, కుడిచేతిని కుడి మోకాలిపై ఆన్చి, ఎడమచేతిని ఆదిశేషునిపై పెట్టి, వెనుక ఉండే రెండు చేతులతో విరోధులను నిరసించే శంఖచక్రాలను ధరించి, దివ్యదేవేరులచే (కౌస్తుభం మొదలైన) ఆభరణాలు మొదలైనవాటిచే సేవింపబడేవాడై వెలిగే వైకుంఠనాథుడు లోకానికి సుఖాన్ని అనుగ్రహించుగాక) అనే రీతిలో శ్రీపాదకమలాలు, తామరలవంటి శ్రీ హస్తాలు, అరవిందంవంటి తిరునేత్రాలు, శ్రీముఖపద్మం మొదలైన అప్రాకృతాలైన అవయవాలతో కూడి ఉండడంచేత **"యత్ర ధూమ స్తత్రాగ్నిః"** (ఎక్కడ పొగ ఉన్నదో అక్కడ అగ్ని ఉంటుంది) అనే తార్కికవాక్యంలో పొగ అనే హేతువు ఉండే చోట అంతా నిప్పు ఉన్నది అని సాధించేటట్లే, ప్రాకృతశరీరాలు అవయవాలను కల్గినదై ఉన్నదాన్ని బట్టి, ఆ శరీరాలు అనిత్యం అని సాధించే రీతిలో, ఈ ప్రాకృతశరీరంకూడా అనిత్యం అని చెప్పవలసివస్తుందే ! అని అంటే, ఆ విధంగాకాదు. ఎందువల్ల ? అని అంటే, అవయవాలతో కూడి ఉండడం అనే హేతువు అన్ని చోట్ల ఆ వస్తువుయొక్క అనిత్యత్వాన్ని సాధించలేదు. నిజానికి, ఏ వస్తువు పలు అవయవాలను కల్గి ఉన్నదో, ఆ వస్తువు విషయంలోనే అవయవాలచే నిర్మింపబడినదై ఉండడం అనే హేతువును పురస్కరించుకొని అనిత్యత్వాన్ని సాధించవచ్చును. ఈ విధంగా గ్రహించకపోతే చేతులు, కాళ్ళు మొదలైన అవయువాలతో చేరి ఉండే జీవాత్మకుకూడా అనిత్యత్వం సాధించవలసివస్తుంది. అందుచేత, భగవానుని తిరుమేని పలు అవయువాలచే నిర్మింపబడినది–అనే దానికి ఏ ప్రమాణం లేనందువల్ల, **"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః"** (ఋుక్–అష్టక !–2–7, సామ–3–8–2–4) (విష్ణువుయొక్క ఆ పరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడూ దర్శిస్తున్నారు) అనే వేదవాక్యంలోను, **"పశ్యంతి చ సదా దేవం నేత్రైః జ్ఞానేన"** (జ్ఞానం అనే కన్నులతో దేవుని ఎల్లప్పుడు

అవయవారబ్ధత్వే ప్రమాణ మిల్లామైయాలుమ్, "సదా పశ్యన్తి సూరయః", "పశ్యన్తి చ సదా దేవం నేత్రైర్ః జ్ఞానేన" ఇత్యాద్యుపబృంహణ్యోప బృంహణఙ్గళాలే నిత్యత్వేన ప్రతీతఙ్గళాకైయాలుమ్ విగ్రహనిత్యత్వమ్ సిద్ధమితే.

ఇఙ్గనేయాకిలుమ్ ఇతుతాన్ అనన్తావతారకన్దమాకైయాలే ఇన్ద విగ్రహత్తినిన్ఱుమ్ సాధుపరిత్రాణార్థమాక, "బహూధా విజాయతే", "బహూని", "పిఱప్పిల్ పల్ పిఱవి ప్పెరుమాన్" ఎన్నుమ్బడి "యుగే యుగే" సమ్భవిక్కిఱ బహుదివ్యజన్మఙ్గళ్‌తోఱుమ్, అసఙ్ఖ్యాతఙ్గళాన "అభిమతోరుదేహా" ఙ్గళుణ్డాకైయాలే ఉపచయాత్మక ప్రాకృతదేహమ్బోలే సతతవికారాస్పదమాయిరుక్కుమో? వెన్నిల్.

---

దర్శిస్తున్నారు) అని దానిని వివరించే ఉపబృంహణ వాక్యంలోను భగవానుని తిరుమేని నిత్యమైనది అని చెప్పబడినందున, ఆ తిరుమేని నిత్యమైనది అని తెలుస్తున్నది కదా !

ఈ రీతిలో నిత్యంగా అంగీకరించినా, పరమపదంలో ఉండే ఈ పరరూపం గీత మొదలైన శాస్త్రాలలో తెల్పిన రీతిలో సాధుపరిత్రాణార్థం, దుష్టవినాశార్థం, ధర్మసంస్థాపనార్థం ఎత్తే అంతులేని అవతారరూపాలకు అన్నిటికీ మూలమై ఉండడంచేత దీనికి వృద్ధి, క్షయాలనే వికారాలు ఉంటాయా ? అనే సందేహం కలిగే అవకాశం లేదు. ఈ తిరుమేనితోనే సాధువులను రక్షించడంకోసం **"అజాయమానో బహుధా విజాయతే"** (కర్మమూలకం అయిన జన్మ లేనివాడైనా కృపవల్ల పలు రీతుల్లో పలు మార్లు అవతరిస్తున్నాడు) (పు. సూ. 2-4) అని పురుషసూక్తంలోను, **"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున"** (భ.గీ-4-5) (అర్జునా ! నాకు, నీకు పలు జన్మలు గడిచాయి) అని గీతలోను, **"పిఱప్పిల్ పల్ పిఱవి ప్పెరుమాన్"** (తిరువాయ్-2-9-5) (కర్మకృత జన్మలులేని, కరుణామూలకాలు అయిన పలు జన్మలను కల స్వామి) అని తిరువాయ్‌మొழிలోను తెల్పిన రీతిలో, **"సంభవామి యుగే యుగే"** అని చెప్పినట్లు ప్రతి యుగంలోను అవతరించే పలు పలు అప్రాకృతజన్మలలో లెక్కలేనన్ని సుందరదివ్యవిగ్రహాలను కలవాడు. కనుక, క్షీణించి వృద్ధిచెందే ప్రాకృతశరీరాలవలె ఈ పరరూపంకూడా ఎల్లప్పుడు తగ్గుతూ, హెచ్చడం అనే వికారాన్ని కల్గినది అవుతుందా? అనే సందేహానికి పరిహారాన్ని ఈ క్రిందివిధంగా చెప్పవచ్చు.

**"యస్య దివ్యం హి తద్రూపం హ్రీయతే వర్ధతే న చ"** (ఎవని ఆ దివ్యరూపం క్షీణించదో, వృద్ధి చెందడంలేదో) అనే ప్రమాణంలోను, **"శురుక్కువారై యిన్ఱియే శురుఙ్గినాయ్ శురుఙ్గియుమ్ పెరుక్కువారై యిన్ఱియే పెరుక్కుమెయ్‌దు పెఱ్ఱియోయ్"** (తిరుచ్చంద-109) (సంకోచించడానికి కారణం అయిన కర్మలు ఏమీ లేకపోయినా



"యస్య దివ్యం హి తద్రూపం హీయతే వర్ధతే న చ", "శురుక్కువారై యిన్ఱియే శురుఙ్గినాయ్ శురుఙ్గియుమ్ పెరుక్కువారై యిన్ఱియే పెరుక్కమెయ్‌తు పెఱ్ఱియోయ్" ఎన్గిఅపడియే కర్మానుగుణవికారరహితమాకవుమ్, "సమ్భవామ్యాత్మమాయయా", "తేవరిరక్క వేణ్డివన్దు పిఱన్దతుమ్", "దేవై ర్థితో జజ్ఞే" ఎన్ఱుమ్, "ఇచ్ఛాగృహీత" వికారమ్ గుణాయవుమాకైయాలే ఏకరూపమాయిరుక్క త్తట్టిల్లై. అనేకవిగ్రహమ్ పరిగ్రహిక్కచ్చెయ్‌తేయుమ్ "సదైకరూపరూపాయ" ఎన్ఱతితే.

---

ఆశ్రితానుగ్రహంచేత వామనుడవై సంకోచాన్ని పొందావు. ఈరీతిగా సంకోచాన్ని పొందినా, పెరగడానికి తగిన కర్మలు లేకున్నా త్రివిక్రముడవై వృద్ధి చెందే స్వభావాన్ని కలవాడా!) అని తిరుచ్చన్దవిరుత్తంలోను అనుగ్రహించిన రీతిలో కర్మచే కలిగే వికారాలు ఈ తిరుమేనికి లేనందువల్ల, **"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్, ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా"** (భ.గీ-4-6) (జన్మలేనివాడనైనా, నాశం లేనివాడనైనా, సర్వేశ్వరుడనైనా, నా సంకల్పంతోను, నా స్వభావంతోనే అవతరిస్తాను) అనే గీతలోను, **"వేణ్డి త్తేవరిక్క వన్దు పిఱన్దదుమ్"** (తిరువాయ్-6-4-5) (దేవతలు ప్రార్థించి యాచించగా వచ్చి జన్మించినది) అని తిరువాయ్‌మొழி లోను, **"స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః"** (రామా.అయో-1-7) (మదించిన రావణుని వధను కోరిన దేవతలచే ప్రార్థింపబడినవాడు, సనాతనుడు అయిన విష్ణువు మానవలోకంలో శ్రీరాముడుగా అవతరించాడు) అని శ్రీరామాయణంలోను-ఇంకా **"ఇచ్ఛాగృహీత"** ఇత్యాదిగా శ్రీవిష్ణుపురాణం మొదలైనవానిలోను ఈ తిరుమేనిని భగవానుడే స్వయంగా ఆశపడి స్వీకరిస్తాడు అని చెప్పినందువల్ల, ఇది ఎప్పుడూ ఒకే విధంగా ఉంటుంది. కర్మచే ఏర్పడే వికారాలే దోషాలకు కారణాలు, భగవానుడు తాను స్వయంగా ఆదరించి స్వీకరించినవి గుణాన్నే కల్గిస్తాయి. అందుచేత ఈ తిరుమేని సదా ఏకరూపాన్ని కల్గినది అని చెప్పడంలో అడ్డులేదు. అందువల్లనే **"అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే, సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే"** (విష్ణు.పు-1-2-1) (వికారాలు లేనివాడు, పరిశుద్ధుడు, నిత్యుడు, పరమాత్మ, ఎల్లప్పుడూ ఒకే రీతిలో ఉండే రూపాన్ని కలవాడు, అందఱిని జయించేవాడైన విష్ణువునకు నమస్కారం) అనే ప్రమాణంలో భగవానుని తిరుమేని ఎల్లప్పుడూ ఒకే రీతిలో ఉండే రూపం అని చెప్పబడింది.

**"కి మాత్మికా భగవతో వ్యక్తిః, యదాత్మకో భగవాన్? కి మాత్మకో భగవాన్? జ్ఞానాత్మకో భగవాన్"** (పాంచరాత్రమ్) (భగవానుని తిరుమేని ఎటువంటిది ? భగవానుడు

"కి మాత్మికా భగవతో వ్యక్తిః" ఎన్ఱు ప్రశ్నమ్ పణ్ణి, "యదాత్మకో భగవాన్" ఎన్ఱు ఉత్తరమ్ ఉక్తమానవన్తరమ్, "కి మాత్మకో భగవాన్" ఎన్ఱు ప్రశ్నమ్ పణ్ణి, "జ్ఞానాత్మకో భగవాన్" ఎన్ఱు అజడత్వాభిప్రాయేన జ్ఞానాత్మకత్వమ్ ఉత్తరమాక చ్చొల్లుకైయాలే, జ్ఞానాత్మకమాన భగవత్స్వరూపమ్ స్వరూపానురూపముమాయ్, "విద్యుల్లేఖేవ భాస్వరా", "నిలవుమ్ శుడర్ శూழ్ఒళి మూర్త్తి", "వాఞ్ శుడర్ క్కుழ్ఱై", "తేజసాం రాశి మూర్జితమ్" ఇత్యాదిప్రమాణప్రకారేణ నిరవధికతేజోరూపమాయిరుక్కుమ్.

---

ఏ రూపాన్ని కల్గి ఉన్నాడో దానితో రూపొందింది. భగవానుడు ఏ రూపాన్ని కల్గి ఉన్నాడు? భగవానుడు జ్ఞానమయుడై ఉన్నాడు) అని పాంచరాత్రశాస్త్రంలో భగవానుని తిరుమేని దేనితో నిర్మింపబడింది ? అని ప్రశ్నించి, "భగవానుడు ఏ రూపంలో ఉన్నాడో దానితో ఏర్పడింది" అని సమాధానాన్ని చెప్పినందున భగవానుని స్వరూపంవలె అతని తిరుమేనికూడా తానే ప్రకాశించే అజడద్రవ్యమై ఉంటుంది-అని వ్యక్తం అవుతున్నది, ఈ విధంగా తానే ప్రకాశించే జ్ఞానమయమై ఉండే భగవానుని తిరుమేని స్వరూపానికి తగినదై, **"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా"** (తై.నా 11) (నీలమేఘం మధ్యలో ఉండే మెఱపు తీగవలె ప్రకాశించేది) అని నారాయణోపనిషత్తులోను, **"నిలవుమ్ శుడర్ శూழ్ఒళిమూర్త్తి"** (తిరువాయ్-6-10-1) (నిత్యమైన ప్రకాశంతో వ్యాప్తం అయిన దివ్యతేజోరూపా!), **"ఒణ్శుడర్ కழ్ఱై"** (తిరువాయ్-1-7-9) (తేజోరాశి అయిన రూపాన్ని కలవాడు) అని తిరువాయ్మొழ్ఇలోను, **"తం దృష్ట్వా తే తతో దేవాః శంఖచక్రగదాధరమ్, అపూర్వరూపసంస్థానం తేజసాం రాశి మూర్జితమ్"** (విష్ణు.పు. 1-9-67) (అపుడు శంఖచక్రగదాధరుడై, అపూర్వమైన అవయవ సన్నివేశాన్ని కలవాడు తేజోరాశి అయిన ఆ భగవానుని దర్శించిన దేవతలు స్తుతించడానికి ఆరంభించారు) అని శ్రీవిష్ణుపురాణంలోను తెల్పిన రీతిలో అంతులేని తేజస్సును కల్గినదిగా ఉంటుంది. భగవానుని తిరుమేని, నిత్యముక్తుల తిరుమేనులు పంచోపనిషన్మయాలు కాబట్టి, పూర్వం తెల్పిన గొప్పతనాన్ని కల్గినదై, శుద్ధసత్త్వం అనే ఒకే జాతికి చెందిన తేజస్సుతో ఏర్పడినదై, ఒకే జాతికి చెందిన రత్నం, సూర్యుడు మొదలైన జ్యోతిఃపదార్థాల నడుమ మిణుకుమిణుకుమనే మిణుగురుపురుగు ప్రకాశంవలె, పరిమితం అయిన వెలుగును కల నిత్యముక్తుల విగ్రహం మిణుగురుపురుగు అని చెప్పదగినట్లుగా భగవానుని తిరుమేని అంతులేని కాంతిని కల్గినదై ఉంటుంది.

ఇంతమాత్రమే కాకుండా అంతులేని సౌందర్యం, (అవయవాల అందం), సౌగంధ్యం, సౌకుమార్యం, లావణ్యం (సముదాయశోభ), యౌవనం-మొదలైన



భగవద్విగ్రహముమ్ నిత్యముక్తర్విగ్రహఙ్గళుమ్, పఞ్చోపనిషన్మయమాకైయాలే, ఉక్తవిశేషణవిశిష్టత్వమ్ అవిశిష్టమాయ్, ఏకజాతీయద్రవ్యమయమాయిరున్దతేయాకిలుమ్, ఏకజాతీయద్రవ్యాత్మకమణిద్యుమణిమహోమధ్యే ఖద్యోతకాన్తివత్, సావధికతేజోరూప తదీయవిగ్రహత్తై ఖద్యోతకల్ప మెన్నలామ్పడి నిరవధిక తేజోరూపమాయిరుక్కై-ఏతద్విషయమ్.

ఇని, అవ్వళవన్ఱిక్కే నిరవధికసౌన్దర్యసౌగన్ధ్యసౌకుమార్యలావణ్య యౌవనాద్యనన్తగుణగణసమవేతమాయ్, "స్ఫురత్కిరీట.....స్వోచితవివిధే" త్యాద్యుక్త ప్రక్రియయా "స్ఫురత్కిరీటమకుటాద్యసఙ్ఖ్యేయదివ్యభూషణభూషిత" మాయ్. ఆభరణకోటియిలుమ్, ఆయుధకోటియిలు మన్వితఙ్గళాన శఙ్ఖచక్రగదాసిశార్ఙ్గాద్య సఙ్ఖ్యేయదివ్యాయుధశోభితమాయ్. "ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీత మివ హ్రదమ్"

---

అంతులేని గుణసమూహాలతో కూడినదై, **"స్ఫురత్కిరీటాంగదహార కంఠికా మణీంద్రకాంచీగుణ నూపురాదిభిః, రథాంగ శంఖాసిగదాధనుర్వరైః లసత్తులస్యా వనమాలయోజ్జ్వలమ్"** (స్తోత్రరత్నమ్-36) (ప్రకాశించే కిరీటం, బాహువలయాలు, హారాలు, కంఠిక, శ్రీకౌస్తుభం, ఒడ్డాణం, నూపురాలు-మొదలైన ఆభరణగణాలతోను, చక్రం, శంఖం, ఖడ్గం, గద, విల్లు అనే ఆయుధాలతోను, నీ స్పర్శవల్ల ప్రకాశించే తలసిని కల వనమాలతోను ప్రకాశించేవానిని) అని స్తోత్రరత్నంలోను, **"స్వోచితవివిధవిచిత్రానంతాశ్చర్యనిత్యనిరవద్య నిరతిశయౌజ్జ్వల్య కిరీటమకుట చూడావసంత మకరకుండలగ్రైవేయక హారకేయూరకటక శ్రీవత్సకౌస్తుభ ముక్తాదామోదరబంధన పీతాంబరకాంచీగుణ నూపురాద్యపరిమిత దివ్యభూషణ"** (శరణాగతిగద్యమ్) (తనకు తగినదై, పలు విధాలైనదై, విచిత్రమైనదై, అంతులేని ఆశ్చర్యాన్ని కల్గించేదై, నిత్యమై, దోషరహితమై, సాటిలేని సుగంధాన్ని, సుఖమైన సాటిలేని స్పర్శను, సాటిలేని కాంతిని కల్గినవైన కిరీటం, మకుటం, చూడావతంసం, మకరకుండలాలు, కంఠాభరణం,హారాలు, అంగదాలు, కటకాలు, శ్రీవత్సం, కౌస్తుభం,ముక్తాదామాలు, ఉదరబంధం, పీతాంబరం, ఒడ్డాణం (మొలనూలు), నూపురాలు-మొదలైన లెక్కలేనన్ని దివ్యాయుధాలతో అందమైనవాడా!) అని, శరణాగతిగద్యలో అనుగ్రహించిన రీతిలో వెలిగే కిరీటం, మకుటం-మొదలైన అంతులేని దివ్యభూషణాలతో అలంకరింపబడినది, ఆభరణ కోటిలోనికి చేరినవి అయిన శంఖం చక్రం, గద, నందకమనే కత్తి, శార్ఙ్గమనే విల్లు-మొదలైన అంతులేని ఆయుధాలతో అందాన్ని పొందింపబడ్డవాడై, **"ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీత మివ హ్రదమ్,**

ఎన్గిఱపడియే సకలతాపహరమాయ్, "ఇన్బమ్, శిÓÓన్బమ్", "ఒÇన్దేన్" ఎన్నలామ్బడి సమస్తభోగవైరాగ్యజనకమాయ్, యోగిధ్యేయమాయ్, శుభాశ్రయముమా యిరుక్కిఱ వైరాగ్యవైలక్షణ్యత్తై అనుసన్ధిత్తు "మూర్తం బ్రహ్మ" ఎన్గిఱార్.

ఇతిల్, సౌందర్యమావతు-సర్వదా అనుభవియానిన్హాలుమ్ "అప్పోÇదైక్కప్పోÇదు" ఏకైకావయవమే అపూర్వవద్విస్మయకరానేక భోగపరమ్పరాజనకాత్యన్తశక్తియాలే "సదా

---

**శామ్యామి పరినిర్వామి సుఖం మా మేతి కేవలమ్"** (భార-మోక్ష-4-50) (గ్రీష్మకాలంలో చల్లని మడుగులో ప్రవేశించి స్నానమాడేటట్లు, ఈ పరబ్రహ్మలో నేను ప్రవేశించి స్నానమాడుతున్నాను. అందువల్ల శాంతుణ్ణి అవుతున్నాను. తాపం తీఱినవాడను అవుతున్నాను. సుఖాన్నే పొందుతున్నాను) అనే రీతిలో అన్ని తాపాలను పోగొట్టేదై, **"కణ్డుకేట్టుÓÓమోన్దుÇలుమ్ ఐజ్కరువి కణ్ణ ఇన్బమ్ తెరివరియ అళవిల్లా చ్చిÓÓన్బమ్, ఒణ్డొడియాళ్ తిరుమకళుమ్ నీయుమే నిలా నిఱ్ప కణ్డు శదిర్న్దొÇన్దేన్ అడైన్దేన్ ఉన్ తిరువడియే"** (తిరువాయ్-4-9-10) (చూచి, విని, తాకి, వాసనచూచి, ఆస్వాదించి, తిరిగే పంచేంద్రియాలద్వారా పొందే సుఖం, తెలియడానికి సాధ్యం కానిది సంసారసుఖంకంటే గొప్పది, కాని, ముక్తానందం కంటే చిన్నది అయిన కైవల్యాన్ని సుందరకంకణాలను కల శ్రీదేవి, నీవు వేంచేసి ఉండేటట్లుగా సంకల్పించిన నీ చాతుర్యాన్ని దర్శించిన తర్వాత వదలిపెట్టాను. నీ శ్రీపాదాలను చేరాను.) అని గ్రహించిన రీతిలో ఐశ్వర్యభోగం, కైవల్యభోగం మొదలైనవానిలో వైరాగ్యాన్ని కల్గించేదై, యోగులచే ధ్యానింపబడేదై, మిగిలిన దైవాల శరీరాలవలె అశుభంగా కాకుండా, శుభంగా ఉండేదై, భగవత్స్వరూపంవలె ధ్యానించడానికి సాధ్యం కానిదై కాకుండా, ధ్యానించతగిన ఆశ్రయాన్ని కల్గినదై ఉండడంచేత శుభాశ్రయం అని అనబడుతున్నది. అయిన శ్రియః పతియొక్క ఈ గొప్ప అతిశయాన్ని అనుసంధించి **"మూర్తం బ్రహ్మ"** అని అన్నారు.

ఇక, పూర్వం ప్రస్తావించిన సౌందర్యం మొదలైన అయిదు దివ్యమంగళవిగ్రహగుణాలు వివరింపబడుతున్నవి. సౌందర్యం అంటే- **"ఎప్పోÇదుమ్ నాళ్ తిజ్గళ్ అణ్డాÇయూÇ దొఱుమ్ అప్పోÇదైక్కప్పోÇదు ఎన్ ఆరావముదమే"** (తిరువాయ్-2-5-4) (ఎప్పుడూ దినాలు, వారాలు, సంవత్సరాలు, యుగాలు-అంతా అప్పటికప్పుడు నిత్యనూతనంగా భాసించే అతృప్తామృతమా!) అనే రీతిలో తిరుమేనియొక్క ఒక్కొక్క అవయవం ఎన్నినాళ్ళు అనుభవించినాగాని, నిత్యనూతనంగా ఆశ్చర్యం కల్గించి, అనేక భోగపరంపరలను పొందించే అంతులేని శక్తితో, **"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః"** (ఋక్-అష్టక-1-2-7, సామవేదమ్-3-18-2-4) (విష్ణువుయొక్క ఆ పరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడూ దర్శిస్తున్నారు) అనేటట్లు



పశ్యన్తి" పణ్ణుకిఱ సూరికళై నిరతిశయకాన్తిసాగర స్వతరఙ్గతాడనతరళచిత్తవృత్తికరామ్బడి తద్దృష్టినిమజ్జనక్షమమాన దివ్యావయవసుషమై. "సౌన్దర్యసాగరత్తిలే ఆÇజ్గాల్ పట్టు క్కరైయేఱమాట్టాతే "అరుమ్బినై యలరై" ఎన్నలామ్బడియాన "యౌవనోన్ముఖీభూత సుకుమారతనుః" ఎన్టతిఱే,

---

ఎల్లప్పుడూ అనుభవించే నిత్యసూరులను తన కాంతిసముద్ర కెఱటాలను వీచి, భ్రమించిన మనస్సును కల్గినవారు అయేటట్లు, వారి కన్నులకు మిఱుమిట్లు కలిగేటట్లును చేయగల అప్రాకృతం అయిన అవయవశోభ. శ్రీకృష్ణుడు మధురకు వచ్చినపుడు అక్కడ ఉన్న స్త్రీలు అతని సౌందర్యసముద్రంలో మునిగి, తీరాన్ని చేరలేక-**''క్వ యౌవనోన్ముఖీభూతసుకుమారతను ర్హరిః, క్వ వజ్రకఠినాభోగశరీరోఽయం మహాసురః "** (విష్ణు. పు-5-20-60) (యౌవనానికి ఉన్ముఖంగా ఉండే సౌకుమార్యంతో కూడిన కృష్ణుడెక్కడ? వజ్రంవలె కఠినం అయిన శరీరాన్ని కల ఈ అసురుడెక్కడ?) అని తడబడ్డారు కదా! తిరుమఙ్గైయాÇ్వార్లుకూడా కౌమారం చివరి దశలోను, యౌవనదశ ప్రారంభదశలోను కూడిన ఈ అందాన్ని చూచి,, **''యువా కుమారః''** (ఋక్-అష్టక-2-8-25) (నవయౌవనాన్ని కలవాడుగాను, కుమారుడుగాను ఉండేవాడు) **("యువా అకుమారః"** అని పదచ్ఛేదం. **"అకుమారః"** అనే పదంలో ఉండే **"నఞ్"** కొంచెం అనే అర్థంలో ప్రయోగింపబడింది) అని వేదం తడబడినట్లు తడబడి **"అరుమ్బినై అలరై"** (పెరియ తిరు.-7-10-1) (మొగ్గ, పూవు అయిన వానిని) అని అభినివేశాన్ని పొందారుకదా!

సౌగంధ్యం అంటే- **"తెరువెల్లామ్ కావి కమÇ తిరుక్కాట్కరై"** (తిరువాయ్-9-6-1) (వీథిఅంతా సువాసన గుబాళించే తిరుక్కాట్కరై) అనే రీతిలో పరమపదం అంతటా తన అప్రాకృతం అయిన సౌగంధ్యంతో **"వాశమ్ శెయ్"** (తిరువాయ్-10-10-2) (పరిమళింపజేసే) అన్నట్లు పరిమళించేటట్లుగా అన్ని దిక్కులలోను ప్రసరించి, ప్రవహించే పలు విధాలైన అప్రాకృత సుగంధం. **"సర్వగంధః సర్వరసః"** (ఛాందో-3-14-2) (పరమాత్మ అన్ని సుగంధాలను కలవాడు, అన్ని రసాలను కలవాడు) అని ఈ సుగంధాన్ని ఉపనిషత్తుకూడా కీర్తించింది కదా !

సౌకుమార్యం అంటే- **"రంగభర్తు రపి లోచనచర్చాం సాహసావళిషు లేఖయమానమ్, పుష్పహాస ఇతి నామ దుహానం సౌకుమార్య మతివాఙ్మనసం నః"** (రంగరాజస్తవ.పూర్వ-88) (తనపై కన్నులు ప్రసరించడంకూడా సాహసకార్యాల లెక్కలో

సౌగన్ధ్యమావతు– "తెరువెల్లా జ్గావి కమழ்" ఎన్గిఱపడియే త్రిపా ద్విభూతి యడైయ ''వాశమ్ శెయ్'' ఎన్నుమాపోలే స్వదివ్యగన్ధత్తాలే వాసితమామ్బడి సర్వతోదిక్కమాక ప్పుఅప్పట్టు ప్రవహిక్కిఱ నానావిధదివ్యగన్ధమ్. "సర్వగన్ధః సర్వరసః" ఎన్నక్కడవతిఱే.

సౌకుమార్య మావతు–''పుష్పహాస ఇతి నామ దుహానం సౌకుమార్య మతివాఙ్మనసం నః" ఎన్గిఱపడియే పేశ ప్పిశకుమ్బడియాయ్, దివ్యమహిషికళ్ "వడిక్కోల వాళ్ నెడుఙ్గణ్"ళాలే అడుత్తడుత్తు ప్పార్క్కిఱ పార్వైయిలుమ్ దాన్తిశీలమాయ్, ''మలర్మకళ్ పిడిక్కుమ్ మెల్లడి'' ఎన్గిఅపడియే కూశి త్తొడవేణ్డుమ్బడియాన "పుష్పహాసాఖ్య"మాయిరుక్కిఱ అత్యన్తమార్దవమ్.

---

వ్రాసేటట్లు చేసేది, **"పుష్పహాసః"** అనే తిరునామాన్ని కలుగజేసేది అయిన శ్రీరంగనాథుని సౌకుమార్యం మన వాక్కుకు, మనస్సుకు అందనిది) అనే రీతిలో ఎదురుగా ఉండి పల్కినా కందిపోయేటట్లుగా ఉన్నదై, **"వడిక్కోల వాళ్ నెడుఙ్గణ్ మామలరాళ్"** (ఇరణ్డామ్ తిరు–82) (సారభూతసౌందర్యాన్ని, కాంతిని కల, భోగ్యతలో అపరిచ్ఛిన్నం అయిన నేత్రాలను కల, గొప్ప తామరపువ్వులో ఉండే లక్ష్మి) అనబడే లక్ష్మీదేవి మొదలైన దివ్యమహిషులు మెల్లగా చూచినా వాడిపోయేటట్లున్నదై, **"వడివిణై యిల్లా మలర్మకళ్ మఱ్ఱ నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై"** (తిరువాయ్–9-2-10) (రూపంలో సాటిలేని లక్ష్మీదేవి, అటువంటి భూదేవి సంవాహనం చేసే మృదుపాదాలు) అనేటట్లు వారుకూడా సంకోచిస్తూ తాకే రీతిలో ఉన్నదై, **"పుష్పహాసః"** (పూవు వికసించిటేట్లు ఉండేవాడు) అని విష్ణుసహస్రనామంలో పొగడబడే తిరుమేనియొక్క అంతులేని మెత్తదనం.

లావణ్యం అంటే– **ఏకైకస్మిన్ పర మవయవేఽనంతసౌందర్యమగ్నం సర్వం ద్రక్ష్యే కథ మితి ముధా మా మథా మందచక్షుః, త్వాం సౌభ్రాత్రవ్యతికరకరం రంగరాజాంగకానామ్ తల్లావణ్యం పరిణమయితా విశ్వపారీణవృత్తి**" (శ్రీరంగరాజ పూర్వ–89) (బుద్ధిహీనం అయిన నేత్రమా ! "భగవానుని ఒక్కొక్క దివ్యావయవంలోని అంతులేని అందంలోనే మునిగి ఉన్న నేను మిగిలిన అన్ని అవయవాలను ఏ విధంగా అనుభవించగలను?" అని వ్యర్థంగా సందేహించబోకు. రంగనాథుని అవయవాలమధ్య సోదరభావాన్ని కల్గించే ఈ సముదాయశోభ అనే లావణ్యం నిన్ను అన్ని అవయవాల అందాన్ని అనుభవింపజేస్తుందిలే) అని పరాశరభట్టర్‌చేత అనుభవింపబడ్డ తిరుమేని మొత్తంయొక్క అందం–అనే సముదాయశోభ. ఈ శ్లోకంలోని తాత్పర్యం ఏమంటే–తిరుమేనియొక్క ఒక్కొక్క అవయవంలో గల అంతులేని సౌందర్యంలో మునిగి, అందమనే సముద్రంలో అవగాహించి, తీరాన్ని చేరలేక తడబడే నిత్యముక్తుల నేత్రాలను,



లావణ్యమావతు–"ఏకైకస్మిన్పర మవయవేఽ నన్తసౌన్దర్యమగ్నం సర్వం ద్రక్ష్యే కథ మితి ముధా మా మథా మన్దచక్షుః, త్వాం సౌభ్రాత్రవ్యతికరకరం రఙ్గరాజాఙ్గకానాం తల్లావణ్యం పరిణమయితా విశ్వపారీణవృత్తి" ఎన్గిఱపడియే, ఓరో అవయవఙ్గళిన్మేలే అనన్తసౌన్దర్యత్తిలే ముழுకినతాయ్క్కొణ్డు సౌన్దర్యసాగరత్తిలే ఆழ்ఙ్గాల్పట్టు క్కరైయేఱ మాట్టాతే తడుమాఱుకిఱ నిత్యముక్తర్ తిరుక్కణ్గళై "ముడిచ్చోతియా యునతు ముకచ్చోతి మలర్న్దతువో?" ఎన్గిఅపడియే దివ్యావయవఙ్గళుక్కన్యోన్యముణ్డాన సౌభ్రాత్రత్తాలే తద్వ్యతికరత్తై ప్పణ్ణినిన్నుకొణ్డు, సర్వపారీణవృత్తియాయ్, సర్వావయఙ్గళైయుమ్ కరైకణ్డు అనుభవిత్తు క్కరై యేఱ్ఱవఱ్ఱాయ్, అత్తాలే లావణ్యమాకిఱ మరక్కల మెన్ఱు శొల్లలామ్బడియాన సౌన్దర్యసాగరనిమగ్నర్క్కు నావమ్బోలే తారకమాయ్,

---

**"ముడిచ్చోదియాయ్ ఉనదు ముకచ్చోది మలర్న్దదువో"** (తిరువాయ్–3-1-1) (కిరీటకాంతిగా నీముఖకాంతి వికసించిందా? ముఖకాంతిగా నీ కిరీటకాంతి ప్రసరించిందా ?) అనేటట్లు దివ్యావయవాలకు ఒక దానితో వేఱొకదానికి గల పొందికచేత, ఒక అవయవంనుండి ఇంకొక అవయవానికి పిలుచుకొని పోయి–ఈవిధంగా అన్ని అవయవాలకు పిలుచుకొనిపోయి, అన్ని అవయవాలను సంపూర్ణంగా అనుభవింపజేసి, గట్టెక్కించగల్గినదై, దానిచేత "లావణ్యం అనే ఓడవలె తీరాన్ని చేర్చగల్గినదై, శ్రీపాదాలనుండి కిరీటంవరకు, లవణం అనబడే ఉప్పునీటిలో అంతటా కటిగి ఉండేటట్లు, మధ్య అంతరం లేకుండా కలసి ఉంటుంది కనుక లావణ్యం అనబడేదై, ప్రవహించే అంతులేని కాంతిసముద్రంయొక్క అలల వరుసలవలె ప్రకాశించేదైన సముదాయశోభయే లావణ్యం అనబడుతున్నది అని.

ఇక, ఈ శ్లోకంలోని పదాలు వివరింపబడుతున్నవి. **(హే మందచక్షుః)** జ్ఞానం లేని నేత్రమా! నిన్ను గట్టెక్కించగల లావణ్యం అన్నది ఒకటి ఉన్నది అని తెలియని నేత్రమా–అని భావం. **(ఏక మేకమ్ తస్మిన్–ఏకైకస్మిన్)**–ఒక్కొక్క అవయవంలో, **(పరమ్)** అవయవానికి తర్వాత, **(అనంతం సౌందర్యం తస్మిన్ మగ్నం సత్)**– అంతులేని సౌందర్యం అనే అవయవాల అందంలో మునిగినదై ఉండి, **(సర్వమ్)**– మిగిలిన అన్ని అవయవాల సౌందర్యాన్ని, **(కథం)** ఏ విధంగా, **(ద్రక్ష్యే)** – అనుభవించగలను? **(ఇతి)** అని, **(ముధా)**– వ్యర్థంగా, **(మా మథాః)–మామంథ**–విచారించకు, సందేహాన్ని పొందకు. **(యతః)** (ఎందువలన అని అంటే) అనే పదాన్ని అధ్యాహారం చేసికోవాలి. ఇకపైగల భాగం ఇంతవరకు చెప్పినదానికి కారణాన్ని తెలుపుతున్నది. **(రంగరాజాంగకానామ్)**–రంగనాథునియొక్క దివ్యావయవాలకు, **(సుభ్రాతుః భావః**

ఆపాదచూడమ్ అవిరతమాయ్ ప్రవహిక్కిఱ నిరవధికకాన్తిసాగరకల్లోల- మాలైపోలే విళఙ్గానిఱ్కిఱ సముదాయసుషమై.

(హే మన్ద) అల్ప!. లావణ్య మెన్నొన్ఱుణ్డెన్ఱఱియాత, (చక్షుః) కణ్ణే ! (ఏక మేకమ్-ఏకైకమ్ తస్మిన్) ఓరొన్ఱాన అవయవత్తిల్. (పరమ్) అతన్మేలే, (అనన్తం సౌన్దర్యం తస్మిన్మగ్నం సత్) అపరిచ్ఛిన్నమాన సౌన్దర్యత్తిల్ ముழுకినతాయ్క్కొణ్డు, (సర్వమ్) మర్ఱెల్లావయవసౌన్దర్యత్తైయుమ్, (కథమ్) ఎఙ్గనే, (ద్రక్ష్యే) అనుభవిక్కప్పోకిఱేన్. (ఇతి) ఎన్ఱు, (ముధా) వ్యర్థమాక. (మా మథాః) మామంస్థాః. విచారం మా కురు- శఙ్కియాతేకొళ్. “యతః” ఎన్ఱధ్యాహారమ్. యాతొరు కారణత్తాలే, (రఙ్గరాజాఙ్గకానామ్) పెరియపెరుమాళుడైయ దివ్యావయవఙ్గళుక్కు, (సుభ్రాతు ర్భావః-సౌభ్రాత్రమ్, తస్య వ్యతికరం కరోతీతి తత్) ఒన్ఱుక్కొన్ఱు నల్లభ్రాతావాయిరుక్కై- యినుడైయ సౌఘట్యత్తినుడైయ సమ్బన్ధత్తై పణ్ణానిన్ఱుళ్ళ. వ్యతికరః సాఙ్గత్యమ్, తత్కరోతీతి

---

**సౌభ్రాత్రమ్, తస్య వ్యతికరమ్ కరోతి ఇతి తత్ సౌభాత్రవ్యతికరమ్)** అవయవాలు ఒకదానితో ఇంకొకటి చక్కని సహోదరులవలె పొందికగా ఉన్నవి. వాటిమధ్యన సంబంధాన్ని లావణ్యం కల్గిస్తున్నది-అని భావం. **“వ్యతికరమ్”** అనే పదం ఇంకొకదానితో వేఱొకదానికి గల చేరికను చెబుతుంది. సౌభ్రాత్రపదం సౌహార్దం (స్నేహం) అనే అర్థాన్ని ఇస్తుంది. **(తత్)** - అన్ని గుణాలతోను గొప్పది అయిన, **(లావణ్యం)**-సముదాయశోభ. ఆ విధంగా కాకుండా **“తల్లావణ్యమ్”** అని సమస్తపదంగా గ్రహించి, **“తస్య లావణ్యమ్”** అని విగ్రహం చెప్పవచ్చును. కనుక “శ్రీరంగనాథుని లావణ్యం” అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. **(త్వామ్)**-అన్ని అవయవాల అందాన్ని అనుభవించాలని ఆశపడే నిన్ను, **(విశ్వస్మిన్ పారీణవృత్తిః యస్య తత్)** అన్ని అవయవాలలోను ఆవలి తీరం చేరిన (పరిపూర్ణం అయిన) అనుభవాన్ని కల్గినదిగా, **(పరిణమయితా)**-పరిణమింపచేయగలదు. **(విశ్వేషు సర్వేషు అవయవేషు, పారీణా-పారంగతా, వృత్తిః అనుభవో యస్య తత్ తథోక్తమ్. పరిణమయితా పరిణతం కర్తా ల్యుట్.)** అన్ని అవయవాలలోను సంపూర్ణం అయిన అనుభవాన్ని లావణ్యం కలుగజేస్తుంది-అని భావం.

యౌవనం అంటే-**“యువా కుమారః”** అనే ప్రమాణానుసారం కౌమారం చివరి దశయై, యౌవనపరువానికి ప్రారంభదశయై ఉండే వయస్సు. **“క్వ యౌవోన్ముఖీభూతసుకుమారతను ర్హరిః, క్వ వజ్రకఠినాభోగశరీరో௨యం మహా**



తథోక్తమ్-సాహార్దమిత్యర్థః. (తత్) సర్వవిలక్షణమాన, (లావణ్యమ్) సముదాయ శోభైయానతు, అన్ఱిక్కే, “తస్య లావణ్యమ్” ఎన్ఱాయ్, పెరియపెరుమాళుడైయ లావణ్యమెన్ఱపడియాకవుమామ్. (త్వామ్) సర్వత్తైయు మనుబుభూషిక్కిఱ వున్నై, (విశ్వస్మిన్పారీణవృత్తిః-యస్య తత్) సర్వావయవత్తిలుమ్ అక్కరైప్పట్ట వనుభవత్తై యుడైత్తానతాక, (పరిణమయితా) పణ్ణప్పోకిఱతు. విశ్వేషు-సర్వేష్వవయవేషు, పారీణా-పారఙ్గతా, వృత్తిః-అనుభవో యస్య తత్తథోక్తమ్. పరిణమయితా-పరిణతం కర్తా. ల్యుట్.

యౌవన మావతు- “యవా కుమారః” ఎన్గిఱపడియే కౌమారావస్థైయిల్ కడైవానదశైయాయ్, యౌవనావస్థాప్రాదుర్భావమాయిరుక్కై. “క్వ యౌవనోన్ముఖీభూత సుకుమారతను ర్హరిః” ఎన్ఱతిఱే. ఏతాదృశస్థితియే నిలైనిఱ్కైయాలే నిత్యయౌవనమా యిరుక్కుమ్. సర్వేశ్వరన్ ఆశ్రితరక్షణార్థమాక అసఙ్ఖ్యాతదివ్య విగ్రహపరిగ్రహమ్బణ్ణి శైశవాద్యవస్థాపన్ననాకిలుమ్, ఇన్ద యౌవనావస్థై కులైయామైయాలే యన్ఱో, “ఉన్నైయు

---

**సురః”** (యౌవనప్రారంభంలో ఉండే సౌకుమార్యాన్ని కల దేహాన్ని కల్గిన కృష్ణుడు ఎక్కడ ? వజ్రంవంటి కఠినమైన శరీరాన్ని కల ఈ అసురుడు ఎక్కడ ?) అని శ్రీకృష్ణుని యౌవనం ఈ విధంగానేకదా వర్ణింపబడింది. ఎల్లప్పుడూ భగవానుని తిరుమేని ఈ దశలోనే ఉంటుంది. కనుక అతడు నిత్యయౌవనాన్ని కల్గి ఉంటాడు. సర్వేశ్వరుడైన భగవానుడు దీనులను కాపాడడంకోసం లెక్కలేనన్ని అవతారాలను ఎత్తే దివ్యవిగ్రహాలలో బాల్యావస్థ మొదలైన దశలను పరిగ్రహించినా, వాటిలోనూ ఈ యౌవనదశ మాఱకుండా దర్శించి అనుభవించేటట్లు ఉంటుంది. ఇందువల్లనేకదా-**“ఉన్నైయుమ్ ఒక్కలైయిల్ కొణ్డు తమ్ ఇల్ మరువి ఉన్నొడు తఙ్గళ్ కరుత్తాయిన శెయ్దు వరుమ్ కణ్ణియరుమ్ మకిழ”** (పెరియాழ்వార్ తిరు-1-5-8) (సౌందర్యాదులచే దృష్టిచిత్తాపహారివి అయిన నిన్ను తమ ఒడిలో చేర్చుకొని, తమ ఇళ్ళకు చేరి, తమకు ఇష్టం అయిన రీతిలో నిన్ను సేవించి, తిరిగి వచ్చే కన్యలు ఆనందించేటట్లు) అనే బాల్యావస్థలో కూడా రేపల్లెలోని కన్యలు శ్రీకృష్ణుని యౌవనాన్ని చూచి అనుభవించారు.

ఈ రీతిలో ఇటువంటి లెక్కలేని కల్యాణగుణాలతో కూడి ఉండడంచేత ఏర్పడిన దివ్యమంగళవిగ్రహంయొక్క అతిశయాన్ని **“మూర్తం బ్రహ్మ”** అని ప్రారంభించి, రెండవపాదంతో అనుభవిస్తున్నారు. ఈ తిరుమేనిని **“బ్రహ్మ”** అని నిర్దేశించడంవల్ల ఇది మిక్కిలి పెద్దది-అని, దాసుల అజ్ఞానాన్ని పోగొట్టి, యథార్థజ్ఞానాన్ని వికసింపజేయడంద్వారా వారిని మిక్కిలి గొప్పవారినిగా చేస్తుంది-అని తెలుపబడింది.

మొక్కలైయిల్ కొణ్డు తమిల్ మరువి ఉన్నొడు తఙ్గళ్ కరుత్తాయిన శెయ్‌తు వరుమ్ కన్నియరుమ్ మకిÇ” ఎన్ఱు శైశవావస్థైయిలే యౌవనఙ్గణ్డనుభవిత్తతు.

ఆక, ఏతాదృశాఽసఙ్ఖ్యేయకల్యాణగుణగణవిశిష్టతైయులుణ్డాన దివ్యవిగ్రహ వైలక్షణ్యత్తై “మూర్తమ్” ఎన్ఱు తొడఙ్గి అనుభవిక్కిఱార్. బ్రహ్మశబ్దత్తాలే విగ్రహత్తినుడైయ అతిమహత్త్వముమ్, స్వాశ్రితాఽజ్ఞాననివృత్తిపూర్వక విజ్ఞానవికాసకత్వముమ్ వివక్షితమ్. ఇతఱ్కు “మూర్తం బ్రహ్మ” ఎన్ఱిఱే తిరునామమ్.

(తతోఽపి తత్ప్రియతరమ్) ఆనన్దమయస్వరూపత్తిలుమ్, ఆనన్దావహ తదసఙ్ఖ్యాతగుణఙ్గళిలుమ్, అతిశయితసౌన్దర్యాదిగుణయోగత్తాలే నిరతి శయానన్దావ

---

**“మూర్తం బ్రహ్మ”** అని పాంచరాత్రం మొదలైనశాస్త్రాలలో ఈ తిరుమేనికి తిరునామం పెట్టబడిందికదా.

**(తతోఽపి తత్ ప్రియతరమ్)**- మొదటిపాదంలో ఉట్టంకింపబడ్డ స్వరూపంకంటే ఆ భగవానునకు మిక్కిలి ప్రియమై ఉండేది. ఆనందమయం అయిన భగవత్స్వరూపంకంటే ఆనందాన్ని కల్గించే ఆ స్వరూపంలో ఉండే లెక్కలేనన్ని గుణాలకంటే, అతిశయాన్నికల సౌందర్యం మొదలైన గుణాలతో కూడి ఉండడంచేత సాటి లేని ఆనందాన్ని కల్గించేదై, అందువల్లనే భగవానునకు అతిప్రియమైన విషయమై ఈ తిరుమేని ఉంటుంది-అని భావం. **“సమస్తకల్యాణగుణాత్మకోఽసౌ స్వశక్తిలేశోద్ధృత-భూతసర్గః, ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధితాశేషజగద్ధితోఽసౌ”** (విష్ణు. పు-6-5-84) (ఈ భగవానుడు సకలకల్యాణగుణాలను సహజంగానే కలవాడు. తనశక్తిలో ఒక చిన్న భాగంతోనే అన్ని వస్తువులను ధరించగల్గినవాడు. ఇచ్ఛచేతనే పరగ్రహింపబడినవి, అభిమతమైనవి అయిన పలు రూపాలను కలవాడు. ఇతడు జగత్తుకు అంతటికీ హితాన్ని కలుగజేసేవాడు) అనే శ్రీవిష్ణుపురాణశ్లోకంలో ఈ తిరుమేని అభిమతం అయినది, అంటే-మిక్కిలి ప్రియమైనది-అని చెప్పబడింది కదా!

**(తత్ ప్రియతరమ్)**- దీన్ని సమస్తపదంగా గ్రహించి, ఆ భగవానునకు స్వరూపంకంటే చాలా ప్రియమైనది-అనే అర్థాన్ని చెప్పవచ్చు. లేక, **“తత్”** అనే పదాన్ని వ్యస్తపదంగా గ్రహించి **“తతో యత్ ప్రియతరమ్ తత్”** అని అన్వయించి స్వరూపంకంటే ఏ రూపం చాలా ప్రియమై ఉంటుందో, అది-అనే అర్థాన్ని గ్రహించవచ్చు, అపుడు **“తత్”** అనే పదం **“పురుషం కృష్ణపింగళమ్”** (తైత్తి-నారా-12) (నల్లని, పసుపుపచ్చని రంగులు కలిగిన రూపాన్ని కలవాడు పురుషుడు) అని, **“కాత్వన్యా త్వామ్ ఋతే దేవి! సర్వయజ్ఞమయమ్ వపుః, అధ్యాస్తే దేవదేవస్య యోగిచింత్యం గదాభృతః”**



హమాయ్, అత ఏవ నిరవధికప్రీతివిషయమాయిరుక్కై. “ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః” ఎన్నక్కడవతిఱే.

(తత్ప్రియతరమ్) తస్య ప్రియతర మెన్నుతల్. “తత్” ఎన్ఱు వ్యస్తమాక్కి “యత్ తత్” ఎన్ఱు యోజిక్కవుమామ్. అప్పోతు “పురుషం కృష్ణపిఙ్గళమ్”, “నీలతోయదమధ్యస్థా”, “ఆదిత్యవర్ణమ్”, “హిరణ్మయఃపురుషః”, “సర్వయజ్ఞమయం వపుః”, “ధ్యేయ స్సదా”, “కిరీటకౌస్తుభధరమ్” ఇత్యాది విగ్రహవైలక్షణ్యప్రతిపాదక-ప్రమాణ ప్రసిద్ధ్యతిశయత్తై ద్యోతిప్పిక్కిఱతు.

---

(విష్ణుపు-1-9-122) (భూదేవీ! గదాధారి, దేవదేవుడు అయిన భగవానునియొక్క యోగులచే ఉపాసింపతగినది, సర్వయజ్ఞమయమైనది అయిన శరీరంలో నీవు కాక వేఱెవరు ఉన్నారు!) అని, **“ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణః సరసిజాసనసన్నివిష్టః, కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః”** (నారసింహపురాణమ్) (సూర్యమండలం మధ్యలో ఉన్నవాడు, పద్మాసనంలో వేంచేసి ఉన్నవాడు, అంగదాలు, మకరకుండలాలు, కిరీటం, హారాలు-అనే వీనిని ధరించినవాడు, సువర్ణమయం అయిన శరీరాన్ని కలవాడు, శంఖచక్రాలను ధరించినవాడు) అని, **“కిరీటకుండలధరం మిత్రాణా మభయప్రదమ్”** (కిరీటాన్ని, కుండలాలను ధరించినవాడు, మిత్రులకు అభయాన్ని ఇచ్చేవాడు) అని మొదలైన ప్రమాణాలలో ఈ తిరుమేని గొప్పతనం చాలా ప్రసిద్ధి పొంది ఉండడం గమనించతగినది.

**(రూపమ్)**- మొదటిపాదంలో **“రూప”** శబ్దం స్వరూపాన్ని తెలిపింది. ఇక్కడ **“రూప”** శబ్దం తిరుమేనిని తెలుపుతున్నది. **“యత్”** అనే శబ్దం తిరుమేని ఏకరూపమైనది నిత్యమైనది, దోషరహితమైనది, ఇంతటిది అని పరిచ్ఛేదించి తెలిసికోలేనిది-అని తెలిపే ప్రమాణప్రసిద్ధిని చూపుతుంది.

**(అత్యద్భుతమ్)**-తన సన్నివేశంతో ముందు చెప్పబడ్డ సౌందర్యాది-అసంఖ్యేయగుణసంయోగంతో నిత్యనూతనం అయిన అనుభవాలను కలిగించేదై, మిక్కిలి ఆశ్చర్యాన్ని కల్గించేదై ఉంటుంది-అని భావం. ఈ సందర్భంలో **స్వాభిమతానురూప-ఏకరూప-అచింత్యదివ్యాద్భుత-నిత్యనిరవద్య- నిరతిశయ ఔజ్జ్వల్య- సౌందర్య-సౌకుమార్య-లావణ్య-యౌవనాద్యనంతగుణనిధి దివ్యరూప”** (శరణాగతిగద్య) (తనకు ప్రియమైనదై, అనురూపమైనదై, ఎల్లప్పుడూ ఒకే విధంగా

(రూపమ్) ఇఙ్గే రూపశబ్దమ్ విగ్రహపరమ్. యచ్ఛబ్దమ్ ఏకరూపత్వ- నిత్యత్వ- నిరవద్యత్వ -అచిన్త్యత్వప్రకాశక ప్రమాణప్రసిద్ధిపరమ్.

(అత్యద్భుతమ్) స్వసన్నివేశ పూర్వోక్తసౌన్దర్యాద్యనన్త యోగఙ్గళాలే అభినవ రసజనకమాయ్, అతివిస్మయావహమాయిరుక్కై. ఇవ్విడత్తిలే "స్వాభిమతానురూపైక రూప.....విగ్రహ'' ఎన్గిఱ చూర్ణికాద్వయప్రతిపాదితవిగ్రహ- వైలక్షణ్యమెల్లా మనుసన్ధేయమ్.

ఇత్తాల్-స్వరూపతద్గుణాత్యన్తాభిమతమాయ్, బ్రహ్మశబ్దవాచ్యమాయ్, అతివిస్మయావహమాయ్, శ్రుతిస్మృత్యాదిప్రసిద్ధమాయ్, సాలమ్బనయోగవిషయాఽ

ఉండేదై, ఇంతటిది అని పరిచ్ఛేదించి చెప్పడానికి వీలు కానిదై, అప్రాకృతమైనదై, ఆశ్చర్యాన్ని కల్గించేదై, ఎల్లప్పుడు నిర్దుష్టమై, సాటి లేని కాంతిని కల్గినదై, సౌందర్యం, సౌగంధ్యం, సౌకుమార్యం, లావణ్యం, యౌవనం-మొదలైన లెక్కలేనన్ని గుణాలకు నిలయమై ఉండే గొప్ప రూపాన్ని కలవాడా) అనే శరణాగతిగద్యలోని రెండు చూర్ణికలో చెప్పబడ్డ తిరుమేనియొక్క గొప్పతనం అంతా అనుసంధించతగినది.

ఇంతవరకు దివ్యాత్మస్వరూపం, అందరిగుణాలు-అనే వాటికంటె మిక్కిలి ప్రియమైనదై, **"బ్రహ్మమ్"** అని చెప్పబడేదై, మిక్కిలి ఆశ్చర్యాన్ని కల్గించేదై, శ్రుతి-స్మృత్యాది ప్రమాణప్రసిద్ధమై, అష్టాంగయోగంతో అనుభవించతగినదై, భగవానునకే తగిన తిరుమేనిని ధ్యానించతగిన శుభాశ్రయంగా అనుభవించారు. **"యోగిధ్యేయమ్"** (యోగులచే ధ్యానించతగినది), **"సదా ధ్యేయమ్"** (ఎల్లప్పుడూ ధ్యానించతగినది) అనే ప్రమాణాలతో ఈ తిరుమేని చెప్పబడుతున్నది. **"సన్నివేశగుణవిహారప్రభావాదిభి రతివిస్మయావహమ్"** అని దేశిక వ్యాఖ్య

ఇకపై, మూడవపాదంలో ఆ పరరూపంనుండి దాసులను రక్షించడంకోసం పరిగ్రహించిన వ్యూహ- విభవ-అంతర్యామి అనబడే రూపాలను అనుభవిస్తున్నారు.**"యథాసుఖం విహరతో హరేః అన్యాని యాని రూపాణి (సంతి) తాని సర్వాణి"** అని అన్వయించి అర్థాన్ని చెప్పాలి. **(యాని)** ఈ యచ్ఛబ్దం ప్రసిద్ధిద్యోతకం. ఈసందర్భంలో **"జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున"** (భ.గీ-4-9) (అర్జునా ! నా అప్రాకృతం అయిన జన్మలను, కర్మలను ఎవడు ఈ రీతిలో యథార్థంగా గ్రహిస్తాడో, అతడు ఈ దేహాన్ని విడచి మఱుజన్మను పొందడు. నన్నే పొందుతాడు) అని గీతలో అవతార రహస్యాన్ని చెప్పే శ్లోకాలతో ప్రసిద్ధి పొందిన విషయాన్ని ఇది తెలుపుతున్నది. **"యాని"** అనే బహువచనం "**అజాయమానో బహుధా విజాయతే**" (కర్మమూలకంగా జన్మించనివాడైనా



సాధారణవిగ్రహత్తై శుభాశ్రయమాక అనుభవిత్తారాయ్త్తు . యోగిధ్యేయ మితే. "స దా ధ్యేయమ్".

మేల్, ఇన్ద విగ్రహత్తినిన్ఱుమ్ ఆశ్రితార్థమాక ప్పరిగ్రహిత్త వ్యూహవిభవాన్తర్యామి రూపఙ్గళై అనుభవిక్కిఱార్ (యాన్యన్యానీత్యాదియాలే). "యథాసుఖం విహరతో హరే రన్యాని యాని రూపాణి సన్తి, తాని సర్వాణి" ఎన్ఱు సమ్బన్ధమ్. (యాని) ఇవ్విడత్తిల్ యచ్ఛబ్దమ్, ''జన్మ కర్మ చ మే దివ్యమ్'' ఎన్గిఱ అవతారరహస్యప్రకాశక ప్రమాణప్రసిద్ధియై సూచిప్పిక్కిఱతు. "యాని" ఎన్గిఱ బహువచనమ్, "అజాయమానో బహుధా విజాయతే", "పిఱప్పిల్ పల్పిఱవి ప్పెరుమానై", "బహూని", "రూపాణి" "శతశోఽథ సహస్రశః" ఇత్యాదికళిఱ్చొల్లుకిఱ అవతారాసఙ్ఖ్యాతత్వత్తై సూచిప్పిక్కిఱతు. (అన్యాని) పరరూపత్తినిన్ఱుమ్ "అతియమ్ శోతి యురువై యఙ్గువైత్తిఙ్గు" పిఱక్కైయాలే,

కృపామూలకంగా పలు రీతుల్లో పలు సార్లు అవతరిస్తున్నాడు) (పురుష సూ-2-4) అనే ప్రమాణంలోను, **"పిఱప్పిల్ పల్ పిఱవి ప్పెరుమాన్"** (తిరువాయ్- 2-9-5) (కర్మమూలక జన్మలు లేని, దయామూలకాలైన పలు జన్మలను కలస్వామి) అనే తిరువాయ్మొఴిసూక్తిలోను, **"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున"** (భ.గీ-4-5) (అర్జునా ! నాకు నీకు పలుజన్మలు గడిచాయి) అనే గీతాశ్లోకంలోను, **"పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః"** (భ.గీ-11-5) ( అర్జునా ! నా వందల వేల సంఖ్యలో ఉండే రూపాలను చూడు) అనే గీతాశ్లోకంలోను చెప్పిన రీతిలో అవతారాలు లెక్కలేనివి అని తెలుపబడింది. **(అన్యాని)-''ఆదియఞ్జోతి యురువై అఙ్గువైత్తిఙ్గప్పిఱన్ద''** (తిరువాయ్-3-5-5) అనే రీతిలో పరరూపంనుండి అదే సన్నివేశం, వర్ణం మొదలైన విశేషాలను కల్గినవిగానే ఈ రూపాలుకూడా అవతరిస్తాయి-అని తెలుపబడింది. అన్యశబ్దంచేత వ్యావృత్తి (భేదం) చెప్పబడడం వల్ల, ఈ రూపాలు కొన్ని విషయాలలో విలక్షణాలని తెలుపుతున్నది.**"పరరూపాత్ తదంశతయా సన్నివేశైః వర్ణాదిభి శ్చ విలక్షణాని"** అని దేశికవ్యాఖ్య

**(యథాసుఖమ్)**-మానవులలో ఒక్కడుగా అవతరించినా, భగవానునకు సహజమై ఉండే సుఖం మొదలైనవి లేకపోవడమో, దుఃఖాన్ని పొందడమో లేకుండా, ఆనందమే మూర్తీభవించినట్లు ఈ తిరుమేనులు ఉంటాయి-అని భావం, **"విహరతః"** అనే పదానికి "విహరించే స్వామికి" అని అర్థం. **"యథాసుఖమ్"** అనే పదం **"విహరతః"** అనే పదానికి విశేషణమై, "ఆనందమే కలిగేటట్లు విహరిస్తాడు" అనే అర్థాన్ని ఇస్తుంది. **"విహరతః"** అనే పదంచేత **"సమస్తకల్యాణగుణాత్మకోఽసౌ"** (విష్ణు.పు-6-5-84)

తత్సన్నివేశవర్ణాదికళైప్పోలే వైలక్షణ్యవిశిష్టఙ్గళాయిరుక్కై. “అన్యః” ఎన్గిఱాప్పోలే, “అన్యాని” ఎన్గైయాలే వావృత్తియుమ్ తో౧౮ంకిఱతు

(యథాసుఖమ్) మనుష్యసజాతీయనాయవతరిత్తదశైయిలుమ్, స్వాభావిక సుఖాతివృత్తి యెన్న, దుఃఖభాక్త్వ మెన్న-ఇవై యిన్ఱిక్కే కేవలమ్ సుఖమా యిరుక్కుమతొరు పడి. (సుఖం యథా భవతి తథా) క్రియావిశేషణమాన అవ్యయమ్. (విహరతః) ఎన్గిఱవిత్తాల్ అవతారరూపఙ్గళ్ “ఇచ్ఛాగృహీత”ఙ్గళెన్నుమిడముమ్, “ఇన్బుఱుమివ్విళై-యాట్టుడైయాన్”, “క్రీడతో బాలకస్యేవ” ఎన్గిఱపడియే క్రీడార్థఙ్గళాయిరుక్కు

---

ఇత్యాది విష్ణుపురాణ ప్రమాణానుసారం భగవానుని ఇచ్ఛచేతనే పరిగ్రహింపబడినవి ఈ అవతారరూపాలు అని, **“వేట్టై ప్పుణ్ణి విళైయాడుమ్”** (నాచ్చి తిరు-14-9) (లోకాన్ని సృష్టించి క్రీడించే), అని , **“ఇన్బుఱుమ్ ఇవ్విళైయాట్టుడైయానై”** (తిరువాయ్-3-10-7) (ఆనందాన్ని కల్గించే ఈ లోక సృష్ట్యాది లీలలను కలవానిని) అని, **“క్రీడతో బాలకస్యేవ చేష్టాం తస్య నిశామయ”** (విష్ణుపు-1-2-18) (చిన్నపిల్లవానివలె ఆడే ఆభగవానుని (జగత్సృష్ట్యాదులనే) కార్యాలను వినుపించు) అనే ప్రమాణంలోను చెప్పిన రీతిలో విహారాన్ని (లీలను) ఫలంగా కల్గినవి-అని తెలుపబడుతున్నది. అందువల్ల భగవానుడు శరీరాన్ని పరిగ్రహించడం కర్మవల్ల సంభవించేదికాకుండా, రక్షించడంకోసమే అయి ఉంటుంది అని తెలుస్తున్నది. **“నాకారణా త్కారణా ద్వా కారణాకారణా న్న చ, శరీరగ్రహణం వ్యాపిన్! ధర్మత్రాణాయ కేవలమ్”** (విష్ణు.పు-5-1-50) (అంతటా వ్యాపించిఉన్నవాడా! నీవు శరీరంతో జన్మించడం సుఖంకోసమో, దుఃఖంకోసమో, సుఖదుఃఖాల అనుభవంకోసమో కాదు. కేవలం ధర్మరక్షణం కోసమే నీ జన్మ ఏర్పడుతున్నది) అని చెప్పబడిందికదా!

**(సర్వాణి తాని)** దీనినిబట్టి పూర్వం చెప్పబడ్డ స్వరూపం, రూపం-మొదలైనవానిలో ఏ చిన్నభాగంకూడా లక్ష్మీదేవితో చేరకుండా ఉండేవి లేవు అనే విషయాన్ని తెలుపడం కోసం **“సర్వాణి తాని”** అని అన్నారు. **“వేదాహ మేతం పురుషం మహాంతమ్”** (పు.సూ-1-16) అనే ప్రమాణవాక్యంలోని **“సర్వాణి రూపాని”** అన్నట్లే వీరుకూడా అనుగ్రహిస్తున్నారు.

**(తై స్తై రనురూప రూపవిభవైః)** నీకే చెందిన (అసాధారణాలు అయిన) ఆ యా తగిన గొప్ప రూపాలతో. **“రూపవిభవైః”** అనే ప్రయోగం రూపాలు అనే సంపదలలో-అనే అర్థాన్ని ఇస్తుంది. లేక, గొప్ప రూపాలలో అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. ఈ సందర్భంలో **“రూప”** శబ్దం శరణాగతిగద్యలో లక్ష్మినిగూర్చిన



మెన్నుమిడముమ్ గర్భితమ్. ఆకైయాల్ ఇవనుడైయ “శరీరగ్రహణమ్” కర్మకృతమిన్ఱిక్కే “కేవలమ్ ధర్మత్రాణార్థ”మాయిరుక్కు మెన్గై. “నాకారణాత్” ఇత్యాది”.

(సర్వాణి తాని) కీళ్ చ్చొన్నవిత్తాల్ స్వరూపరూపాదికళిల్ అత్యల్పమాకిలుమ్ పెరియపిరాట్టియారాలే అనన్వితమాయిరుప్పతిల్లై-యెన్నుమిడత్తై ద్యోతిప్పిక్కైక్కాక “సర్వాణి తాని” ఎన్గిఱార్. “సర్వాణి రూపాణి” ఎన్గాప్పోలే యిరుక్కిఱతాయ్త్తు.

(తై స్తై రనురూప రూపవిభవైః) ఉన్నుడైయ. అసాధారణఙ్గళాన అనురూపరూప విభవఙ్గళాలే. అనురూపఙ్గళాన రూపసమ్పత్తుక్కళాలే యెన్గై. అథవా, రూపఙ్గళాకిఱ విభవఙ్గళాలే యెన్నవుమామ్. ఇవ్విడత్తిల్ రూపశబ్దమ్ “భగవన్నారాయణాభిమతాను రూప”ఙ్గళాన స్వరూపరూపగుణవిభూతికళై చ్చొల్లుకిఱతు.

---

మొదటి చూర్ణికలో పల్కినట్లు భగవానుడైన నారాయణునకు అభిమతంగాను (ప్రియంగాను), అనురూపంగాను (తగినట్లు) ఉండే స్వరూపం, రూపం, గుణం విభూతి మొదలైనవానిని చెబుతుంది.

**(యథాసుఖం విహరతో హరే స్సర్వాణి రూపాణి తై స్తై రనురూపరూపవిభవైః గాఢోపగూఢానీత్యాహుః)** నీకు ప్రియమైనవి, తగినవి అయిన భగవానుని స్వరూపగుణాదులు, ఆ భగవానునకు ప్రియమైనవై, అతని స్వరూపం మొదలైనవానికి అనురూపం అయిన నీ స్వరూపం మొదలైనవానితో క్రమంలో వియోగానర్హంగా, గాఢంగా కూడి ఉంటాయి-అని శ్రుతిస్మృతులలో వశిష్ఠ, పరాశర, పారాశర్యాది మహర్షులు తెలిపారు. అనురూపంగా ఉండడం అంటే-రత్నం, బంగారాల కలయికవలె తనతో కలసి ఉన్న వస్తువుకు అధికం అయిన అందాన్ని కల్గించేటట్లుగా చేయడం.

**(గాఢోపగూఢాని)** అత్యంతం గాఢంగా, తిరిగి విడిపోవడానికి వీలులేనట్లుగా ఉంటుంది అని భావం. **“ఇఱైయుమ్ అకలకిల్లేన్”** (తిరువాయ్-6-10-10) (క్షణం కూడా విడువలేను) అని భగవానుని క్షణకాలంకూడా విశ్లేషించి ఉండలేనిదిగా ఉంటుంది-లక్ష్మి. **“చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి, న జీవేయం క్షణ మపి వినా తా మసితేక్షణామ్”** (రామా.సుందర-66-10) (సీత ఒక మాసం ప్రాణాలను ధరించి ఉండగల్గినది అయితే చాలా కాలం జీవించి ఉన్నది అవుతుంది. నేను నల్లని కన్నులను కల ఆమెను విడచి ఒక్క క్షణమైనా జీవించలేను) అన్నట్లు పిరాట్టిని విడచి క్షణకాలంకూడా జీవించలేనివాడై ఉంటాడు భగవానుడు. ఈ విధంగా ఉన్నపుడు ఈ ఇద్దరి స్వరూపం మొదలైనవి ఒకదానిని ఇంకొకటి విడిచి ఉండే అవకాశం ఉన్నదా?

(యథా సుఖం విహరతో హరే స్సర్వాణి రూపాణి, తై స్తై రనురూపరూపవిభవై ర్గాఢోపగూఢానీత్యాహుః) త్వదభిమతానురూపఙ్గళాన తత్స్వరూపరూపగుణాదికళ్, యథాక్రమమ్ తదభిమతతత్స్వరూపాద్యనురూపఙ్గళాన ఉన్నుడైయ రూపాదికళాలే యథాక్రమమ్ దృఢసమ్బన్ధఙ్గళాయిరుక్కు మెన్ఱు శ్రుతిస్మృతికళ్, వసిష్ఠపరాశర పారాశర్యాదికళాన పరమర్షికళ్ శొల్లువర్‌కళ్. అనురూపమా- యిరుక్కైయావతు- రత్నకాఞ్చనన్యాయత్తాలే స్వసమ్బన్ధిక్కు శోభాతిశయహేతువాయిరుక్కై.

(గాఢోపగూఢాని) వియోగాఉ నర్హఙ్గళాయిరుక్కు మెన్గై. ఇవళ్ "ఇఱైయు మకలకిల్లేన్" ఎన్ఱిరుక్క, అవన్ "న జీవేయం క్షణ మపి" ఎన్ఱిరుక్క, ఇరువర్ స్వరూపాదికళుమ్ వియోగిత్తిరుక్క విరకుణ్డో?

---

**(ఆహుః)**- పలికారు. **"శ్రుతిస్మృత్యాదీని, తద్విదో వా. స్వయంభూవశిష్ఠ పరాశరపారాశర్యాత్రికాశ్యపశౌనకమంకణశతమఖధనదాదయః తత్సంహితా ప్రణేతారః"** అని దేశికవ్యాఖ్య. **"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ, యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"** (విష్ణుపు-1-8-17) (జగన్మాతయై, విష్ణువుకు గొప్ప సంపదయై, క్షణంకూడా అతనిని విడిచి ఉండనిదైన ఈ పిరాట్టి నిత్యయే. బ్రాహ్మణోత్తమా! ఏ విధంగా భగవానుడు సర్వవ్యాపియై ఉంటాడో, ఆవిధంగానే ఈమె కూడా సర్వ వ్యాపినిగా ఉంటుంది) అనే శ్లోకంలోను, **"తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః, శ్రీవత్సవక్షాః నిత్యశ్రీః రజయ్య శ్శాశ్వతో ధ్రువః"** (రామా.యు-114-15) (ఈ శ్రీరాముడే తమస్సుకు ఆవల ఉన్నవాడై, సర్వధారకుడై, శంఖచక్రగదాధరుడై, శ్రీవత్సమనే పుట్టుమచ్చను వక్షఃస్థలంలో కల్గినవాడై, ఎల్లప్పుడూ శ్రీదేవితో కూడి ఉండేవాడై జయించడానికి సాధ్యం కానివాడై, నిత్యుడై, స్థిరంగా ఉండే నారాయణుడు) అనే శ్రీరామాయణశ్లోకంలోను, **"తిరువిరున్ద మార్బన్"** (నాన్ముకన్ తిరు-92) (లక్ష్మీదేవి ఉన్న వక్షస్సును కలవాడు), **"తిరు మెయ్యుఱైకిన్ఱ"** (తిరువాయ్-10-4-2) (లక్ష్మీదేవి నివసించే వక్షస్సును కలవాడు), **"తన్నొడుమ్ పిరివిలాద తిరుమకళ్ మరువుమ్"** (పెరియ తిరు-4-5-5) (తనతో విశ్లేషం లేని లక్ష్మీదేవి సంశ్లేషించే) అని దివ్యప్రబంధసూక్తులలోను యథార్థాన్ని చూచి తెలిసిన జ్ఞానులు లక్ష్మి-భగవానుడు ఎల్లప్పుడూ కలసి ఉండే విషయాన్ని చెప్పారు.

ఈ శ్లోకంయొక్క సారార్థం ఏమంటే-దోషాలను చేసే జీవులు దోషాలను స్మరించి భయపడి, వెనుకకు తగ్గకుండా, వారికి భగవానుని విషయంలో ఆభిముఖ్యం కలిగినపుడు వారు అతనిని ఆశ్రయించేటట్లు చేసి. అతనితో చేర్చే పురుషకారస్వరూపిణి



(ఆహుః) "విష్ణోః శ్రీ రనపాయినీ", "శ్రీవత్సవక్షా నిత్యశ్రీః" ఎన్ఱుమ్, "తిరువిన్దమార్బన్" ఎన్ఱుమ్, "తిరుమెయ్యుఱైకిన్ఱ" "తన్నొడుమ్ పిరివిలాత తిరుమకళ్ మరువుమ్" ఇత్యాదిప్రమాణప్రవర్తకరాన తత్త్వదర్శికళ్ ఇన్నిత్యయోగత్తై చ్చొన్నార్‌కళ్.

ఇత్తాల్, సాపరాధచేతనర్, స్వాపరాధత్తై నినైత్తఞ్జి అకలామల్ రుచి పిఱన్దపోతే ఆశ్రయిక్కలామ్బడి పురుషకారభూతైయాన వివళ్ సన్నిధి అవశ్యమ్ వేణ్డుకైయాలుమ్,

---

అయిన ఈమె దగ్గరలో ఉండాలి కాబట్టి, భగవానుని ఆశ్రయించేటపుడు, సుగంధద్రవ్యాలను కలిపిన పాలు, కలకండ కలిసినట్లు, ఈమె చేరిక ఏర్పడగానే మిక్కిలి భోగ్యంగా ఉండడంచేతను, **"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చ తే"** (రామా-అర-31-25) (నీవు పిరాట్టితోపాటు కొండచరియల ప్రాంతాలలో సంచరిస్తావు. అపుడు నేను మీరిరువురు మేల్కొని ఉన్నపుడు, నిద్రించేటపుడును మీకు అన్ని విధాల కైంకర్యాలను చేస్తాను) అనే ప్రమాణానుసారం ఇరువురి చేరికలో కైంకర్యాన్ని చేయడమే క్రమం కనుక, కైంకర్యం సిద్ధించడం, భోగ్యంగా ఉండడం ఇరువురి చేరికలోనే కనుక, ఈ విధంగా ఉపాయదశలోను, ఉపేయదశలోను తేడా లేకుండా, **"ఇఱుగ మఱుగుమ్ తిరుమాలన్ఱి యిన్మై కణ్డు"** (తిరువాయ్-7-9-11) అనే రీతిలో ఇద్దఱు చేరి ఉంటే తప్ప ఆనందించడం వీలు కాదుకదా! **"అపరాధభీతానాం భగవతః సర్వదా శరణ్యత్వార్థం, ప్రాప్తిదశాయాం శర్కరాన్వితదుగ్ధన్యాయేన నిరతిశయభోగ్యత్వార్థం చ సర్వప్రకారేణ శ్రియా గాఢోపగూఢత్వోక్తిః"** అని దేశికభాష్యం. **"ఇన్బమ్ పయక్క ఎழிల్ మాదరుమ్ తానుమ్ ఇవ్వేழులకై ఇన్బమ్ పయక్క ఇనిదుడన్ వీఱ్ఱిరున్దు ఆళ్కిన్ఱ ఎఙ్గళ్‌పిరాన్, అన్బుఱ్ఱు అమర్న్దుఱైకిన్ఱ అణి పొழிల్ శూழ் తిరువాఱన్ విళై, అన్బుఱ్ఱు అమర్న్దు వలమ్ శెయ్దు కైతొழు నాళ్‌కళుమ్ ఆకుమ్‌కొలో!"** (తిరువాయ్-7-10-1) (అందాన్ని కల శ్రీదేవి, తాను సుఖించేటట్లు, ఈ ఏడులోకాలు సుఖించేటట్లు ప్రీతితో వేంచేసి ఉండి పాలిస్తున్న మాస్వామి, సర్వేశ్వరుడు ఆనందంగా అమరి, నిత్యవాసం చేసేది, అందమైన తోటలలో చుట్టబడి ఉన్నది అయిన తిరువాఱన్‌విళై అనే దివ్యక్షేత్రంలో స్నేహాన్ని కల్గి అక్కడే ప్రదక్షిణం చేసి, అంజలి ఘటించే దినాలు నాకు వస్తాయా!) అనే రీతిలో భగవానుడు, లక్ష్మి ఇరువురి చేరిక-అనే నిత్యయోగాన్ని ఈ శ్లోకంలో అనుసంధించి, అనుగ్రహించారు.

ఇక, ఈ చతుఃశ్లోకిలో ద్వయార్థం అనుసంధింపబడిందని తెలుపబడుతున్నది. **"మతుప్"** అనే ప్రత్యయంయొక్క అర్థం అయిన నిత్యయోగాన్ని చెప్పే ఈ శ్లోకంతోను,

ప్రాప్తిదశైయిల్ శేర్ప్పాలుమ్, ఖణ్డశర్కరైయుమ్ కలన్దాప్పోలే నిరతిశయభోగ్యత్వార్థ-మాకవుమ్, "వైదేహ్యా సహ" ఎన్గిఱపడియే ఇరువరుమాన శేర్త్తియిలే అడిమైశెయ్కై ముఱైయాకైయాలుమ్, అడిమైతాన్ సిద్ధిప్పతుమ్, రసిప్పతుమ్ శేర్త్తియిలేయా-కైయాలుమ్, ఇప్పడి ఉపాయదశైయోడు, ఉపేయదశైయోడు వాశియఱ "ఇఱ్ఱుమఱ్ఱుమ్ తిరుమాలన్ఱి" విన్బుఱ విరకిల్లామైయాలే, "ఎఴిల్ మలర్ మాతరున్దానుమాయ్" క్కొణ్డు "ఇవ్వేఴులకై ఇన్బమ్ పయక్క వినితుడన్ వీఱ్ఱి" రుక్కిఱ నిత్యయోగత్తై అనుసన్ధిత్తరుళినారాయ్త్తు.

---

**"నారాయణ"** శబ్దంయొక్క అర్థం మొదటిశ్లోకంతోను సంగ్రహంగా చెప్పబడ్డాయి. ఏ విధంగా అంటే-**"శాంతానంద"** అని ఉభయవిభూతికి ఆశ్రయమై, ఉండేవాడు-అనే అయనశబ్దంయొక్క అర్థం సంగ్రహంగా చెప్పబడింది. గుణాలు-వాటినికల గుణిని విడిచి ఉండనివి కాబట్టి, గుణి అయిన స్వరూపాన్ని చెప్పడంద్వారా ఆ స్వరూపాన్ని నిరూపించే గుణాలు అయిన జ్ఞానం, ఆనందం, అమలత్వం మొదలైనవి, వీటిచే నిరూపింపబడ్డ స్వరూపంలో విశేషణాలుగా ఎల్లప్పుడూ ప్రకాశించే జ్ఞానం, శక్తి మొదలైన గుణాలు, జీవుడు భగవానుని ఆశ్రయించడానికి దోహదపడే వాత్సల్యం, సౌశీల్యం, సౌలభ్యం-మొదలైన గుణాలు ఉపలక్షణ విధిలో నిరూపింపబడ్డాయి. **"మూర్తమ్ బ్రహ్మ"** అని ప్రారంభించి, రెండవపాదంలో తెల్పిన తిరుమేని, దాని గుణాలైన కాంతి, సౌకుమార్యం మొదలైనవానిని, ఆ తిరుమేనిలో ధరింపబడే దివ్యాభరణాలను, ఆభరణకోటిలోనికి చేరిన దివ్యాయుధాలను ఉపలక్షణ విధిలో చూపుతున్నది. చివరిలో **"తే"** అని లక్ష్మీదేవిని నిర్దేశించడం భూమి పిరాట్టి మొదలైన మిగిలిన దేవేరులకుకూడా ఉపలక్షణం. మొదటిశ్లోకంలో **"ఫణిపతిః"** అని ఆదిశేషుడు, **"విహగేశ్వరః"** అని గరుడుడు -ఇద్దరు నిత్యసూరులను చెప్పడం ఛత్రచామరాదులతో పాటు మిగిలిన నిత్యసూరులకు, పరమపదం అంతటికీ ఉపలక్షణం. **"మాయా"** అని మూలప్రకృతిని తెల్పినది సంసారంలో బద్ధులైన జీవులకు, కాలానికి మహాన్ మొదలైన మూలప్రకృతి వికారాలకు ఉపలక్షణం. **"బ్రహ్మేశాది"** అని అండాంతర్వర్తులైన దేవతలు మొదలైనవారిని తెల్పినపుడే, అండంకూడా చెప్పినట్లయింది. తిరుమేనిని తెల్పినపుడే తిరుమేనిలో భాగం అయిన శ్రీపాదాలను చెప్పే చరణశబ్దంయొక్క అర్థం చెప్పబడింది. ఉపాయదశతో-ఉపేయదశతో భేదం లేకుండా ఇద్దఱూ కలసి ఉండడాన్ని చెప్పడంచేత ఉపాయాన్ని ఆశ్రయించడం అనే **"ప్రపద్యే"** శబ్దార్థం, ఉపేయాన్ని ప్రార్థించే **"ఆయ"** శబ్దార్థం



మతుబర్థప్రతిపాదకమాన ఇశ్లోకత్తాలుమ్, ప్రథమశ్లోకత్తాలుమ్ నారాయణశబ్దార్థముమ్ సఙ్గృహీతమ్. ఎఙ్గనే ఎన్నిల్, "శాంతానంత" ఎన్ఱు తొడఙ్గి దివ్యాత్మస్వరూపత్తై ప్రతిపాదిక్కైయాలే, అయన శబ్దార్థం సంగృహీతమ్. గుణగుణికళ్ అపృథక్సిద్ధఙ్గళాకైయాలే గుణియాన స్వరూపత్తై చ్చొన్న వితు-తన్నిరూపకగుణఙ్గళాన జ్ఞానానన్దామలత్వాదికళుక్కుమ్, నిరూపితస్వరూపవిశేషణఙ్గళాన జ్ఞానాశక్త్యాదికళుక్కుమ్, సౌకర్యాపాదకఙ్గళాన వాత్సల్య సౌశీల్యాదికళుక్కు ముపలక్షణమ్. "మూర్తం రూపమ్" ఎన్ఱు తొడఙ్గి చ్చొన్న దివ్యవిగ్రహమ్-తద్గుణఙ్గణాన కాన్తిసౌకుమార్యాదికళుక్కుమ్, తదాధేయమాన దివ్యభూషణఙ్గళుక్కుమ్, ఆభరణకోటియిలే అన్వితమాన

---

చెప్పబడినట్లయింది. ఆవిధంగా కాకుండా, మొదటి మూడు శ్లోకాలతో ద్వయం మొదటివాక్యంలోని అర్థం, నాల్గవ శ్లోకంలో రెండవవాక్యంయొక్క అర్థం చెప్పబడింది-అని కూడా చెప్పవచ్చు. (నాల్గవ శ్లోకవ్యాఖ్యానం చివరలో దేశికులుకూడా లక్ష్మీ విభుత్వాదులను గూర్చి, వ్యాప్తినిగూర్చి విచారించారు. ఆ సందర్భంలోనే తమకు పూర్వం ఉన్న అయిదు పక్షాలను కూడా ప్రస్తావించారు.

ఇక్కడ ఒక ప్రశ్న కలుగుతుంది. అది ఏమంటే-ఈ శ్లోకంలో పిరాట్టి, భగవానుడు అనే ఇద్దఱూ ఎప్పుడూ కలిసి ఉంటారని చెప్పబడింది. అంటే-**"పరమాత్మా పరో యోఽసౌ నారాయణసమాహ్వయః, తస్యానపాయినీ శక్తిః దేవీ తద్ధర్మచారిణీ"** (పాంచరాత్రమ్) (నారాయణుడు అనే పేరును కలవాడై, గొప్పవాడై ఉండే పరమాత్మ ఎవడో, అతనిని విడచి ఉండని శక్తిగాను, అతని గుణాలనే తనకు కల్గినదిగాను ఉంటుంది లక్ష్మీదేవి) అనే ప్రమాణంలోను, **"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ"** (విష్ణు. పు-1-8-17) అనే ప్రమాణాలను తెల్పిన రీతిలో, ఈ విషయాన్ని "ఇద్దఱు ఎప్పుడూ కలసి ఉంటారు" అని ఒకటిగా చేర్చి గ్రహించకుండా, భగవానుని, స్వరూపం, రూపం, గుణాలు, విభూతి-మొదలైనవానితో గాఢోపగాఢంగా ఉంటుంది-అని విభజించి వివరంగా చెప్పడంలోని కారణం ఏమి? అని అన్నదే ఆ ప్రశ్న. ద్వయంలో మొదటి పదం అయిన **"శ్రీమన్నారాయణ"** అనే పదంలోని విశేష్యాన్ని చెప్పే నారాయణపదంలో భగవానుని స్వరూపం, రూపం, గుణాలు , విభూతులు-మొదలైనవానిని అన్నిటినీ చెప్పబడడంచేత, దానికి విశేషణంగా ఉండే శ్రీశబ్దంలో పిరాట్టియొక్క స్వరూపం, రూపం, గుణాలు మొదలైనవాటిని చెప్పబడడంచేత, ఆ ఇద్దఱి స్వరూపం మొదలైనవి ఒకదానితో వేఱొకటి విడచి ఉండనివి-అనే విషయాన్ని "**మతుప్**" అనే ప్రత్యయం

దివ్యాయుధఙ్గళుక్కు ముపలక్షణమ్. (తే) ఎన్ఱు-పెరియపిరాట్టియారై చ్చొన్నతు, భూమిప్పిరాట్టి తొడక్కమాన మఱ్ఱై నాయ్చ్చిమారుక్కు ముపలక్షణమ్. "ఫణిపతిః" ఎన్ఱు నిత్యసూరికళై చ్చొన్నతు, ఛత్రచామరాదికళ్ తొడఙ్గి పరమాకాశత్తుక్కు ముపలక్షణమ్. "మాయా" ఎన్ఱు ప్రకృతియై చ్చొన్నదు బద్ధాత్మాకుళుక్కుమ్, కాలమహదాదివికారఙ్గళుక్కు ముపలక్షణమ్. "బ్రహ్మేశాది" ఎన్ఱు అణ్డత్తుక్కుట్పట్ట దేవాదిపదార్థఙ్గళై చ్చొన్నపోతే అణ్డముమ్ సిద్ధమిఱే. ఆక, నారశబ్దార్థముమ్ సఙ్గృహీతమ్. ఉపాయోపేయఙ్గళుక్కు అవిశిష్టమాన నిత్యయోగత్తై చ్చొల్లుకైయాలే ఉపాయస్వీకారముమ్, ఉపేయప్రార్థనైయుమ్ ఉక్తప్రాయమ్. అథవా, శ్లోకత్రయత్తాలే పూర్వవాక్యార్థత్తైయుమ్, తురీయశ్లోకత్తాలే ఉత్తరవాక్యార్థత్తైయుమ్ అనుసన్ధిక్కవుమామ్.

నను-ఇశ్శ్లోకత్తిల్ ఇరువరుడైయవుమ్ నిత్యయోగమ్ శొల్లుకిఱతాకిల్, "పరమాత్మా పరో యోఽసౌ నారాయణసమాహ్వయః, తస్యాఽనపాయినీ శక్తి ర్దేవీ తద్ధర్మచారిణీ", "విష్ణో శ్శ్రీ రనపాయినీ" ఎన్ఱాప్పోలే తిరళ వారు పాశుర మిట్టరుళిచ్చెయ్యామల్, భగవత్స్వరూపరూపగుణవిభూతికళ్ లక్ష్మీస్వరూపరూపగుణాది-

---

తెలుపుతున్నందున, ఆ ప్రత్యయంయొక్క అర్థాన్ని చెప్పే ఈ శ్లోకంతో పురుషకారిణి అయిన పిరాట్టియొక్క, ఉపాయభూతుడైన భగవానునియొక్క స్వరూపం మొదలైనవి ఒకదానితో వేఱొకటి విడచి ఉండని సంబంధాన్ని కల్గినవి-అనే విషయాన్ని ఈ శ్లోకంలో విడదీసి వివరంగా చెబుతున్నారు. కనుక లోపం లేదు.

ఈ విధంగా భగవానుని, స్వరూపం, రూపం, గుణాలు, విభూతులు-మొదలైనవానితో పిరాట్టియొక్క స్వరూపం మొదలైనవానికి గల విడదీయరాని సంబంధాన్ని వేదాలు, ఋషులు, ఆఴ్వార్లు, ఆచార్యులు ఆదరించి, అనుసంధించారు. **"చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్, తాం పద్మనేమిం శరణ మహం ప్రపద్యే, అలక్ష్మీ ర్మే నశ్యతామ్ త్వాం వృణే"** అనే ప్రమాణంలోని **"దేవజుష్టామ్"** అనే పదంలో వేదం భగవానుని స్వరూపం మొదలైనవానిలో పిరాట్టి విశ్లేషించకుండా ఉంటుంది-అని చూపబడింది. **"అహంతా బ్రహ్మణ స్తస్య సాఽహ మస్మి సనాతనీ, ఆత్మా స సర్వభూతానా మహంభూతో హరిః స్మృతః, అహంతా వినాఽహం హి నిరుపాఖ్యో న సిద్ధ్యతి, అహ మర్థం వినాఽహంతా నిరాధారో న సిద్ధ్యతి"** (లక్ష్మీతంత్రమ్-2-12-18) (సనాతని అయిన నేను బ్రహ్మ అయిన ఆ భగవానునకు అహంత (నేను అనే స్వభావం) గా ఉన్నాను.



కళోడే యథాక్రమమ్ గాఢాశ్లిష్టఙ్గళాయిరుక్కుమెన్ఱు ఇప్పడి విభజిత్తురుళిచ్చెయ్-వానెన్నెన్నిల్, ద్వయత్తిలే ప్రథమపదత్తిల్ విశేష్యపరమాన నారాయణపదత్తిలే భగవత్స్వరూపగుణవిభూతికళై ప్రతిపాదిక్కైయాలుమ్, తద్విశేషణపరమాన శ్రీశబ్దత్తిలే పిరాట్టియినుడైయ స్వరూపరూపగుణాదికళై ప్రతిపాదిక్కైయాలుమ్, ఉభయరుడైయవుమ్ స్వరూపాదికళుక్కుణ్డాన అవినాభావసమ్బన్ధత్తై మతుప్పు ప్రతిపాదిక్కైయాలుమ్, మతుబర్థ ప్రకాశకమాన విశ్లోకత్తాలే పురుషకారోపాయఙ్గళుడైయ స్వరూపాదికళుక్క-న్యోన్యముణ్డాన అవినాభావసమ్బన్ధత్తై విస్తరేణ వరుళిచ్చెయ్య క్కుఱైయిల్లై.

ఇప్పడి భగవత్స్వరూపగుణవిభూతికళోడే పిరాట్టిక్కుణ్డాన అవినాభావసమ్బన్ధత్తై వేదఙ్గళుమ్, ఋషికళుమ్, ఆఴ్వార్కళుమ్, ఆచార్యర్కళుమ్ విరుమ్బి యనుసన్ధిత్తార్కళ్. "దేవజుష్టామ్" ఎన్ఱుమ్, "శ్రీమన్నారాయణ" ఎన్ఱుమ్, తత్స్వరూపాదికళోడే తదవినాభావసమ్బన్ధత్తై వేదాన్తఙ్గళుమ్ విరుమ్బిఱ్ఱన. "అహంతా బ్రహ్మణ స్తస్య స్యాహ

---

సర్వభూతాలకు ఆత్మ అయిన హరి అహంభూతుడుగా ఉన్నాడు. అహంతను విడచి అహమర్థం పేరును పొందినదిగా సిద్ధించదు. అహమర్థాన్ని విడచి అహంత ఆధారం లేనిదై సిద్ధించదు) అనే పాంచరాత్రశాస్త్రప్రమాణం పిరాట్టి స్వరూపం భగవానుని స్వరూపాన్ని విడచి ఉండకుండా ఉంటుందని స్పష్టంగా తెలిపింది. **"కా త్వన్యా త్వాం ఋతే దేవి! సర్వయజ్ఞమయం వపుః, అధ్యాస్తే దేవదేవస్య యోగిచింత్యం గదాభృతః"** (విష్ణుపు-1-9-122) (ఓ దేవీ! గదను ధరించినవాడు, దేవదేవుడు అయిన భగవానునియొక్క యోగులచేత భావించతగినది, సర్వయజ్ఞమయం అయినది అయిన శరీరంలో నీవుకాక వేఱెవ్వరు ఉన్నారు?) అనే ప్రమాణంలోను, **"తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః, శ్రీవత్సవక్షాః నిత్యశ్రీ రజయ్య శ్శాశ్వతో ధ్రువః"** (రామా. యు-114-15) (ఈ శ్రీరాముడు తమస్సుకు ఆవల ఉన్నవాడు, అన్నిటినీ ధరించేవాడు, శంఖచక్రగధాధరుడు, ఎల్లప్పుడు శ్రీదేవితో కూడి ఉండేవాడు, జయించడానికి సాధ్యం కానివాడు, నిత్యుడు, స్థిరమైనవాడు అయిన నారాయణుడే) అనే శ్లోకంలోను, **"దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణభూషితా, పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః"** (విష్ణుపు-1-9-105) (స్నానం చేసినదై, దివ్యమాలికలను, దివ్యవస్త్రాలను ధరించినదై, ఆభరణాలచేత అలంకరింపబడినదైన లక్ష్మి దేవతలందఱు చూస్తుండగానే భగవానుని వక్షస్సును చేరింది) అనే ప్రమాణంలోను ఇరువురి తిరుమేనులు ఒకదానిని వేఱొకటి విడచి ఉండవని చెప్పబడింది. **"రాజరాజోఽఖిలస్యాస్య విశ్వస్య**

మస్మి సనాతనీ, ఆత్మా న సర్వభూతానా మహమ్భూతో హరిః స్మృతః, అహన్తయా వినాహం హి నిరుపాఖ్యో న సిద్ధ్యతి, అహమర్థం వినాఽహన్తా నిరాధారా న సిద్ధ్యతి" ఇత్యాదికళాలే భగవత్స్వరూపాఽవినాభావసమ్బన్ధమ్ స్పష్టమాయిఠ౦. "కాచాఽన్యాత్వా మృతే దేవి సర్వయజ్ఞమయం వపుః, అధ్యాస్తే దేవదేవస్య యోగిచిన్త్యం గదాభృతః", "శ్రీవత్సవక్షా నిత్యశ్రీః", "యయౌ వక్షస్థలం హరేః" ఇత్యాదికళాలే విగ్రహాన్వయమ్ విశదమాయ్‌త్తు. "రాజరాజోఽఖిలస్యాస్య విశ్వస్య పరమేశ్వరః, కాన్తస్య తస్య దేవస్య విష్ణో స్సద్గుణశాలినః, దయితాహం సదా దేవీ జ్ఞానానన్దమయీ సదా,

---

**పరమేశ్వరః, కాంతస్య తస్య దేవస్య విష్ణోః సద్గుణశాలినః, దయితాహం సదా దేవీ జ్ఞానానందమయీ సదా, అనవద్యాఽనవద్యాంగీ నిత్యం తద్ధర్మధర్మిణీ''** (లక్ష్మీతంత్రమ్-17-30-31) (రాజరాజై, ఈ లోకానికి అంతటికీ పరమేశ్వరుడై, భగవానుడై, కాంతుడై, కల్యాణగుణాలను కలవాడై, దేవుడైన ఆ విష్ణువునకు నేను దేవేరినై, ఎల్లప్పుడు ప్రియురాలినై, జ్ఞానానందమయినై ఎల్లప్పుడు దోషాలులేని గుణాలను, దివ్యదేహాన్ని కల్గినదాననై, ఎల్లప్పుడు అతని ధర్మాలనే నా ధర్మాలుగా కల్గినదాననై ఉన్నాను) అని లక్ష్మీతంత్రంలోను, ఇరువురి గుణాలు ఒకదానితో వేఱొకటి విడచి ఉండవు అని - ఘోషింపబడింది.

**"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్థం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైర్భాగవతై స్సహ"** (శైవపురాణం) (గొప్పలోకం అయిన పరమపదంలో జగత్పతి, భావించడానికి సాధ్యం కాని స్వరూపాన్ని కలవాడు అయిన విష్ణువు భక్తులతో, భాగవతులతో కూడినవాడై, శ్రీదేవితో కలసి వేంచేసి ఉంటాడు) అనే ప్రమాణ శ్లోకంలోను, **"తత్ర దివ్యవపుః శ్రీమాన్ దేవదేవో జనార్దనః, ఆస్తే నారాయణః శ్రీమాన్ వాసుదేవ స్సనాతనః"** (అక్కడ దేవదేవుడు, జనార్దనుడు, వాసుదేవుడు అనే పేర్లను కలవాడు, దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడై, అందమైనవాడై, పిరాట్టితో కూడినవాడైన నారాయణుడు వేంచేసి ఉంటాడు) అనే ప్రమాణంలోను, **"వైకుంఠే తు పరేలోకే శ్రీసహాయో జనార్దనః, ఉభాభ్యాం భూమినీళాభ్యాం సేవితః పరమేశ్వరః"** (వైకుంఠం అనే గొప్ప లోకంలో శ్రీదేవితో కూడిన భగవానుడు భూమి, నీళాదేవి ఇరువురిచేత సేవింపబడుతున్నాడు) అనే ప్రమాణంలోను ఇరువురి విభూతులు ఒకదానితో ఇంకొకటి చేరి ఉన్నవి అని వివరింపబడింది. "**ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః**" అని, "**దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషే**" అనే ప్రమాణాలలో, **"వ్యూహేషు చైవ వానపాయినీ"** (పాంచరాత్రమ్) (అన్ని వ్యూహాలలోను, అన్ని విభవాలలోను నన్ను



అనవద్యానవద్యాఽఙ్గీ నిత్యం తద్ధర్మధర్మిణీ" ఇత్యాదికళాలే గుణావినాభావమ్ ఘోషిక్కప్పట్టతు.

"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్థం జగత్పతిః, ఆస్తే", "తత్ర దివ్య వపుః శ్రీమాన్ దేవదేవో జనార్దనః, ఆస్తే నారాయణ శ్శ్రీమా న్వాసుదేవ స్సనాతనః", "వైకుణ్ఠే తు పరే లోకే శ్రీసహాయో జనార్దనః" ఇత్యాదికళాలే విభూత్యన్వయమ్ విస్తరిక్కప్పట్టతు. "ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః", "దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ, రాఘవత్వేఽభవత్సీతా", "వ్యూహేషు చైవ సర్వేషు విభవేషు చ సర్వశః,

---

విడచి ఉండనిదై, ఈ పిరాట్టికూడా అవతారాలను ఎత్తుతుంది) అని పాంచరాత్రంలోను ఇరువురి వ్యూహవిభవాలలోను విడచి ఉందని స్థితి వివరింపబడింది. **"తైస్తదానుగుణై ర్భావై ర్యాహం దేవస్య శార్‌ఙ్గిణః, కరోమి సకలం కృత్యం సర్వభావానుగామినీ"** (లక్ష్మీతంత్రమ్-17-4) (అనురూపాలైన అయా భావాలతో కూడి, నేను శార్‌ఙ్గమనే వింటిని కల దేవుని అన్ని స్వభావాలలోను అనుసరించేదాననై, అన్ని కార్యాలను చేస్తున్నాను) అని లక్ష్మీతంత్రలోను ఇరువురి ఐశ్వర్యాలు ఒకదానితో వేఱొకటి చేరి ఉంటాయని చెప్పబడింది. ఈ విధంగా ఒక్కొక్కటిగా నిర్దేశించి చెప్పడమే కాకుండా, **"గుణై ర్విలాసైః రూపై శ్చ స్వాత్మనా వాఽత్మనీశ్వరమ్, నియచ్ఛంతీం అఖండాండని యంత్రీం చ స్తుమః శ్రియమ్"** (పాంచరాత్రమ్) (గుణాలతో, విలాసాలతో, రూపాలతో, తన స్వరూపంతో తన యందు ఈశ్వరుని నియంత్రించినదై అన్ని అండాలను నియమించే శ్రీదేవిని స్తుతిస్తున్నాను) అని స్వరూపం, రూపం మొదలైన అన్నిటిలోను ఇరువురు చేరి ఉండడం సంగ్రహంగా చెప్పబడింది.

**''మలర్‌మకళ్ విరుమ్పువ్ నమ్ అరుమ్ పెఱలడికళ్''** (తిరువాయ్-1-3-1) (లక్ష్మీదేవి ఆశపడే మనస్సు పొందడానికి అరుదైన స్వామి) అని ఇద్దఱి స్వరూపంయొక్క అవినాభావసంబంధాన్ని (ఒకదానిని విడచి వేఱొకటి ఉండని సంబంధాన్ని), **"ఎన్ తిరుమకళ్ శేర్ మార్బనే"** (తిరువాయ్-7-2-9) (మా లక్ష్మీదేవిచేరి ఉండే వక్షస్సును కలవాడా!), **"అలమేల్‌మఙ్గై యుఱై మార్బా"** (తిరువాయ్-6-10-10) (అలర్మేల్‌మంగై నిత్యవాసంచేసే వక్షస్సును కలవాడా!), **"తిరుమకళుమ్ కూఱాళుమ్ తనియుడమ్బన్"** (తిరువాయ్-4-8-1) (లక్ష్మీదేవి కూడా వాటాని కల్గి ఉండే అద్వితీయ విగ్రహాన్ని కలవాడు) అని వీరి రూపాలయొక్క అవినాభావసంబంధాన్ని, **"నికరిల్ పుకழాయ్"** (తిరువాయ్-6-10-10) (సాటిలేని

తథా వ్యూహీ భవత్యేషా మమ చైవానపాయినీ” ఇత్యాదికళాలే వ్యూహవిభవాఽ వినాభావమ్ వ్యాఖ్యాతమాయిర్రు. “తై స్తై రనుగుణై ర్భావై ర్యాహం దేవస్య శార్ఙిణః, కరోమి సకలం కృత్యం సర్వభావానుగామినీ” ఇత్యాదికళాలే ఐశ్వర్యాన్వయమ్ ఆదరిక్కప్పట్టతు. ఇప్పడి ప్రత్యేకమాక ప్రతిపాదిక్కైయన్నిక్కే, “గుణై ర్విలాసై రూపై శ్చ స్వాత్మనాఽ వాత్మనీశ్వరమ్, నియచ్ఛన్తీ మఖణ్డాణ్డనియన్త్రీఞ్చ స్తుమ శ్రియమ్” ఎన్ను సకలావినాభావసమ్బన్ధముమ్ సఙ్గ్రహిక్కప్పట్టతితే.

“మలర్మకళ్ విరుమ్బుమ్ నమరుమ్ పెఱలడికళ్”, “తన్నొడుమ్ పిరివిలాత తిరుమకళ్” ఇత్యాదికళాలే స్వరూపావినాభావసమ్బన్ధముమ్, “ఎన్ తిరుమకళ్ శేర్ మార్బనే”, “తిరుమార్బినిల్ శేర్ తిరుమాలే”, “అలర్మేల్మఙ్గై యుఱైమార్బా”,

---

వాత్సల్యగుణాన్ని కలవాడా!), **“మికుమ్ తిరుమాల్ శీర్క్కడలై”** (పెరియ తిరు-69) (సర్వాధికుడైన శ్రియఃపతియొక్క కల్యాణగుణాలు అనే సముద్రాన్ని) అని ఇద్దఱి గుణాలు ఒకదానిని వేఱొకటి వృద్ధిచేస్తూ చేరి ఉంటాయని, **“తిరుమాల్ వైకున్దమ్”** (తిరువాయ్-10-7-8) (శ్రియఃపతి వైకుంఠం) అని ఇద్దఱి విభూతులు (ఒకటేనని) ఒకదానిలో వేఱొకటి చేరి ఉంటాయని, **“తిరుమాల్ కడల్”** (మూన్ఱామ్. తిరు-30) (శ్రియఃపతి యొక్క క్షీరాబ్ధి) ,**“మాదవా! కూనేయ్‌శిదై యుణ్డైవిల్ నిఱత్తిల్ తెఱిత్తాయ్ కోవిన్దా”** (తిరువాయ్-1-5-5) (మాధవా! మంధర గూని తనాన్ని వింటితో పోగొట్టిన గోవిందా!), **“శ్రీమాదవన్ కోవిన్దన్”** (తిరువాయ్-8-2-7) (శ్రీమాధవుడు, గోవిందుడు), **“తిరుమాల్ వన్దు ఎన్ నెఞ్జు నిఱైయ పుకున్దాన్”** (తిరువాయ్-10-8-1) (శ్రియఃపతి వచ్చి నామనస్సు నిండుగా ప్రవేశించాడు), **“వేఙ్గడత్తెన్ తిరుమాల్”** (నాచ్చియార్. తిరు -8-10) (వేంకటాద్రిలోని నా శ్రియఃపతి) అని వ్యూహం, విభవం, అంతర్యామి, అర్చావతారం-అనే అవతారాలలో ఇద్దఱు అవినాభావంగా కలసి ఉండడం, **“పూమ్ పావై యాకమ్ పుణర్వదు ఇరువరవర్ ముదలుమ్ తానే”** (తిరువాయ్-2-861) (పుష్పనివాసిని వక్షస్థలాన్ని సంశ్లేషిస్తాడు. ఆవిధంగా ప్రసిద్ధులైన బ్రహ్మరుద్రులకు ఇద్దరికీ తానే కారణభూతుడు), **“అల్లిమలర్ మకళ్ పోయ మయక్కుక్కుళాల్ ఆకియుమ్ నిఱ్కుమ్ అమ్మాన్...ఎల్లా క్కరుమఙ్గళుమ్ శెయ్”** (తిరువాయ్-3-10-8) (తామరపూవులో నివసించే లక్ష్మియొక్క సంశ్లేషంచేత కల్గిన ఆనందాలను కలవాడైన స్వామి అన్ని జగద్వ్యాపారాలను చేసి) అని లోకాన్ని సృష్టించడంలో అభినివేశం మొదలైన దశలలో కలసి ఉండడం ఆళ్వార్లచేతకూడా అనుసంధింపబడిందికదా!



“తిరుమకళుమ్ కూఱాళుమ్ తనియుడమ్బన్” ఎన్ను రూపావినాభావసమ్బన్ధముమ్, “నికరిల్ పుకழాయ్”, “మికుమ్ తిరుమాల్ శీర్క్కడలై” ఎన్ను గుణాఽభివృద్ధ్యన్తర్భావముమ్, “ తిరుమాల్ వైకున్దమ్” ఎన్ను విభూత్యన్తర్భావముమ్, “తిరుమాల్ కడల్”, “మాతవా ! కూనే శితైయ వుణ్డై విల్ నిఱత్తిల్ తెఱిత్తాయ్ కోవిన్దా”, “శ్రీమాతవన్ కోవిన్దన్”, “తిరుమాల్ వన్దెన్నెఞ్జు నిఱైయ పుకున్దాన్”, “వేఙ్గడత్తెన్ తిరుమాల్” ఎన్ను వ్యూహవిభవాన్తర్యామ్యర్చావతారాఽ వినాభావసమ్బన్ధముమ్, “పూమ్బావైయాకమ్ పుణర్వతు ఇరువరవర్ ముతలుమ్ తానే”, “అల్లిమలర్మకళ్ పోకమయక్కుక్కళాకియుమ్

---

ఈ ఆళ్వార్లను అనుసరించిన ఆచార్యులలో అగ్రేసరులైన శ్రీపరాశరభట్టర్-**“స్వరూపం స్వాతంత్ర్యం భగవత ఇదం చంద్రవదనే త్వదాశ్లేషోత్కర్షాత్ భవతి ఖలు నిష్కర్షసమయే, త్వ మాసీ ర్మాత శ్రీః కమితు రిదమిత్థంత్వవిభవః త్వదంతర్భావా త్త్వాం న పృథగభిధత్తే శ్రుతి రపి”** (శ్రీగుణ-28) (చంద్రునివంటి ముఖాన్ని కల తల్లీ! మహాలక్ష్మీ! పరత్వాన్ని నిర్ణయించే కాలంలో భగవానుని ఈ స్వరూపం, స్వాతంత్ర్యం నీ ఆలింగనంయొక్క అతిశయంచేత కలుగుతున్నదికదా! నీ పతి స్వరూపాన్ని, స్వభావాన్ని వివరించే అంతరంగవిశేషణంగా నీవు ఉన్నావు. వేదంకూడా (అతని స్వరూపనిరూపకగా) అతనితో నీవు ఒకటిగా కలసి ఉండడంచేత నిన్ను ప్రత్యేకంగా స్తుతించడం లేదు) అని స్వరూపంలో ఇద్దఱూ విశ్లేషించకుండా కలసి ఉండడాన్ని, **“అనుకలతనుకాండాలింగనారంభశుంభత్ ప్రతిదిశభుజశాఖ-శ్రీసఖానోకహర్ధిః, స్తననయనగుళుచ్ఛస్ఫారపుష్పద్విరేఫా రచయతు మయి లక్ష్మీకల్పవల్లీ కటాక్షాన్”** (ప్రతిక్షణం లతవంటి శరీరాన్ని కల పిరాట్టి ఆలింగనంయొక్క ఆరంభంతో నాల్గు దిక్కులలోను ప్రకాశించే బాహువులనే శాఖలను కల లక్ష్మీనాథుడనే కల్పవృక్షం యొక్క సంపదను కల్గినది, పూలగుత్తులవంటి స్తనాల తటాలను, వికసించిన పుష్పాలలో ఉండే తుమ్మెదలవంటి శ్రీనేత్రాలను కల్గినది అయిన కల్పకతవంటి లక్ష్మి నాపట్ల కటాక్షాలను వర్షించాలి) (శ్రీగుణ-3) అనే ప్రమాణంలో రూపంలో చేరి ఉండడాన్ని, **“ప్రశకనబలజ్యోతిర్ జ్ఞానైశ్వరీవిజయప్రథా ప్రణతవరణ ప్రేమక్షేమం కరత్వపురస్సరా, అపి పరిమళః కాంతి ర్లావణ్య మర్చిరితీందిరే తవ భగవత శ్చైతే సాధారణా గుణరాశయః”** (శ్రీగుణ-32) (లక్ష్మీదేవీ! శక్తి, బలం, తేజస్సు, జ్ఞానం, ఐశ్వర్యం, విజయకీర్తి, ఆశ్రితులను వశీకరించుకోవడం, వారిపట్ల ప్రేమ, వారికి క్షేమాన్ని కలుగజేయడం-మొదలైన ఆత్మగుణాలు, సౌగంధ్యం, సౌందర్యం, లావణ్యం,

నిజ్కు మమ్మాన్- ఎల్లా క్కరుమజ్గళుమ్ శెయ్” ఎన్ను జగత్సృష్ట్యున్ముఖాద్యన్తర్భావముమ్ ఆళ్వార్కళాలు మనుసన్ధిక్కప్పట్టతిటే.

ఇవర్కళై అడియొఱఱిన ఆచార్యశ్రేష్ఠరాన భట్టరుమ్-“స్వరూపం స్వాతన్త్ర్యం భగవత ఇదం చన్ద్రవదనే త్వదాశ్లేషోత్కర్షా ద్భవతి ఖలు నిష్కర్షసమయే, త్వ మాసీ మాత శ్రీః కమితు రిదమిత్థంత్వవిభవై స్తదన్తర్భావా త్త్వాం న పృథ గభిధత్తే శ్రుతి రపి” ఎన్ను స్వరూపాఽవినాభావసమ్బన్ధముమ్, “అకలతనుకాణ్డాలిజ్గనారమ్భశుమ్భత్” ఎన్ను రూపసమ్బన్ధముమ్,“ప్రకశనబలజ్యోతిర్జ్ఞానైశ్వరీవిజయప్రథా ప్రణతవరణప్రేమ-

(సముదాయశోభ), కాంతి-అనే దేహగుణాల సమూహాలు నీకు, భగవానునకు సాధారణాలు) అని, **“అన్యేఽపి యౌవనముఖా యువయో స్సమానాః శ్రీరంగమంగళవిజృంభణవైజయంతి, తస్మిం స్తవ త్వయి చ తస్య పరస్పరేణ సంస్తీర్య దర్పణ ఇవ ప్రచురం స్వదంతే”** (శ్రీగుణ-33) (శ్రీరంగంలోని మంగళాలను చూపే వైజయంతి (ధ్వజం) వంటి లక్ష్మీదేవీ! యౌవనం మొదలైన మిగిలిన కొన్ని గుణాలు మీ ఇరువురికి సమానంగా ఉన్నాయి. నీ గుణాలు స్వామి వద్ద, స్వామి గుణాలు నీ వద్ద అద్దంలోవలె పరస్పరం ప్రతిఫలించి, చాలా మనోహరంగా ఉన్నాయి) అని, **“యువత్వాదౌ తుల్యేఽప్యపరవశతాశత్రుశమనస్థిరత్వాదీన్ కృత్వా భగవతి! గుణాన్ పుంస్త్వసులభాన్, త్వయి స్త్రీత్వైకాంతాన్ ప్రమదిమపతిపారార్థ్యకరుణాక్షమాదీన్వా భోక్తుం భవతి యువయో రాత్మని భిదా”** (శ్రీగుణ-4) (యౌవనం మొదలైన గుణాలు ఇద్దఱికీ సాధారణాలైనా, స్వాతంత్ర్యం, శత్రునిగ్రహం, స్థైర్యం మొదలైన పురుషునకు తగిన గుణాలను భగవానునివద్ద, స్త్రీలకు తగిన మృదుత్వం, పతిపారార్థ్యం, దయ, క్షయ-మొదలైన వానిని నీవద్ద దర్శించి, అనుభవించడానికి, మీ స్వరూపరూపాలలో భేదంకూడా సిద్ధిస్తుంది) మొదలైనశ్లోకాలలో గుణావినాభావత్వం, **“తత్ర స్రక్ స్పర్శగంధం స్ఫురదుపరిఫణారత్నరోచిర్వితానం విస్తీర్యానంతభోగం తదుపరి నయతా విశ్వమేకాతపత్రమ్, తె స్తైః కాంతేన శాంతోదితగుణవిభవై రర్హతాత్వా మసంఖ్యైః అన్యోన్యాద్వైతానిష్ఠాఘనరసగహనాన్ దేవి! బధ్నాసి భోగాన్”** (శ్రీగుణ-25) (దేవీ! ఆ తిరుమామణిమండపంలో పూమాలల సుగంధంవంటి సుగంధాన్ని, స్పర్శను కల్గినది, ప్రకాశిస్తున్న, పైనగల పడగలలోని రత్నాల కాంతులనే మేల్కట్టును కల్గినదై ఉండే ఆదిశేషుని శరీరం అనే చాపను పఱచి, దానిపైన వేంచేసి ఉండి, ఉభయవిభూతులను ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించేవాడు, లెక్కలేనన్ని ఆయా శాంతోదితావస్థయొక్క



క్షేమజ్కరత్వపురస్సరాః, అపి పరిమళఃకాన్తిర్లావణ్య మర్చి రితీన్దిరే నను భగవత శ్చైతే సాధారణా గుణరాశయః, అన్యేఽపి యౌవనముఖా యువయో స్సమానా శ్రీరజ్గమజ్గళవిజృమ్భణవైజయన్తి, తస్మిం స్తవ త్వయి చ తస్య పరస్పరేణ సంస్తీర్య దర్పణ ఇవ ప్రచురం స్వదన్తే”, “యువత్వాదౌ తుల్యేఽప్యపరవశతాశత్రుశమన” ఇత్యాదికళాలే గుణావినాభావముమ్, “తత్ర స్రక్ స్పర్శగన్ధం స్ఫురదుపరిఫణారత్న-రోచిర్వితానం విస్తీర్యానన్తభోగమ్” ఎన్ను విభూత్యన్తర్భావముమ్, “దధిమాథం మథ్నత

గుణాతిశయాలతో నీకు తగినవాడై ఉండే నీ వల్లభునితో కలసి పరస్పరసాదృశ్యనిష్ఠచే గొప్ప ఆనందం నిండి ఉండే అనుభవాలను అనుభవిస్తున్నావు) అని విభూత్యంతర్భావం, **“స్ఖలితకటకమాల్యైః దోర్భి రబ్ధిం మురారేః భగవతి దధిమాథం మథ్నతః శ్రాంతిశాంత్యై, భ్రమదమృతతరంగావర్తతః ప్రాదురాసీః స్మితనయనసుధాభిః సించతీ చంద్రికేవ”** (శ్రీగుణ-49) (తల్లీ!అటు ఇటు కదిలే బాహువలయాలను, మాలికలను కల చేతులతో పాలసముద్రాన్ని, పెఱుగును చిలికినట్లు చిలికే మురారియొక్క శ్రమం తీరడంకోసం, మందహాసం, కటాక్షాలు-అనే అమృతధారలతో తడుపుతూ, చంద్రుని వెన్నెలవలె భ్రమిస్తున్న అమృతతరంగాల సుడులనుండి నీవు ప్రాదుర్భవించావు) అని వ్యూహాంతర్భావాన్ని, **“యది మనుజతిరశ్చాం లీలయా తుల్యవృత్తే రనుజనురనురూపా దేవి! నావాతరిష్యః, అసరసమభవిష్యన్నర్మ నాథస్య మాతః దరదళదరవిందోదంత-కాంతాయతాక్షి”** (శ్రీగుణ-48) (కొంచెం విచ్చుకున్న ఎఱ్ఱ తామరల లోపల రేకులవలె అందమైన తిరునేత్రాలనుకల లక్ష్మీదేవీ! లీలార్థం దేవ-మనుష్య-తిర్యక్-స్థావర రూపాలతో సమానమైన వృత్తిని కలవాడై అవతరించే శ్రీరంగనాథుని అవతారాలు అన్నిటిలోను అనురూపంగా నీవు అవతరించి ఉండకపోతే ఆ స్వామి లీల అసరసమే అయి ఉండేది) అని, **“అనుజను రనురూపరూపచేష్టా యది సమాగమ మిందిరాఽకరిష్యత్, అసరస మథవాఽప్రియం భవిష్ణు ధ్రువ మకరిష్యత రంగరాజ నర్మ”** (శ్రీరంగరాజ-ఉత్తర-49) (శ్రీరంగనాథా! లక్ష్మీదేవి నీ అవతారాలు అన్నిటిలోను నీకు తగిన రూపాన్ని, లీలను కల్గినదై కలిసి అవతరించి ఉండనిది అయితే, నీ అవతారం అనే లీలను రసహీనంగానో లేక, అప్రియంగానో అయి ఉండేది. ఇది నిశ్చయం) అని విభవావతారాలలోని అవినాభావాన్ని, **“శ్రీస్తనాభరణం తేజః శ్రీరంగేశయ మాశ్రయే, చింతామణి మివోద్వాంత ముత్సంగేఽనంతభోగినః”** (శ్రీరంగరాజ-పూర్వ-8) (ఆదిశేషుని ఒడిలో ఉమిసిన మాణిక్యంవలె, పిరాట్టియొక్క స్తనతటాలకు ఆభరణంవలె

శ్రాన్తిశాన్త్యై", "స్మితనయనసుధాభి స్సిఞ్చతీ చన్ద్రికేవ" ఎన్ఱు వ్యూహాన్తర్భావముమ్, "యది మనుజతిరశ్చాం లీలయా తుల్యవృత్తే రనుజను రనురూపా దేవి నావాతరిష్యః, అసరస మభవిష్య న్నర్మ నాథస్య మాత ర్దరదళదరవిన్దోదన్తకాన్తాయతాక్షి", "అనుజను రనురూపరూప చేష్టా న యది సమాగమ మిన్దిరాఽకరిష్యత్, అసరస మథవాఽ ప్రియంభవిష్ణు ధ్రువ మకరిష్యత రఙ్గరాజ నర్మ" ఎన్ఱు విభవాన్తర్భావముమ్, "శ్రియై

---

ఉండే శ్రీరంగనాథుడనే తేజస్సును ఆశ్రయిస్తున్నాను) అని అర్చారూపావినాభావాన్ని, **"శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః, అంగీకారిభి రాలోకైః సార్థయంత్యై కృతోఽంజలిః"** (శ్రీగుణ-1) (సకలచేతనాచేతనాలను సృష్టించడంవల్ల భగవానునకు కలిగే శ్రమను తన అంగీకారాన్ని తెలిపే కటాక్షాలద్వారా సఫలం చేసే లక్ష్మినిగూర్చి అంజలి దాసునిచే చేయబడుతున్నది) అనే ప్రమాణంలోను, **"ప్రళయసమయసుప్తం స్వం శరీరైకదేశం వరద చిదచిదాఖ్యం స్వేచ్ఛయా విస్తృణానః, ఖచిత మివ కలాపం చిత్ర మాతత్య ధూన్వన్ అనుశిఖిని శిఖీవ క్రీడసి శ్రీసమక్షమ్"** (శ్రీరంగ-2-44) (వరాన్ని అనుగ్రహించే స్వామీ! ప్రళయకాలంలో, సంకోచించి ఉండే నీ తిరుమేనిలోని ఒక భాగాన్ని నీ సంకల్పంతో జగద్రూపంగా విస్తరింపజేసి, ఆడునెమలికి ఎదురుగా పలు వర్ణాలను కల పింఛాన్ని విప్పి ఆడే మగనెమలివలె, పిరాట్టి సమక్షంలో నీవు క్రీడిస్తున్నావు) అనే శ్రీరంగరాజస్తవ ఉత్తరశతకశ్లోకంలోను లోకాన్ని సృష్టించడం మొదలైనవానిని చేసేటపుడు స్వామితో చేరి ఉండడాన్ని స్పష్టంగా అనుగ్రహించారుకదా!

**"ఆత్మన్యాత్మా వపుషి చ వపుః వైభవైః వైభవం చేత్యాకారై స్తై రనుగుణతయా సర్వభావానుయాతా, ఇచ్ఛారూపాణ్యపి భగవతః స్వాదయంత్యాత్తరూపా దూరీకుర్యా న్న హి మధురతాం దుగ్ధసింధో స్తరంగాత్"** (భగవత్స్వరూపంలో తన స్వరూపం, అతని దేహంలో తన దేహం, అతని విభూతులలో తనవైభవం అణగిఉండే ఆకారాలతో అతనికి తగినదియై, అతనిని అన్ని దశలలోను అనుసరించేదై, భగవానుని ఇచ్ఛచేత పరిగ్రహింపబడ్డ అవతారరూపాలను, వాటికి తగిన రూపాలను ఎత్తడంద్వారా అనుసరిస్తూ పిరాట్టి ఆనందింపజేస్తుంది. క్షీరాబ్ధిలోని తరంగాలనుండి దాని మాధుర్యాన్ని విడదీయడం సాధ్యం కాదుకదా!) అని భగవానుని, పిరాట్టిని చక్కగా గ్రహించిన అభియుక్తులొకరు భగవానుని స్వరూపం మొదలైన వానితో విశ్లేషించకుండా పిరాట్టి ఉండే స్థితిని కలిపి అనుసంధించారుకదా!

ఈ రీతిలో శ్రుతి-స్మృతి-ఇతిహాస-పురాణాలచేత, వాటిని అనుసరించే దివ్యసూరుల దివ్యప్రబంధాలచేత చెప్పబడే, దివ్యదంపతుల స్వరూపం మొదలైనవానికి



సమస్తచిదిచిద్విధానవ్యసనం హరేః", "యద్భ్రూభఙ్గాః ప్రమాణమ్", "అనుశిఖిని శిఖీవ క్రీడసి శ్రీసమక్షమ్" ఎన్ఱు జగద్వ్యాపారాన్తర్భావముమ్ స్పష్టమాక వరుళిచ్చెయ్‌తారిఱే.

"ఆత్మన్యాత్మా వపుషి చ వపు ర్వైభవై ర్వైభవ ఞ్చేత్యాకారై స్తై రనుగుణతయా సర్వభావానుయాతా, ఇచ్ఛారూపాణ్యపి భగవతః స్వాదయస్యాత్తరూపా దూరీకుర్యా న్న హి మధురతా దుగ్ధసిన్ధో స్తరఙ్గాత్" ఎన్ఱు పిరాట్టిక్కుణ్డాన భగవత్స్వరూపాద్యవినాభావ-సమ్బన్ధత్తై అభియుక్తరుమ్ అనుసన్ధిత్తార్‌కళిఱే.

---

ఒకదానితో వేఱొకటి విడువకుండా ఉండే అవినాభావసంబంధాన్ని ఈ శ్లోకంద్వారా ఆళవన్దార్ అనుగ్రహించారు.

ఈ సందర్భంలో ఈ క్రింది ఆక్షేపం తల ఎత్తుతుంది. ఈ రీతిలో దివ్యదంపతులు ఇద్దఱు ఒకరితో వేఱొకరు విడచి ఉండని దశనుగూర్చి చెప్పేటప్పుడు మొదట అంతటా వ్యాపించిన, విభువైన భగవానుని స్వరూపంతో లక్ష్మీస్వరూపానికి అనురూపమైన సంబంధాన్ని చెప్పవలసి ఉన్నది. ఆవిధంగా చెప్పేటప్పుడు పిరాట్టికూడా స్వరూపంలో అంతటా వ్యాపించిన విభువై ఉంటుంది-అనే ఒప్పుకోవలసి ఉంటుంది. ఈ విధంగా స్వరూపవిభుత్వాన్ని లక్ష్మికి ఒప్పుకొంటేనే ఆమె స్వరూపం భగవానుని స్వరూపంతో తగినదిగా ఉంటుంది-అని చెప్పడానికి వీలున్నది. దీనివల్ల ఈ శ్లోకంలో విశిష్టమైన స్తుతికూడా సిద్ధిస్తున్నది. **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (యజు-4-4-12) (ఈ లోకానికి ఈశ్వరి, విష్ణువుకు పత్ని) అనే ప్రమాణంలో గల **"విష్ణుపత్నీ"** అనే పదం పత్నియొక్క స్వరూపం పతిస్వరూపంతో అనురూపంగా ఉండవలసి ఉన్నది-అని చెప్పబడింది కదా! సర్వవ్యాపకుడు కాబట్టి విష్ణువు అనబడే దేవునకు పత్నిగా ఉండేటపుడు ఈమెకూడా అంతటా వ్యాపించి ఉండాలికదా! **"భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూప"** ఇత్యాది శరణాగతిగద్యం మొదటి చూర్ణికలో భగద్రామానుజులు భగవానుని స్వరూపంతో అనురూపంగా ఉండడం పిరాట్టియొక్క స్వరూపం అని అనుగ్రహించారుకదా!

ఈ విధంగా ప్రమాణం అయిన వేదంవల్ల స్పష్టపడేదై, ప్రమాణాలను తెలిసిన ప్రమాతలైన శ్రీరామానుజులు మొదలగువారిచేత అంగీకరింపబడినదై, యుక్తితో కూడినదైన విభుత్వాన్ని అంగీకరించకుండా పిరాట్టికి అణుత్వాన్ని ఒప్పుకొంటే భగవానుని స్వరూపంలో ఒక భాగాన్నే ఆమె వ్యాపించి ఉంటుందని ఏర్పడుతుంది. ఇది చేతనులందఱికి సాధారణం కనుక ఈ నాల్గవ శ్లోకంలో దానిని చెప్పడంవల్ల పిరాట్టికి

ఆక, ఇప్పడి శ్రుతిస్మృతీతిహాసపురాణఙ్గళాలుమ్, అవఱ్ఱై యడియొఱ్ఱిన వాఴ్వార్కళ్ దివ్యప్రబన్ధఙ్గళాలుమ్ ప్రతిపాదిక్కిఱ దివ్యదమ్పతికళుడైయ స్వరూపాది కళుక్కన్యోన్యముణ్డాన అవినాభావసమ్బన్ధత్తై ఇశ్లోకత్తాలే అరుళిచ్చెయ్‌తారాయ్‌త్తు.

ఇప్పడి ఇరువర్క్కు ముణ్డాన అవినాభావసమ్బన్ధత్తై యరుళిచ్చెయ్‌కిఱవిడత్తిల్, ప్రథమతః విభువాన భగవత్స్వరూపత్తోడే లక్ష్మీస్వరూపత్తుక్కు అనురూపస్వరూపసమ్బన్ధమ్ శొల్లుమళవిల్ పిరాట్టిక్కుమ్ స్వరూపతః విభుత్వ మజ్గీకరిక్కవేణుమ్. స్వరూపవిభుత్వ మజ్గీకరిత్తాలిఱే భగవత్స్వరూపానురూపత్వముమ్, అతిశయాకారేణ స్తుతియుమ్ సిద్ధిప్పతు. పత్నిక్కు పతిస్వరూపానురూప్యావశ్యమ్భావిత్వత్తై శ్రుతియుమ్ సూచిప్పిత్తతిఱే, విష్ణువుక్కు ప్పత్నియావ్బోతు వ్యాపనశీలైయాకవేణుమే. "భగవన్నారాయణాభి-

---

విశిష్టమైన స్తుతి సిద్ధించదు. **"అనురూపరూపవిభవైః"** అని ఇక్కడ చివరలో గల పదంకూడా భగవానుని స్వరూపం మొదలైనవాటిలో ఒక చిన్న భాగంకూడా ఈమె సంబంధం లేకుండా ఉండదు–అని తెలుపుతున్నది, **"సర్వాణి"** అనే మూడవపాదంలోని పదంకూడా అర్థరహితమై పోతుంది.

ఈమె అణువు అయిన స్వరూపాన్ని కల్గినదిగా ఉన్నా, స్వరూపాన్ని విస్తరించే వికాసక శక్తిచే విభువై ఉంటుందని అంటే, అపుడు అదే న్యాయంతో జీవులందఱు అణువై ఉన్నా, స్వరూపవికారాన్ని కలవారు అని ఒప్పుకోవడం దోషం కాకుండా పోవలసి వస్తుంది. "ఆత్మ వికారరహితమైనది" అని చెప్పే ప్రమాణాలకు విరోధం ఏర్పడుతుంది.

ధర్మభూతజ్ఞానంతో పిరాట్టి అంతటా వ్యాపించి ఉంటుంది అనే విషయాన్ని ఈ నాల్గవ శ్లోకంలో చెప్పబడింది–అని అనవచ్చునే –అని అంటే.**"వాలాగ్రశతభాగస్య శతథా కల్పితస్య చ, భాగో జీవ స్స విజ్ఞేయ స్స చానంత్యాయ కల్పతే"** (ధ్యానపు గింజ మొనయొక్క నూఱు భాగాలలో ఒక భాగాన్ని నూఱు భాగాలు చేస్తే, అందులో ఒక భాగం జీవుని పరిమాణమని తెలియదగినది. అతడు ముక్తిని పొందే సమయంలో అయితే జ్ఞానంద్వారా అవధి లేనివాడవుతున్నాడు) అనే శ్వేతాశ్వతరోపనిషత్ వాక్యానుసారం ముక్తిని పొందిన ఆత్మలన్నిటికీ జ్ఞానవ్యాప్తి ఉంటుంది కనుక, పిరాట్టి దీనిని కల్గినదని చెప్పడంలో ఒక అతిశయంగాని, భగవానుని స్వరూపంతో అనురూప్యంగాని సిద్ధించదు. ఒక సమయంలో ముక్తిని పొందినవారివలె కాకుండా, ఎల్లప్పుడూ ముక్తిదశలో ఉండడాన్ని చెబుతుంది. కనుక ఇది సిద్ధిస్తుంది–అని అంటే ఈ అతిశయం నిత్యసూరులకుకూడా ఉన్నది. కనుక, ఈ రెండు పిరాట్టికే అసాధారణాలని



మతానురూపస్వరూపరూప" ఎన్ఱు భగవత్స్వరూపానురూపత్వత్తై భాష్యకారరుమ్ ప్రథమత్తిలే ప్రతిపాదిత్తరుళినారిఱే.

ఇప్పడి ప్రమాణసిద్ధముమాయ్, ప్రమాతృసిద్ధముమాయ్, యుక్తియుక్తముమాన విభుత్వత్తై అజ్గీకరియామల్ అణుత్వత్తై అజ్గీకరిక్కుమ్బోతు, భగవత్స్వరూపైకదేశ-వ్యాప్తియేయిఱే సిద్ధిప్పతు. అతు సకలచేతనసమానమాకైయాలే పిరాట్టిక్కు ఓరతిశయి స్తోత్రమ్ సిద్ధియాతు. "అనురూపవిభవైః" ఎన్గిఱ పదత్తుక్కుమ్ భగవత్స్వరూపాదికళిల్ అల్పదేశమాకిలుమ్ ఇవళాల్ అనన్వితమాయిరుప్పతోరిడమిల్లై యెన్నుమిడత్తై ప్రతిపాదిక్కిఱ "సర్వాణి" ఎన్గిఱ పదత్తుక్కుమ్ వైయర్థ్యముమ్ వరుమ్.

అణుస్వరూపైయాయిరుక్కవుమ్ వికాసశక్తియాలే విభువాయిరుక్కు మెన్నిల్, అప్పోతు సమానన్యాయత్తాలే సకలాత్మాక్కళుక్కుమ్ స్వరూపవికారాంగీకారత్తాలే దోషమిన్ఱియిలే ఒఴియుమ్. ఆత్మనిర్వికారత్వప్రతిపాదకమాన ప్రమాణఙ్గళుక్కుమ్ విరోధమామ్.

---

సిద్ధించదు. "అనురూపంగా ఉండడం, అంటే–భగవానుని స్వరూపంవలె విభువై ఉండకుండా, పిరాట్టి స్వరూపం అణువై ఉన్నందున వైలక్షణ్యం ఉన్నా, స్వతంత్రశేషి అయిన అతని విషయంలో పిరాట్టికి ఉండే శేషత్వం, పారతంత్ర్యం–మొదలైనవాటిచే భగవానునకు అతిశయాన్ని కల్గించడమే" అని అన్నట్లయితే, ఈ అతిశయం జీవులందఱికీ ఉన్నది కనుక, పిరాట్టికి దీనివల్ల ఒక అతిశయమైన స్తుతి సిద్ధించదు.

అంతేకాక, **"నిత్యై వైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ, యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"** అనే శ్రీవిష్ణుపురాణశ్లోకంలోను, **"త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా, త్వయైతత్ విష్ణునా చాంబ జగద్వ్యాప్తం చరాచరమ్"** (విష్ణుపు–1–9–126) (తల్లీ ! అన్ని లోకాలకు నీవు తల్లివి. దేవదేవుడైన హరి తండ్రి. నీ చేత, విష్ణువుచేత ఈ లోకం అంతా వ్యాపింపబడింది) అనే శ్రీ విష్ణుపురాణశ్లోకంలోను పిరాట్టి స్వరూపంతో వ్యాపించి ఉంటుంది–అని సుస్పష్టంగా చెప్పబడి ఉండగా, దానిని ఒప్పుకోకుండా అణుత్వాన్ని అంగీకరించడం ప్రమాణవిరుద్ధం– అనే దోషంకూడా వస్తుంది. కనుక, "భగవానుని స్వరూపంలో ఆనురూప్యం సిద్ధించడంకోసం, పిరాట్టికి ఇక్కడ అతిశయమైన స్తుతిసిద్ధించడంకోసం, ప్రమాణాలు విరుద్ధాలు కాకపోవడంకోసం లక్ష్మి స్వరూపంతోనే అంతటా వ్యాపించి, విభువై ఉంటుంది –అని ఒప్పుకోవలసి ఉన్నది అన్నదే –ఈ ఆక్షేపం. ఈ

ఆకిల్, జ్ఞానవ్యాప్తియై చొల్లుకిఱతెన్నిల్, “వాలాగ్రశతభాగస్య” ఎన్ఱు తొడఙ్గి, “స చానన్త్యాయకల్పతే” ఎన్ఱు ముక్తాత్మాక్కళుక్కుమ్ జ్ఞానవ్యాప్తి యుణ్డాకైయాలే ఇఙ్ఙు ఒరు అతిశయముమ్, అనురూపత్వముమ్ సిద్ధియాతు. ఇవర్కళైప్పోలే ప్రధ్వంసాభావమాత్రమేయిన్ఱిక్కే ప్రాగభావత్తై పఱ్ఱిచ్చొల్లుకైయాలే అతిశయముమ్ అనురూపత్వము సిద్ధిక్కిఱతెన్నిల్, అతు నిత్యర్క్కు ముణ్డాకైయాలే అవై ఇరణ్డుమ్ సిద్ధియాదు. కించ, అనురూపత్వోక్తియాలే అతిశయస్తుతి సిద్ధిక్కిఱతెన్నిల్, అన్ద అనురూపత్వమావతు-అణుత్వత్తిల్ వైషమ్యముణ్డానాలుమ్, స్వతన్త్రశేషియైక్కుఱిత్తు శేషత్వపారతంత్ర్యఙ్గళాలే అతిశయావహత్వమెన్నిల్, అతువుమ్-సకలచేతనాఉ చేతనసమానమాకైయాలే విశేషమ్ సిద్ధియాతు.

కిఞ్చ “యథా సర్వగతో విష్ణు స్తథైవేయం ద్విజోత్తమ, త్వయైతద్విష్ణునా చాంబ జగద్వ్యాప్తం చరాచరమ్” ఇత్యాదికళిలే స్వరూపతో విభుత్వమ్ ప్రసిద్ధమాయిరుక్క

---

ఆక్షేపంలో-అతిశయమైన స్తుతి అన్నది తప్ప మిగిలినది దేశికుల పక్షం.

ఇక, ఈ ఆక్షేపం పొసగదు-సరికాదు. లక్ష్మీస్వరూపాన్ని పరిశీలిస్తే, ఆమె స్వరూపంతో విభువై ఉంటుంది-అని అంగీకరించడానికి వీలు కాదు. ఎందుకు? అని అంటే, **“ఏతద్ జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం నాతః పరం వేదితవ్యం హి కించిత్. భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా, సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేతత్”** (శ్వేతా-1-12) (ఆత్మలో అంతర్యామిగా ఉండే ఈ పరబ్రహ్మ ఎల్లప్పుడూ తెలియదగినది. దీనికంటే తెలియదగినది వేఱొకటి లేదు. అనుభవించే జీవునకు అంతర్యామిగాను, అనుభవింపబడే అచిత్తుకు అంతర్యామిగాను, నియమించేవాడైన తన స్వరూపంతోకూడిన వాడుగాను-ఈ విధంగా బ్రహ్మ మూడు విధాలుగా చెప్పబడుతున్నాడు), **“క్షరం ప్రధానమమృతాక్షరం హరః, క్షరాత్మానా వీశతే దేవ ఏకః”** (శ్వేతా-1-10) (క్షర మనబడేది మూలప్రకృతి. నాశనం లేనివాడు కనుక అక్షరశబ్దవాచ్యుడు భోక్త అయిన జీవుడు. ఈ అచిత్తును, జీవుని ఒక దేవుని ఒక దేవుడు నియమిస్తున్నాడు) అని మొదలైన వేదాంత వాక్యాలలో చిదచిదీశ్వరులనే తత్త్వాలు మూడు అని, ఈశ్వరుడు ఒక్కడే అని ఘోషింపబడడం మన విశిష్టాద్వైతదర్శనంలో అంగీకరింపబడుతున్నది. “ఈ మూడు తత్త్వాలలో లక్ష్మి అచిత్‌తత్త్వంలోనికి చేరినదా! జీవతత్త్వానికి చేరినదా? ఈశ్వరతత్త్వంలో చేరినదా? లేక, ఈ మూడు తత్త్వాలకంటే విలక్షణ అయినదా?” అని వికల్పించి, నిరూపణ చేసినపుడు, అచిత్తు జ్ఞానశూన్యం కనుక, ఈమె జ్ఞానమే మూర్తీభవించిన



తదనఙ్గీకారేణ అణుత్వాఙ్గీకారమ్, ప్రమాణవిరోధముమ్ ప్రసఙ్గిక్కుమ్. ఆక, అనురూపత్వసిద్ధిక్కాకవుమ్, అతిశయితస్తుతిసిద్ధిక్కాకవుమ్, ప్రమాణవైయర్థ్య నివృత్త్యర్థమాకవుమ్, పిరాట్టిక్కు స్వరూపవిభుత్వమ్ అవర్జనీయమాకైయాలే అవశ్య మఙ్గీకార్యమితే ఎన్నిల్,

మైవమ్. లక్ష్మీస్వరూపత్తై నిరూపిక్కు మళవిల్ స్వరూపవిభుత్వమ్ కూడాతు. ఎఙ్ఙనేయెన్నిల్, “భోక్తా భోగ్యం ప్రేరితారఞ్చ మత్వా, “క్షరాత్మానా వీశతే దేవ ఏకః” ఇత్యాది వేదాన్తసిద్ధమాన వర్గఙ్గళ్ నమ్‌దర్శనత్తుక్కు ముణ్డిఱే. ఇవఱ్ఱిల్-“అచిత్తత్త్వాన్తర్భూతైయో? ఈశ్వరత్వాన్తర్భూతైయో? తత్త్వత్రయాతిరిక్తైయో?” ఎన్ఱు

---

జ్ఞాత కనుక, జ్ఞత్వ-అజ్ఞత్వాలు ఒకదానికి వేఱొకటి విరుద్ధాలు కనుక (పొసగవు కనుక), ఈమెను అచిత్తత్వంలోనికి చేర్చడానికి వీలు కాదు. ఈశ్వరతత్వంలో చేర్చవచ్చునా? అని చూస్తే, **“క్షరమ్ ప్రధానమ్”** ఇత్యాది ఉపనిషద్వాక్యంలో లోకాన్ని అంతటినీ నియమించే ఈశ్వరుడు ఒకడే అని ఘోషింపబడడంతోపాటు **“న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే, పరాఉస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ”** (శ్వేత-6-8) (అతని ప్రాకృతం అయిన శరీరం, ఇంద్రియాలు లేవు. అతనికి సాటి వచ్చేవారు, మించినవారు కనబడడం లేదు. ఇతని గొప్ప శక్తి, సహజమైన జ్ఞానబల క్రియలు పలు విధాలుగా వినబడుతున్నాయి) అనే శ్వేతాశ్వతరోపనిషద్వాక్యంలో “ఆపరమాత్మకు సాటి అయినవాడు, మించినవాడు ఎవరూ లేరు” అని చెప్పబడడంతో విరోధిస్తుంది. కనుక ఈమెను ఈశ్వరతత్త్వంలో చేర్చి, ఈశ్వరుడొక్కడే-అని చెప్పడం సాధ్యం కాదు. “ఈమె, భగవానుడు స్వరూపంలో ఒక్కరే” అని చెప్పాలని చూచినా, ఈమె ఈశ్వరుని పత్ని-అని చెప్పే వేదవాక్యాలతో విరోధిస్తుంది. “ఇద్దఱూ ఒక్కరే” అని కొన్ని వాక్యాలలో చెప్పబడినా, భగవానునకు అత్యంతపరతంత్రయై, ప్రకారయై, అతనిని విడచి ఉండనిది-అనే అ వాక్యాలకు అర్థాన్ని చెప్పడం యుక్తం. అంతేకాక, ఈశ్వరుడొక్కడే అని ఒప్పుకొంటే, ఒకరు ఆజ్ఞాపించడానికి, దానిని ఇంకొకరు కాదనడానికి వీలున్నది. కనుక, ఇద్దఱూ ఈశ్వరులు కాకుండా పోవలసి వస్తుంది. ఇద్దఱూ ఈశ్వరులు అని అంటే, ఒకరు ఇంకొకరి లోపల ప్రవేశించి వ్యాపించి నియమించవలసివస్తుంది. ఇది సాధ్యం కాదు. కనుక ఇద్దఱూ ఈశ్వరులు కాకుండా పోవలసివస్తుంది. “చిదచిదీశ్వరులనే మూడు తత్త్వాలకంటే ఈమె విలక్షణ అయినది” అని చెప్పినట్లయితే, ఆవిధంగా మూడు తత్త్వాలకు పైన నాల్గవ తత్త్వం ఒకటి ఉన్నదని ఏ ప్రమాణం లేదు. కనుక, ఆవిధంగా ఒప్పుకొనే వీలు లేదు. అందువల్ల

వికల్పిత్తు నిరూపిక్కుమళవిల్, అచిత్తు జ్ఞానశూన్యమాకైయాలుమ్, ఇవళ్ జ్ఞాతృత్వ విశిష్టైయాకైయాలుమ్, జ్ఞత్వాజ్ఞత్వవిరోధప్రసజ్గత్తాలే అచిత్తత్వాన్తర్భావమ్ కూడాతు. ఈశ్వరద్విత్వప్రసజ్గత్తాలుమ్, "ఈశతే దేవ ఏకః" ఎన్గిఱ ఏకత్వశ్రుతియోడుమ్, "న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే" ఎన్గిఱ సమాధికదరిద్రత్వప్రకాశక శ్రుతియోడుమ్ విరోధమ్ ప్రసజ్గిక్కైయాలుమ్, ఈశ్వరతత్వాన్తర్భావమ్ కూడాతు. భగవదైక్యమ్ శొల్లిల్, పత్నీశ్రుతియోడుమ్, భేదపరమాన శ్రుతియోడుమ్ విరోధమ్ పిఱక్కుమ్. ఐక్యపరజ్గళాన శ్రుతికళ్ అత్యన్తపారన్త్రత్తాలే అవినాభావనిబన్ధనజ్గళ్. భేదప్రతిపాదకజ్గళ్ స్వరూపభేద పరజ్గళ్. కిఞ్చ, ఈశ్వరద్విత్వత్తిల్ అన్యోన్య మాజ్ఞావ్యాఘాతత్తాలే అనీశ్వరత్వముమ్

---

పరిశేషన్యాయంతో మిగిలి ఉన్న "జీవతత్త్వానికి చెందినదే ఈమె"-అనే నిర్ణయమే సిద్ధిస్తుంది

ఈ విధంగా "లక్ష్మి జీవకోటికి చెందినదే" అని సిద్ధించిన తరువాత, **"ఏషో-ఱు రాత్మా చేతసా వేదితవ్యః"** (ముండక-3-1-9) (అణువైన ఈ జీవాత్మ మనస్సుతో తెలియదగినవాడు), **"త్రసరేణుప్రమాణా స్తే రశ్మికోటివిభూషితాః"** (జ్ఞానమయం అయిన కోటిసంఖ్యలోని కిరణాలను కల ఆ జీవులు త్రసరేణువు పరిమాణాన్ని కలవారు) అని జీవాత్మలకు అణుత్వాన్ని లక్షణంగా చెప్పడంచేత, జీవులను అందఱిని తెలిపే మకారం **"మాఙ్-మానే"** (**"మాఙ్"**- అనే ధాతువు పరిమాణాన్ని కల్గి ఉండడాన్ని తెలుపుతుంది) అనే ధాతువునుండి సిద్ధిస్తుంది కనుక, జీవాత్మలు అణుపరిమాణాన్ని కలవారు అని సిద్ధిస్తుంది. కాబట్టి, జీవతత్త్వాంతర్భూత అయిన ఈమెకు అణుత్వం అవర్జనీయం. కనుక స్వరూపవిభుత్వం పొసగదు.

అంతేకాక, "ఈమె జీవకోటిలోకి చేరినదే" అని ఒప్పుకొని, "అయినా ఈమెకు అణుత్వం లేదు, స్వరూప విభుత్వమే ఉన్నది. అణుత్వం అన్నది ఈమెకు తప్ప మిగిలిన జీవుల లక్షణం. జీవుడై ఉన్నా విభువై ఉండడం ఈమెకు లక్షణం." అని చెప్పడం పొసగదు. ఎందుకు? అని అంటే. ఎక్కడెక్కడ జీవత్వం ఉంటుందో అక్కడక్కడ అంతా అణుత్వం ఉన్నది. అందుచేత ఈ విధంగా చెబితే జీవలక్షణం ఈమెలో పొసగదు. అందువల్ల, జీవలక్షణానికి అవ్యాప్తి దోషం వస్తుంది. "విభువై ఉంటూ చేతనుడై ఉండడం" అనే ఈశ్వర లక్షణానికి అతివ్యాప్తి దోషమూ వస్తుంది. జీవులందఱూ అణువులే. **"వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ, భాగో జీవ స్స విజ్ఞేయ స్స చానంత్యాయ కల్పతే"** (శ్వేతా-5-9) అనే ప్రమాణాన్నిబట్టి ముక్తులకు



ప్రసజ్గిక్కుమ్. అతిరిక్తత్వత్తిల్ ప్రమాణ మిల్లామైయాలే తత్వత్రయాతిరిక్తై యెన్న క్కూడాతు. ఇని, పారిశేష్యాత్ జీవతత్వాన్తర్భూతై ఎన్ను మిడమ్ సిద్ధమ్.

అన పిన్బు, "ఏషోఽణురాత్మా", "త్రసరేణుప్రమాణా స్తే రశ్మికోటి విభూషితాః" ఎన్ఱు ఆత్మాక్కళుక్కు అణుత్వత్తై లక్షణమాక చ్చొల్లుకైయాలుమ్, జీవసమష్టివాచకమాన మకారత్తిల్ "మాఙ్-మానే" ఎన్గిఱ ధాతువాల్ ఆత్మాక్కళ్ అణుపరిమాణరెన్ఱు శొల్లుకైయాలుమ్, జీవతత్వాన్తర్భూతైయాన ఇవళుక్కుమ్ అణుత్వమ్ అవర్జనీయమాకైయాలే స్వరూపవిభుత్వమ్ శేరాతు.

కిఞ్చ, జీవతత్వాన్తర్భావత్తై అజ్గీకరిత్తు *అణుత్వానజ్గీకారేణ "అణుత్వస్య ఏతద్వ్యతిరిక్తజీవవిషయత్వేఽపి విభుత్వ మేతద్విషయమ్" ఎన్నిల్; అప్పోతు, జీవత్వ

---

స్వరూపవిభుత్వాన్ని చెప్పకుండా, వారు జ్ఞానంద్వారా వ్యాపిస్తారు-అనే అర్థం గ్రహింపబడింది. ఈ అర్థం **"ప్రదీపవదావేశ స్తథాహి దర్శయతి"** (బ్రహ్మ.సూ-4-4-15) (దీపంవలె దేశాంతరంలోకూడా వ్యాపించి ఉండడం జీవునకు జ్ఞానంద్వారా సాధ్యం. **"వాలాగ్రశతభాగస్య"** ఇత్యాది శ్రుతికూడా ఆ విధంగానే తెల్పుతున్నది కదా) అని బ్రహ్మసూత్రంలోకూడా చెప్పబడిందికదా!

దీనికి పిమ్మట, పిరాట్టికి స్వరూపవిభుత్వం ఒప్పుకొనే తీరాలి-అని కొందఱి ఆక్షేపం. "ముక్తాత్మలు అందఱూ జీవకోటిలోనికి చేరినవారు-అనే విషయం అందఱు అంగీకరించినదే. అందువల్ల వారి స్వరూపం అణువై ఉంటుంది అన్నది కాదనడానికి వీలులేనిది. ఆ అణుత్వాన్ని కాదనే ప్రమాణంకూడా ఏదీ లేదు. అణుత్వాన్ని స్థిరీకరించే ప్రమాణాలు ఉన్నాయి"-అన్నది అందఱూ అంగీకరించినది. అందువల్ల వారికి అణుత్వాన్ని అంగీకరించవచ్చును. పిరాట్టి జీవకోటిలో చేరినది-అని అంగీకరించడంవల్ల సిద్ధించే అణుత్వాన్ని "ఆమె అంతటా వ్యాపించి ఉన్నది" అని తెలిపే ప్రమాణాలు నిషేధిస్తున్నాయి. అందువల్ల ఆమె అణుస్వరూప అని అంగీకరించరాదు"-అన్నది ఆ ఆక్షేపస్వరూపం. ఈ అక్షేపం సరికాదు. పిరాట్టి అంతటా వ్యాపించిన విభువు-అని తెలిపే ప్రమాణాలు ఆమె స్వరూపంతో వ్యాపించి ఉంటుంది-అని తెలిపేవి కావు. విగ్రహంతో ఆమె అంతటా వ్యాపించి ఉంటుంది-అని తెలిపేవే. అందువల్ల ఆ ప్రమాణాలు పిరాట్టి అణుత్వాన్ని నిషేధించేవి కావు.

పిరాట్టికి విభుత్వాన్ని అంగీకరించాలి-అని వాదించేవారు మళ్ళీ ఈ విధంగా బదులివ్వవచ్చు. ప్రమాణాలనుబట్టి ఆమె స్వరూపంతోను విభువై ఉంటుంది-అని

---

* "అణుత్వమేతద్వ్యతిరిక్తజీవవిషయమ్. జీవత్వేపి విభుత్వమ్ ఏతద్విషయమ్" అని పాఠాంతరం.

మణుత్వ వ్యాప్తమాకైయాలే జీవలక్షణత్తుక్కు అవ్యాప్తిదోషమ్ ప్రసజ్గిక్కుమ్. "విభుత్వే సతి చేతనత్వమ్" ఎన్గిఱ ఈశ్వరలక్షణత్తుక్కు అతివ్యాప్తియుమ్ ప్రసజ్గిక్కుమ్. జీవాణుత్వ–ప్రతిపాదికైయాన శ్రుతియోడుమ్ విరోధిక్కుమ్. ఆకైయిఱే, "స చానన్త్యాయ కల్పతే" ఎన్గిఱవిడత్తిలుమ్ ముక్తరుక్కుమ్ స్వరూపవిభుత్వమ్ శొల్లామల్ జ్ఞానవ్యాప్తియై ప్రతిపాదిక్కిఱతు. ఇవ్వర్థమ్ "ప్రదీపవదావేశః" ఇత్యాదిసూత్రత్తిలే ప్రతిపాదిత్తతిఱే.

నను, ముక్తర్క్కు జీవత్వసామ్యత్తాలే అవర్జనీయమాన అణుత్వత్తుక్కు బాధకప్రమాణ మిల్లామైయామ్, తదనుగ్రాహకప్రమాణసద్భావత్తాలుమ్ అణుత్వ మజ్గీకరిక్కలామ్. పిరాట్టిక్కు జీవత్వసామ్యాకారత్తాలే ప్రాప్తమాన వణుత్వత్తుక్కు తద్వ్యాపకప్రమాణమ్. బాధకమాకైయాలే, అణుత్వమ్ కూడాదే? యెన్నిల్; మైవమ్,

---

అంగీకరించడంలో ఏ అడ్డూ లేనపుడు, ఆ ప్రమాణాలకు విగ్రహవ్యాప్తి వ్యాప్తిని చెబుతున్నదని సంకోచించి అర్థాన్ని గ్రహించడం తగదు. అందువల్ల పిరాట్టిని అణువుగా గ్రహించడానికి ఆమె "విభువు" అని తెలిపే ప్రమాణాలు అవరోధాలే అవుతాయి. అన్నది వారి వాదం. దీనిని ఈ విధంగా తిరిగి సమాధానించవచ్చు. ఇద్దఱు విభువులను ఒప్పుకోవడంద్వారా "ఈశ్వరుడు ఒక్కడే" అని చెప్పడంకూడా వీరి పక్షానికి గొప్ప అడ్డు అవుతుంది. అందువల్ల పిరాట్టి అణుస్వరూప–అని ఒప్పుకొనే తీరాలి.

దీనికి పిమ్మట పిరాట్టి విభుత్వాన్ని అంగీకరించేవారి బదులు ఈ విధంగా ఉంటుంది. కాలం (ధర్మభూతజ్ఞానం) మొదలైన కొన్ని తత్త్వాలను విభువు అని ఒప్పుకొన్నా "ఈశ్వరుడు ఇద్దఱు" అని అంగీకరించినట్లు కాదు. అందువల్ల అది పిరాట్టి స్వరూపవిభుత్వానికి అడ్డు కాదు. దీనికి సిద్ధాంతపక్షంలో సమాధానం ఏమంటే–"కాలం మొదలైనవానికి విభుత్వం ఉన్నా, ఇద్దఱు ఈశ్వరులున్నారనే దోషం రానట్లే" అని వీరు చెప్పే దృష్టాంతం పొసగదు. ఎందుకు? అని అంటే, "జ్ఞానానికి ఆశ్రయంగా ఉండకుండా విభువై ఉండడం" అన్నదికదా అచేతనం అయిన కాలం మొదలైనవాని లక్షణం. చైతన్యానికి ఆశయమై, విభువై ఉండడం ఈశ్వర లక్షణం. అందువల్ల చైతన్యాన్ని కల్గిన పిరాట్టికి విభుత్వాన్ని అంగీకరిస్తే ఇద్దరు ఈశ్వరులు అనే దోషం వస్తుంది. అందుచేత పిరాట్టికి "అణువై ఉండి, జ్ఞానాశ్రయయై ఉండడం" అనే జీవలక్షణమే పొసగుతుంది.

దీనికి పిమ్మట, పిరాట్టికి విభుత్వాన్ని ఒప్పుకొనే వారు ఈ విధంగా అనవచ్చు. **"ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ"** ఇత్యాది గీతాప్రమాణంలో **"యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః, ఉత్తమః పురుష స్త్వన్యః"** (భ.గీ–15–6)



తద్విభుత్వప్రమాణజ్గళ్ స్వరూపవిభుత్వపరజ్గళన్ఱిక్కే విగ్రహవ్యాప్తిప్రతిపాదకళాకైయాలే తదణుత్వబాధకజ్గళల్లవిఱే యెన్నై.

నను, యథాప్రమాణమ్ తద్విభుత్వాజ్గీకారత్తిల్ బాధకమిల్లామలిరుక్కవుమ్, ప్రమాణజ్గళుక్కన్యార్థమ్ కల్పిక్కై యుక్త మల్లామైయాలే, తద్విభుత్వప్రమాణజ్గళ్ తదణుత్వే బాధకజ్గళిఱేయెన్నిల్, *మైవమ్, విభుద్వయాసమ్భవమే ఇవ్విడత్తిల్ బాధకమాకైయాలే అణుత్వ మవర్జనీయ మెన్నై.

నను, కాలాదికళుక్కు విభుత్వ ముణ్డాయిరుక్కవుమ్ ఈశ్వరద్విత్వమ్ వారాతాప్పోలే, లక్ష్మీవిభుత్వత్తిలుమ్ ఈశ్వరద్విత్వముమ్ ప్రసజ్గియామైయాలే అతు విరోధ మన్ఱే? యెన్నిల్, "కాలాదికళుక్కు విభుత్వ ముణ్డాయిరుక్కవుమ్ ఈశ్వరద్విత్వమ్ వారాతాప్పోలే"–యెన్గిఱ దృష్టాన్తమ్ శేరాతు. ఎజ్గనే? ఎన్నిల్, "చైతన్యానాధారత్వే సతి

---

అనే గీతాప్రమాణంలో "అన్ని వస్తువులను వ్యాపించి ఉండడంచేత, అంతటినీ నియమించడంచేత ఈశ్వరుడు జీవునికంటె విలక్షణుడు" అని నిరూపింపబడింది. **"నిత్యైవైషా జగన్మాతా"** ఇత్యాది శ్రీవిష్ణుపురాణప్రమాణంలోని **"యథా సర్వగతో విష్ణు స్తథైవేయం ద్విజోత్తమ"** (విష్ణుపు.–1–8–17) అనే ప్రయోగం పిరాట్టి సర్వత్ర వ్యాపించి ఉంటుందని తెలుపుతున్నది. **"ఈశ్వరీం సర్వభూతానాం త్వాపమిహోహ హ్వయే శ్రియమ్"** (శ్రీసూక్తమ్–9) అనే ప్రమాణం "ఈ లక్ష్మి సర్వభూతాలకు ఈశ్వరి" అని తెలుపుతున్నది. ఈ రెండు ప్రమాణాలవల్ల పిరాట్టి అన్ని వస్తువులలో వ్యాపించి ఉన్నదని, వాటిని నియమిస్తున్నదని తెలుస్తున్నది. ఈ రెండు గొప్పతనాలనుబట్టి పూర్వం ఉట్టంకించిన గీతాశ్లోకాలు రెండింటిలో భగవానుడు జీవులకంటె అన్యుడు అని నిర్ణయించినట్లే, లక్ష్మికూడా జీవులకంటె వేఱయినది అని సాధించవచ్చునుకదా! ఏవిధంగా అంటే, అయిదు అవయవాలనుకల ఈ క్రింది అనుమానంతో దీనిని సాధించవచ్చును. "ఈ పిరాట్టి జీవకోటిలోనికి చేరినది కాదు. ఎందుకంటే, అన్నిటిలో వ్యాపించేదై ఉండడంచేత. అందటినీ నియమించేదై ఉండడంచేత. ఈశ్వరునివలె, అందువల్ల ఈ పిరాట్టికూడా" ఈ అనుమానంలో హేతువుగా చెప్పబడ్డ రెండు అతిశయాలను కల్గినదై ఉండడంవల్ల ఈమెకూడా ఈశ్వరియే అవుతుంది అని, ఈ విధంగా ఈ అనుమానంతో ఈ పిరాట్టి జీవాత్మ కంటే వేఱు అని సాధించడంవల్ల, జీవకోటికి చెందిన అణుత్వంకూడా ఈమెకు లేకుండా పోతుంది. అంతేకాక, పిరాట్టి భగవానునియొక్క స్వరూపాన్ని నిరూపించేదిగా ఉండడంచేత, శ్రియఃపతియే (శ్రీదేవితో కూడి ఉండే నారాయణుడే) అన్నిటినీ వ్యాపించి

---

* "మైవమ్" అనే పదం ద్రావిడలిపిప్రతిలో లేదు.

విభుత్వమ్'' ఎన్గిఱదితే *కాలలక్షణమ్. ''చైతన్యాధారత్వే సతి విభుత్వమ్'' ఈశ్వరలక్షణమాకైయాలే, చైతన్యవిశిష్టైయాన వివళుక్కు విభుత్వమ్ కొళ్ళిల్, ఈశ్వరద్విత్వమ్ ప్రసజ్గిక్కైయాలే, ఇవళుక్కు అణుత్వమే అసాధారణ లక్షణ మెన్న త్తట్టిల్లై.

నను, "యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః", "ఉత్తమః పురుస్త్వన్యః" ఎన్ఱు సర్వవ్యాపకత్వత్తాలుమ్, సర్వనియన్తృత్వత్తాలుమ్ ఈశ్వరనుక్కు జీవాన్యత్వమ్ సాధిత్తాప్పోలే, "యథా సర్వగతో విష్ణు స్తథైవేయం ద్విజోత్తమ", "ఈశ్వరీం సర్వభూతానామ్" ఇత్యాదిప్రమాణసిద్ధజ్గళాన సర్వవ్యాపకత్వ-నియన్తృత్వజ్గళాలే పిరాట్టిక్కు జీవజాత్యన్తర్భావమ్ సాధిక్కలామితే. ఎజ్గనే? ఎన్నిల్, "నేయ మాత్మజాత్యంతర్భూతా, కుతః-సర్వవ్యాపకత్వాత్, సర్వనియన్తృత్వాత్; యథా-ఈశ్వరః, తథా చేయమ్ తస్మాత్త

ఉంటాడు-అని ఒప్పుకోవలసి ఉన్నది. నిరూపింపబడే భగవానుని స్వరూపం, ఆ స్వరూపాన్ని నిరూపించే పిరాట్టి స్వరూపం రెండూ కొంచెంకూడా భేదం లేకుండా కలిసే ఉండవలసి ఉన్నది. కనుక, నిరూపింపబడే భగవానుని స్వరూపానికిగల విభుత్వం నిరూపించే ఈమెయొక్క స్వరూపానికి ఒప్పుకొనే తీరాలి. నిరూపింపబడే ఘటం ఉన్నచోట అంతా, దాన్ని నిరూపించే ఘటత్వం ఉంటుందికదా! ఈ రీతిలో భగవానుని స్వరూపానికి నిరూపకగా ఉండడంవల్ల పిరాట్టికి కాదనడానికి సాధ్యం కాని, తనకు తానే సిద్ధించే స్వరూపవిభుత్వం అవశ్యం అంగీకరించవలసినది. కనుక, ఈమెను అణువుగా చెప్పడం పొసగదు.

ఈ ఆక్షేపానికి ఈ క్రింది సమాధానాన్ని చెప్పవచ్చు. "ఈ ఆక్షేపం సరికాదు. ఇక్కడ భగవానుని దృష్టాంతంగా చూపి, పిరాట్టికి స్వరూపవిభుత్వాన్ని సాధించాలని ప్రయత్నించడం ఇద్దఱికి సామ్యం లేనందువల్ల పొసగదు. స్వరూపంతో అంతటా వ్యాపించి ఉండడంచేతను, అన్నిటినీ నియమించడంచేతనుకదా సర్వేశ్వరుడు జీవులకంటే భిన్నుడు-అని గీతలో సాధింపబడింది. అతనిని దృష్టాంతంగా గ్రహించి, పిరాట్టి అనే దార్ష్టాంతికంలో ఆ స్వరూపవిభుత్వాన్ని సాధించడం సాధ్యం కాదు. ఎందుకంటే, పిరాట్టివద్ద అంతటా వ్యాపించి ఉండడం అనే స్వరూపవిభుత్వం లేదు. అందఱినీ ఆమె నియమించడమూ లేదు. ఏవిధంగా అని అంటే-పిరాట్టి స్వరూపంలో విభువుగా ఉంటుంది అని చూపడంకోసం ఉట్టంకింపబడ్డ **"యథా సర్వగతః"** అని ప్రారంభం అయే శ్రీవిష్ణుపురాణశ్లోకం ఆమె విగ్రహంతో అంతటా వ్యాపించి ఉంటుంది-అని

* "కాల" అనే పదం తెలుగుప్రతిలో లేదు.



థేతి" ఎన్ఱు పఞ్చావయవమాన అనుమానత్తాలే ఆత్మతత్త్వాన్యత్వమ్ సాధిత్తు, అత ఏవ తజ్జాతీయత్వాఽ గతాణుత్వమ్ నివృత్తమాకైయాలుమ్, "శ్రియఃపతియే సర్వవ్యాపక వస్తు" ఎన్ఱఙ్గీకరిక్కవేణ్డుకైయాలుమ్, నిరూప్యనిరూపకాఽ వినాభావసమ్బన్ధనిబంధమాక నిరూప్య స్వరూపత్తుక్కుణ్డాన విభుత్వమ్ తన్నిరూపకస్వరూపత్తుక్కుమ్ అవర్జనీయమాయ్ క్కొణ్డు తన్నడైయేవరుకైయాలుమ్, ఇవళుక్కుమ్ స్వరూపతో విభుత్వమ్ న్యాయతః ప్రాప్తమాకైయాలే అణుత్వపక్షమ్ అయథార్థమితే-యెన్నిల్;

మైవమ్. ఇవ్విడత్తిల్ దృష్టాన్తయుక్తదార్ష్టాన్తికజ్గళ్ సదృశజ్గళన్ఱితే. స్వరూపవిభుత్వత్తాలుమ్, సర్వనియన్తృత్వత్తాలుమితే సర్వేశ్వరనుక్కు జీవాన్యత్వత్తై సాధిత్తతు. దార్ష్టాన్తికత్తిల్ అన్ద హేతుద్వయ మిల్లైయితే. ఎజ్గనే యెన్నిల్, పిరాట్టిక్కు

చూపుతుంది. కాబట్టి స్వరూప విభుత్వం అనే హేతువు ఆమె విషయంలో పూర్తిగా లేదు అందువల్ల "స్వరూపాసిద్ధం" అనే లక్షణదోషం వస్తుంది.

ఆ విష్ణుపురాణశ్లోకం విగ్రహవ్యాప్తినే చెబుతుంది-అని చెప్పడం ఏ విధంగా? అని అంటే, **"క్షీరోదా చ్ఛ్రీ సముత్పన్నా శ్రూయతేఽమృతమంథనే, భృగోః ఖ్యాత్యాం సముత్పన్నే త్యేతదాహ కథం భవాన్"** (విష్ణుపు.-1-8-16) (అమృతాన్ని చిలికిన సమయంలో పాలకడలినుండి శ్రీదేవి అవతరించింది అని చెప్పబడుతున్నది. భృగువుకు ఖ్యాతి అనే భార్యవల్ల పుట్టినట్లుగా నీవు ఏ విధంగా అంటున్నావు? ) అనే విష్ణుపురాణ శ్లోకంలో పిరాట్టి క్షీరాబ్ధిలో పుట్టింది అని, భృగుమహర్షికి పత్ని అయిన ఖ్యాతికి పుత్రికగా పుట్టిందని శ్రీపరాశమహర్షి ఉపదేశించగా వినిన అతని శిష్యుడైన మైత్రేయుడు "లక్ష్మీదేవి ఎల్లప్పుడూ ఉంటుంది" అన్నది ప్రమాణప్రసిద్ధం. అటువంటి లక్ష్మి క్షీరాబ్ధినుండి అవతరించింది అని, భృగువు-ఖ్యాతులకు పుత్రికగా జన్మించింది అని మీరు చెప్పడం ఆమె నిత్యమై ఉంటుంది అనే దానికి పొసగలేదే! "అనే ప్రశ్నను అడుగగా, దానికి సమాధానంగా శ్రీ పరాశరులు **"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ, యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"** (విష్ణు.పు-1-8-17) అనే శ్లోకాన్ని పలికారు. దీని అర్థం ఏమంటే- "**నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్**" (శ్వేతా-6-13) (నిత్యులై ఉండే సకలచేతనులమధ్య వారిని అనుగ్రహిస్తూ ఉండే నిత్యచేతనుడు) అని, **"అవ్యయః పితా"** (శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రమ్) (అందఱికి నశించని తండ్రిగా ఉండేవాడు) అని ఘోషింపబడే సర్వేశ్వరుడు సాధువులను కాపాడడం కోసం దేవతలు, మానవులు మొదలైన అన్ని జాతులలో అవతరించి, **"తమరుకన్దదు ఎవ్వురువమ్ అవ్వురువమ్తానే"**

ఆత్మజాత్యనన్తర్భావసాధకఙ్గళాక చ్చొన్న హేతుద్వయత్తిల్ ప్రథమహేతు విగ్రహవ్యాప్తి విషయమాకైయాలే స్వరూపాఽ సిద్ధమ్.

అఙ్గు విగ్రహవ్యాప్తియై చ్చొల్లుకిఱతెన్గెక్కు ద్యోతకమెన్? ఎన్నిల్, "క్షీరోదా ద్ఛ్రీ స్సముత్పన్నా శ్రూయతేఽ మృతమన్థనే, భృగోః ఖ్యాత్యాం సముత్పన్నేత్యేతదాహ కథం భవాన్" ఎన్ఱు, "శెÇఙ్గడలముతినిఱ్పిఱన్దా" ళెన్ఱుమ్, భృగుపత్నియాన ఖ్యాతియినిడత్తిఱ్పిఱన్దాళెన్ఱుమ్, పరాశరభగవానుపదేశిక్క క్కేట్ట మైత్రేయభగవాన్, నిత్యైయాన లక్ష్మిక్కు ఉత్పత్తిమత్త్వముణ్డానాల్ నిత్యత్వమ్ కూడుమ్బడి యెఙ్గనే? యెన్ఱు ప్రశ్న మ్బణ్ణ, అదఱ్కు ఉత్తరమాక "నిత్యై వైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ,

---

(ముదల్ తిరు-44) (భక్తులు ఇష్టపడిన రూపంఏదో ఆ రూపాన్ని తాను పొందుతాడు), **"ఉమరుకన్దుకన్ద ఉరువమ్ నిన్నురువమ్"** (తిరువాయ్-8-1-4) (భక్తులు అభిమానించిన రూపం నీరూపంగా) అనే రీతిలో దాసులు ఇష్టపడిన ఆయా తిరుమేనులను పరిగ్రహించి, అన్ని దేశాలలో, అన్ని కాలాలలో, అన్ని అవస్థలలో ఏ ఏ రీతులలో అవతరించాడో, నిత్యయై, అతని సంపదయై, లోకమాతయై ఉండే ఈ దేవేరికూడా ఆయా రీతులలోనే ఆ భగవానుని అతనిని విడచి ఉండకుండా, లోకానికి తల్లి అయినందువల్ల కల్గి ఉన్న వాత్సల్యంచేత అవతరించి, అతని రూపాలకు అనురూపం అయిన ఆయా రూపాలను పరిగ్రహించి, అన్ని చోట్ల వ్యాపించి ఉంటుంది. అందువల్ల, ఈమె క్షీరాబ్ధినుండి భృగుపుత్రికగా అవతరించింది అన్నది అవతారమే కాబట్టి, ఈమె నిత్యత్వానికి విరుద్ధం కాదు. కర్మచేత ఈమె జన్మిస్తే అది దోషం అవుతుంది. అనుగ్రహంవల్ల సంభవించే అవతారం కాబట్టి అది గుణాన్నే కలుగజేస్తుంది-అన్నది సమాధాన తాత్పర్యం. కనుక ఈమెను శ్రీవిష్ణుపురాణశ్లోకంలో **"సర్వగతా"** అని నిర్దేశింపబడింది, ప్రశ్న-సమాధానాలను గమనించినపుడు అవతారరూపం అయిన విగ్రహవ్యాప్తినే చెబుతుంది-అని గ్రహించవలసి ఉంది.

ఇంతేకాక, "**పునశ్చ పద్మా సంభూతా హ్యాదితో భూద్యథా హరిః, యదా తు భార్గవో రామ స్తదాసీద్ధరణీత్వియమ్, రాఘవత్వేఽ భవత్ సీతా**" అని, "**దేవత్వే దేవదేహేయమ్**" అని ఈమె విగ్రహవ్యాప్తి ప్రతిపాదింపబడింది. **"సౌమ్యాసౌమ్యైః జగద్రూపైః త్వయైతత్ దేవి పూరితమ్"** (విష్ణుపు.-1-9-121) (దేవీ! అందమైనవి, క్రూరమైనవి అయిన రూపాలతో ఈ లోకం నీచే వ్యాపింపబడి ఉన్నది) అని దీనినిపైన వివరించేటపుడు విగ్రహవ్యాప్తి స్పష్టంగా చెప్పడంచేత **"త్వం మాతా సర్వలోకానాం**



యథా సర్వగతో విష్ణు స్తథైవేయం ద్విజోత్తమ" ఎన్ఱు ఉపదేశిత్తాన్. అతెఙ్గనే యెన్నిల్; "నిత్యానాం నిత్యనాయ్", "అవ్యయః పితావాన సర్వేశ్వరన్ సాధుపరిత్రాణార్థమాక సర్వజాతియిలుమ్ అవతరిత్తు,"తమరుకన్ద తెవ్వురువ మవ్వురువన్దానే", "ఉమరుకన్దుకన్ద వురువమ్ నిన్నురువమ్" ఎన్గిఱపడియే ఆశ్రితరుకన్ద వవ్వో తిరుమేనికళాలే సర్వదేశ-సర్వకాల-సర్వావస్థైకళిలుమ్ యాతొరుపడి సన్నిహితనాకిఱాన్, అప్పడియే "నిత్యైయాయ్, జగన్మాతావాయ్, విష్ణువుక్కు సమ్పద్రూపైయాయ్, అనపాయినియా-యిరుక్కిఱ ఇవళుమ్ మాతృత్వప్రయుక్తమాన వాత్సల్యత్తాలే అవతరిత్తు, తద్రూపానురూపఙ్గళాన వవ్వో రూపవిశేషఙ్గళాలే సర్వత్ర సన్నిహితైయాయిరుక్కుమ్. ఆకైయాల్ ఉత్పత్తిమత్త్వమ్ నిత్యత్వభఞ్జక మన్ఱు కర్మకృతోత్పత్తియాకిలిఱే దోషాయవావతు. అనుగ్రహార్థమాన వవతారమ్ గుణాయ వామిత్తనై"-ఎన్ఱు ప్రతివచనమ్ పణ్ణుకైయాలే సర్వవ్యాపిత్వవచన మర్థాన్తరవిషయమ్.

---

**దేవదేవో హరిః పితా, త్వయైతత్ విష్ణునా చాంబ జగద్వ్యాప్తం చరాచరమ్"** (విష్ణుపు.-1-9-126) అనే ప్రమాణంలో **"త్వయైతత్ విష్ణునా చాంబ జగద్వ్యాప్తం చరాచరమ్"** (నీచే, విష్ణువుచేత చరాచరూపం అయిన ఈ లోకం వ్యాపింపబడింది) అని భగవానునకు, ఈమెకు వ్యాప్తిని చెప్పినది విగ్రహవ్యాప్తినిబట్టియే-అని గ్రహించాలి, అందువల్ల ఈ పిరాట్టికి స్వరూపవ్యాప్తి లేదని, విగ్రహవ్యాప్తియే ఉన్నదని నిర్ణయింపబడినట్లయింది.

అంతేకాక భగవానుడు, పిరాట్టి ఇద్దఱు స్వరూపంతో అంతటా వ్యాపించి ఉంటారు-అని అంటే,-"**దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవాన్ హరిః, స్త్రీనామ్నీ లక్ష్మీ ర్మైత్రేయ నానయో ర్విద్యతే పరమ్**" (విష్ణు.పు-1-8-35) (మైత్రేయా! దేవతలు, పశుపక్ష్యాదులు, మానవులు-అనే జీవరాసులలో పురుషులు అంతా భగవానుడైన హరి అంశాన్ని కల్గి ఉన్నారు. స్త్రీలు అందఱూ లక్ష్మి అంశ)-అని వీరిద్దఱి విభూతులను విడదీసి పల్కి, **"అర్థో విష్ణు రియం వాణీ"** (విష్ణుపు-1-8-36) (భగవానుడు అర్థం, ఈమె ఆ అర్థాన్ని చెప్పే శబ్దం) అని ప్రారంభించి, వీరి విభూతులను వివరించే సూక్తి అర్థరహితం అవుతుంది. అందువల్ల "అంతటా వ్యాపించి ఉన్నందున పిరాట్టి జీవులకంటే వేఱయినది" అనే హేతువు వీరి విషయంలో పొసగదు.

అందఱినీ నియమించేది కనుక ఈమె జీవులకంటె వేఱయినది అని చెప్పిన రెండవ హేతువుకూడా భాగాసిద్ధం అనే దోషం కల్గి ఉండడంవల్ల సాధ్యాన్ని సాధించగల్గిన

ఇవ్వళవన్టిక్కే, "పున శ్చ పద్మా సముద్భూతా హ్యాదితోఽభూ ద్యదా హరిః, యదా తు భార్గవో రామ స్తదాసీద్ధరణీ త్వియమ్, రాఘవత్వేఽభవత్సీతా", "దేవత్వే దేవదేహేయమ్" ఇత్యాదికళాలే మేలుమ్ ఇన్ద విగ్రహవ్యాప్తియే ప్రతిపాదిక్కప్పట్టతితే. "సౌమ్యాసౌమ్యై ర్జగద్రూపై స్త్వయైతద్దేవి పూరితమ్" ఎన్టు మేలే వివరిక్కైయాలే, ''త్వయైంతద్విష్ణునా చావ్బ జగద్వ్యాప్తం చరాచరమ్'' ఎన్గిఱతుమ్-విగ్రహవ్యాప్తివిషయమ్. ఆకైయాలే, ఇవళుక్కు స్వరూపవ్యాప్తి పరిహారేణ విగ్రహవ్యాప్తియే ఉళ్ళతెన్టు నిర్ణీతమాయ్త్తు.

కిఞ్చ, ఇరువర్క్కుమ్ స్వరూపవ్యాప్తియై చ్చొల్లిల్, "దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవా న్హరిః , స్త్రీనామ్నీ లక్ష్మీ ర్మైత్రేయ నాఽనయో ర్విద్యతే పరమ్, అర్థో విష్ణు రియం వాణీ" ఎన్ఱ విభూతివిభాగవిరోధమ్ ప్రసజ్జిక్కుమ్.

ద్వితీయహేతువాన సర్వనియన్తృత్వమ్ భాగాసిద్ధమాకైయాలే సాధ్యసాధక సద్ధేతు వన్టు. ఎజ్ఞనే? యెన్నిల్; సకలపురుషనియన్తృత్వత్తైయిటే అజ్గు పురుషతత్వాన్యత్వ

---

సద్ధేతువు కాదు. ఏవిధంగా అంటే-ముందు ఉట్టంకించిన గీతాశ్లోకంలో పురుషులను అందఱినీ నియమించేవాడై ఉండడం అనేదే, జీవులకంటే వేఱయినవాడు అనేదానికి కారణంగా చూపబడింది. ఈ విధంగా అందఱినీ నియమించేదిగా ఉండడం అనేది పిరాట్టికి పొసగదుకదా! భగవానుని తప్ప మిగిలినవారినికదా ఈమె నియమించగలదు. అందులోను లోపల ప్రవేశించి వ్యాపించి నియమించలేదు. ఈ నియంతృత్వాన్ని మాత్రం పురస్కరించుకొని ఈమె జీవకోటిలోనికి చేరినది కాదు -అని అంటే, చేతనులందఱూ జీవకోటిలో చేరినవారు కారు-అని చెప్పవలసి వస్తుంది. ఒక్కొక్క చేతనుడు కనీసం తన శరీరాన్ని అయినా నియమిస్తూకదా ఉన్నాడు.

అందువల్ల ఈ విధంగా, ''పిరాట్టి జీవకోటిలోనికి చేరనిది'' అని నిర్ణయించడానికి కారణంగా చెప్పిన రెండు హేతువులు ఇక్కడ సరికావు. కనుక, భగవానుని స్వరూపాన్ని నియమించే ఈమె, ఈమెచే నియమింపబడే భగవానుడు-అని విభజింపబడి ఉండకపోయినా, ఈమె స్వరూపంతో నియమింపబడ్డ భగవానుని స్వరూపంతోనే అంతట వ్యాపించి ఉండడం అనే అతిశయం చెప్పబడడంచేత, ఈమెను జీవకోటిలోనికి చేరినది-అనే చెప్పాలి. ఆ విధంగా జీవకోటిలోనికి చేరినందువల్ల సిద్ధించే అణుత్వాన్ని స్వరూపంగా కల ఈమెకు, స్వరూపంతో విభువై ఉండే భగవానునకువలె స్వరూపవ్యాప్తి లేదు-అని ఇందుచేత నిర్ణయింపబడింది.



సాధకమాక చ్చొల్లిరయ్. అన్ద సర్వనియన్తృత్వమ్ ఇవళుక్కు క్కూడాతితే. ఏకోననియన్తృత్వ మితే ఇవళుక్కుళ్ళతు. అతుతన్నిలుమ్ అన్తఃప్రవిశ్య నియన్తృత్వ మిల్లైయితే. తావన్మాత్రత్తాలే ఆత్మజాత్యన్తర్భావమ్ కొళ్ళుమ్బోతు సర్వర్క్కుమ్ అపుంస్త్వమ్ ప్రసజ్గిక్కుమ్. స్వశరీరమాత్రత్తుక్కుమ్ అనీశనాయిరుప్పా నొరువ నిల్లైయితే.

ఆక, ఇప్పడి ఆత్మతత్త్వాన్యత్వసాధకజ్గళాన హేతుద్వయముమ్ అసిద్ధజ్గళాకైయా లేయుమ్, నిరూప్యనిరూపకజ్గళుక్కు అవినాభావముణ్డాకిలుమ్, లక్ష్మీస్వరూప నిరూపితభగవత్స్వరూపత్తుక్కే వ్యాప్తిశొల్లుకైయాలే జీవతత్వాన్తర్భూతైయాయ్, తజ్జాతీయత్వేన ప్రాప్తమాన అణుత్వత్తై స్వరూపమాకవుడైయ వివళుక్కు స్వరూపతో విభువాన వీశ్వరనైప్పోలే స్వరూపవ్యాప్తి యిల్లై -ఎన్టు నిర్ణయిక్కప్పట్టతు.

---

ఇట్లయినా, **"యద్బ్రహ్మ రూపమ్ తత్తే అనురూపరూపవిభవైః గాఢోపగూఢాని"** అని అన్నిటిలో వ్యాపించి ఉండే భగవానుని స్వరూపంతోటి దానిని నిరూపించే లక్ష్మీస్వరూపం గాఢంగా కలసి ఉన్నది" అని ఆళవన్దార్ అవినాభావసంబంధాన్ని అనుగ్రహించడంవల్ల, భగవానుని స్వరూపం ఉన్నచోట అంతా ఈమె స్వరూపం ఉన్నది అని అంగీకరించవలసి ఉన్నది. కనుక, ఆ స్వరూపవిభుత్వం అణువైన ఈమెకు ఏ విధంగా పొసగుతుంది? అని. పరన్దరహస్యంలో పెరియవాచ్చాన్ పిళ్ళై ఈ విషయంలో ఈ క్రింది నిర్ణయం చేశారు. అనుపపద్యం అయిన అర్థద్వయదర్శనంలో ఉపపద్యమానం అయిన అర్థాంతరకల్పనం-అర్థాపత్తి (ఒకదానితో వేఱొకటి పొసగని రెండు అర్థాలు కన్పించినపుడు వాటిని పొసగేటట్లు చేయడం కోసం వేఱొక (మూడవ) అర్థాన్ని కల్పించడం అర్థాపత్తి) అన్నది అర్థాపత్తి లక్షణం. దీనికి చెప్పబడే దృష్టాంతం ఏమంటే-**"పీనో దేవదత్తో దివా న భుంక్తే"** (బలిసి ఉన్నవాడైన దేవదత్తుడు పగలు భుజించడు) ఇందులోని రెండు అర్థాలు (బలిసి ఉండడం, పగలు భుజించక పోవడం) ఒకదానితో ఇంకొకటి పొసగవు. కనుక, వీనిని పొసగేటట్లు చేయడంకోసం "అతడు రాత్రి భుజిస్తాడు" అనే అర్థాంతరాన్ని కల్పించడమే అర్థాపత్తి ప్రమాణం అదేరీతిలో ''పిరాట్టి అణుస్వరూపాన్ని కల్గినదై ఉన్నా, ముందు తెల్పిన అర్థాపత్తి ప్రమాణంతో కల్పించబడిన అఘటితఘటనాశక్తిచేత విభువైన ఈశ్వరస్వరూపం ఉన్న చోట అంతా ఈమెకూడా వ్యాపించి ఉంటుంది-అన్నదే ఆళవన్దార్ ఈశ్లోకంలో అనుగ్రహిస్తున్నారు'' అని గ్రహించడంలో విరోధం లేదు.

ఏవిధంగా అంటే-**"అణో రణీయాన్ మహతో మహీయాన్ ఆత్మా గుహాయాం నిహితోఽస్య జంతోః, త మక్రతుం పశ్యతి వీతశోకో ధాతు ప్రసాదా న్మహిమాన**

ఆకిల్, "యద్బ్రహ్మ రూపం తత్తే అనురూపరూపవిభవై ర్గాఢోపగూఢాని" ఎన్ఱు సర్వవ్యాపకస్వరూపత్తోడే తన్నిరూపకభూతైయాన లక్ష్మీస్వరూపత్తుక్కు అవినాభావసమ్బన్ధమ్ శొల్లుకైయాలే "సన్నియోగశిష్టన్యాయ" సిద్ధమాన స్వరూపవిభుత్వమ్ ఇవ్విడత్తిల్ శేరుమ్బడి యెజ్గనే? ఎన్నిల్, ఇప్పడి అనుపపద్యమానార్థ దర్శనత్తాలే ఉపపద్యమానార్థాన్తరత్తై క్కల్పిక్కైయాకిఱ అర్థాపత్తిప్రమాణసిద్ధమాన అఘటితఘటనాశక్తియాలే, అణుస్వరూపైయా యిరుక్కవుమ్, విభువాన ఈశ్వరస్వరూపత్తోడే పరిసమాప్య వ్యాపిత్తిరుక్కైయై ఇవ్విడత్తిల్ శొల్లుకైయాలే విరోధ మిల్లై.

---

**మీశమ్"** (తైత్తి-నా-9-1) (అణువుకంటే అణువై, పెద్ద వస్తువులకంటే పెద్దదైన పరమాత్మ ఈ జీవుని హృదయగుహలో ఉంటున్నాడు. కర్మబంధాన్ని లేనివాడై, మహిమశాలి అయిన ఆ పరమాత్మను అతని అనుగ్రహంతో దర్శించి జీవుడు శోకం తీరినవాడవుతున్నాడు) అనే పెద్ద వస్తువులకంటే పెద్దవాడై ఉండే సర్వేశ్వరుడు చిన్నవస్తువుకంటే (అణువు కంటే) చిన్నవాడుగా ఉంటాడని చెప్పబడడంచేత, అతడు ప్రతి అణువులోను తన అసంకుచితం అయిన నిరంకుశైశ్వర్యంతో, తన సంపూర్ణ స్వరూపంతో, తన అఘటితఘటనాశక్తితో (ఇతరులకు చేయడానికి సాధ్యం కానివానిని చేయగల్గిన శక్తితో) వ్యాపించి ఉండేటట్లే, ఈ భగవానుని స్వరూపానికి నిరూపకమై ఉండే ఈమెకూడా అణువై ఉన్నా, నిరూపింపబడే ఆ భగవానుడు వ్యాపించి ఉండేచోట అంతా శ్రీసూక్తంలో **"ఈశ్వరీమ్"** అని ఘోషింపబడ్డ తన అఘటితఘటనాశక్తితో ప్రవేశించి అంతటా వ్యాపించి ఉండడమే ఈ శ్లోకంలో ఆళవందార్‌చేత చెప్పబడడంచేత విరోధం లేదు-అని భావించాలి. భగవానునకు ఈ అఘటితఘటనాశక్తి ఉన్నది-అని కృత్స్నప్రసక్త్యధికరణంలో వేదవ్యాసులవారిచేత నిరూపింపబడింది. **"పరన్ద తణ్ పరవైయుళ్ నీర్ తొఱుమ్ పరన్దుళన్ పరన్ద అణ్డమిదెన........ఇవై యుణ్డ కరనే"** (తిరువాయ్-1-1-10) అని నమ్మాళ్వార్లచేతకూడా ఈ అర్థం ఆదరింపబడిందికదా! ఈ విధంగా గ్రహిస్తే పిరాట్టి అంతటా స్వరూపంతో వ్యాపించి ఉండే ఈశ్వరతత్వంకంటే వేఱయినది అవుతుంది. కేవలం ధర్మభూతజ్ఞానంతో అంతటా వ్యాపించి ఉండే మిగిలిన జీవులకంటే వేఱు అవుతుంది. జ్ఞానాశ్రయం కాని అచేతనతత్త్వంకంటే వేఱవుతుంది. భగవానుని స్వరూపానికి అనురూపమై ఉంటుంది. మిగిలిన ఎవరికీ లేని గొప్ప స్తుతి కూడా సిద్ధిస్తుంది కదా !



ఎజ్గనే ఎన్నిల్? "మహతో మహీయాన్" ఎన్నుమ్బడి అతిమహత్తత్త్వమాన ఈశ్వరన్, "అణో రణీయాన్" ఎన్గిఱపడియే అణీయాసామ్ అణీయనాయ్ క్కొణ్డు అణువ్యక్తికళ్‌తోఱుమ్ అసజ్కుచితమాక నిరజ్కుశైశ్వర్యత్తోడే తన్నుడైయ అఘటితఘటనాశక్తియాలే పరిసమాప్య వర్తిక్కుమాపోలే, తత్స్వరూపనిరూపకభూతైయాన వివళుమ్ అణువాయిరుక్కవుమ్ నిరూప్యవస్తు వ్యాపిత్తు నిఱ్కుమిడ మెజ్గుమ్ "ఈశ్వరీమ్" ఎన్ఱు శ్రుతిప్రసిద్ధమాన తన్నుడైయ అఘటితఘటనాశక్తియాలే వ్యాపిత్తు విభువాయిరుక్కై ఇవ్విడత్తిల్ వివక్షితమాకైయాలే విరోధ మిల్లైయిఱే. ఆకైయాలే స్వరూపతో విభువాన ఈశ్వరతత్త్వవ్యావృత్తియుమ్, కేవలమ్ గుణతో విభువాన ఆత్మతత్వవ్యావృత్తియుమ్, చైతన్యాఽనాధారమాన అచిత్తత్వవ్యావృత్తియుమ్, భగవత్స్వరూపానురూపత్వముమ్, అతిశయితస్తోత్రముమ్ సిద్ధిక్కుమిఱే.

---

ఈమె స్వరూపం భగవానుని స్వరూపానికి అనురూపంగా ఉండడం అంటే-**"క్షరం ప్రధాన మమృతాక్షరం హరః, క్షరాత్మానా వీశతే దేవ ఏకః"** (శ్వేతా-1-10) అనే శ్వేతాశ్వతరోపనిషత్ప్రమాణంలోను, **"ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానామ్"** (తైత్తి, నారా-44) (విద్యలన్నిటికీ ఈశ్వరుడు, అన్ని భూతాలకు ఈశ్వరుడు) అనే తైత్తిరీయనారాయణవల్లీ మంత్రంలో చెప్పిన రీతిలో తనకంటే అన్యులైన అందటికీ ఈశ్వరుడైన అతని స్వరూపానికి తగినట్లుగా" **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (యజుస్సంహితా-464-1) ( ఈ లోకానికి అంతటికీ ఈశ్వరి, విష్ణువుకు పత్ని) అనే వాక్యంలోను, **"ఈశ్వరీం సర్వభూతానాం త్వా మిహోపహ్వయే శ్రియమ్"** (శ్రీసూక్తమ్-9) (సర్వభూతాలకు ఈశ్వరియై, శ్రీదేవి అయిన నిన్ను ఇక్కడకు రమ్మని ఆహ్వానిస్తున్నాను) అనే శ్రీసూక్తప్రమాణంలోను ఘోషింపబడ్డ రీతిలో అఘటితఘటనాశక్తిని కల ఈశ్వరిగా ఉండడం-అని చెప్పడమే యుక్తంగా ఉంటుంది. ఆ విధంగా కాకుండా, భగవానుని సత్త ప్రేమపారతంత్ర్యంచేత ఈమెకు వశమై, ఈమె సత్త ఈమెకు అంతర్యామిగా ఉన్నందువల్ల అతనికి వశమై ఉండడమే ఇద్దటికీ ఉండే ఆనురూప్యం" అనికూడా చెప్పవచ్చు. **"ఉనక్కేఱ్కుమ్ కోలమలర్ప్పావై"** (తిరువాయ్-10-10-6) (నీకు తగిన, అందమైన, పుష్పనివాసిని అయిన లక్ష్మికి) అని తిరువాయ్‌మొళిలోను, **"తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్, రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా"** (రామా.సుందర-16-5) (అనురూపాలైన గుణాలు, వయస్సు, నడవడికలను కల్గినది, అనురూపం అయిన కులం, అందంతోపాటు కూడినది అయిన

ఆనురూప్యమావతు– “ఈశతే దేవ ఏకః”, “ఈశ్వర స్సర్వభూతానామ్” ఎన్గిఱ తత్స్వరూపత్తుక్కనురూపమాక “అస్యేశానా”, “ఈశ్వరీం సర్వభూతానామ్” ఎన్నుమ్బడి యిరుక్కైయితే ఉచితమ్. అథవా, అవనుడైయ సత్తై ఏతదధీనైయాయ్. ఇవళుడైయ సత్తై తదధీనైయా యిరుక్కై అన్యోన్యానురూపత్వమాకవుమామ్. ఎల్లాప్పడియాలుమ్, “ఉనక్కేఱ్కుమ్” ఎన్నుమ్బడి “తుల్యశీలమా” యిరుక్కైయితే అనురూప్యమావతు.

---

వైదేహికి రాముడే తగినవాడు) అనే శ్రీరామాయణప్రమాణంలోను చెప్పిన రీతిలో అతడు పతిగా ఉండడంచేత కల్గిన స్వాతంత్ర్యం, ఈమెకు స్వామిగా ఉండడం మొదలైన అతిశయాలను కలవాడై ఉండడం, ఈమె పత్నిగా ఉండడంచేత ఏర్పడే పారతంత్ర్యం, కరుణ మొదలైన వానిలో అతనినికూడా మించి ఉండడం–మొదలైన అతిశయాలను కల్గినదై ఉండడమే పతి–పత్నులకు అన్ని రీతులలోను కల అనురూప్యం తప్ప, అతనికి సమానం అయిన స్వాతంత్ర్యం కల్గి ఉండడం–మొదలైనవానితో ఈశ్వరిగా పిరాట్టి ఉంటుంది–అని చెప్పడం పొసగదు.

ఇక, ఈ సందర్భంలో భగవానునకు చెప్పబడిన అఘటితఘటనాశక్తి పిరాట్టికి ఉన్నదని చెప్పడం పొసగదు–అనే ఆశంక వివరించబడుతున్నది. (ఇది శ్రీ దేశికులు వ్యాఖ్యలోని ఆక్షేపసారం) అంతటా వ్యాపించి, విభువై ఉండే సర్వేశ్వరుడు ఒక్కొక్క అణువులోను, ఘటత్వ–గోత్వాది జాతులు ఒక్కొక్క ఘటంలోను, గోవులోను పరిసమాప్య వ్యాపించి ఉండేటట్లే, తనకు ఉన్న అఘటితఘటనాశక్తితో తనస్వరూపం అంతటితో వ్యాపించి ఉంటాడు–అని కృత్స్నప్రసక్త్యధికరణంవల్ల తెలిసే విషయమని పూర్వాచార్యులచేత నిర్ణయింపబడింది. అదే రీతిలో, ఈ పిరాట్టికూడా అణుస్వరూప అయి ఉన్నా, ఈశ్వరిగా ఉండే తన అఘటితఘటనాశక్తితో విభువైన భగవానుని స్వరూపం ఉన్నచోట అంతా వ్యాపించి ఉంటుంది–అని వీరు చెబుతున్నారు. ఇందులో వీరు దృష్టాంతంగా ఉట్టంకించే సర్వేశ్వరునకే అటువంటి అఘటితఘటనాశక్తి లేదు. భగవానుని గొప్ప వస్తువుకంటె గొప్పవాడు **(మహతో మహీయాన్),** అణువుకంటే అణువు” **(అణో రణీయాన్)–**అని విభువుగా, అణువుగా చెప్పడంలో ఏమి భావం? అని అంటే, అతని స్వరూపం చాలా పెద్దది కనుక, అతనికి విభుత్వమే సహజమైనది. “అణుపరిమాణ వస్తువులలో కూడా అతడు పూర్ణంగా వ్యాపించి ఉన్నాడు” అని చెప్పడం ఆ అణువస్తువులు ఉండే చోట తన శక్తిని అంతటిని గ్రహించి వ్యాపించి ఉంటాడు–



నను, విభువాన సర్వేశ్వరన్, అఘటితఘటనాసామర్థ్యత్తాలే అణుస్వరూప–నాయ్క్కొణ్డు అణువ్యక్తికళ్తోఱుమ్ జాతివద్వ్యాపిత్తిరుక్కుమాపోలే, ఇవళుమ్ అణువాయిరుక్కవుమ్ అఘటితఘటనాశక్తియాలే విభువాయ్ క్కొణ్డు వ్యాపిత్తిరుక్కుమెన్గిఱ విడత్తిల్ దృష్టాన్తమ్ కూడాదు. ఎఙ్గనే? ఎన్నిల్, విభువాన ఈశ్వరనుక్కు ఉపాధ్యవచ్ఛేదమాత్రత్తాలేయితే అణుత్వవిభుత్వఙ్గళ్ శొల్లుకిఱన. స్వరూపతః అణుత్వమ్ శొల్లవొణ్ణాతితే. అఘటితఘటనాశక్తియాలే అణుత్వమహత్త్వరూపవిరుద్ధ సముచ్చయమ్ కూడు మెన్నిల్; అప్పోతు సర్వాద్వైతభేదాభేదపక్షఙ్గళుమ్ అఙ్గీకార్యఙ్గళామితే. ఆకైయాలే,

---

అని చెప్పినట్లు తప్ప, అతడే అణుస్వరూపి అవుతున్నాడు–అని అనడం తన అఘటితఘటనాశక్తితో ఒకదానితో వేఱొకటి విరుద్ధం అయిన అణువై ఉండడం–పెద్దదిగా ఉండడం రెండూ సర్వేశ్వరునికే తగును–అని ఒప్పుకొంటే, ఒకదానితో ఇంకొకటి పొసగని పలు విషయాలను బ్రహ్మలో ఒప్పుకొనే, అద్వైతవాదానికి చెందిన భాస్కరుడు మొదలైన భేదాభేదవాదుల పక్షం ఒప్పుకోవలసివస్తుంది. అందుచేత ఒక్కొక్క వస్తువులోను భగవానుడు పూర్ణంగా ఉంటాడు–అని ప్రమాణాలు, పూర్వాచార్యులు పల్కడం–భగవానుని స్వరూపంలో ఒక్కొక్క వస్తువును వ్యాపించి ఉండే అంశాలే వానిని అన్నిటినీ నిర్వహించగల శక్తిని కల్గినవై ఉన్నాయి– అనే అభిప్రాయంతోనే. ఈ విధంగా కాకుండా, ఒక్కొక్క అణుపరిమాణ వస్తువులోను స్వరూపంలో పూర్ణంగా వ్యాపించి ఉన్నాడని అంగీకరిస్తే, ఆ వస్తువుల బయటకూడా భగవానుడు వ్యాపించి ఉన్నాడని ప్రమాణాలు చెప్పడం పొసగదు. అంతేకాక, అణువై, నిరవయవం అయిన జీవాత్మకు, బృహద్వస్తువులకు ఉన్నట్లుగా, తూర్పు, పడమర, క్రింద, పైన ఉత్తరం, దక్షిణం–అని అఱు భాగాలు లేవు. కనుక దానికి “లోపల” “బయట” అనే వ్యవహారమే పొసగదు. అందువల్ల అణువైన జీవాత్మకు లోపల భగవానుడు వ్యాపించి ఉన్నాడు–అని చెప్పే అంతర్వ్యాప్తియే అంగీకరించ తగినది కాదు. అందుచేత, అఘటితఘటనాశక్తితో భగవానునకు అణువస్తువులలో అంతర్వ్యాప్తిని అంగీకరించినట్లే, పిరాట్టికి ఆ శక్తితో విభుత్వాన్ని అంగీకరిస్తాము–అని చెప్పడం ఒప్పుకోదగినదికాదు.

అంతేకాక, పిరాట్టికి స్వరూపంతో అంతటినీ వ్యాపించి ఉండడాన్ని, విగ్రహంతో వ్యాపించి ఉండడాన్ని ఒప్పుకోవచ్చునే తప్ప, అణుస్వరూప అయినా అఘటితఘటనాశక్తితో విభువు అయిన భగవానుడు ఉన్నచోట అంతటా పిరాట్టి వ్యాపించి ఉంటుంది–అని ఒప్పుకొంటే, అతని స్వరూపం వికారాన్ని పొందుతుంది అని అంగీకరించినట్లవుతుంది. అపుడు, “ఆత్మ నిర్వికారమైనది” అని చెప్పే ప్రమాణాలకు

